4165
893

# సౌధాగ్రము

కూర్పు:

ఎస్. కె. వెంకటాచార్యులు, యం. ఎ.




ప్రకాశకులు :

తులసీ పబ్లిషర్స్,

విద్యావిషయిక ప్రచారకులు,

సామారంగంచౌక్, విజయవాడ-1.

3

# 893 సౌధాగ్రము

నా తండ్రిగారి కుటుంబనామము పిర్రిప్. నా పేరు ఫిలిప్. నేను చిన్నప్పుడు నన్ను 'పిప్' అని పిలుచుకొనుచుండెడివాడను. అందఱు నన్నదే పేరుతో పిలువసాగిరి.

నా తల్లిదండ్రులు నా చిన్నప్పుడే గతించియుండిరి. అందువలన వా రెట్లుందురో కూడ నాకు జ్ఞాపకము లేదు. నేను నా సోదరి యగు జో గార్జరీ సతివద్ద పెరిగి పెద్దవాడ నగుచుంటిని. ఆమె భర్త జో గార్జరీ ఒక కమ్మరి.

నే నొకనాడు నా తల్లిదండ్రుల, అయిదుగురు సోదరుల సమాధులున్న శ్మశానమునకు పోతిని. ఆనాడు గాలి తీవ్రముగా వీచుచుండెను. శ్మశానమున కావల చిత్తడి భూములుండెను. ఆ భూముల కావల ఒక నది యుండెను. మఱికొన్ని మైళ్ళ దూరమున సముద్ర ముండెను.

నేను నా తల్లిదండ్రుల సమాధులను జూచుచు కూర్చుంటిని. అంతలో గాలి తీవ్రముగ వీచుచు భయంకరమగు సవ్వడి చేయసాగెను. నే నా సవ్వడికి భయపడి గట్టిగా నేడువసాగితిని.

అంతలో సమాధుల మధ్యనుండి యొక మనుజుడు బయటకు వచ్చి భయంకరముగ నిట్లనెను: "సవ్వడి చేయక నోరు మూసికొనుము. ఓరి చిన్నదయ్యమా! నోరు మూసికొని కూర్చుండుము. లేనిచో నీ గొంతు కోసివైచెదను."

నేను ఆ మాటలన్న మనుజుని వంకకు చూచితిని. అతడు చాల భీకరముగ నుండెను. మోటురంగు దుస్తులను ధరించి

యుండెను. కాలికి బిగువైన పెద్ద గొలుసొకటి వ్రేలాడుచుండెను. నెత్తిమీద టోపీ లేదు. బూట్లు చినిగిపోయియుండెను. తలచుట్టును ప్రాతగుడ్డ యొకటి చుట్టబడియుండెను. అతడు నీళ్లలోనాని, బురదలో నానుకొనిపోయి, రాళ్ల దెబ్బలు తిని, ముండ్లు గ్రుచ్చుకొని వచ్చినట్లుండెను. అతడు గజగజ వణికిపోవుచుండెను. పండ్లు టకటకమని కొట్టుకొనుచుండెను. అతడు నా గడ్డము పట్టుకొనెను.

అంతట నేను అపరిమితమగు భయముతో నిట్లంటిని: "అయ్యా! నా గొంతు కోసివేయకుడు. అయ్యా! దయయుంచి నా గొంతు కోసివేయకుడు. మీ కాళ్లు పట్టుకొని వేడుకొనుచున్నాను."

"నీ పేరేమో చెప్పుము. తొందరగా చెప్పుము."

"నాపేరు పిప్."

"మఱియొకసారి చెప్పుము. సరిగా చెప్పుము."

"పిప్! పిప్! పిప్!"

"మంచిది నీవెక్కడ నివసించుచున్నావో చెప్పుము. ఆ ప్రదేశమును చేయిపెట్టి చూపుము."

శ్మశానమునకు సుమారు ఒక మైలు దూరముననున్న మా గ్రామము నతనికి చేయిపెట్టి చూపితిని.

అంతట నా మనుజుడు నన్నొక్క క్షణకాలము చూచెను. పిమ్మట నతడు నా జేబులను వెదకెను. అతనికి ఒక రొట్టెముక్క తప్ప మఱి యింకేమియు లభింపలేదు. అతడా రొట్టెముక్కను తినివైచి ఇట్లనెను; "ఓరి చిన్నకుక్కా! నీ బుగ్గలు క్రొవ్వుపట్టి యున్నవి!"

అవును. అతడన్నమాట నిజమే. నాకు వయస్సుకు తగినంత శరీరము లేకపోయినప్పటికిని బుగ్గలుమాత్రము బాగుగ క్రొవ్వుపట్టి యుండెను.

“నీ బలిసిన బుగ్గలను తినివేయవలయునని కోరికగా నున్నది! నా కోరిక తీర్చిన బాగుండును!” అని అతడనెను.

“ఆపని మాత్రము చేయకుము.”

“అబ్బాయి! ఇటు చూడుము. మీ అమ్మ ఎక్కడ నున్నది?” నే నొక సమాధి నతనికి చూపుచు, “అల్లదిగో మా అమ్మ! అది జార్జియానా సమాధి. అది మా అమ్మపేరు.”

“ఓహో! అటులనా! దానిప్రక్కనే యున్నది మీతండ్రి సమాధియా?”

“అవును.”

“మఱి నీ వెవ్వరితో కలసి నివసించు చున్నావు?”

“నా సోదరి జోగార్జరీసతి ఇంట నివసించు చున్నాను. నా బావ యొక కమ్మరి.”

“కమ్మరియా! అవునా?” అట్లని అతడు తన కాలివంకకు చూచుకొనెను; తరువాత నా వంకకు చూచెను. అతడావిధముగ చాలసార్లు చేసెను. తరువాత నతడు నాకు బాగుగ దగ్గఱకువచ్చి నా కన్నులలోనికి చూచుచు నిట్లనెను: “అబ్బాయి! ఇటు చూడుము. ఆకురాయి అననేమో నీ కెఱుగుదువా?”

“ఎఱుగుదును.”

“మఱి ఆహారమననేమో ఎఱుగుదువా?”

“ఎఱుగుదును.”

"నీవు నాకొక ఆకురాయిని తెచ్చియిమ్ము. ఆహారమును గూడ తెచ్చియిమ్ము. నీవా రెంటిని తెచ్చి యీయవలయును. లేనిచో నీ గుండెకాయ తీసివైచెదను. నీ ప్రాణములింక నీవి కావు."

అట్లని అతడు నన్ను తలక్రిందులు చేసెను. అప్పుడు నేను అపరిమితముగా భయపడితిని. "అయ్యా! నన్ను సరిగా కూర్చుండ బెట్టుడు. నేను మీకు సరియైన సమాధానమును చెప్పగలను" అని నేను గజగజ వణకుచు నంటిని.

అంతట నతడు నన్ను సరిగా కూర్చుండబెట్టి భీకరస్వర ముతో నిట్లనెను: "అబ్బాయి! రేపటి యుదయమున పెందలకడ నాకు ఆకురాతిని, ఆహారమును తీసికొనివచ్చి యిమ్ము. అల్ల దిగో, ఆ కనబడుచున్న బురుజును చూడుము. వాని సచ్చటకు తీసికొని వచ్చియిమ్ము, తెలిసినదా? నీవీ పనిని తప్పక చేయవల యును. నన్ను చూచిన విషయమునుగూర్చి నీ వెవ్వరికిని ఒక్క మాటయైనను చెప్పరాదు. నన్ను చూచినట్లు ఎవ్వరికిని సంజ్ఞ చేసి చెప్పరాదు. నేను చెప్పినట్లు చేసినచో నిన్ను బ్రతుకనిచ్చె దను. లేనిచో నీ ప్రాణములు తీయుదును. తెలిసినదా? నా మాటలకు ఏమాత్రము భిన్నముగా నడచుకొన్నను నీ గుండె కాయ తీసివైచెదను. నిన్ను కాల్చుకొని తిందును.

నేను ఒక్కడనే ఉన్నానను కొన్నావేమో! నాతో బాటు మఱియొక యువకుడు దాగుకొని యున్నాడు. అతనితో బాటు పోల్చిచూచినచో నేను దేవతనే. నా మాటలనన్నిటిని ఆ యువ కుడు ఆలకించు చున్నాడు. అతనివద్ద రహస్యశక్తి యొకటి యున్నది. ఆ శక్తితో నతడు బాలురను పట్టుకొని వారినికాల్చి

కొని తినివేయును. అతనికి కనబడకుండ దాగుకొనుటకు ప్రయ
త్నించుట వట్టి వృథాయని చెప్పవలయును.

బాలుడు తలుపు తాళము వేసికొని పరుండియుండ వచ్చును. సుఖముగా శయ్యమీద పరుండి నిదురింపవచ్చును. మంచము క్రింద దాగుకొనవచ్చును. ముసుగు వేసికొని ఒకమూల కూర్చుండవచ్చును. ఇక తాను సురక్షితముగ నున్నట్లు భావింప వచ్చును. కాని ఏమిలాభము? ఆ నామిత్రుడు ఎక్కడనుండియో మెల్లన ప్రాకుకొనుచువచ్చి ఆ బాలుని పట్టుకొని చంపివేయును. ప్రస్తుతమున కతడు నీకెట్టి హానియు చేయకుండ, ఎంతో కష్టము మీద, అతనిని ఆపివేయుచున్నాను. నిన్నతడు చంపి వేయకుండ ఆపుట ఎంతయు దుర్ఘటముగ నున్నది. మఱి నీవు ఏమందువు?"

అప్పుడు నేను భయపడుచు నిట్లంటిని: "అయ్యా! నేను మీకు తప్పక ఆకురాత్రిని తెచ్చి యిచ్చెదను. మఱియు నాకు అందుబాటులోనుండు ఆహార పదార్థములను తెచ్చియిచ్చెదను. రేపు తెల్లవాఱు సమయమున పెందలకడ మిమ్ము బురుజువద్ద కలసి కొందును."

"దేవునిమీద ప్రమాణముచేసి చెప్పుము."

అంతట నేను దేవునిమీద ప్రమాణముచేసి చెప్పితిని.

అతడింకను నిట్లనెను: "నీవుచేసిన వాగ్దానమును జ్ఞప్తి యందుంచుకొనుము. ఆ యువకుని మాట జ్ఞప్తియందుంచు కొనుము. ఇంక ఇంటికి పొమ్ము."

"ఇంక సెలవు" అని నేను అంటిని.

అతడు పొట్టిగానున్న చర్చిగోడదాటి బయటకుపోయెను. అంతట నేను ఇంటి దిక్కుకు తిరిగి కాళ్లకు బుద్ధి చెప్పసాగితిని.

ఒకసారి వెనుకకు తిరిగి అతడు నది వంకకు పోవుచుండుటను చూచితిని. ఆ సమయమున నాకేమో అపరిమితమగు భయము వేయసాగెను. ఆ భయముతో నేను ఇంటి వంకకు పరుగెత్తుకొని పోసాగితిని.

## 2

నా సోదరి నాకంటె ఇరువది సంవత్సరములు పెద్ద. ఆమె నన్నెప్పుడును కఠినముగా శిక్షించుచుండెడిది. ఆ విషయము చుట్టు ప్రక్కల వారికందఱకు బాగుగ తెలియును. ఆమె నన్నే కాదు; నా బావనుగూడ శిక్షించుచుండెడిది. అనగా నేమిద్దఱము ఆమె పెంపకములోనే పెరుగుచుంటి మన్న మాట.

నా సోదరి అందమైనది కాదు. ఆమె సన్నగా, పొడవుగ నుండి నల్లని కన్నులు, జుట్టు కలిగి యుండెను. చర్మమెప్పుడును ఎఱ్ఱగా నుండెడిది. ఆమె ఎప్పుడును మొఱటుగానుండు దుస్తులు ధరించుచుండెడిది. నా బావ మాత్రము అందమైనవాడు. అతడు చాల మంచి స్వభావము కలవాడు.

నేను శ్మశానమును వీడి ఇంటికి పోవుసరికి నా బావ జో కమ్మరకొలిమిని వదలిపెట్టి వంట గదిలో కూర్చుండి యుండెను. అప్పుడచ్చట నా సోదరి లేను. జో నాతో బాటు బాధ పడుచున్నవాడే కదా. అందువలన నతడు నన్ను చూడగనే ఇట్లు నెను: "పిప్ ! మీ సోదరి నీకొఱకు సుమారు పన్నెండుసార్లు

బయటకు పోయినది. ఇప్పుడుకూడ నీకొఱకే బయటకుపోయి యున్నది."

"అటులనా?"

"అవును, పిప్! అంతకంటె అధ్వాన్నమైన విషయము. మఱి యొకటి యున్నది. ఆమెవద్ద కఱ్ఱగూడ నున్నది."

ఆ మాటలు వినగానే నేను గజగజ వణకి పోసాగితిని.

"ఆమె బయటకుపోయి చాల సేపైనదా?" అని ప్రశ్నించితిని.

"అయిదు నిమిషములైనది. అల్లదిగో! చేత కఱ్ఱ పట్టుకొని వచ్చుచున్నది. నీవు తలుపు వెనుకదాగుకొని యుండుము."

వెంటనే నేనట్లు చేసితిని. కాని నా సోదరి సామాన్యమైనది కాదు. నేను తలుపు వెనుక దాగుకొని యుంటినన్న విషయము నామె అనతికాలములోనే గ్రహించెను. ఆమె నన్ను పట్టుకొని బయటకులాగి జో మీదకు విసరివైచెను. అతడు నన్ను పట్టుకొని వెనుకకు తీసికొనెను. నా సోదరి అక్కడకు రాకుండ కాలు అడ్డు పెట్టెను.

నా సోదరి పాదముతో నేలను గట్టిగా త్రొక్కి ఇట్లనెను: "ఓరి చిన్నకోతీ! నీ వింతవఱకు నేమి చేయుచున్నావో సూటిగ చెప్పుము. నీ మూలమున నేను ఎన్నో బాధలు పడుచున్నాను. నీవు సరియైన సమాధానము చెప్పకపోయినచో, నిన్ను అక్కడ నుండి ఈడ్చుకొనివచ్చి చర్మము ఒలిచి వేసెదను."

నేను ఏడ్చుచు, "శ్మశానమునకు మాత్రమే పోయి యుంటిని" అని సమాధానము చెప్పితిని.

"శ్మశానము!" అని ఆమె ఆశ్చర్యముతో ననెను; "నేను నిన్ను పెంచి యుండకపోయినచో ఎప్పుడో శ్మశానమునకు పోయి యుండెడివాడవు. నేను నిన్ను చేతితో పెంచినానను విషయము బాగుగ తెలియునా?"

"తెలియును."

"మఱి నేనెందుల కటుల చేసినాను?"

"తెలియదు."

"తెలియదా? నేను చేసినదంతయు వృథాఅన్నమాట."

నేను చిత్తశి నేలల వంకకు చూడసాగితిని. కాలికి గొలుసున్న మనుజుడు, భయంకరమైన మఱియొక మనుజుడు నాకు జ్ఞప్తికి వచ్చిరి. ఆకురాయి, ఆహారము, నేనుచేసిన వాగ్దానముగూడ జ్ఞప్తికి వచ్చెను.

నా సోదరి మాకు తేనీరు నొసగుటకు సిద్ధపడుచుండెను. అపుడు జో నావంకకు చూడసాగెను. తరువాత తన భార్య వంకకు చూడసాగెను. నా సోదరి రొట్టెముక్కనొకదానికి కొలదిగా వెన్నరాసి దానిని రెండు ముక్కలుచేసెను. ఒక ముక్కను తన భర్తకిచ్చెను. రెండవ దానిని నాకిచ్చెను.

నే నప్పుడు బాగుగ ఆకలి గొనియున్నమాట నిజమే. కాని నేను ఆ ముక్కను తినుటకు సాహసింపలేకపోతిని. ఏలయన కాలికి గొలుసున్న మనుజునకు ఆహారము నొసగుదునని వాగ్దానముచేసి యుంటిని గదా. నా అక్క ఆహార పదార్థములను జాగ్రత్తగా దాచును. వానిని దొంగిలించి తీసికొని పోవుటకు సాధారణముగా వీలుండదు. అందువలన నేను రొట్టె ముక్కను నాలాగు జేబులో దాచివైచితిని.

నా రొట్టెముక్క అంత త్వరగా మాయమైపోయినందుకు జో ఎంతయు ఆశ్చర్యపడసాగెను. నేను దానిని మ్రింగివైచితినని అతడు భావింపసాగెను. నా సోదరికూడ ఆ విధముగనే భావింపసాగెను.

తరువాత నామె నాచే తారునీటిని త్రాగించెను. అది శరీరమునకు చాల మంచిపని చేయునని ఆమె అభిప్రాయము. అందువలన నామె దానిని నాకును, జోకును ఎప్పుడు ఇచ్చు చుండెడిది. దానిని త్రాగినతరువాత నేను మెల్లగ నాగదిలోనికి పోయి జేబులోని రొట్టెముక్క నొకచోట దాచితిని.

నాటి సాయంకాలము మే మందఱము కుంపటివద్ద కూర్చుండి యుంటిమి. అంతలో నాకు పెద్ద సవ్వడి వినబడెను.

"ఆ ఫిరంగిమ్రోత ఏమి?" అని నేను జోను ప్రశ్నించితిని.

"అదియా! మఱియొకఖైదీ పలాయనము చిత్తగించినాడు."

"అనగా అర్థమేమి?"

"తప్పించుకొని పాఱిపోయినాడు" అని నాసోదరి సమాధానము చెప్పెను.

"ఖైదీఅనగా నెవ్వరు?" అని నేను మెల్లగ ప్రశ్నించితిని. జో మెల్లగనేమో చెప్పెను. కాని నాకేమియు వినబడలేదు. తరువాత నతడు గట్టిగా నిట్లనెను: "నిన్న నొక ఖైదీ పాఱిపోయినాడు. అందువలన హెచ్చరికగా అధికారులు ఫిరంగి మ్రోగించినారు. నేడు మఱియొక ఖైదీ తప్పించుకొని పాఱిపోయినాడని మరల హెచ్చరిక చేయుచున్నారు."

"ఫిరంగి మ్రోగించినదెవరు?" అని నేను ప్రశ్నించితిని.

"నీ కా విషయమంతయు నెందులకు? అనవసరమైన ప్రశ్నలు వేయకుము." అని నా సోదరి నన్ను హెచ్చరించెను.

జో ఏమో చెప్పబోయెను కాని నాకు సరిగా వినబడలేదు. ఎట్టకేలకు నేను ధైర్యమువహించి నాసోదరితో నిట్లంటిని; "ఫిరంగి మ్రోత ఎక్కడనుండి వచ్చుచున్నదో తెలిసికొనగోరు చున్నాను."

నా సోదరి ఆశ్చర్యమును ప్రకటించుచు, "కారాగారపు టోడలనుండి వచ్చుచున్నది" అని యనెను.

"కారాగారపు టోడలలో నెవ్వరుందురు? వా రచ్చట నుండుటకుగల కారణమేమి?" అని నేను ప్రశ్నించితిని.

ఆ ప్రశ్నలు నా సోదరికి అపరిమితముగు ఆగ్రహమును కలిగించెను. ఆమె లేచి నిలబడి ఇట్లు సమాధానము చెప్పెను: "నేను నిన్ను చేతితో పెంచినదెందులకు? ఇటువంటి ప్రశ్నలు వేయుటకేనా? హత్యలు చేసినవారు, దొంగతనము చేసినవారు, దొంగ సంతకములు చేసినవారు కారాగారపు టోడలలో బంధింపబడుదురు. వారి నేరములకు ప్రారంభ దశ నీవలెనే అనవసరమైన ప్రశ్నలువేయుట! ఇక పోయి పరుండుము."

అంతట నేను చేత నొక క్రొవ్వువత్తియైన లేకుండ నా గదిలోనికి పోసాగితిని. నేనుగూడ ప్రశ్నలువేయుట ప్రారంభించితిని కనుకను, చిత్తడి నేలలలో కనబడిన మనుజునికొఱకు దొంగతనము చేయబోవుచుంటిని కనుకను కారాగారపు టోడలలో బంధింపబడుదునని అనుకొనసాగితిని.

నేను పోయి శయ్యపై పరుండితిని. కాని నాకు సరిగా నిదుర పట్టకుండెను. ఒకప్పుడు నిదుర పట్టినను భయంకరమైన కలలు రాసాగెను.

ఇంకను బాగుగ తెల్లవారకమునుపే నేను ఆహారపదార్థములున్న గదిలోనికి పోయి కొన్ని ఆహార పదార్థములను దొంగిలించితిని. వాని నన్నిటిని ఒక గుడ్డలో మూటకట్టు కొంటిని. బ్రాందీసీసాలోని సగము బ్రాందీని వేరొక సీసాలో పోసి దానిని నాజేబులో పెట్టుకొంటిని. నేను బ్రాంది తీసి నట్లు నా సోదరికి తెలియకుండ నుండవలయునుగదా! అందుల కని మఱియొక సీసాలోని ద్రవ పదార్థమును అసలు బ్రాందీ సీసానిండ పోసితిని. అటు పిమ్మట కొలిమి వద్దకు పోయి ఒక ఆకురాయిని తీసికొంటిని. పిమ్మట నేను ఇంటిలోనుండి బయటకు వచ్చి చిత్తడి నేలల వద్దకు పరుగెత్తుకొని పోతిని.

# 3

నేను బురుజువంకకు పోసాగితిని. అంతలో నొకచోట కూర్చున్న మనుజుడొకడు నాకు కనబడెను. నాకతని వీపు భాగము మాత్రమే కనబడుచుండెను. నేను మెల్లగ అతని ముందుకు పోయి భుజములను ముట్టుకొంటిని. అంతట నతడు ఉలికి పడిలేచి నిలబడెను. అతడు నే నిదివఱకు చూచిన మనుజుడు కాడు! వేరొక మనుజుడు! కాని అతడుకూడ నా కిదివఱకు కన బడిన మనుజుని వలెనే దుస్తులు ధరించి యుండెను. అతని

కాలికిగూడ బరువైన పెద్దగొలుసొకటి యుండెను. ఇంకను అనేక విషయములలో నేను మొదటచూచిన మనుజునకును, అతనికిని పోలికలుండెను. కాని మొగముమాత్రము వేఱుగా నుండెను. ఆ విషయముల నన్నిటిని నేను ఒక్క క్షణకాలములో గ్రహించితిని. అతడు నన్ను ఏమో తిట్టి కొట్టబోయెను. కాని ఆ దెబ్బనాకు తగులలేదు. అతడే క్రిందపడిపోయెను. తరువాత నతడు లేచి వేఱొక వంకకు పరుగెత్తుకొని పోయెను.

"మొదట కనబడిన మనుజుడు చెప్పిన యువకు డితడే అనుకొందును" అని అనుకొంటిని. అప్పుడునాకు ఎంతో భయము వేసెను. అయినను నేను ముందుకు సాగిపోయి బురుజును చేరు కొంటిని. అచ్చట అసలు మనుజుడు నా కొఱకు వేచియుండెను. అతడు చలిబాధకు గజగజ వణకిపోవు చుండెను. అతనికి ఆకలి బాధకూడ మిక్కుటముగ నున్నట్లుండెను. నే నతనికి మొదట ఆకురాయి నిచ్చితిని. దాని నతడు తీసికొని క్రిందపెట్టెను.

పిమ్మట నే నతనికి గుడ్డమూటలోని ఆహార పదార్థము లను, జేబులోని రొట్టెముక్కను, బ్రాందీ సీసాను ఇచ్చితిని.

"సీసాలో నున్న దేమి?" అని అతడు ప్రశ్నించెను.

"బ్రాందీ" అని సమాధాన మిచ్చితిని.

అతడు ఆహారము తినుచు, బ్రాందీ త్రాగుచు గజగజ వణకి పోసాగెను.

"నీకు చలిజ్వరము వచ్చినదను కొందును."

"అవును, అబ్బాయి! నేనును ఆ విధముగనే అభిప్రాయ పడుచున్నాను."

"ఈ ప్రాంతి మేమియు బాగుండలేదు. మఱి నీవీ చిత్తడి నేలలో పనుండియున్నావు. ఆరోగ్యము పాడుకాదా మఱి?"

"ఆ విషయమునకేమిగాని ముందు నన్ను భోజనము చేయనిమ్ము."

అతడు ఎంతో భయపడుచున్న వానివలె ఆహార పదార్థములను గబగబ భుజింపసాగెను. మధ్యమధ్య బ్రాందీ సేవింపసాగెను. హఠాత్తుగా నతడిట్లనెను: "నీవు నన్ను మోసము చేయుట లేదుగదా? నీతో మఱియింకెవ్వరిని తీసికొని రాలేదు గదా?"

"నేను నిన్నేమియు మోసము చేయుటలేదు. నాతో మఱి యింకెవ్వరిని తీసికొని వచ్చియుండలేదు."

"నన్ను వెంబడించి రావలసినదని ఎవ్వరిని కోరియుండ లేదు గదా ?"

"లేదు."

"మంచిది. నేను నీ మాటలు నమ్ముచున్నాను."

"నీవు భోజనము చక్కగా చేయుచున్నందుకు నేను సంతసించుచున్నాను."

"ఏమను చున్నావు?"

"నీవు భోజనము చక్కగా చేయుచున్నందుకు నేను సంతసించుచున్నాను."

"అవునవును. నేను నీకెంతయు కృతజ్ఞుడను."

"మఱి నీవు అతనికి ఆహార పదార్థములను మిగుల్చవను కొందును. నేను మఱియొకసారి ఆహార పదార్థములను తీసికొని రాలేను."

"అతనికా ? ఎవ్వరతడు ?"

"యువకుడు. అతనినిగూర్చి నీ విదివఱకు చెప్పియున్నావు గదా! మఱి యొకడు దాగుకొని యున్నాడని నీవిదివఱకు చెప్పి యుంటివి గదా ?"

"ఓహో! అతడా! అవునవును. కాని అతనికి ఆహార మేమియు అక్కఱ లేదు."

"మఱి అతడు ఆహారము కావలసిన వానివలె కనబడి నాడే ?"

"కనబడినాడా ?. ఎప్పుడు ?"

"ఇంతకు ముందే."

"ఎక్కడ ?"

"అల్లదిగో, అక్కడ కనబడినాడు. నేను మొదట అతనిని చూచి నీవే అనుకొన్నాను."

అంతట నతడు నా కాలరు పట్టుకొని తీక్షణముగా చూడ సాగెను. నే నింకను నిట్లంటిని: "అతడన్ని విధముల నీవలెనే దుస్తులు ధరించి యున్నాడు. అతని కాలికిగూడ పెద్ద బరువైన గొలుసున్నది. అతనికిగూడ ఆకురాయి అవసరమని అను కొన్నాను. మఱి నీవు నిన్న రాత్రి ఫిరంగి మ్రోతను వినియుండ లేదా ?"

"అవునవును, విన్నానను కొంటాను."

"అది ఏమి ? దానినిగూర్చి నీకు సందేహ మెందులకు ? తలుపులు మూసికొని ఇంటిలో కూర్చున్న మేమే వినియుంటిమే! మఱి మా యిల్లు ఎంతో దూరమున నున్నది గదా!"

"ఆ మ్రోత కేమిగాని, ఆ మనుజుడు ఎట్లున్నాడు?"

"అతని ముగముమీాద పెద్ద గాయమున్నట్లు తోచినది."

అంతట నతడు తన ఎడమ బుగ్గను చూపుచు, "ఈప్రదేశముననే కదా నీకు గాయము కనబడినది?" అని ప్రశ్నించెను.

"అవునవును."

"అతడెక్కడ నున్నాడు? అతడే దారిని పోయినాడో చెప్పుము. అతని రక్తము పీల్చివైచెదను. అబ్బ, కానీ కిరాయి వైన గొలుసొకటి! ఏదీ, ఆ ఆకురాయి నీవు అందిమ్ము."

నేను అతని చేతికి అకురాయి నిచ్చితిని. మఱియొక వాడు జుడు పోయిన దారినతనికి చూపితిని. అతడా వంకకు కొంచెము సేపు చూచెను. తరువాత నతడు ఆకురాతితో గొలుసును కోసికొనుటలో నిమగ్నుడయ్యెను.

"నే నింక ఇంటికి పోవలయును" అని అంటిని. కాని అతడేమియు సమాధాన మీయలేదు. అతడు నాయునికి నసలు గమనింపనట్లే యుండెను. అందువలన మెల్లన ఆ ప్రదేశము నుండి జాఱుకొనుటయే శ్రేయస్కరమని భావించితిని. వెంటనే నేనా ఆలోచనను అమలులో పెట్టితిని. అతడు నేను చేయుచున్న పనిని గమనింపనే లేదు.

4

నేను తిన్నగాపోయి మా యింటిలో ప్రవేశించితిని. నేను మాయింట ఆహార పదార్థములను దొంగిలించి యుంటినిగదా. అందువలన నన్ను పట్టుకొని జైలుకు తీసికొనిపోవుట కొక రక్షక

భటుడు సిద్ధముగా నుండుననుకొంటిని. కాని అటువంటిదేమియు జరుగలేదు. నేను దొంగతనముచేసిన సంగతిని ఇంకను ఎవ్వరును కనుగొని యుండలేదు.

ఆనాడు క్రిస్మసు సుదినము. క్రిస్మసు ఉత్సవమునకు కావలసిన ఏర్పాట్లను చేయుటలో నా సోదరి మునిగియుండెను. చర్చికి వచ్చుటకు ఆమెకు తీఱుబడి లేకుండెను. అందువలన నేను, జో కలసి చర్చికి పోవలయునని నిశ్చయింప బడెను. జో ప్రతి ఆదివారము ధరించునట్టి దుస్తులను ఆనాడుగూడ ధరించెను. ఆ దుస్తులలో నతడు దృష్టిబొమ్మవలె నుండెను. నేను బాగుగ బిగువైగానున్న దుస్తులను ధరించితిని. నా సోదరి నాకు కుట్టించిన దుస్తులన్నియు నట్టివే. మేము చర్చికిపోవుచుండగా పలువురు మమ్ము చూచి నవ్విరన్నచో అందు ఆశ్చర్యకరమైన విషయ మేదియు లేదు.

ఆనాడు మాయింట చక్కని విందు జరుగనుండెను. చర్చిలో పనిచేయుచున్న వాప్సల్, హాబుల్ దంపతులు, పంబుల్ చూక్ మామయ్య మున్నగు వారందఱు ఆనాడు మాతో కలసి భోజనము చేయనుండిరి. విందు మధ్యాహ్నము ఒంటిగంటన్నరకు జరుగును.

చర్చి కార్యకలాపములలో పాల్గొన్న తరువాత మేము స్వగృహమునకు తిరిగి వచ్చితిమి. అప్పటికే భోజనముచేయు బల్లలు సిద్ధము చేయబడి యుండెను. నా సోదరి చక్కగా దుస్తులు ధరించి యుండెను. అతిథులు స్వేచ్ఛగా వచ్చుటకై వీధి ద్వారము తెఱచి యుంచబడెను. అంతయు చాల చక్కగా నుండెను. అప్పటివఱకుగూడ నేను చేసిన దొంగతనము సంగతి ఎవ్వ

రికసి తెలిసుకుండెను. దానినిగూర్చి ఎవ్వరును ఒక్కమాటయైన మాట్లాడకుండిరి.

మొదట వాప్సల్ వచ్చెను. తరువాత హాబుల్ దంపతులు వచ్చిరి. పిమ్మట పంబుల్‌చూక్ వచ్చెను.

పంబుల్‌చూక్ నా సోదరితో నిట్లనెను: "జో సతీమణీ! నేను నీకు క్రిస్మసు అభినందనల నందజేయుచున్నాను. అందుకు సూచనగా ఒక సీసా షెర్రీ ద్రాక్ష సారాయము తెచ్చియున్నాను; మఱియు ఒకసీసా పోర్టు సారాయము తెచ్చియున్నాను."

ప్రతి క్రిస్మసు పండుగకు అతడట్లే చెప్పుచుండెడివాడు. ఆ విధముగనే రెండు సీసాల ద్రాక్ష సారాయమును తెచ్చి యిచ్చెడివాడు. అప్పుడు నా సోదరి ఇట్లనుచుండెడిది: "పంబుల్‌చూక్ మామయ్యా! నేను నీ దయకెంతయు కృతజ్ఞురాలను."

మేమందఱము భోజనమునకు కూర్చుంటిమి. వాప్సల్ మొదట దైవప్రార్థనచేసి, "మన మందఱము కృతజ్ఞులమై యుండవలయును" అనెను. అంతట నా సోదరి నావంకకుచూచి మందలింపు ధోరణిలో నిట్లనెను: "విన్నావా ఆ మాటలు? కృతజ్ఞుడవై యుండుము."

"అబ్బాయి! ముఖ్యముగా నిన్ను చేతితో పెంచిన వారికి కృతజ్ఞుడవై యుండుము." అని పంబుల్‌చూక్ అనెను.

అంతట హాబుల్‌సతి తలపంకించి, నేనేదో తప్పుచేసినట్లు నావంకకు చూచెను. ఎట్టకేలకామె, "పిల్లలెప్పుడును కృతజ్ఞులై యుండరెందుచేత?" అని ప్రశ్నించెను.

"ఇది వారిసహజ స్వభావము" అని హాబుల్ సమాధాన మిచ్చెను.

"అప్రసన్నుడు" అని మఱికొందఱని నావంకకు చూచిరి.

జో మాత్రము ఎప్పటివలె నావంకకు సానుభూతితో చూచెను.

అతిథులందరును పరిపరివిధముల హేళన చేయ సాగిరి. నేను కృతఘ్నుడనని వారు మాటిమాటికి రుజువుచేయు టకు ప్రయత్నింపసాగిరి. ఆవిధముగా వారు సోదరి అభిమాన మును సంపాదించుకొనుచుండిరి. జో మాత్రము కడు ప్రశాంత ముగ తనకు నాపట్లగల అభిమానమును ప్రకటించుచుండెను.

మఱికొంతసేపటికి నాసోదరి ఇట్లనెను: "పంబుల్ చూక్ మామయ్యా! కొంచెము బ్రాందీని సేవింపుము."

ఆమాటలు నాచెవినిబడెను. ఇంకేమున్నది! కొంపమునిగి పోయినది! బ్రాందీలో నేను నీటిని కలిపియుంటినిగదా. ఆ విష యము త్వరలోనే బయల్పడి పోవును. నేను జైలు పాలగుట తప్పదు.

నా సోదరి లోనికిపోయి బ్రాందీసీసాను చేతబట్టుకొని తిరిగివచ్చెను. ఆమె బ్రాందీసంతను పంబుల్‌చూక్ గ్లాసులో పోసెను. ఇంక ఇతరు లెవ్వరికి ఈయలేదు. పంబుల్ చూక్ వెంటనే బ్రాందీని సేవింపకుండెను. అందువలన నా ఆందోళన హెచ్చిపోసాగెను. మఱికొంతసేపటి కతడు మందహాసముచేసి బ్రాందీగ్లాసును పైకి ఎత్తెను. అనతికాలములో నతడు బ్రాందీ నంతను గడగడ త్రాగివైచెను. ఇంకేమున్నది? మఱుక్షణములో నతడు లేచి నిలబడెను. గిరగిర తిరుగుచు, గట్టిగా దగ్గుచు

ద్వారము వంకకు పరుగెత్తుకొని పోసాగెను. నేను బిగబట్టుకొని కూర్చుంటిని. జో దంపతులు అతని వద్దకు పరుగెత్తుకొని పోయిరి. నే నతనిని నిష్కారణముగ హత్యచేసితి ననుకొనసాగితిని. కాని జో దంపతు లతనిని అనతికాలములోనే వెనుకకు తీసికొనివచ్చి కుర్చీపై కూర్చుండబెట్టిరి. కుర్చీపై కూర్చున్న పంబుల్ చూక్, “తాను!” అని మాత్ర మనెను.

అప్పుడు నాకు జరిగిన విషయము అర్థమయ్యెను. నేను మంచి నీరనుకొని తాగునీటిని బ్రాందీలో కలిపియుంటిని! అతని పరిస్థితి క్రమక్రమముగా అధ్వాన్నముగ తయారగునని నేను భావింపసాగితిని.

“తారా!” అని నా సోదరి ఆశ్చర్యముతో ననెను. కాని అదృష్టవశమున నామె పంబుల్ చూక్ కోరిక ననుసరించి అతనికి వేఱొక పానీయము నొసగెను. అత డా పానీయమును సేవించి స్వస్థత పొందెను.

ఇక నాకెట్టి బాధయు నుండదని అనుకొనసాగితిని. కాని అంతలో నా సోదరి, “నేను ప్రత్యేకముగా తయారుచేసిన రొట్టెను మీకు తెచ్చి యిత్తును” అని అతిథులతో ననెను. ఆ మాటలు నాకు అశనిపాతమువలె నుండెను. ఏలయన నేను దానిని దొంగిలించి తీసికొనిపోయి చిత్తడి నేలలోని మనుజున కొసగి యుంటిని.

నా సోదరి రొట్టెను తీసికొని వచ్చుటకై లోపలకు పోయెను. అతిథులు దానినిగూర్చి మాట్లాడుకొనసాగిరి. “పిప్! ఆ రొట్టెలో నీకుగూడ వాటా యుండును” అని జో నాతో ననెను. రొట్టెఉన్నకదా నాకు భాగమువచ్చుట! నా సోదరి తిరిగి

వచ్చి ఏమి చేయునోయని నే నెంతయు భయపడసాగితిని. వెంటనే ఇల్లువీడి పారి పోవలయునని నిశ్చయించుకొంటిని. ఆ యుద్దేశ్యముతో లేచి వీధి ద్వారమువద్దకు పరుగెత్తుకొని పోతిని.

కాని అంతలో నాకు వీధి ద్వారమువద్ద చిన్న తుపాకు లను చేతబట్టుకొనియున్న సైనికులు కొందఱు కనబడిరి. వారిలో నొకడు చేతి సంకెళ్ళను నాకు జూపుచు నిట్లనెను: "ఓహో! నీ విక్కడనే యున్నావుకదా! రారమ్ము."

తుపాకులను పట్టుకొనియున్న సైనికులనుజూచి అతిథులు కలవరపడి లేచిరి. అంతలో రొట్టెను తీసికొనివచ్చుటకు లోపలకు పోయిన నా సోదరి ఉత్తచేతులతో తిరిగివచ్చి, "అయ్యో భగ వానుడా! రొట్టె ఏమై పోయినది? కనబడుటలేదు" అని ఆశ్చర్య మును ప్రకటించెను.

సైనికాధికారి నన్నులోనికి తీసికొనిపోయెను. అతడచ్చట నున్నవారి నందఱను పరికించి చూచెను. తరువాత నతడిట్లనెను: "గౌరవనీయులారా! మీకు అడ్డు వచ్చినందుకు క్షమింపుడు. నే నిచ్చటకు ఘనత వహించిన రాజుగారి పేరిట వచ్చియున్నాను. నాకు కమ్మరి కావలయును. అతనితో పనియున్నది."

"కమ్మరితో పనిఏమి యున్నది?" అని నా సోదరి ప్రశ్నించెను.

"కొంచెము పనియున్నది" అని సైనికాధికారి సమాధాన మిచ్చెను. అప్పటికతడు జోను గుర్తించి ఇట్లనెను: "ఓ కమ్మరీ! ఈ సంకెళ్లు కొంచెము చెడిపోయినవి. వీనిని నీ విప్పుడు ఉప

యోగింపవలసి యున్నది. అందువలన వీనిని వెంటనే బాగుచేసి యిమ్ము."

అంతట జో ఆ సంకెళ్లను పరిశీలించి ఇట్లనెను: "అయ్యా! ఇప్పుడు నేను కొలిమి వెలిగింపవలసి యున్నది. మీపని పూర్తి యగుసరికి సుమారు రెండు గంటలకాలము పట్టును."

"అటులనా? అయిన నీవు వెంటనే పనిని ప్రారంభింపుము. ఇది నాకు సంబంధించిన పనికాదు. ప్రభుత్వమువారికి సంబంధించిన పనియని జ్ఞప్తియందుంచు కొనుము" అని సైనికాధికారి అనెను. పిమ్మట నతడు సైనికుల నందఱను లోనికి పిలిచెను.

"ఇప్పుడు కాలమెంతయైనదో చెప్పగలవా?" అని సైనికాధికారి, పంబుల్‌చూక్‌ను ప్రశ్నించెను.

"రెండున్నర గంటలైనది."

"అయిన ఫరవాలేదు. రెండు గంటలు ఆగవలసి వచ్చినను ఆగుటకు నాకెట్టి అభ్యంతరమును లేదు. ఇక్కడకు చిత్తడినేలలు ఎంతదూరములో నున్నవి? ఒకమైలు దూరములో నున్నవను కొందును."

"సుమారొక మైలుదూరములో నున్నవి" అని నాసోదరి అనెను.

"మంచిది, సంధ్యా సమయమునకు వారినిపట్టుకొనగలను కొందును. సంధ్యా సమయమునకు పూర్వమే వారిని పట్టుకొన వలయునని ఆజ్ఞాపించి యున్నాను. నే నటులే చేయుదును."

"నేరగాండ్రా?" అని వాప్సల్ మామూలు ధోరణిలో ప్రశ్నించెను.

"అవును. ఇద్దఱు నేరగాండ్రు. వారింకను చిత్తడినేలల

లోనే తిరుగుచున్నారని నమ్ముచున్నాను. సంధ్యా సమయము నకు పూర్వము వారా ప్రదేశమును వీడిపోవుటకు ప్రయత్నింపరు. మరి ఇచ్చట నున్న వారెవ్వరైన వారిని చూచియున్నారా?"

అప్పుడు నేనుతప్ప మిగిలిన వారందఱును, "లేదు" అని గట్టి నమ్మకముతో సమాధానము చెప్పిరి. నేను సమాధాన మేమియు చెప్పలేదు. కాని ఆ విషయమును గుర్తించినవారే లేరు.

సైనికాధికారి ఇంకను నిట్లనెను: "వారు అనతికాలము లోనే మాకు చిక్కెదురనుట తథ్యము. ఓ కమ్మరీ! నీవు సిద్ధముగ నున్నావా? మా సైనికులు నీకుసాహాయ్యము చేయుటకు సిద్ధముగా నున్నారు."

అంతట జో కొలిమిలో పనిచేయుటకు అనుకూలమైన దుస్తులు ధరించి కొలిమిలోనికి పోయెను. సైనికు లతని వెంట లోనికిపోయి వేర్వేఱు పనులు చేసిరి. అనతికాలములో జో తన పని ప్రారంభించెను. మే మందఱము కన్నులప్పగించి చూడ సాగితిమి.

సైనికులు నేరగాండ్రను పట్టుకోదలచినారన్న సంగతిని విన్న నా సోదరికి సైనికులపట్ల అభిమాన మేర్పడెను. అందు వలన నామె వారిని బీరు పానీయము తీసికోవలసినదని ఆహ్వానించెను. సైనికాధికారిని బ్రాందీతీసికోవలసినదని ఆహ్వానించెను. కాని పంబుల్‌చూక్ ఇట్లనెను: "జో సతీమణీ! అతనికి ద్రాక్ష సారాయము నిమ్ము. అందు తారు లేదని నేను హామీ ఈయ గలను.

"అయిన నాకు ద్రాక్ష సారాయమే కావలయును" అని

సైనికాధికారి అనెను.

పంబుల్‌చూక్ నా సోదరివద్దనుండి ద్రాక్షసారాయమున్న సీసానుతీసికొని ఒక గ్లాసులో పోసి సైనికాధికారి కిచ్చెను. సైనికాధికారి దానిని సేవించెను.

"సైనికాధికారీ! ద్రాక్షసారాయము చాలబాగున్నదా?" అని పంబుల్‌చూక్ ప్రశ్నించెను.

అంతట సైనికాధికారి ఇట్లనెను: "ఈ ద్రాక్ష సారాయ మును మీరే తెచ్చినారని అనుమానించు చున్నాను."

పంబుల్‌చూక్‌నవ్వుచు, "అవునవును, ఎందుచేత మీరట్లు భావించుచున్నారు?"

"మీ సంగతి నేను సులభముగా గ్రహించినాను. మీకు ప్రతి విషయమునకు సంబంధించిన మంచిచెడ్డలు బాగుగా తెలి యును. మీరు మంచి అనుభవజ్ఞులు" అని సైనికాధికారి అనెను.

పంబుల్‌చూక్ మరల నవ్వుచు నిట్లనెను: "అటుల భావించుచున్నారా? మఱియొక గ్లాసునిండ ద్రాక్ష సారాయము సేవింపుడు."

"మీకెంతయు కృతజ్ఞుడను. మీరు వేయేండ్లు జీవింతురు గాక. మీ ఆరోగ్యముకొఱకు నేనీ ద్రాక్షసారాయము సేవించు చున్నాను." అని సైనికాధికారి అనెను.

పంబుల్‌చూక్ ఇచ్చిన రెండవగ్లాసు నతడు ఖాళీచేసెను. మూడవగ్లాసును సేవించుటకుగూడ నతడు సిద్ధముగా నున్న ట్లుండెను. పంబుల్‌చూక్ తాను ద్రాక్ష సారాయపు సీసాలను జో సతీమణికి బహుమానముగా నిచ్చిన విషయము మఱచి

పోయినట్లుండెను. అతడు ద్రాక్ష సారాయమును స్వేచ్ఛగా నీయసాగెను. నాకుగూడ కొద్ది వాటా వచ్చెను. అతడు నా సోదరి వద్దనుండి రెండవ సీసాను గూడ తీసికొని దానిలోని ద్రాక్ష సారాయమునుగూడ స్వేచ్ఛగా పంచి యీయసాగెను.

ఎట్టకేలకు జో చేయవలసిన పని పూర్తి అయ్యెను. అతడు సంకెళ్లను బాగుచేసి కొలిమిలోనుండి బయటకువచ్చెను. వాని సతడు సైనికాధికారి కొసగెను.

"మనలో కొందఱము సైనికులవెంటపోయి నేరగాండ్రను పట్టుకొనుట ఎంతవఱకు విజయవంతమగునో తెలిసికొనిన ఎంతయు బాగుండును" అని జో ధైర్యము తెచ్చుకొని అనెను.

"నేను రాను, నాకు వేఱేపని యున్నది" అని పంబుల్ చూక్ అనెను. హబుల్‌కూడ అదేవిధముగ సనెను.

"నీవు వచ్చినచో నేనుగూడ వత్తును" అని వాప్సల్ అనెను.

"నేను వచ్చుటకు సిద్ధముగనే యున్నాను. నా సతీమణి అంగీకరించినచో పిప్‌నుగూడ నావెంట తీసికొని వచ్చుటకు సిద్ధముగ నున్నాను" అని జో అనెను.

నేమిఱుపురము పోవుటకు నా సోదరి ఏ విధముగను అంగీకరించి యుండెడిదికాదు. కాని నేరగాండ్రను పట్టుకొనుపని ఎట్లు ముగియునో తెలిసికొనవలయునని ఆమె ఎంతేయు కుతూహాల పడుచుండెను. అందువలన నామె మేమిఱుపురము పోవుటకనుమతి యొసగెను.

సైనికాధికారి, సైనికులు అందఱివద్ద సెలవుతీసికొని బయటకు వచ్చిరి. వారివెంట నేను, జో, వాప్సల్ ఉంటిమి. సైని

కాధికారి మాతో నిట్లనెను: "మీరు మువ్వురును ఎప్పుడును మా వెనుకనే యుండవలయును. చిత్తడినేలలు చేరుకొన్న తరువాత మీ రేమియు మాట్లాడరాదు."

మేమందఱము బయలుదేఱి పోసాగితిమి. త్రోవలో నొకచోట నేను జోతో మెల్లన నిట్లంటిని: "వారు మనకు కనబడరనియే ఆశించుచున్నాను." కొంతసేపటికి మేము శ్మశానము యొద్దకు పోతిమి. కొందఱు సైనికులు సమాధుల నన్నిటిని వెదకిరి. కాని ఎవ్వరును కనబడలేదు. అంతట మేమందఱము చిత్తడినేలలలో ప్రవేశించితిమి. అచ్చట గాలి కడు తీవ్రముగ వీచుచుండెను. అందువలన జో నన్ను తన వీపుపై నెక్కించుకొనెను.

నా సాహచర్యమును పొందిన నేరగాడు నన్ను చూచుట తటస్థించినచో ఏమనుకొనును? నేను తన్ను మోసపుచ్చితినని భావించునా? జో వీపుమీద నున్న నేను నేరగాండ్రు కనబడుదురేమోయని నలువంకలకు చూడసాగితిని. నాకెవ్వరును కనబడకుండిరి. నాకే సవ్వడియు వినబడకుండెను. సైనికులు ప్రాత బురుజు దిక్కునకు పోవుచుండిరి. మేము వారివెనుకనే పోవుచుంటిమి. హఠాత్తుగా మేమందఱ మొకచోట ఆగిపోతిమి. ఏలయన మాకొక పెద్దకేక వినబడెను. మఱియొకసారికూడ ఆ కేక వినబడెను. ఆ సవ్వడి తూర్పుదిక్కుగా దూరమునుండి వచ్చుచున్నట్లుండెను. కాని అది స్పష్టముగాను, గట్టిగాను ఉండెను. రెండు రకముల కేకలు వినబడుచున్నట్లు మేము అనతికాలములో గ్రహించితిమి. ఆ విషయమును గూర్చియే సైనికాధికారి, సైనికులు మాట్లాడుకొనసాగిరి. జో వారితో నేకీభవించెను. వాప్సల్ కూడ ఏకీభవించెను.

"మన మా సవ్వడి వచ్చిన దిక్కునకు పోవలయును" అని సైనికాధికారి ఆజ్ఞాపించెను. మేమందఱు మా ఆజ్ఞను శిరసా వహించి పోసాగితిమి. ఎట్టి అవరోధములను లెక్కచేయక పోవు చుంటిమి. దగ్గఱకు పోవుచున్న కొలది మాకు రెండు గొంతులు స్పష్టముగా వినబడసాగెను. "హత్య!" అని ఒకగొంతు వినబడు చుండెను. "నేరగాండ్రడు!" అని మఱియొక గొంతు వినబడుచుం డెను. తరువాత నిరువురును పోరాడుకొనుచున్నట్లుండెను. మరల వారు కేకలు వేసికొనుచుండిరి.

మొదట సైనికాధికారి పరుగెత్తసాగెను. అతనివెంట సైనికులు పరుగెత్తుకొని పోసాగిరి. ఎట్టకేలకు ఒక గోతిలో పోరాడుకొనుచున్న ఇరువురు మనుజులనుచూచి సైనికాధికారి ఇట్లనెను: "ఇక్కడ ఇరువురు మనుజులును ఉన్నారు. ఓరీ! మీ రిరువురును వెంటనే లొంగిపొండు."

కాని గోతిలోని మనుజు లిరువురును ఎప్పటివలె కేకలు వేసికొను చుండిరి; కొట్టుకొనుచుండిరి. పోట్లాడుకొను చుండిరి.

అంతట సైనికాధికారి కొందఱు సైనికులతో కలిసి గోతిలో దిగెను. వారు పోరాడుకొనుచున్న నేరగాండ్ర నిరువు రను విడదీసిరి. అందొకడు నాకు మొట్టమొదట కనబడి నా సాహాయ్యమునుబొందిన మనుజుడు. మఱియొకడు నాకు రెండవ సారి కనబడిన మనుజుడు. వారిని మొదటి నేరగాడు, రెండవ నేరగాడు అని వ్యవహరింతము. వా రిరువురి శరీరములనుండి రక్తము స్రవించుచుండెను; ఇరువురును బాగుగ అలసిపోయినట్లు ఒగర్చు చుండిరి.

మొదటి నేరగాడు తన మొగముమీది రక్తమును

తుడుచుకొనుచు సైనికాధికారితో నిట్లనెను: "అయ్యా ! గుర్తుంచుకొనుడు! అతనిని వశపఱచుకొన్నది నేనే! అతనిని నేనే మీకు అప్పగించుచున్నాను. ఈవిషయమును బాగుగా గుర్తుంచు కొనుడు."

"ఆ విషయమునుగూర్చి నీవంత ప్రత్యేకముగ చెప్పవల సిన పనిలేదు. అందువలన నీకు కలుగు లాభమేమియు నుండదు. నీవుకూడ అదే పరిస్థితిలో నున్నావు" అని సైనికాధికారిఅనెను.

"అందువలన నాకేమో లాభము కలుగునని నేను ఆశిం చుటలేదు. ఇప్పుడు జరుగుచున్న మంచికంటె ఎక్కువ మంచి జరుగవలసిన పని ఏమియు లేదు. నే నతనిని లోబఱచుకొన్నాను. అతని కా విషయము తెలియును. నా కామాత్రము చాలును" అని మొదటి నేరగాడు అనెను.

రెండవ నేరగాడు చూచుట కెంతయు భయంకరముగ నుండెను. అతని మొగముమీద నిదివఱకొక పెద్దగాయముండె డిది. ఇప్పుడు చాలగాయములుండెను. అత నోటివెంట మాట రాకుండెను.

సైనికాధికారి ఆజ్ఞ ననుసరించి సైనికులు ఇరువురు నేర గాండ్ర చేతులకు సంకెళ్లు వేసిరి. ఎట్టకేలకు రెండవ నేరగాడు ఇట్లనెను: "అయ్యా! అతడు నన్ను హత్యచేయుటకు ప్రయత్నించి నాడు. ఈ విషయమును బాగుగ జ్ఞప్తియం దుంచుకొనుడు."

అంతట మొదటి నేరగాడు ఇట్లనెను: "ఏమేమి? హత్య చేయుటకు ప్రయత్నించినానా? ప్రయత్నించుటయు, చేయకుండ నుండుటయునా? నే నతనిని లోబఱచుకొని, అప్పగించినాను. నేను చేసిన పని అదియే. అత డీ చిత్తడి నేలనుండి పాఱిపోవు

టకు ప్రయత్నించినాడు. అతడట్లుచేయకుండ నేను ఆపుచేసినాను. అంతియకాదు. అతని నిచ్చటకు ఈడ్చుకొని వచ్చినాను. ఈ దుర్మార్గుడొక గౌరవనీయుడు. నా ద్వారమున నీ గౌరవనీయుడు మరల కారాగారపు టోడలో ప్రవేశించుటకు వీలు కలుగుచున్నది. హత్యచేయుటయా? నాచే హత్యచేయబడుట కతడు తగినవాడేనా?. అంతకంటె అధ్వానమగు పరిస్థితిలోని కీడ్చుకొని వచ్చుటకు వీలుండగా హత్యచేయుటయా!"

అపుడు రెండవ నేరగాడు ఒగర్చుచు ఇట్లనెను: "అయ్యా! అతడు—నన్ను—హత్య—చేయుటకు ప్రయత్నించినాడు.—గుర్తించుకొనుడు."

కాని మొదటి నేరగాడు ఇట్లనెను: అయ్యా! నామాట ఆలకింపుడు. నేను ఒక్కడనే కారాగారపు టోడనుండి తప్పించుకొని వచ్చినాను. ఆ విషయమున నాకు సాహాయ్యము చేసిన వారెవ్వరును లేరు. నేనువచ్చి నా విధ్యుక్తధర్మమును నిర్వహించినాను. అతనిని నేను స్వేచ్ఛగా పోనిచ్చుటయా? ఎప్పటికిని వీలు లేదు. నే నీ గోతిలో చనిపోయి యుండినను అతనిని గట్టిగా పట్టుకొని యుండెడివాడను. మీరు వచ్చి అతనిని పట్టుకొనగలిగి యుండెడివారు. నా గట్టిపట్టు అటువంటిది."

అపరిమితముగా భయపడిన రెండవ నేరగాడు ఇట్లనెను: "అతడు నన్ను హత్యచేయుటకు ప్రయత్నించినాడు. మీరు సమయమునకు వచ్చియుండక పోయినచో నేను మరణించి యుండెడివాడను."

"అతడు అసత్యము పలుకుచున్నాడు!" అని మొదటి నేరగాడు అనసాగెను; "అతడు అసత్యవంతుడుగా జన్మించినాడు.

అసత్యవంతుడుగానే మరణించును. అతని మొగమువంకను చూడుడు. ఆ విషయ మతని మొగముపై స్పష్టముగ కనబడుట లేదా? అతడు నావంక కన్నెత్తియును చూడడు. చూచుట కతనికి ధైర్యము చాలదు."

రెండవ నేరగాడు సైనికులవంక చూచెను; చిత్తడి నేలల వంక చూచెను; ఆకసమువంక చూచెను; కాని మొదటి నేరగానివంక మాత్రము చూడలేదు.

అంతట మొదటి నేరగాడు ఇట్లనెను: "అతనిని చూచుచున్నారా? అతడెంతటి దుర్మార్గుడో చూచుచున్నారా? అతడా కన్నులతో నెట్లు చూచుచున్నాడో గమనింపుడు. మమ్ముల నిద్దరను కలిసి విచారణ చేసినప్పుడతడట్లే చూచినాడు. అతడెప్పుడుకూడ నావంకచూచి యుండలేదు."

చాలసేపు అటునిటు చూచిన తరువాత రెండవ నేరగాడు మొదటి నేరగానివంక ఒక్క క్షణకాలముచూచి, "నీవంక చూచుటకు నీలో నేమియులేదు" అని యనెను. ఆమాటలు వినగానే రెండవ నేరగానికి అపరిమితమగు కోపమువచ్చెను. అతడు రెండవ నేరగానిపైకి దుముకసాగెను. కాని సైనికులడ్డు పడిరి.

అంతట రెండవ నేరగాడు ఇట్లనెను: "నేను మీకు చెప్పియుండలేదా? హత్యచేయుటకు వీలున్నచో అతడున్నన్ను తప్పక హత్యచేయును. అందుకు సందేహ మేమాత్రమునులేదు." అతడు అపరిమితమగు భయముతో గజగజ వణకిపోవుచున్నట్లు స్పష్టముగా కనబడుచుండెను.

"ఇంక మీ వాగ్వివాదము చాలును" అని సైనికాధి

కారి వారి నిసుపురను మందలించెను.

తరువాత ఒక సైనికుడు సైనికాధికారి ఆజ్ఞ ననుసరించి దీపము వెలిగింపబోయెను. అప్పుడు మొకటి నేరగాడు చుట్టును కలయజూచెను. అప్పుడే నేను అతని కంటబడితిని. అతడంతవఱకు నన్ను చూచియుండలేదు. నే నంతకుముందే జో వీపుపైనుండి క్రిందకుదిగి నిలబడి యుంటిని. అతడు నావంక చూడగానే నేను తని వంక ఆతురముగ చూచితిని. నేను మెల్లగ చేతులను కదల్చితిని; తల పంకించితిని. నా అమాయకత్వమును ఋజువుచేసికొనుటకై అతడు నావంక చూచు నవకాశముకొఱకు అంతవఱకు వేచియుంటిని. అతడు నావంక చూచెను. నా మనస్సులోని విషయ మతనికి తెలిసినదో, లేదోమాత్రము నాకు అర్థముకాకుండెను. అతడు నావంక కదియొక విధముగా చూచెను. కాని ఆ చూపు నాకు అర్థముకాలేదు. అది యంతయు నొక్క-క్షణ కాలములో జరిగిపోయెను.

అనతికాలములో దీపములు వెలిగింపబడెను. అంతట నలుగురు సైనికులు గాలిలోకి రెండుసార్లు తుపాకులు కాల్చిరి. మా వెనుక కొంతదూరమునకూడా దీపములువెలిగింపబడుటను చూచితిమి. మఱికొన్ని దీపములు నది కావలిగట్టున వెలిగింపబడెను.

"ఇంక మనము బయలుదేఱి పోదము" అని సైనికాధికారి అనెను.

మే మందఱము బయలుదేఱి పోసాగితిమి. మే మింకను ఎంతోదూరము పోకపూర్వమే మాకు మూడుసార్లు ఫిరంగి మ్రోతవినబడెను. ఆమ్రోతకునాచెవులు బద్దలైపోయినట్లయ్యెను.

మ్రోత వినబడెను. ఆ మ్రోతకు నా చెవులు బద్దలై పోయినట్లయ్యెను.

ఇద్దఱు నేరగాండ్రను ఎడముగా నడచి పోవుచుండిరి. ఒక్కొక్కని చుట్టును ప్రత్యేకముగా సైనికులు కాపుండిరి. నేను జో హస్తము నొక దానిని పట్టుకొని యుంటిని. అతని మఱియొక చేతిలో దీప మొకటి యుండెను. వెనుకకు తిరిగి పోదమని వాప్సల్ అనెను. కాని విషయమును కడవఱకు చూచుట మంచిదని జో అనెను. అందువలన మేమింకను ముందుకు పోవుచుంటిమి. మా దారి చాలవఱకు బాగుగనే యుండెను. ముఖ్యముగా మేము నది యొడ్డుననే పడిపోవుచుంటిమి. నేను చుట్టును చూడసాగితిని. అప్పుడు ఇతర దీపములు నూరింత మా వంకకే వచ్చుచున్న దృశ్యమును చూచితిని. ఇరువురు నేరగాండ్రను తీసికొనుచు నడవసాగిరి. అందువలన మేము వేగముగ ప్రయాణము చేయలేకుంటిమి. రెండు మూడుసార్లు వారు అచ్చటచ్చట నాగి సేద తీర్చుకొనిరి గూడ.

ఆ విధముగా మేము సుమారొక గంట కాలము ప్రయాణముచేసి ఒక కఱ్ఱ కుటీరమును చేరుకొంటిమి. ఆ కుటీరములోని కాపలావారు మా సవ్వడి విని, "ఎవరు వారు?" అని ప్రశ్నించిరి. సైనికాధికారి వారికి సముచితముగ సమాధానమొసగెను. తరువాత మేమందఱము ఆ కుటీరములో ప్రవేశించితిమి. అచ్చట వెల్లవేసిన వాసన, పొగాకు వాసన వేయుచుండెను. నిప్పుకుంపటి బాగుగా వెలుగుచుండెను. ఒక పెద్ద దీపము గోడ నుండెను. అచ్చట నొక పెద్ద కొయ్య మంచము కూడ నుండెను. ఆ మంచముమీద ఒకే సమయమున పదుగురు

పంద్రెండుగురు సైనికులు పరుండవచ్చును. నేమూ కుటీర ములో ప్రవేశించు నప్పటికి దానిమీద ముగ్గురు నలుగురు సైని కులు పరుండి యుండిరి. మా సవ్వడికి వారు లేచి తలలెత్తి చూచిరి. కాని తరువాత నెప్పటివలె పరుండిరి. సైనికాధికారి ఆ కుటీరములోని ఒక పుస్తకములో నేమో వ్రాసెను. పిమ్మట నతడు రెండవ నేరగానిని పడవ వద్దకు పంపెను. అతనితోబాటు కొందఱు సైనికులుగూడ వెళ్ళిరి.

మొదటి నేరగాడు ఆ ఒక్కసారి తప్ప మఱి నావంక నింక చూడలేదు. అతడు కుటీరములో నిలబడి ఏదో ఆలో చించుచున్న వానివలె నిప్పు కుంపటి వంకకు చూడసాగెను. కాని హఠాత్తుగా నతడు సైనికాధికారి వంకకు తిరిగి ఇట్లనెను: "ఈ నా తప్పించుకొని పోవుటను గూర్చి ఒక విషయము చెప్ప దలచుకొన్నాను. అందువలన మీకు కొందఱిపైగల అను మానము తొలగి పోవును."

అంతట సైనికాధికారి ఇట్లనెను: "నీ యిష్టము వచ్చిన విషయము చెప్పవచ్చును. కాని ఇచ్చట చెప్పవలయునని నిన్నె వ్వరును కోరియుండలేదు. నీవు అన్ని విషయములను చెప్పుటకు నీకు తగిన అవకాశము లభించును. ఆ విషయము నీకు తెలి యును."

"ఆ విషయము నాకు తెలియు నన్నమాట నిజమే. కాని నేను వేఱొక విషయమును గూర్చి చెప్పబోవుచున్నాను. ఏ మానవుడును కాని ఆహారము లేక మలమల మాడలేడు. ఇతరుల మాట కేమిగాని, నేను మాడలేను. అందువలన నేను శ్మశానము

నకు సమీపముననే యున్న గ్రామములో ఆహారము తీసి కొన్నాను."

"అనగా దొంగిలించినావన్నమాట!" అని సైనికాధి కారి అనెను.

"ఎక్కడనుండి తీసికొంటినో చెప్పెదను వినుడు. కమ్మరి ఇంటినుండి."

అంతట సైనికాధికారి జో వంకకు తేటిపాఱజూచి, "హల్లో!" అని యనెను.

జో నావంకకు జూచి, "హల్లో! పిప్! అని యనెను.

"బ్రాందీ, ప్రత్యేకముగ తయారు చేయబడిన రొట్టె, మఱి కొన్ని ఆహార పదార్థములు సంపాదించినాను" అని మొదటి నేరగాడనెను.

"ప్రత్యేకముగ తయారు చేయబడిన రొట్టెను మీరు పోగొట్టుకొని యుండిరా?" అని సైనికాధికారి జోను ప్రశ్నించెను.

"ఆ రొట్టె లేని సంగతిని నా భార్య కనుగొన్నది. సరిగా ఆ సమయమునకు మీరు మా యింటికి వచ్చినారు. నీకు తెలి యుదా, పిప్!" అని జో అనెను.

అంతట మొదటి నేరగాడు నా వంకకు చూడకుండ జో వంకకు చూచి ఇట్లనెను: "అయిన ఆ కమ్మరివి నీవన్నమాట! అవునా? మీరు ప్రత్యేకముగ తయారు చేసికొన్న రొట్టెను నేను తిన్నిసైచినందుల కెంతయు విచారించుచున్నాను".

అప్పుడు జో ఇట్లనెను: "విచారింపకుము. నీవేమి చేసి నావో మాకు తెలియదు. నీవు మా తోడివాడవు. నీవు మాబ

మలమూఁడి మరణించుటకు సిద్ధముగా నుండగా నేము ఊర కొందుమా? మనము సహించి యూరకొందుమా, పిప్?"

అంతలో రెండవ నేరగానిని తీసికొని పోయిన పడవ తిరిగి వచ్చెను. మొదటి నేరగానిని కూడ తీసికొని పోవుటకు కొందఱు సైనికులు సిద్ధముగా నుండిరి. వారతనిని పడవ వద్దకు తీసికొని పోసాగిరి. మేముగూడ వారి ననుసరించిపోతిమి. మొదటి నేరగాఁడు పడవలో ప్రవేశపెట్టబడెను. ఆ పడవను నడపుచున్న వారుగూడ నేరగాండ్రే. మొదటి నేరగానిని తిరిగి చూడ గలిగి నందుల కెవ్వరును ఆశ్చర్యపడలేదు. అతనిని చూచుట కెవ్వరును కుతూహలపడలేదు. ఎవ్వరును సంతోషింపలేదు; విచారింపలేదు; ఒక్క మాటయైన మాట్లాడలేదు

అనతికాలములో పడవ ప్రయాణమైపోయెను. అదిపోయి పోయి కారాగారపు టోడను చేరుకొనెను. పడవలోని మొదటి నేరగాఁడు ఆ కారాగారపు టోడలో ప్రవేశించెను. అతడింక కనబడలేదు. జో నన్ను తన వీపుమీద నెక్కించుకొని ఇంటికి తిరిగి తీసికొని వచ్చెను.

# 5

నేను పెద్దవాడనైన తరువాత జో వద్ద 'అప్రెంటిసు'గా పనిచేయవలయునని నిశ్చయింపబడెను. అంతవఱకు నేను జో చెప్పిన చిల్లర పనులన్నిటిని చేయసాగితిని. ఒక్క అతడే అన నేల? ఆ చుట్టు ప్రక్కల వారికి ఏ చిన్న అవసరము వచ్చినను

నన్నే పిలిచెడివారు. నేను వారి పనులుచేసి పెట్టుచుండెడివాడను.

ఆ గ్రామములో సాయంకాలపు పాఠశాల ఒకటి యుండెను. దానిని వాప్సల్ బంధుగు ఒకర్తె నడపు చుండెను. ప్రతి కుఱ్ఱవానివద్ద ఆమె వారమునకు రెండు పెన్నీలు తీసికొను చుండెను. నేనుగూడ ఆ పాఠశాలకు పోసాగితిని. ఇందలి ఆశ్చర్య కరమైన విషయమేమనగ, ఆమె ప్రతి సాయంకాలము ఆరు గంట లకు, ఏడు గంటలకు మధ్య నిదురించు చుండెడిది. ఆమె నిదురను చూచుటకే నేను వారమునకు రెండు పెన్నీలు ఇచ్చుకొను చుంటి నన్నమాట.

వాప్సల్ బంధుగుకు ఒక్క పాఠశాలయేకాదు; ఒక అంగడికూడ నుండెను. ఆ రెండును ఒకేగదిలో నడచుచుం డెను. ఆ అంగడిలో నేమివస్తువులున్నవో, వాని ధరలేమో ఆమెకు తెలియదు. కాని ఒకపుస్తకములో వేర్వేరు వస్తువుల ధరలు వ్రాయబడియుండెను. అవి ఎప్పుడును డ్రాయరులో నుండును. బిడ్డీ అను పేరుగల అమ్మాయి వాప్సల్‌కు దూర బంధువు. ఆమెకు తల్లిదండ్రు లెవ్వరునులేరు. అంగడి యజ మానురాలు తరఫున ఆమెయే సరకుల నమ్ముచుండెడిది. నేను ఎట్టిపరిస్థితిలో నుంటినో ఆ అమ్మాయికూడ అటువంటి పరిస్థితి లోనే యుండెను.

బిడ్డీ నాపట్ల అభిమానమును ప్రదర్శింపసాగెను. ఆమెయే నాకు అక్షరములు నేర్పసాగెను. క్రమక్రమముగా నేను చదువను, వ్రాయను, లెక్కలుచేయను నేర్చుకొంటిని.

ఒకనాటిరాత్రి నేను పొగగొట్టము మూలకూర్చుండి పలకపై ఒక ఉత్తరము వ్రాసితిని. దానిని జోకు చూపితిని. జో

దానినిచూచి, "నీవెంత విద్యావంతుడవైనావు?" అని యంటిని. జో విద్యావిహీనుడను విషయమును నేను గ్రహించితిని. అందువలన నేను అతని నిట్లుప్రశ్నించితిని: "జో! నీవు నా అంత చిన్నవాడుగా నున్నప్పుడు బడికి వెళ్ళియుండలేదా?"

"లేను, పిప్!"

"నీవు బడికి ఎందుచేత వెళ్ళలేదో తెలిసికోవచ్చునా?"

"చెప్పెదను వినుము, పిప్! నాతండ్రి వట్టి త్రాగుబోతు. అతడు బాగుగ త్రాగియున్నప్పుడు నాతల్లిని చితుకగొట్టుచుండెడివాడు. అంతియకాదు, నన్నుగూడ చావగొట్టుచుండెడివాడు. కొలిమివద్ద మాత్రము ఏపనియుచేసెడివాడుకాడు. పిప్! వినుచున్నావా? నీకు అర్థమగుచున్నదా?"

"వినుచున్నాను, జో!"

"అందువలన మేము అనేకసార్లు ఇల్లువిడి పారిపోవుచుండెడివారము. నాతల్లి నన్ను పాఠశాలకు పంపుటకు సిద్ధపడుచుండెడిది. కాని అంతలో నాతండ్రివచ్చి మమ్ములనిరువురను బలవంతముగ ఇంటికి తీసుకొనిపోవుచుండెడివాడు. ఇల్లు చేరుకొన్న తరువాత మరల చితుకగొట్టి పచ్చడిచేయుచుండెడివాడు. నేను పాఠశాలకుపోయి చదువుకొనుటకు ఏమాత్రము వీలుండెడిది కాదు.

చదువుకొనకపోయినను భోజనము తప్పదుకదా! పనిచేసి డబ్బుసంపాదించకపోయినచో ఇంటిలోనికుండలు డింకీలుకొట్టును. అందువలన నేను కమ్మరము నేర్చుకొనికష్టపడి పనిచేయసాగితిని. అందులకు నాతండ్రి ఎట్టి అభ్యంతరముపెట్టలేదు. నేను సంపాదించిన డబ్బుతో మా కుటుంబమును పోషింపసాగితిని. కొంత

కాలమునకు నాతండ్రి మరణించెను. నాత
చెడిపోయెను. ఆమె అనతికాలములో మరణంచె.
ఒంటరిగనుండుట నాకెంతయు బాధాకరమ , నిం ...
సరిగా ఆసమయముననే నాకు నీసోదరితో పరిచయమేర్పడెను. నీసోదరి చాల చక్కనిది."

'నీసోదరి చాలచక్కనిది' అను వాక్యమును వినగానే నా ముఖములో సందేహము గోచరింపసాగెను.

అది గ్రహించి జో ఇట్లనెను: "ఆ విషయమునుగూర్చి ఆమె కుటుంబములోనివారికని, ప్రపంచములోని ఇతరులకును మరియొక అభిప్రాయ ముండవచ్చును. కాని ఆమె చాల చక్కనిదే అని నేను గట్టిగ అభిప్రాయ పడుచున్నాను."

"జో! నీవా విధముగ తలచు చున్నందుకు నే నెంతయు సంతసించు చున్నాను."

"పిప్! నా పరిస్థితి కూడ అంతే. ఆ విధముగ అనుకో గలుగు చున్నందుకు నేనుకూడ ఎంతయు సంతసించు చున్నాను. కొంచెము ఎఱ్ఱగా నున్నను, అచ్చటచ్చట ఎముకలు తగిలినను నాకు వచ్చు నష్టమేమి ?"

"అవునవును. ఎవ్వరికిగాని వచ్చు నష్టమేమి ?"

"నిశ్చయముగవచ్చు నష్టమేదియు లేదు. నీవు చాల చక్కగ మాట్లాడినావు. నీ సోదరి నిన్ను చేతితో పెంచుచున్న దని ఆనాడు జనులందఱును అనుకొను చుండెడివారు. అది యామె దయాదాక్షిణ్యమును తెలియ జేయుచున్నదని అంద ఱును అనుకొనెడి వారు. నేనుగూడ అట్లే అనుకొంటిని. అప్పుడు నీవు చూచుట కెంతయు అసహ్యముగ నుండెడివాడవు."

నేమి ?"

మాట ? నేను నీ సోదరితో మాట్లాడుట

... ప్పుడెల్ల నేను ఇట్లను చుండెడివాఁడను: "పాప మీా బాలుని బాగుగ పెంచుము. భగవంతుఁ డీ బాలుని ఆశీర్వ దించునుగాక. ఇతనికి నా కొలిమిలో స్థానమున్నది ? తెలిసి నదా ?"

ఆ మాటలు నాకు అపరిమితమగు సంతోషమును కలి గించెను. నే నతని మెడను గట్టిగా కౌగిలించుకొంటిని.

జో ఇంకను నిట్లనెను: "నా వివాహ మైనప్పటి నుండియు మన మిరువురము ప్రాణ స్నేహితులముగా నున్నాము. నా కిప్పుడు నీ వద్ద చదువుకొన వలయునని యున్నది. నీవు నాకు విద్య నేర్ప వలయును. కాని యీా విషయము నీ సోదరికి తెలియరాదు. తెలిసినచో ఆమె ఇందుల కెంతమాత్రమును అంగీకరింపదు. నిన్ను నన్ను కఠినముగ పరిపాలించుటయే ఆమె అభిమతము."

అత డింకను నా సోదరినిగూర్చి అనేక విషయములు చెప్పెను. నేను చిన్నవాఁడ నైనప్పటికిని నా కా రాత్రి నుండి జో అనిన నొక క్రొత్త రకమగు గౌరవభావము ఏర్పడెను.

జో గడియారము వంక చూచి ఇట్లనెను: "ఇప్పుడు ఎనిమిది గంటలై పోయినది. చూడుము, మీా సోదరి ఇంకను ఇంటికి తిరిగి రాలేదు. పంబుల్‌చూక్ బండి గుఱ్ఱము మంచులో కూరుకొని పోయినదో, ఏమో ?"

ఆనాడు నా సోదరి, బ్రహ్మచారి పంబుల్‌చూక్‌తో కలసి సంతకుపోయి యుండెను. పంబుల్‌చూక్‌కు కొన్ని వస్తువులను

కొనుట సరిగా తెలియదు. అందువలన నాన్న యింటికి సాహా-య్యము చేయుటకై సంతకు పోయియుండెను.

జో ఇంటిలో చేయవలసిన కొన్ని పనులు చేసెను. తరువాత మేమిద్దరముపోయి బయట కూర్చుంటిమి. బయట చలిగాలి తీవ్రముగా వీచుచుండెను. మరికొంతసేపటికి గుఱ్ఱపు బండి చప్పుడు వినబడసాగెను. అనతి కాలములో నొకబండి వచ్చి మా యింటిముందు ఆగెను. దానిలోనుండి నా సోదరి, పంబుల్‌చూక్ క్రిందకు దిగిరి. మేమందఱము కలసి లోపలకు పోయి కుంపటివద్ద కూర్చుంటిమి.

అప్పుడు నా సోదరి ఇట్లనెను: "ఈ బాలుడు నేడు కృతజ్ఞుడుగా నుండనిచో ఇక నెప్పుడును నుండడు."

ఎందుకో తెలుసుకొనకుండగనే నేను కృతజ్ఞుడుగా నున్నట్లు కనబడుటకు ప్రయత్నింప సాగితిని.

నా సోదరి ఇంకను ఇట్లనెను: "ఇతనిని ఋజుమార్గముగా పైకెత్తగలనని ఆశించుచున్నాను. ఆ విషయమును గూర్చి నేను భయపడుచున్నాను."

"ఆమె అటువంటిది కాదు. ఆమెకు అన్ని విషయములు బాగుగా తెలియును" అని పంబుల్‌చూక్ అనెను.

ఆ మాటలను విని నేను, జో ఒకరివంక నొకరము చూచుకొన సాగితిమి. 'ఆమె' యెవరో తెలిసికొనుటయే మా తలంపు.

మా ముఖ కవళికలను గమనించి నా సోదరి ఇట్లనెను: "మీ ముఖము లట్లున్న వేమి? ఎవరి యిల్లయినా తగులబడి పోవుచున్నదా ఏమి?"

అంతట జో మెల్లగ నిట్లనెను: "అదికాదు సతీమణీ! 'ఆమె' అని ఎవ్వరో అన్నారు."

"అందు ఆశ్చర్యకరమయిన విషయ మేమున్నది? హావిషమ్ కన్య 'అతడు' అయినతప్ప ఆమె ఆమెయే."

"పట్టణములో నివసించుచున్న హావిషమ్ కన్యయా?" అని జో అనెను.

"పట్టణములో నివసించుచున్న హావిషమ్ కన్యగాక పట్టణము బయట నివసించుచున్న మఱియొక హావిషమ్ కన్య యున్నదా? ఇతడు తన యింటికి వచ్చి ఆడుకొనవలయునని ఆమె వాంఛించుచున్నది. ఇతడు వెళ్ళుట తథ్య మనుకొనుము. అత డచ్చటకు పోయి ఆడుకొనుటయే మంచిది. లేనిచో అత నితో పనులు చేయింతును.

పట్టణములో నివసించుచున్న హావిషమ్ కన్యను గూర్చి నేనిదివరకు వినియుంటిని. ఆమెను గూర్చి తెలియనివా రెవ్వరు? ఆమె గొప్ప ధనికురాలు. ఒక పెద్ద భవనమున నామె ఏకాంతముగ నివసించుచున్నది.

"ఆమె పిప్‌ను ఎరిగియుండు ననుట ఎట్లు తటస్థించినదో నాకు ఆశ్చర్యకరముగ నున్నది" అని జో అనెను.

"ఆమె పిప్‌ను ఎఱుగునని ఎవరన్నారు?"

"మరి ఆమె అతడు తనవద్దకు వచ్చి ఆడుకోవలయునని కోరినదని ఎవరో అన్నారు కదా?"

"పంబుల్ చూక్ మామయ్య ఆమె ఇంటికి తఱచుగా పోవుచుండును కదా? అప్పుడామె తన యింటికి వచ్చి ఆడుకొను బాలు డొకడు కావలయునని మామయ్యతో చెప్పియుండ

కూడదా? మనపట్ల అపరిమితమగు అభిమానముగల మామయ్య ఈ బాలుని గూర్చి ఆమెకు చెప్పియుండ కూడదా? దీనివలన ఈ బాలుని భవిష్యత్తే మారిపోవచ్చును. నేటి రాత్రి మామయ్య ఇతనిని తన బండిలో కూర్చుండబెట్టుకొని పట్టణమునకు తీసికొని పోవును." తేపటి యుదయమున హావిషమ్ కన్య యింటికి తీసికొని పోవును."

తరువాత ఆమె నన్ను గట్టిగా పట్టకొని వేరొకచోటు నకు తీసికొనిపోయి స్నానముచేయించెను. ఉన్న దుస్తులలో కెల్ల మంచి దుస్తులు తొడిగించెను. పిమ్మట నన్ను పంబుల్ చూక్ కు అప్పగించెను. అతడు నన్ను స్వీకరించి యిట్లనెను: "అబ్బాయి! నీవు మిత్రులకందరకును శాశ్వతముగా కృతజ్ఞుడవై యుండుము. ముఖ్యముగా నిన్ను చేతితో పెంచినవారికి కృతజ్ఞుడవై యుండుము."

నేను జో వద్ద శలవు తీసికొని బండిలో ప్రవేశించితిని. అపతి కాలములో బండి పట్టణమునకు బయలుదేరెను. జోను విడిచిపోవుటకు నేనెంతయు విచారింప సాగితిని. హావిషమ్ కన్య ఇంట నేనేమి చేయవలయునో కూడా నాకు సరిగా అర్థము కాకుండెను.

# 6

మఱునాటి యుదయమున ఎనిమిది గంటలకు నేను, పంబుల్‌చూక్ కలసి భోజనము చేసితిమి. కాని నాకది ఏమాత్రము సంతృప్తికరముగ లేకుండెను.

పదిగంటలయ్యెను. మేమిరువురము కలసి హావిషమ్ కన్య ఇంటికి బయలుదేఱి పోతిమి. పదునేను నిమిషములకు మేమా గృహమును చేరుకొంటిమి. అది చాల పెద్ద ఇల్లు. చూచుటకెంతో ప్రాతదివలె నుండెను. మఱియు నది భయంకరముగ నుండెను.

మేము గంట మ్రోగించి ద్వారమువద్ద నిలబడితిమి. కొంతసేపటికి ఎవ్వరో కిటికీ తలుపులు తెఱచి, "ఎవరు ?" అని ప్రశ్నించిరి.

"పంబుల్‌చూక్"

"మంచిది."

కిటికీ తలుపులు మరల మూసికొనెను.

కొంతసేపటికి చేత తాళపుచెవులు పుచ్చుకొన్న యువతి యొకర్త మేమున్న ద్వారము వద్దకు వచ్చెను.

"ఇతడే పిప్" అని పంబుల్‌చూక్ అనెను.

యువతి ద్వారము తెఱచి, "ఓహో ఇతడా పిప్ ? లోనికిరమ్ము, పిప్ !" అని యనెను. ఆమె చాల అందముగ నుండెను. ఆమె గర్వము కలదానివలె కూడ నుండెను,

నేను లోపలకు పోతిని. పంబుల్‌చూక్ కూడ లోపలకు వచ్చుటకు సిద్ధపడెను. కాని యువతి అతనిని ఆపుచేసి ఇట్లనెను: "నీవుకూడ హావిషమ్ కన్యను చూడవలచితివా?"

"ఆమె నన్ను చూడవలచినచో చూచెదను" అని పంబుల్‌చూక్ అనెను.

"ఆమె నిన్ను చూడవలచుటలేదు" అని యువతి అనెను. అంతట పంబుల్‌చూక్ వెనుకకు తిరిగి పోయెను.

తరువాత యువతి నాతో నిట్లనెను: "అబ్బాయి! నీ ప్రవర్తన నిన్ను చేతితో పెంచి పైకి తీసికొని వచ్చినవారికి గర్వ కారణముగ నుండునుగాక."

యువతి ఎప్పటివలె ద్వారమునకు తాళమువేసెను. తరువాత మేమిరువురము కలసి పో సాగితిమి. ఎట్టకేలకు మేము ఇంటికి ప్రక్కగా నున్న ఒక ద్వారమును చేరుకొంటిమి. ఆ ద్వారముగుండా మేము లోనికి ప్రవేశించితిమి. లోపల నంతయు చీకటిగా నుండెను. యువతి చేతనొక క్రొవ్వువత్తి పట్టుకొని నన్ను తీసికొని పోసాగెను. ఒక చోట మెట్లు ఎక్కి మేడపైకి పోతిమి. ఎంతదూరము పోయినను చీకటిగనే యుండెను. క్రొవ్వువత్తి వెలుగే మాకు దారి చూపుచుండెను.

చాలసేపటికి మే మొక గదిద్వారమును చేరుకొంటిమి. అంతట నామె, "లోనికిపొమ్ము" అని యనెను.

"నీ తరువాత నేను వత్తును" అని నే నంటిని.

"అబ్బాయి! పరిహాస్యముగ మాట్లాడకుము. నేను లోనికి వచ్చుటలేదు." అని ఆమె అనెను. పిమ్మట నామె తిరస్కార భావముతో వెళ్ళిపోయెను. అంతకంటె అధ్వాన్నమైన

విషయమేమన ఆమె తనతో బాటు వెలుగుచున్న క్రొవ్వొవత్తిని గూడ తీసికొని పోయెను.

అప్పుడు నేను భయపడితిని. కాని నేనింక చేయుదగినది ఏమియున్నది? తలుపు తట్టితిని. "లోపలకురమ్ము" అని లోన నున్న వారెవ్వరో అనిరి. అంతట నేను తలుపులు తీసికొని లోపలకు పోతిని. అది చాల పెద్దగది దానినిండ క్రొవ్వొవత్తులు వెలుగుచుండెను. ఆ గదిలోనికి సూర్యకాంతి ప్రవేశించుచున్న చిహ్నమేనియు కనబడకుండెను. ఆ గదిని దుస్తులు ముస్నగు వానిని ధరించుట కుపయోగింతురని అచ్చటి సామానులనుబట్టి గ్రహించితిని.

నిలువుటద్దము బిగింపబడిన అందమైన బేబులు ఒకచోట నుండెను. దాని ముందు చేతులకుర్చి ఒకటియుండెను. అందొక వింతస్త్రీ కూర్చుండియుండెను. అటువంటి స్త్రీని నేనంత వరకు ఎన్నడును చూచియుండలేదు. ఆమె ఒకమోచేతిని టేబులుపై ఆన్చియుండెను. తలను ఆచేతిపై నాన్చియుండెను.

ఆస్త్రీ చాలవిలువైన సాటిన్, లేసు, సిల్కుదుస్తులు ధరించియుండెను. ఆ దుస్తులన్నియు తెల్లగానుండెను. ఆమెకాలి జోళ్లుకూడ తెల్లగానుండెను. ఆమె తలలో పెండ్లికాలమునాడు ధరించునట్టి పుష్పములుండెను. కాని ఆమెతలవెండ్రుకలు బాగుగ నెఱసిపోయి తెల్లగానుండెను. ఆమె వివాహదినమున కన్యలు ధరించునట్టి తెల్లనిముసుగును కూడ ధరించియుండెను. ఆమె మెడ లోని నగలు, చేతులకున్న నగలు తళతళమని ప్రకాశించు చుండెను. కొన్నినగలు టేబులుపై పడియుండెను. అవికూడ చాల చక్కగా ప్రకాశించుచుండెను. ఆమె పూర్తిగా దుస్తులు ధరించి

నట్లుగాని, ఇతర అలంకరణలు పూర్తిచేసికొన్నట్లుగాని కనబడ కుండెను. ఎన్నో అలంకరణ వస్తువులు అద్దము ముందు ప్రోగుపడి యుండెను.

ఆ విషయముల నన్నిటిని నేను మొట్టమొదటి క్షణముల లోనే చూచితినని అనుకోరాదు. కాని చాలవఱకు అప్పుడే గ్రహించితిని. తెల్లని దుస్తులు, ఇతర వస్తువులు ఎంతోకాలము క్రిందటివనియు, అవి పసుపు పచ్చరంగు కలవిగా మాఱుచున్న వనియు గ్రహించితిని. పెండ్లి దుస్తులలోనున్న పెండ్లికూతురు, తలలోని పుష్పములవలె వాడిపోయినదనియు తెలిసికొంటిని. ఆ దుస్తులామె యువతిగానున్నప్పుడు ధరించినట్టివి. ఆమె ఇప్పుడు ముసలిదైపోయినది. అందువలన నవి ఎంతో వదులుగా నున్నవి.

నన్నుచూచి ఆమె, "ఎవరు వారు?" అని ప్రశ్నించెను.

"అమ్మా! నాపేరు పిప్."

"పిప్?"

"పంబుల్‌చూక్ పంపిన పిల్లవాడనమ్మా! ఆడుటకు వచ్చినాను."

"దగ్గఱకు రమ్ము. ఏదీ, నిన్ను చూడనిమ్ము. దగ్గఱకు రమ్ము."

నేనామె ముందు నిలబడితిని. కాని ఆమె కన్నులవంకకు మాత్రము చూడకుంటిని. నేను అప్పుడే చుట్టుప్రక్కలనున్న వస్తువులను వివరముగా పరిశీలించితిని. ఆమె చేతి గడియారము సరిగా ఎనిమిది గంటల నలువది నిమిషములకు ఆగిపోయి యుండెను. గోడనున్న గడియారముగూడ అచ్చటనే ఆగిపోయి యుండెను.

"అబ్బాయి! నా వంకకు చూడుము. నేను సూర్యుని వెలుగునుచూచి చాలకాలమైనది. అట్టి నన్ను చూచుటకు నీవు భయపడుట లేదా?"

"లేదు" అని అసత్యము పలికితిని.

అంతట నామె తన రెండు చేతులను ఒకదానిపై నొకటి హృదయముమీద పెట్టుకొని ఇట్లనెను: "నే నిచ్చట దేనిని తాకుచున్నానో నీకు తెలియునా?"

"తెలియునమ్మా!"

"అది యేమో చెప్పుము."

"హృదయము."

"వ్రక్కలై పోయినది."

తరువాత నామె హృదయముపైనుండి చేతులు తీసివైచి ఇట్లనెను: "నేను అలసి పోయినాను. నాకు విసుగెత్తుచున్నది. నాకు మార్పు కావలయును. పలువురు పురుషులు, స్త్రీలు పోయినారు. నీవింక ఆడుము. ఇతరులాడు చుండగా చూడవలయునని నేను కోరుకొనుచుందును."

నేను కదలక మెదలక నిలబడి యుంటిని.

"నీవు మూర్ఖపుపట్టు గలవాడవా యేమి?"

"అమ్మా! కాదు. నేను మీకొఱకెంతయు విచారించుచున్నాను. ఇప్పుడప్పుడే ఆడ లేనని చెప్పుటకెంతయు విచారించుచున్నాను. ఈ విషయమును గుఱించి మీరు ఫిర్యాదు చేసినచో నాకు మా సోదరితో తంటావచ్చును. ఇచ్చటి వాతావరణమంతయు నాకు క్రొత్తగానున్నది."

అంతట నా మెఏమో అనుచు అద్దములోనికి చూచు కొనసాగెను. మఱికొంత సేపటికి, "ఎస్టెల్లాను పిలువుము" అని యనెను. ఆమె తనలో తానేమో మాట్లాడుకొనుచున్నదని నే ననుకొంటిని. అందువలన నే నేమియు చేయలేదు.

ఆమె మఱియొకసారి ఇట్లనెను: "ఎస్టెల్లాను పిలువుము. నీ వా పని చేయవచ్చును. ఎస్టెల్లాను పిలువుము. ద్వారమువద్దకు పోయి పిలువుము."

వెంటనే నేను ద్వారమువద్దకుపోయి, "ఎస్టెల్లా! ఎస్టెల్లా!" అని పిలిచితిని. కొంత సేపటికామె సమాధానమిచ్చెను. క్రొవ్వ వత్తి దీపము తీసికొని ఆమె లోనికివచ్చెను.

హావిషమ్‌కన్య టేబులుపై నుండి ఒక నగను తీసి, ఎస్టెల్లాను దగ్గఱకు రమ్మని పిలిచి ఇట్లనెను: "ప్రియమైన ఎస్టెల్లా! ఇవి అన్నియు ఒకనాడు నీకే చెందును. ఏదీ, ఈ బాలునితో పేకాట ఆడుము. నేను చూతును."

"ఈ బాలునితోనా! ఇతడు సామాన్య కుటుంబమునకు చెందిన బాలుడు!" అని ఎస్టెల్లా అనెను.

అంతట హావిషమ్‌కన్య మెల్లగ ఈ విధముగా అన్నట్లు నాకు వినబడెను: "మంచిది! నీ వతని హృదయమును ప్రక్కలు చేయవచ్చును."

తరువాత మే మిరువురము పేకాట ఆడసాగితిమి. నే నప్పుడు గదిలోని మఱికొన్ని విషయములను పరిశీలించి చూచితిని. మేము ఆట ఆడుచున్నంతసేపు హావిషమ్‌కన్య శవమువలె కుర్చీపై కూర్చుండి యుండెను.

ఆట మధ్యలో ఎస్తెలా నన్ను నిరసించుచు మాట్లాడ సాగెను. "అబ్బ! ఏమి మొఱటు చేతులు! ఏమి మొద్దు బూట్లు!" అని యామె అనసాగెను. నేను అంతవఱకు నా చేతు లనుచూచి సిగ్గుపడలేదు. కాని ఆమె మాటలను విన్నతరువాత నాకు సిగ్గువేయసాగెను. కడకు ఆమెయే ఆటలో విజయము గాంచెను. నేను వట్టి పనికిమాలిన మొద్దునని ఆమె నన్ను సంబోధింపసాగెను.

ఎట్టకేలకు హవిషమ్‌కన్య నాతో ఇట్లనెను: "అబ్బాయి! ఆమెనుగూర్చి నీ వేమియు అనవేమి? ఆమె నిన్ను అనరాని మాటలని ఎన్నోవిధముల భాషించుచున్నది. మఱి నీ వేమియు మాట్లాడవేమి? ఆమెనుగూర్చి నీవేమి అనుకొనుచున్నావు?"

"నేను చెప్పుట కిష్టపడను."

"నా చెవిలో చెప్పుము."

"ఆమె చాల గర్వముకలదియని నేననుకొనుచున్నాను" అని మెల్లన ఆమెచెవిలో నంటిని.

"ఇంకేమైన చెప్పవలసియున్నదా?"

"ఆమె చాల అందమైనదనుకొందును."

"ఇంకేమైన చెప్పవలసియున్నదా?"

"ఆమె ఇతరుల నవమానించు బుద్ధికలది."

"ఇంకేమైన చెప్పవలసియున్నదా?"

"నేనింక ఇంటికిపోవలయునని అనుకొనుచున్నాను."

"మఱి ఆమె చాల అందమైనదికదా. ఆమె నింక నెన్నటికి చూడవా?"

"ఆమెను మరల చూడకూడదని నేననుకొనుచున్నట్లు నమ్మకము లేదు. కాని ఇప్పటికే ఇంటికిపోవలయునని అనుకొనుచున్నాను."

"త్వరలోనే పోవుదువుగాని, ఆటపూర్తిగా ఆడుము."

ఎస్టెలా నాపై అపూర్వమగు విజయము సాధించెను. ఆమె నన్ను తిరస్కారభావముతో చూడసాగెను.

"నీవు మరల నెప్పుడు ఇచ్చటకు వత్తువు? నన్ను ఆలోచించుకొననిమ్ము" అని హావిషమ్‌కన్య అనెను.

"నేడు బుధవారము...అని నేనేమో చెప్పబోవుచుంటిని."

అంతట నామె నాకు అడ్డువచ్చి, "ఆగుమాగుము! నాకు వారములోని దినముల సంగతి తెలియదు. సంవత్సరములోని వారముల సంగతియు తెలియదు. ఆరుదినముల తరువాత మరల రమ్ము. వినబడినదా?" అనియనెను.

"అమ్మా! అట్లనే వచ్చెదను."

"ఎస్టెలా! ఇతనిని క్రిందకుతీసుకొనిపొమ్ము. తినుటకు ఏమేని ఇమ్ము. ఈమొత్తో పొమ్ము, పిప్!"

ఎస్టెలా క్రొవ్వువత్తితీసికొని ముందునడవసాగెను. నేనామె ననుసరించి నడవసాగితిని. ఎట్టకేలకామె నన్ను నేమిదు పురము మొదట ప్రవేశించిన ద్వారమువద్దకు తీసికొనిపోయెను. నేను బయటకు వచ్చితిని.

"అబ్బాయి! నీవిచ్చటనే వేచియుండుము!" అని యని ఎస్టెలా తలుపులుమూసి అదృశ్యమైపోయెను.

నేను ఇంటిముందున్న ఖాళీభాగములోనుంటిని. ఒంటరిగ నున్న నేను నాచేతులవంక, బూట్లవంక చూచుకొనసాగితిని. వానినిగూర్చి నాకు సదభిప్రాయ మేర్పడలేదు. అంతవఱకు నేను వానినిగూర్చి బాధపడియుండలేదు. కాని ఎస్టెలామాటలు విన్న తరువాత అపరిమితముగా బాధపడసాగితిని.

మఱికొంతసేపటికి ఎస్టెలా తిరిగివచ్చెను. ఆమె కొద్దిగా మాంసమును, రొట్టెను, ఒకచిన్నపాత్రతో బీరుపానీయమును తీసికొనివచ్చెను ఆమె పాత్రను నేలమీదనున్న తాళ్ళమీద పెట్టెను. ఏదో కుక్కకు పెట్టినట్లు నావంకకు చూడకుండగనే మాంసమును, రొట్టెను ఇచ్చెను. అవమానము, విచారము, బాధ కోపము మున్నగునవి అన్నియు నన్ను ముప్పిరిగొనెను. నాకన్నులలో నీటిబిందువులు బయలుదేఱసాగెను. ఆ బిందువులనుచూడగనే ఆమెకు ఆనందముకలిగెను. తాను బాధపెట్టుట వలన నేనుఏడ్చుచున్నానని ఆమెఎంతయుగర్వింపసాగెను. ఆగర్వముతో ఆమె నన్ను చూడసాగెను.

ఆ విషయమును గ్రహించిననేను నాశక్తిఅంతయు నుపయోగించి కన్నీటిబిందువులను ఆపుకొని ఆమెను చూచితిని. అంతట నామె నన్ను తిరస్కారభావంతో చూచి వెళ్ళిపోయెను. ఆమె వెళ్లిపోయినతరువాత నేను మనసారనేడ్చితిని. తరువాత మాంసము, రొట్టె తింటిని. బీరు పానీయమును త్రాగితిని.

మఱి కొంతసేపటికి ఎస్టెలా తిరిగి వచ్చెను. ఆమెచేత వీధి ద్వారపు తాళపు చెవులుండెను. ఆమె విజయగర్వముతో నావంక చూడసాగెను. పిమ్మట నామె వీధి తలుపు తెఱచి నిలబడెను. నేను ఆమెవంకకు చూడకుండగనే బయటకు పోసాగి

తిని. అంతట నన్నామె చేతితో తట్టి, "నీ వెందుల కేడ్చుట లేదా?" అని ప్రశ్నించెను.

"ఏడ్చుట కిష్టపడను గనుక" అని నేను సమాధానము చెప్పితిని.

"అసత్యము. నీవింతవఱకు ఏడ్చుచునేయున్నావు ఇప్పుడు కూడ ఏడ్చుటకు సిద్ధముగానున్నావు" అని ఆమె యనెను. ఆమె తృణీకారభావముతో నవ్వి, నన్ను బయటకు నెట్టివైచి, తలుపులకు తాళము వేసెను.

తరువాత నేను తిన్నగా పంబుల్‌చూక్ ఇంటికి పోతిని. అతడు ఇంటివద్ద లేనను విషయమును తెలిసికొంటిని. అప్పుడు నా హృదయము చాల తేలికపడి నట్లయ్యెను. నన్ను హావిషమ్ కన్య తిరిగి రమ్మన్నరోజును అచ్చటనున్న ఒకనికి తెలిపితిని. ఆసంగతిని పంబుల్‌చూక్‌కు తెలియజేయవలసినదని కోరితిని. పిమ్మట నేను మా గ్రామమునకు బయలుదేఱి పోసాగితిని. త్రోవలో నా చేతులనుగూర్చియు, బూట్లనుగూర్చియు ఆలోచించుకొనసాగితిని. నేను వట్టి పనికిమాలిన వాడననియు, సామాన్య కుటుంబములో పెరిగి పెద్దవాడ నగుచున్నాననియు భావింపసాగితిని. అందుకు కెంతయు బాధపడసాగితిని; విచారింపసాగితిని.

ఎట్టకేలకు నేను మాయిల్లు చేరుకొంటిని. హావిషమ్‌కన్య ఇంట జరిగిన విషయములు నన్నడిగి తెలిసికోవలయునని నాసోదరి కుతూహలముగనుండెను. అందువలన నామెనన్ను ఎన్నో ప్రశ్నలు వేసెను. అన్ని విషయములను తెలిసికోవలయు నను కుతూహల

ముతో పంబుల్‌చూక్ కూడ అచ్చటకు వచ్చియుండెను. కాని నేను వారికి ఒక్క సరియైన విషయమునైనను చెప్పలేదు.

నేను వారికి చెప్పిన విషయముల సారాంశ మిట్లున్నది: "హావిషమ్‌కన్య పొడవుగను, నల్లగనున్నది. ఆమెనల్లనివెల్వెటు కోచిలో కూర్చుండి యున్నది. అచ్చట నామె బంధువుల పిల్ల ఒకర్తె యున్నది. ఆమెపేరు ఎస్టెలా, మేమందఱము ఆ కోచిలో కూర్చుండి బంగారు పళ్లెములలో భోజనము చేసినాము. అచ్చట నాలుగు కుక్కలున్నవి. అవి వెండి పళ్లెములలోని ఆహారమును భుజించినవి.

అచ్చట ఆమె, నేను, ఎస్టెలా కలసి రంగురంగుల జెండాలతో ఆడుకున్నాము. కత్తులను చూసినాము. ఆ దృశ్యమును నిజముగా చూచి తీఱవలయునేగాని వర్ణింప సలవికాదు.

ఆ ఇంటిలో లక్షలకొలది క్రొవ్వువత్తి దీపములు వెలుగుచున్నవి. వాని కాంతి సూర్యకాంతిని మించియున్నది. సూర్యకాంతి మాత్ర మా యింటిలోనికి ప్రవేశించుటలేదు."

నే నా విషయము లన్నిటిని చెప్పుచున్నప్పుడు జో తన కమ్మరపు పనిలో నిమగ్నుడై యుండెను. తరువాత అతడు తేనీటిని సేవించుటకై మేమున్న ప్రదేశమునకు వచ్చెను అప్పుడు నాసోదరి నేను చెప్పిన విషయముల నన్నిటిని అతనికి వివరముగా వర్ణించి చెప్పెను. వాని నన్నిటిని జో విని ఎంతయు ఆశ్చర్య పడెను. పిమ్మట నతడు తన కొలిమివద్దకు పోయెను.

మఱి కొంత సేపటికి పంబుల్‌చూక్ మా యిల్లు వీడి వెళ్ళిపోయెను. నా సోదరి యేదోపనిలో నిమగ్నురాలై పోయెను. అప్పుడు నేను యింకను పనిలో నిమగ్నుడైవున్న జో వద్దకు

పోతిని. అతని పని పూర్తియైన తరువాత నేను ఇట్లంటిని: "జో! నేను నా సోదరికి అన్నియు అసత్యములనే చెప్పియున్నాను. ఆ అసత్యములనే ఆమె నీకు చెప్పినది. ఇందులకు నే నెంతయు విచారించుచున్నాను."

జో నా మాటలు నమ్మకుండెను. నేను నా సోదరికి చెప్పిన దానిలో కొంతయైన సత్య ముండునని అతడు భావింప సాగెను. కాని అందులో ఆవగింజంతయైన సత్యము లేదని నే నతనికి మఱియొకసారి చెప్పితిని. అతని కచట జరిగిన విషయము లన్నిటిని పూస గ్రుచ్చినట్లు చెప్పితిని. ముఖ్యముగా ఎస్టెలా కన్య నన్ను నిరసన భావముతో చూచి అవమానించిన విధము నను వివరముగా చెప్పితిని. "ఎస్టెలాకన్య నన్ను అవమానించి నట్లు నా సోదరికి గాని, పంబుల్ చూక్ కు గాని తెలియరాదు. అందుకే నేను వారికి అసత్యములు చెప్పితిని" అని అంటిని.

అంతట జో ఇట్లనెను: "నీవు ఏ కారణముచేత చెప్పినను అసత్యములు అసత్యములే. ఛీ! ఇక ముం దెన్నడును అసత్య ములు పలుకకుము. నీవు కొన్ని విషయములలో అసాధారణ మైన ప్రజ్ఞ కలవాడవు. భగవంతుడు నీకు తప్పక మేలుచేయును. కావున ఉత్సాహముతో నుండుము."

తరువాత నేను నిద్రింపబోతిని.

కొలది దినములు గడచిన తరువాత నేను మరల హావి షమ్ కన్య ఇంటికి పోతిని. ద్వారము వద్దనున్న గంటను మ్రోగిం చితిని. కొంచంసేపటికి కచట ఎస్టెలా కన్య ప్రత్యక్ష మయ్యెను. ఆమె తాళము తీసి నన్ను లోనికి ప్రవేశపెట్టెను. తరువాత ఎప్పటి వలె తాళము వేసెను. తరువాత మేము ఇంటిలో ప్రవే

శించి చీకటి దాటుగుండా క్రొవ్వు వత్తి వెలుగుచున్న ప్రదేశ మునకు పోతిమి. ఆమె అచట క్రొవ్వు వత్తిని చేతబుచ్చుకొని "నీ వీ నాడు ఈ దారిని రావలయును" అని యనెను. పిమ్మట నామె నన్ను ఆ ఇంటిలోని వేఱొక భాగమునకు తీసికొని పోయెను. అది యొక చిన్న ఖాళీ ప్రదేశము. అచటకు సూర్య కాంతి నిరాటంకముగ ప్రవేశించుచుండెను. మేమూ ఖాళీ ప్రదేశముగుండా పోయి ఒక గదిలో ప్రవేశించితిమి. ఆ గదిలో నొక గడియారముండెను. అదికూడ ఎనిమిది గంటల నలువది నిమిషముల వద్దనే ఆగిపోయి యుండెను. ఆ గదిలో కొందఱు మనుజులు కూడ నుండిరి.

"నీకు కబురు పంపువఱకు యిచటనే నిలబడియుండుము" అని ఎస్టెలా నాతో అనెను. అంతట నేను ఒక కిటికీవద్దకుపోయి నిలబడి బయటకు చూడసాగితిని.

నేను ఆ గదిలో ప్రవేశించుసరికి అచ్చట నున్నవారు మాట్లాడుకొనుచుండిరి. నన్ను చూడగానే వారు మాటలు మానివైచిరి. కొంచెముసేపయిన తరువాత వా రెప్పటివలె మాట్లాడుకొనసాగిరి నాయునికినే వారు గమనింపనట్లుండిరి.

మఱి కొంచెముసేపటికి ఎస్టెలా నన్నచ్చటనుండి తీసికొని పోసాగెను. త్రోవలో నామె హఠాత్తుగా నాగి నావంకకు తిరిగి, "ఆ!" అని యనెను.

"ఏమి?" అని నేను అంటిని.

"నేను అందముగ నున్నానా?"

"నీవు చాల అందముగ నున్నావని" అనుకొనుచున్నాను.

"నేను నిన్ను అవమానించుచున్నానా?"

"ఇదివఱ కంతగా లేదు."

"అంతగా లేదా?"

"లేదు."

నే నా సమాధానము చెప్పుచుండగా ఆమె నా ముగము మీఁద గట్టిగా కొట్టెను. తరువాత నిట్లనెను: "మఱి యిప్పుడు? ఓరి మొఱకు రాక్షసుడా! మఱి యిప్పుడు నీవు నన్ను గుఱించి ఏమనుకొనుచున్నావు?"

"నేను చెప్పను."

"ఎందుచేతననగా నీవు మేడమీఁద చెప్పఁబోవుచున్నావు కనుక, అంతియేనా?"

"కాదు. అది కారణము కాదు."

"ఓరి అధముడా! నీవు మరల నెందుకు ఏడువవు?"

"నేను నీకొఱ కెన్నఁడును ఏడువను గనుక."

నే నా విధముగ సమాధానము చెప్పితి నన్నమాటయే గాని నిజముగా లోలోపల ఆమెకొఱకు ఏడ్చుచుంటిని.

తరువాత మేము మేడమీఁదకు పోసాగితిమి. త్రోవలో మాకొక గౌరవనీయుఁడు కనబడెను. అతఁడు నన్ను చూచి ఆగి "ఎవరితఁడు?" అని ప్రశ్నించెను.

"ఒక పిల్లవాఁడు" అని ఎస్టెల్లా సమాధాన మిచ్చెను.

ఆ గౌరవనీయుఁ డొక నల్లని ధృఢకాయుఁడు. అతఁడు తన పెద్దచేతితో నా గడ్డము పట్టుకొని క్రొవ్వువత్తి వెలుఁగులో నా మొగము చూచెను. అత డెవ్వరో నాకప్పుడు తెలియదు. కాని ఆ బట్టతల మనుజుని నేను బాగుగా పరిశీలించి చూచితిని.

"ఈ ప్రాంతపు బాలుడా?" అని అతఁడనెను.

"అవును" అని నేను అంటిని.

"నీ విశ్వాసము వచ్చుట ఎట్లు తటస్థించినది?"

"హావిషమ్‌కన్య నాకొఱకు కబురు పంపినది."

"మంచిది. జాగ్రత్తగా మసలుకొనుము. పిల్లలు ఎట్టి వారో, నాకు బాగుగ తెలియును. జాగ్రత్తగా మసలుకొనుము."

తరువాత నతడు తన దారిని పోయెను.

మే మిరువురము హావిషమ్‌కన్య గదిలో ప్రవేశించితిమి. తరువాత ఎస్టెలా ద్వారము వద్దకు పోయెను.

"రోజులు గడచిపోయినవన్న మాట" అని ఎస్టెలాకన్య యనెను.

"అవునవును. నేడు........" అని నేను చెప్పబోతిని.

"ఆగు మాగుము. నా కా విషయ మింక నక్కఱ లేదు. నీవు ఆడుటకు సిద్ధముగ నున్నావా?"

నేను కొంచెము కలవరపడి, "అమ్మా! నేను సిద్ధముగ నున్నానని అనుకొనను."

"పేకాట కూడ ఆడవా?"

"నేను కోరబడినచో ఆడవచ్చును."

"నీకంత సమ్మతము కాదన్నమాట. అయిన నీవు పనులు చేయుట కిష్టపడుదువా?"

"తప్పక చేయుదును."

"అయిన ఆ ఎదుటనున్న గదిలోనికి పొమ్ము. నేనువచ్చు నంతవరకు ఆగదిలో వేచియుండుము."

అంతట నేనాగదిలోకి పోతిని. ఆగదిలోనికిగూడ సూర్య కాంతి ప్రవేశింపకుండెను. అచ్చట నొకవిధమగు వాసనవేయు

చుండెను; కొన్ని క్రొవ్వువత్తులు వెలుగుచుండెను. ఆగది ఒక ప్పుడు చాలఅందమైనదే. కాని యిప్పుడంగలి వస్తువులన్నియు దుమ్ముతో నిండియుండెను. ఆగదిమధ్య నొకపెద్దబేబులుండెను. దానిమీద గుడ్డపఱచబడియుండెను. అచ్చట నొకప్పుడు గొప్ప విందు జరుగుటకేర్పాట్లు చేయఁబడియుండును. కాని హఠాత్తుగా నది ఆగిపోయియుండును.

నేనాగదిలోని వానినన్నిటిని నిశితముగా పరిశీలించు చుంటిని. అంతలో హావిషమ్‌కన్య ఆగదిలో ప్రవేశించి నాభుజముపై నొకచేయివేసెను. ఆమె రెండవచేతిలో కఱ్ఱయొకటియుండెను. ఆమె దానిపై ఆనుకొనియుండెను.

గదిలో నొకచోట సాలెగూళ్ళు చాలఎక్కువగానుండెను. వానినామె చూపుచు, "అది ఏమైయుండునని ఊహించు చున్నావు?" అని ప్రశ్నించెను.

"నేను ఊహింపలేకున్నాను" అని అంటిని.

"అది వివాహదినమున తయారుచేయురొట్టె. నావివా హపురొట్టె. నాదే!" అని యామెఅనెను. తరువాత నామె గుడ్డ పఱచబడియున్న పెద్దబేబులును చూపుచునిట్లనెను. "నేను చని పోయినపుడు నన్ను దానిమీదనే పెట్టెదరు. అప్పుడు వారువచ్చి నన్నుచూచెదరు."

పిమ్మట నామె గదిచుట్టును కలయఁజూచి నామీద ఆను కొని, "నన్ను నడుపుము! నన్ను నడుపుము" అని యనెను.

అప్పుడు నేను చేయఁవలసినపని ఏమో బాగుగనర్థ మయ్యెను. నేను హావిషమ్‌కన్యను గదిచుట్టును పలుసార్లు నడి పించవలెను. వెంటనే నేనాపని ప్రారంభించితిని. నేనామెను వేగ

ముగ నడిపింపసాగితిని. కాని ఆమె శరీరమున శక్తి లేదు. అందు వలన నామె "మెల్లన! మెల్లన!" అని యనెను. కొంతసేపు గడచినతరువాత నామె, "ఎస్టెలాను పిలువుము!" అని యనెను. నేను వెంటనేపోయి అట్లుచేసితిని. ఆమె క్రొవ్వువత్తిదీపపు కాంతి కనబడినతరువాత నేను మరల లోనికివచ్చి హావిషమ్ కన్యను ఎప్పటివలె నడిపింపసాగితిని.

నేను చేయుచున్నపనిని ఒక్క-ఎస్టెలామాత్రమే చూచి యుండినచో బాధపడియుండెడివాడనుకాను. కాని ఆమె తనతో బాటు ముగ్గురుస్త్రీలను, నాకంతకుముందు కనబడిన గౌరవ నీయునిగూడ తీసికొనివచ్చెను. నేనుబాధపడి ఆమెనునడిపించుట మానివేయవలయుననుకొంటిని. కాని ఆమె నన్ను ముందుకు త్రోసివేయుచుండుటవలన ఆగుటకు వీలులేకపోయెను. కొంచెము సేపున్నతరువాత ఎస్టెలా వెళ్ళిపోయెను. ముగ్గురుస్త్రీలును హావిషమ్కన్యతో ఎంతో మర్యాదగ మాట్లాడసాగిరి. కాని ఆమె మాటలుమాత్రము అందుకు పూర్తిగావిరుద్ధముగనుండెను. ఆమె వారిని ప్రతిమాటకు తప్పుపట్టసాగెను. వారావిధముగ మాట్లాడు చుండగ మేము గదిచుట్టును తిరుగుచునేయుంటిమి. ఒకప్పుడు మేము వారిదగ్గఱకు పోవుచుంటిమి. మఱియొకప్పుడు చాలదూర ముగ పోవుచుంటిమి.

కొంతసేపు గడచినతరువాత ఒకస్త్రీ యిట్లనెను! "మత్తయి మన హావిషమ్ కన్యను చూచుటకు రాకుండుట ఎంతయు శోచ నీయమైన విషయము! అదెంతయు ఆశ్చర్యకరమైన విషయము!"

మత్తయి పేరును వినగానే హావిషమ్కన్య ఆగిపోయెను. ఆమెతోబాటు నేనును ఆగిపోతిని. ఆమె ఆ పేరు నుచ్చరించిన

స్త్రీ వంకకు చూడసాగెను. కొంతసేపైన తరువాత ఆమె ఇట్లనెను: "మత్తయి ఇప్పుడప్పుడే ఇచ్చటకు రాడు. నేను మరణించిన తరువాతనే అతడిచ్చటకు వచ్చును. నేనా టేబులుపై పడియున్నప్పుడు అతడు వచ్చి నా తలవద్ద నిలబడును."

తరువాత నామె నా వంకకు తిరిగి, "నడిపింపుము. నడిపింపుము" అని యనెను. అంతట మేమిరువురము ఎప్పటివలె తిరుగ సాగితిమి. కొంతసేపటికామె కుంపటిముందు ఆగి, "నేడు నా జన్మదినము, పిప్!" అని యనెను. "మీరింకను చిరకాలము జీవింతురుగాక!" అని నేను అనబోతిని. కాని ఆమె వారించెను.

మఱికొంతసేపటికి ఎస్టెలా తిరిగివచ్చెను. అప్పుడు హావిషమ్‌కన్య ఇట్లనెను: "ఇంక నడచుట చాలును. మీరింక పేకాట ఆడుచుండగా చూడవలయునని యున్నది. వెంటనే ఎందుకు ప్రారంభింపరు?"

అంతట మేమందఱము మామెగదికి తిరిగి వచ్చితిమి. ఇదివఱకు వలెనే నేను, ఎస్టెలా కూర్చుండి పేకాట ఆడసాగితిమి. యజమానురాలు ఎప్పటివలెనే మాఆటను చూడసాగెను. ఆమె మాటిమాటికి ఎస్టెలా అందచందములను నా దృష్టికి తీసికొనిరా సాగెను! తన నగలను ఎస్టెలా జుట్టుపైనను, రొమ్ము భాగముపైనను పెట్టి నన్ను ఊరింపసాగెను.

ఎస్టెలా నన్ను ఇదివఱకువలెనే బాధపెట్ట సాగెను. కాని ఆమె నాతో మాట్లాడలేదు. ఆమె నన్ను మాటి మాటికి ఓడింపసాగెను. సుమారు ఆఱుఆటలు ఆడిన తరువాత నేను మఱియొకసారి రావలసిన దినము నిర్ణయింపబడెను. తరువాత నన్ను ఎస్టెలా ఇంటిముందున్న ఖాళీస్థలములోనికి తీసికొనిపోయి

ఇదివఱకు వలెనే కుక్కకు పెట్టినట్లు ఆహారపదార్థములు పెట్టెను. నేను వానిని తింటిని. అచ్చట నేను నా యిచ్ఛవచ్చినట్లు తిరుగ సాగితిని. ఎస్టెలా అప్పుడు ఎక్కడకో వెళ్ళిపోయెను.

అంతలో నా కచ్చట పాలిపోయిన యువకుడొకడు కన బడెను. అతడు నన్నుచూసి, "ఓయీ! నిన్నెవరు ఇచ్చటకు తీసికొని వచ్చినారు?" అని ప్రశ్నించెను.

"ఎస్టెలా."

"నీ యిష్టము వచ్చినట్లు తిరుగుటకు అనుమతి ఎవ్వ రొసగి యున్నారు?"

"ఎస్టెలా."

"అయిన నాతో వచ్చి పోరాడుము."

అప్పుడు నేను అతని ననుసరించి పోవుటతప్ప ఇంకచేయ దగినది ఏమి యున్నది? అతడింక నాకెట్టి అవకాశమును ఈయ నందుకు నేనెంతయు ఆశ్చర్యపడితిని. అయినను అతనిని వెంబ డించి పోతిని. ఆ సందర్భమున నేను మంత్ర బద్ధునివలె ప్రవర్తించితిని.

కొంతదూరము పోయిన తరువాత నతడు ఆగి ఇట్లనెను: "ఒక్క నిమిషము ఆగుము. నేను నీతో పోరుటకు కారణము తెలియఁజేయవలసియున్నదిగదా. ఇదిగో ఆ కారణము!" అట్లని యతడు రెండుచేతులను ఒకదానితో నొకటి కొట్టుకొనెను. ఒక కాలును వెనుకకు ఎగురవైచెను. నా జుట్టు పీకెను. మరల చేతులు చఱచుకొనెను. తలవంచి ముందుకు వచ్చి నాపొట్టలో పొడిచెను.

అతడు చేసిన పని నా కెంతో కోపము కలిగించెను. అదియుగాక నే నంతకు ముందే ఎస్టెలా ఒసగిన ఆహార పదార్థములను భుజించియుంటిని. అందువలన అతడు చేసిన పని నా కెంతో బాధాకరముగా కూడ నుండెను. అపుడు నే నతనిని గట్టిగా కొట్టితిని. మరియొకసారి గట్టిగా కొట్టుటకు సిద్ధపడు చుంటిని. అంతట నతడు "ఆ! నన్ను కొట్టితివా!" అని యనెను. పిమ్మట నతడు వెనుకకు ముందుకు పోవుచు నాట్యము చేయ సాగెను. నేను అంతకు ముందెన్నడును అటువంటి దృశ్యమును చూచియుండ లేదు.

తరువాత మే మిరువురమును మఱికొంత దూరము పోతిమి. అతడొకచో నాగి "ఈ ప్రదేశము మన పోరాటమున కెంతయు తగియున్నది. ఇది నీకిష్టమే అనుకొందును" అని అనెను.

"అవునవును, బాగుగనే యున్నది" అని నే నంటిని.

అంతట నతడు ప్రార్థనా పూర్వకముగా యిట్లనెను: "నేను కొంచెము బయటకు పోయి ఒక్క క్షణ కాలములో తిరిగి వచ్చెదను. అంతవఱకు ఆగుము."

"పోయిరమ్ము" అని నేనుఅంటిని. అతడు పోయి క్షణకాలములో తిరిగివచ్చెను. అతడు తనతో బాటు నీటిసీసా నొకదానిని వినీగరులో తడిపిన స్పాంజిని తీసికొని వచ్చెను. వాని నతడు ఒకచోట పెట్టి "ఇవి మన యిరువురికు ఉపయోగించును" అని అనెను. తరువాత నతడు తన కోటు, చొక్కా మున్నగు వానిని తీసివైచెను.

అతనిని చూచి మొదట నే నెంతగానో భయపడితిని. కాని క్రమక్రమముగా నాతని సంగతి బయల్పడ సాగెను. నా

మొదటి దెబ్బకే అతడు క్రింద పడిపోయెను, అతని శరీరమునకు కొన్ని గాయములు తగిలెను. అతడు లేచి మంచినీరు త్రాగి, గాయములకు వినీగరు అద్దుకొని మరల నా మీదికు రాసాగెను. అతనిని కొట్టి క్రింద పడవైచితిని. అతడు మరల లేచి నా మీదకు మరల రాసాగెను. ఆ విధముగా చాల సార్లు జరిగెను. అతని దురవస్థకు నేనెంతయు విచారింపసాగితిని. కాని అతడు నా మీదకు వచ్చుటమానకుండెను. కడకతడు క్రిందపడి గట్టిదెబ్బలు తినెను. అప్పుడు కూడ అతడు లేచి మరల క్రిందపడెను. "నీవే విజయము సాధించినట్లు" అని అతడు చివరకు అనెను. అంతట నేను అతని వద్ద శలవు దీసుకొని యథాస్థానమునకు వచ్చితిని.

అప్పుడచ్చట ఎస్టెలా తాళపుచెవులతో వేచియుండెను. "ఎక్కడకు పోయినావు?" అని గాని, "ఇంత ఆలస్య మెందుకు చేసినావు?" అనిగాని ఆమె నన్ను ప్రశ్నింపలేదు. పైగా ఆమెకు సంతోషము గలిగించు పని ఏదో జరిగినట్లు ముఖము ప్రకాశించుచుండెను. ఆమె తిన్నగా వీథిద్వారము వద్దకు పోవుటకు బదులు ప్రక్కకు తప్పుకొని నన్ను దగ్గరకు పిలిచెను. అంతట నే నటుల చేసితిని.

అపుడామె యిట్లనెను: "నీకిష్టమైనచో నన్ను ముద్దు పెట్టుకొనవచ్చును."

అట్లని ఆమె నా మోముదగ్గర తన బుగ్గ పెట్టెను. నే నా బుగ్గపై ముద్దు పెట్టుకొంటిని. తరువాత ఇంటికి పోతిని.

# 8

పాలిపోయియున్న యువకుని నేను తీవ్రముగ గాయపఱచి యుంటినిగదా. అందువలన నాకేదైన అపకారము జరుగునని భయపడసాగితిని. ఆ సంగటననుగూర్చి ఆలోచించినకొలది నా భయము ఎక్కువకాసాగెను. బయటకు పోయినచో రక్షక భటులు నన్ను పట్టుకొందురేమో అను భయముతో ఇల్లువీడి బయటకు వెళ్లకుంటిని.

కాని ఎట్టకేలకు నేను హావిషమ్‌కన్య ఇంటికి తిరిగి వెళ్ళ వలసిన రోజు వచ్చెను. అప్పుడు నా భయము పరాకాష్ఠను చెందెను. రక్షకభటులు నన్నుపట్టుకొనుటకై ఆమె వీధిద్వారము వద్ద వేచియుందురని నేను అనుకొనసాగితిని. కాని నేను చేయ గలిగినది ఏమి యున్నది? ఆమె యింటికి పోకతప్పదు. అందువలన నేను ప్రాణములు బిగబట్టుకొని ఆమెయింటికిపోతిని. కాని అచ్చట నాకు రక్షక భటులెవ్వరును కనబడలేదు. నా పోరాటమును గూర్చి మాట్లాడిన వారుకూడ ఎవ్వరును లేరు.

నేను హావిషమ్‌కన్య గదివద్దకు పోతిని. ఆమె గదిముందు ఒక చక్రముల కుర్చీ యుండెను. ఆమె దానిపై కూర్చుండెను. నా భుజముపై ఆనుకొని నడచుట ఆమెకు అలసటగా నుండెను. అందువలన నామె ఆపనిని మానుకొని చక్రముల కుర్చీపై

కూర్చుండి యుండెను. నేను వెనుక నిలబడి దానిని త్రోయ సాగితిని, ఇక నేను ఆనాడు చేయవలసినపని అదియే.

అప్పటినుండి నేను రోజువిడిచి రోజు హావిషమ్‌కన్య ఇంటికి పోసాగితిని. ఆమెను చక్రముల కుర్చీపై కూర్చుండబెట్టి త్రిప్పసాగితిని. ఆ విధముగా సుమారు పది మాసములు గడచి పోయెను.

పరిచయము ఎక్కువైనకొలది హావిషమ్‌కన్య నాతో ఎక్కువగా మాట్లాడసాగెను. ఆమె నన్ను, "నీవేమి నేర్చుకొన్నావు? నీవేమి చేయబోవుచున్నావు?" మున్నగు ప్రశ్నలు అడుగసాగెను.

"నేను మా బావ జో వద్ద అప్రెంటిసుగా చేరుదునని నమ్ముచున్నాను. నా కింతవరకు ఏమియురాదు. కాని ఎన్నో విషయములను నేర్చుకోవలయునని మాత్రము కుతూహలపడు చున్నాను" అని నేను అంటిని. నేనా విధముగ ఎందుకంటినో తెలియునా? అనేక విషయములను నేర్చుకొనుటకామె నాకు సాహాయ్యపడునని నేను ఎంతగానో ఆశించితిని. కాని ఆమె నా కెట్టి సాహాయము చేయలేదు. పైగానేను ఏమియు తెలియని వానివలె నుండుటయే మేలని ఆమె భావించుచున్నట్లుండెను. ఆమె నాకు ప్రతి దినము భోజనము పెట్టుచుండెను. గాని డబ్బేమియు నీయకుండెను. నేను చేయుచున్న పనికి డబ్బునిత్తునని కూడ ఆమె ఎన్నడును అనకుండెను.

ఎస్టెల్లా నన్ను ప్రతి దినము కలసికొనుచునే యుండెను. కాని ఆమె ఎన్నడును, "నన్ను ముద్దుపెట్టుకొనుము" అని అనకుండెను. ఒకప్పుడామె నన్నేదో సహించి యూరకొనుచున్నట్లు

ప్రవర్తించును. ఒకప్పుడు ఒక మెట్టు క్రిందకు దిగివచ్చినట్లు నటించును. మఱియొకప్పుడు ఎంతో పరిచయమున్నట్లు ప్రవర్తించును. ఇంకొకప్పుడు, "నేను నిన్ను తీవ్రముగ ద్వేషించుచున్నాను." అని అనుచున్నట్లుండును.

హావిషమ్‌కన్య నన్ను తఱచుగా నిట్లడుగుచుండెడిది: "పిప్! ఎస్టెల్లాకన్య అందచందములు రోజు రోజుకు అభివృద్ధి చెందుచున్నావా?"

"అవును" అని నేను సమాధానము చెప్పెడివాడను. అప్పుడామె ఒకవిధమగు సంతృప్తి పొందుచున్నట్లుండెడిది.

నేను, ఎస్టెల్లా పేకాట ఆడుచున్నప్పుడు ఆమె చూచుచు కూర్చుండెడిది. ఒక్కొక్కప్పుడామె ఎస్టెల్లాను గట్టిగా కౌగిలించుకొనుచుండెడిది. ఆమె ఎస్టెల్లా చెవిలో రహస్యముగా, "అతని హృదయమును వ్రక్కలు చేయుము" అని చెప్పుచున్నట్లుండెడిది.

నేను హావిషమ్‌కన్య ఇంట జరుగుచున్న విషయముల నన్నింటిని జోకు చెప్పవలయుననుకొంటినిగాని, చెప్పలేను. నాకు చదువు నేర్పిన బిడ్డకిమాత్రము చెప్పితిని.

ఇక మా ఇంటివద్ద పంబుల్‌చూక్, నా సోదరితో నా భవిష్యత్తునుగూర్చి తఱచుగా చర్చించుచుండెడివాడు. హావిషమ్‌కన్య నాకు చేయబోవు సాహాయ్యమునుగూర్చి వారు పరిపరివిధముల నూహించుచుండెడివారు. వారి సంభాషణలలో జో పాల్గొనుచుండెడివాడు కాడు. అతనికి నేను కొలిమిలో పని చేయుటయే ఇష్టమను విషయమును నాసోదరి గ్రహించెను.

ఒకనాడు నేను హావిషమ్ కన్యను గది చుట్టును త్రిప్ప సాగితిని. ఒక సమయమున ఆమె హఠాత్తుగాఆగిపోయి, నేనేమో

తప్పుచేసినట్లు ఇట్లనెను: "నీవు చాల పొడవై పోవుచున్నావు, పిప్!"

"అందుకు నేను బాధ్యుడనుకాను. పొడవు ఎదుగుట, ఎదుగకపోవుట అనునవి నా స్వాధీనములో లేవు" అని నేను జవాబు చెప్పదలచితిని. కాని మాట్లాడలేదు. ఆమెయు ఇంక నేమియు అనలేదు. కాని మధ్యమధ్య నామె ఆగి నావంక కది యొక విధముగా చూడసాగెను.

మఱియొకనాడు మాపని పూర్తియైన తరువాత ఆమె ఇట్లనెను: "నీకు బంధువైన కమ్మరి పేరేమో మరలచెప్పుము."

"జోగార్జరీ, అమ్మా!"

"నీ వతనివద్దనేకదా అప్రెంటిసుగా చేరదలచుకొన్నది?"

"అవునమ్మా!"

"నీవు వెంటనే అతనివద్ద అప్రెంటిసుగా చేరుట మంచిది. జో నీతోబాటు ఇచ్చటకు వచ్చునా? అవసరమైన పత్రములు ముందుగు వానిని తీసికొనివచ్చునా?"

"ఇచ్చటకు వచ్చుటకు అత డెంతయు సంతసించును. అందుకు సందేహ మే మాత్రమును లేదు."

"అయిన అతని నిచ్చటకు రమ్మనుము."

"ఎప్పుడు రమ్మందురు?"

"ఎప్పుడో నాకు తెలియదు. సాధ్యమైనంత త్వరగా రావలయును. నీవు, అతడుతప్ప మఱి యింకెవ్వరును రారాదు."

నేను ఇంటికిపోయి జరిగిన విషయమును నా బావకు చెప్పితిని. అప్పుడు నా సోదరి మండిపడెను. దాని ఫలితముగా నేను, నా బావ ఇంటిబయట చలిలో రాత్రి పదిగంటలవఱకు

నిలబడియుండవలసి వచ్చెను. తరువాత మేము మెల్లన ఇంటిలో దూఱితిమి.

మఱునాటి యుదయమున భోజనమ్మైన తరువాత నేను, నా సోదరి, బావ కలసి పట్టణమునకు నడచిపోతిమి. మేము మొదట పంబుల్‌చూక్ ఇంటికిపోతిమి. నా సోదరి ఆఇంటిలో ప్రవేశించెను. తరువాత మిగిలిన ఇరువురము హావిషమ్‌కన్యఇంటికి పోతిమి. ఎప్పటివలె ఎస్టెల్లా వీధితలుపులు తెఱచెను. ఆమెను చూడగనే జో ఎంతో గౌరవభావమును ప్రకటించెను.

ఎస్టెల్లా మాత్రము మమ్ము గమనింపకయేగనే లోనికి పోసాగెను. నేనామె వెనుకపడితిని. జో నావెనుకరాసాగెను. కొంతసేపటికి మేము హావిషమ్‌కన్యగదిని చేరుకొంటిమి. అప్పుడు ఎస్టెల్లా, "మీరిరువురును లోనికిపోవచ్చును" అని యనెను. అంతట నేను జో చేయిపట్టుకొని లోనికితీసుకొనిపోతిని. అప్పుడు హావిషమ్‌కన్య టేబులువద్ద కూర్చుండియుండెను. ఆమె మమ్ము చూచెను.

"ఈబాలుని సోదరిభర్తవు నీవేనా?" అని ఆమె జోనుద్దేశించి అనెను.

కాని జో సమాధానమేమియు చెప్పలేదు. అతడొక స్తంభమువలె నిలబడియుండెను.

"ఈబాలుని సోదరిభర్తవు నీవేనా?" అని ఆమె మరల ప్రశ్నించెను.

"అవును" అని జోనావంకకుచూచి సమాధానమిచ్చెను.

"మంచిది. ఈబాలుని నీవద్ద అప్రెంటిసుగా చేర్చుకో దలచి చిన్నప్పటినుండియు పెంచియున్నావా?"

జో నాతో నిట్లుననసాగెను: "పిప్! నేను, నీవు మొదటి నుండియు స్నేహితులమను విషయము నీకు బాగుగా తెలియును. నీవు నాపనిలో నాకు సాహాయ్యపడుదువని నేను మొదటి నుండియు ఆశించుచున్నాను. నీకెందుకు ఏమైన అభ్యంతర మున్నచో వెంటనే తెలియజేయుము. తరువాత ఏమిచేయవల యునో బాగుగ ఆలోచింతము."

"ఈబాలుడు ఇదివఱకెప్పుడైన ఏమైన అభ్యంతరము తెలిపియున్నాడా? ఇతనికావృత్తి ఇష్టమేనా?" అని ఆమె ప్రశ్నించెను.

"నీవు నాకెన్నడును ఎట్టిఅభ్యంతరము తెలిపియుండలేదు. ఈవృత్తిలో ప్రవేశించుటయే నీహృదయములోని ముఖ్యమైన కోరికయను విషయము నాకు తెలియును" అని జో నాతో ననెను.

"మఱి సంతకములుపెట్టిన పత్రములను తీసికొనివచ్చి నావా?" అని ఆమె ప్రశ్నించెను.

ఎప్పటివలె జో నాతో నిట్లనెను: "పిప్! నేను ఆపత్రము లను నాటోపీలో పెట్టుకొనుచుండగా నీవు స్వయముగచూచి యున్నావు. అందువలన అవి టోపీలోనే ఉన్నవనువిషయము నీకు తెలియును."

పిమ్మట నతడాపత్రములను తనటోపీలోనుండి బయటకు తీసెను. వానినతడు హావిషమ్‌కన్యకు ఇచ్చుటకుబదులు నాచేతికి ఇచ్చెను.

హావిషమ్‌కన్య కుంచ్చించియున్న కుర్చీకి వెనుక ఎస్టెలా నిలబడియుండెను. ఆమె జో ప్రవర్తనను చూచి నవ్వసాగెను. ఆమె కన్నులలో చిలిపితనము గోచరించుచుండెను. అందువలన నేను సిగ్గుపడసాగితిని. కాని చేయగలిగినది ఏమియున్నది? నేను జోవద్దనుండి తీసికొన్న పత్రములను హావిషమ్‌కన్య చేతికొసగితిని.

ఆమె ఆపత్రములను చక్కగాచదివి తరువాత జోతో నిట్లనెను: "ఈబాలునకు నీవృత్తిని నేర్పినందుకు నీవు సొమ్మేమియు ఆశించుటలేదా?"

ఆ ప్రశ్నకు జో సమాధానమేమియు చెప్పలేదు. అందువలన నేను అతనితో నిట్లంటిని: "జో! నీవామె ప్రశ్నకు సమాధానమొసంగుము చెప్పుము!"

అప్పుడతడు నాతో నిట్లనెను: "ఈ ప్రశ్నకు సమాధానము ఈయవలసిన అవసరమేమి వచ్చినది? నీకు, నాకు మధ్య ఈ ప్రశ్న ఉదయింపనే ఉదయింపదను విషయము నీకు బాగుగ తెలియును. ఒకవేళ నేనీ ప్రశ్నకు సమాధానమీయవలసి వచ్చినచో, 'లేదు' అన్నదే నా సమాధానము. 'లేదు' అన్నదే నా సమాధానమను విషయము నీకు బాగుగా తెలియును. మఱి యింక నేను సమాధానమీయవలసిన అవసరమేమి వచ్చినది?"

అంతట హావిషమ్‌కన్య నా వంకకు చూచెను. పిమ్మట నామె టేబులుపైనున్న ఒక చిన్న సంచిని తీసికొనెను. ఆమె అతనితో నిట్లనెను: "పిప్ ఇచ్చట పనిచేసియున్నాడు. అందువలన నేను అతనికి జీతము నీయవలసి యున్నది. ఆ జీతము

నతనికి నేనింకను ఇచ్చియుండలేదు. ఇదిగో, ఈ సంచిలో ఇరు వది ఐదు పౌనులున్నవి. ఇదే అతని జీతము."

అట్లని ఆమె ఆ సంచిని నా చేతికిచ్చి, "పిప్ ! ఈ సంచిని నీ బావకిమ్ము" అని యనెను. నేనాసంచిని తీసికొని జో కిచ్చితిని.

అప్పుడుకూడ జో ఆమెతో మాట్లాడలేదు. అతడింకను నాతోనే ఇట్లనెను: "పిప్ ! ఇది నీ హృదయ వైశాల్యమును సూచించుచున్నది. ఈ డబ్బు నాకు వచ్చునని నేను ఎన్నడును ఆశించి యుండలేదు. ఆ యుద్దేశ్యముతోనే నేను ఈ సొమ్మును స్వీకరించుచున్నాను. ఈ సొమ్మును స్వీకరించుటకు నేను సంత సించుచున్నాను. ఇక మనము మనవిధ్యుక్త ధర్మమును నెఱ వేర్పవలసి యున్నది. అవును, మన 'విధ్యుక్త ధర్మమును సక్ర మముగా నెఱవేర్చవలసి యున్నది."

హావిషమ్కన్య ఇట్లనెను: "పిప్ ! ఇంక నీవు పోవచ్చును. ఎస్టెలా ! వీరినింక బయటకు పంపుము."

"అమ్మా ! నేను మరల మీ యింటికి రావలయునా ?" అని నేను ప్రశ్నించితిని.

"వలదు. గార్జరీ ఇక నీయజమానుడు. గార్జరీ ! ఒక్క మాట !"

అంతట నేను బయటకు పోసాగితిని. జో ఇంకను కదల లేదు. హావిషమ్కన్య అతనితో నిట్లనెను: "ఈ బాలుడిచ్చట చాల చక్కగా ప్రవర్తించినాడు. అందుకు బహుమానముగా ఈ సొమ్ము నిచ్చియున్నాను. నీవు మంచివాడవు. కావున ఇంత కంటె ఎక్కువ నీవు ఆశింపరాదు."

అప్పుడు నేను వెనుకకుపోయి అతని చేయిపట్టుకొని బయ టకు తీసికొని వచ్చితిని. మేము వీథి ద్వారముదాటి బయటకు పోతిమి. ఎస్టెలా ఎప్పటివలె తాళమువైచి వెళ్ళిపోయెను.

మేమిప్పుడు తిన్నగా పోయి పంబుల్ చూక్ గృహము చేరుకొంటిమి. అచ్చట నా సోదరి మమ్ము చూచినంతనే ఇట్లనెను: "ఏమి జరిగినది? మీరిచ్చటకు తిరిగి వచ్చుట ఆశ్చర్యకరముగ నున్నది! గొప్పవారి ఇల్లువిడిచిపెట్టి ఎట్లు రా గలిగినారు?"

అప్పుడచ్చట పంబుల్ చూక్ కూడ నుండెను.

"ఆమె నీకిమ్మని కొంతసొమ్మిచ్చినది" అని జో అనెను. ఆ విషయము తనకు ముందే తెలియునన్నట్లుగా పంబుల్ చూక్ నా సోదరివంకచూచి భుజములు ఎగురవైచెను.

నా సోదరి నవ్వుచు, "ఎంత ఇచ్చినది?" అని ప్రశ్నించెను.

"పది పౌను లిచ్చిన దనుకొనుడు. దానిని గూర్చి మీ రేమనుకొందురు?" అని జో అనెను.

"అది అంత మొత్తము కాదుకాని బాగుగనే యున్న దని అనుకొందును" అని నా సోదరి అనెను.

"ఆమె యిచ్చిన సొమ్ము అంతకంటె ఎక్కువ"

"ఎంత?"

"ఇరువది పౌనులైన ఎట్లుండును?"

"చాల బాగుగ నున్నదని అనుకొందును."

"అంతకంటె యెక్కువ సొమ్మిచ్చినది."

"ఎంత?"

"ఇంక ఆలస్య మెందులకు? ఇరువదియైదు పౌను లిచ్చినది."

"చాల పెద్ద మొత్తమే ఇచ్చినది" అని పంబుల్‌చూక్ అనెను.

తరువాత నేను, నా సోదరి, బావ కలసి మా యింటికి పోతిమి.

# 9

నా సోదరి నన్నెప్పుడును కఠినముగా చూచుచుండెడిది. అందువలన నాకు మొదటినుండియు జీవితము దుర్భరముగ నుండెడిది. ఒక్క జో సహచర్యముమాత్రమే నాకు కొంచెము మనశ్శాంతిని కలిగించుచుండెడిది.

ఏదో పెద్ద లాభము చేకూరునను నుద్దేశముతో నా సోదరి నన్ను హావిషమ్ కన్య గృహమునకు పంపియుండెను. కాని చివరకు హావిషమ్ కన్య నాకు యిరువదియైదు పౌను లిచ్చి, "నీ బావవద్ద అప్రెంటిసుగా పనిచేయుము" అని మాత్రము చెప్పెను. అనతికాలములో ఆమెకు అసలువిషయము తెలిసెను. అందువలన నామె మండిపడెను. ఆమె నన్నిదివరకు కంటె ఎక్కువ నిర్దయతో చూడసాగెను. నా పరిస్థితి యెంతో అధ్వాన్నముగ నుండెను.

నేను జో వద్ద అప్రెంటిసుగా పనిచేయసాగితిని. అది నా కెంతయు బాధాకరమైన విషయముగా నుండెను. కాని నే నా సంగతిని అతనికి చెప్పియుండలేదు. చెప్పినచో అతడెంతయు బాధపడునను విషయము నాకు బాగుగ తెలియును. అతనికి చెప్పనందుకు నేనెంతయు సంతసించుచున్నాను.

ఎస్టెలాను చూడవలయునని నేనుగాఢముగా వాంఛించుచుంటిని. అందువలన నొకనాడు నేను జోతో నిట్లంటిని: "జో! నేనొకసారి హావిషమ్ కన్యను దర్శించుట మంచిది కాదా?"

కొంచెముసేపు ఆలోచించిన తరువాత అత డిట్లనెను: "పిప్! ఎందుకు?"

"ఎందుకా? చూచివచ్చుట కెందుకు పోదును?"

"ఇతరులనుచూచుటకు పోవుటకు, హావిషమ్ కన్యను చూచుటకు పోవుటకు భేదమున్నది. నీవు ఆమెవద్దనుండి ఏదో ఆశించి వచ్చినావని ఆమె అనుకోవచ్చును."

"నేను ఏమియు ఆశించి రాలేదని చెప్పెదను."

"ఆమె నీమాటలను నమ్మవచ్చును, నమ్మకపోవచ్చును. ఇంక తనవద్దనుండి ఏమియు ఆశింపరాదని ఆమె నాతో స్పష్టముగా చెప్పియున్నది."

"అవును. నేను ఆమాటలను వినియున్నాను."

"ఆమె నాతో చెప్పినదంతయు విన్నావా?"

"అంతయు విన్నాను."

"ఆమె మాటల అర్థమేమి? ఇంక మరెన్నడు తన యింటికి రారాదని ఆమె అర్థము కాదా?"

"కాని......"

"చెప్పుము."

"నేను ఆమెను చూచి సంవత్సరము కావచ్చుచున్నది. ఆమె వద్దకుపోయి నా కృతజ్ఞతను తెలియజేయుట ఉచితముగ నుండదా!"

"ఏదేని బహుమానమును తీసికొనిపోదువా?"

"ఆ తలంపు నా మనస్సులో లేదు."

"ఏదేని బహుమానమును తీసికొనిపోయిన బాగుండును."

"నేనా సంగతి ఆలోచించుటయే లేదు."

"సామాన్యమైన బహుమానమును తీసికొనిపోయిన బాగుండను."

"ఆమాట లెందుకు? నేను అసలు ఏ బహుమానమును తీసికొని పోదలచుట లేదని చెప్పినానుగదా?"

"అవునవును. నీ యుద్దేశ్యమే సరియైనది."

"మంచిది. నే నిప్పుడు చెప్పదలచుకొన్న విషయ మొక్కటి యున్నది. మనకిప్పుడు అంతగా పని లేదుకదా. అందువలన నేను ఱేపే పోయి హావిషమ్‌కన్యను దర్శించి వత్తును. నాకు అరరోజు సెలవు కావలయును."

"మఱియొకసారి నీవు పోరాదు."

"అటులనే" అని నే నంటిని.

ఇచ్చట నొక విషయము చెప్పవలసి యున్నది. జో వద్ద ఆర్లిక్ అను పేరుగల పనివాడొకడు జీతమునకు పనిచేయు చుండెను. అతడొక వింతమనిషి. చాల బలిష్ఠుడు. అతని గుణము లన్నియు చెడ్డవే. అతడన్న ఎవ్వరును ఇష్టపడరని నిస్సంశయ

ముగా చెప్పవచ్చును. అతడుకూడ ఈ ప్రపంచములో ఎవ్వరిని ప్రేమించుట లేదు.

అతనికి నేనన్న మొదటినుండియు ద్వేషమే. కాని అతడెన్నడును ఆ ద్వేషమును బహిరంగముగా ప్రకటించి యుండలేదు. ద్వేషమును సూచించుపని ఏదియు చేసియుండలేదు. కాని నేను జో వద్ద అప్రెంటిసుగా చేరిన తరువాత అతని ద్వేషమింకను హెచ్చిపోసాగెను. కొంతకాలమునకు తన యుద్యోగము పోవునని అతడెంతయు భయపడుచుండెను.

నేను హావిషమ్‌కన్య గృహమునకు పోవుటనుగూర్చి జోతో మాట్లాడిన మరునాడు ఆర్లిక్ కొలిమివద్ద పనిచేయుచుండెను. అప్పుడచ్చట జోగూడ నుండెను. ఆ సమయమున నేను నా సెలవు సంగతిని జోకు జ్ఞాపకము చేసితిని.

కొంచెము సేపైనతరువాత ఆర్లిక్, జోతో నిట్లనెను: "యజమానుడా! మా యిరువురిలో ఒకనికి మాత్రమే సెలవిచ్చుట ఉచితముకాదు. పిప్‌కు అరరోజు సెలవిచ్చినచో, ఈ ముసలి ఆర్లిక్‌కుగూడ అదేవిధముగ సెలవీయవలయును."

ఆర్లిక్ వయస్సు సుమారు ఇరువదియైదు వత్సరములుండును. అయినను అతడు తన్ను, 'ముసలి ఆర్లిక్' అని పిలుచుకొను చుండెను.

"ఎందుకు? నీకు అరరోజు సెలవిచ్చినచో ఏమి చేయుదువు?" అని జో ప్రశ్నించెను.

"నే నేమిచేయుదునా? అతడేమి చేయును? అతడేమి చేయునో నేనును అదే చేయుదును" అని ఆర్లిక్ అనెను.

"అతడు పట్టణమునకు పోవుచున్నాడు."

"పట్టణమునకు ఒక్కడే పోవలయునా ఏమి? ఇద్దఱుకూడ పట్టణమునకు పోగలరు. నేనుగూడపట్టణమునకు పోదును" ఇందుల కెవ్వరును అభ్యంతరం పెట్టవలసిన పని లేదు" అని ఆర్లిక్ ఆవేశముతో అనెను.

"అనవసరముగా ఆవేశము తెచ్చుకొనకుము."

"నాకిష్టమైనచో ఆవేశము తెచ్చుకొందును. యజమానుడా! ఒక్కడే పట్టణమునకు పోవలయునని వ్రాసిపెట్టి యున్నదాఏమి? కొందఱిపట్లమాత్రమే అభిమానమును చూపుట ఏమాత్రము పనికిరాదు. పురుషునివలె ప్రవర్తింపుము."

"ఆర్లిక్! నీవు ఆవేశము తగ్గించుకొనుము. నీ ఆవేశము తగ్గువఱకు నేను ఆవిషయమును గుఱించి మాట్లాడను."

అంతట ఆర్లిక్ ఎఱ్ఱగాకాలియున్న ఇనుపకడ్డీ నొకదానిని తీసుకొని కోపముతో నావద్దకువచ్చెను. అతడు దానిని నా పొట్టలో గ్రుచ్చువానివలె ప్రవర్తించెను. దానిని నాతలచుట్టును త్రిప్పెను. తరువాతపోయి తనస్థానమున కూర్చుండెను. కొంచెము సేపైనతరువాత నతడిట్లనెను: "యజమానుడా!"

"ఇప్పుడు నీవు సరియైనస్థితిలో నున్నావా?"

"ఉన్నాను."

"నీవు సాధారణముగా ఇతరులు పనిచేయునట్లుగనే చేయుచున్నావు అందువలన నేడందఱకు అరరోజు సెలవిచ్చుచున్నాను."

ఆమాటలను దొడ్డిలోనిలబడియున్న నాసోదరి వినెను. అంతట నామె ఒకకిటికీదగ్గఱకువచ్చి ఇట్లనెను: "జో! నీవు వట్టి తెలివితక్కువవాడవు. సరిగా పనిచేయనివారికిగూడ సెలవులిచ్చు

నీవు తప్పక మూర్ఖుడవే. జీతముమీద సేలవిచ్చుటకు నీవు ధని కుడవాఏమి? అతనికి నేనుయజమానుడనైయుండినచో ఎంతయు బాగుండెడిని."

"నీవు అందఱకు యజమానుడవే!" అని ఆర్లిక్ కోపముతో అనెను.

"అవును. నీవంటి పనికిమాలినవారి పీచమణచుటకు నేనే తగియున్నాను" అని నాసోదరి అనెను.

అంతట ఆర్లిక్ కుపితుడై ఆమెను పేరుపెట్టిపిలువసాగెను. నాసోదరి ఆపరిస్థితిని సహింపలేకపోయెను. "నాభర్త ఎదుట నన్నొకపసివాడు అవమానించుచున్నాడు. ఇంక నేను బ్రతికి ఏమి లాభము?" అని నాసోదరి అనెను.

అప్పుడు జో ఆర్లిక్‌తో పోరాడెను. ఆ పోరాటమున ఆర్లిక్ చిత్తయ్యెను. తరువాత వారిరువురును స్నేహపూర్వకముగ బీరుపానీయమును సేవించిరి.

తరువాత నేను ఉన్నివస్త్రులలోకెల్ల మంచివస్త్రులు ధరించి పట్టణమునకు బయలుదేఱిపోతిని. తిన్నగా హావిషమ్‌కన్య గృహమును చేరుకొంటిని. గంటమ్రోగించితిని. వీధిద్వారము వద్దకు సారా అను పేరుగలస్త్రీ యొకర్తె వచ్చెను. ఎస్టెలా రాలేదు.

"ఓహో! నీవా! మరల నిచ్చటకు వచ్చినావెందులకు? నీకేమికావలయును?" అని సారా అనెను.

"ప్రత్యేకమైనపని ఏమియు లేదు. హావిషమ్‌కన్యనుచూచు టకు వచ్చినాను" అని నేనంటిని.

నన్ను లోనికి రానిచ్చుటయూ, రానీయకపోవుటయూ అను విషయమున ఆమె యొకనిర్ణయమునకు రాలేకపోయెను. ఆ విషయమున బాధ్యతను స్వీకరించుట కామె ఇష్టపడకుండెను. అందువలన నామె హావిషమ్ కన్యవద్దకు పోయి తిరిగివచ్చెను. తరువాత నన్ను లోనికి ప్రవేశపెట్టెను. నేను తిన్నగా హావిషమ్ కన్య గదిలోనికి పోతిని. అచ్చట మార్పేమియు లేదు. అంతయు పూర్వమువలెనే యుండెను. ఆమె ఒంటరిగా కూర్చుండి యుండెను.

ఆమె నావంక తేఱి పాఱజూచి ఇట్లనెను: "మంచిది. నీ విచ్చటకు ఏకోరికతోను రాలేదనుకొందును. నీకు నావద్దనుండి ఏమియు ముట్టదు."

"నేను మీ వద్దనుండి ఏమో తీసికొని పోవలయునను నుద్దేశ్యముతో వచ్చి యుండలేదు. నేను చక్కగా అప్రెంటీసు పని చేయుచున్నానను విషయమును మీకు తెలియజేయుటకు మాత్రమే వచ్చినాను. మీరు నాకిదివరకు చేసిన సాహాయ్యమునకు నేనెంతయు కృతజ్ఞుతడను. నేను మఱియొకసారి కృతజ్ఞతను ప్రకటించుచున్నాను."

"మంచిది. మంచిది. అప్పుడప్పుడు వచ్చుచుండుము. నీ పుట్టినదినమున రమ్ము."

నేను గదిచుట్టును చూడసాగితిని. ఎచ్చటనైన ఎస్టెలా కనబడునేమోయని నా ఆశ. అది గ్రహించి ఆమె ఇట్లనెను: "ఓహో! నీవు ఎస్టెలా కొఱకు చూచుచున్నావు కాబోలు. అవునా?"

"ఆమె క్షేమముగ నున్నదని ఆశించుచున్నాను."

“పలేస యువతిగా తయారగుటకు కావలసిన విద్యను సముపార్జించుటకై విదేశములకు పోయినది. నీకు అందని దూరముననున్నది. ఆమె సౌందర్యము దినదినాభివృద్ధి గాంచు చున్నది. ఆమెను చూచిన వారందరును పరిపరి విధముల ప్రశంసించుచున్నారు. నీ వామెను పోగొట్టుకొన్నావని భావించు చున్నావా?”

అట్లని ఆమె అదియొక విధముగా నవ్వెను. ఆ నవ్వు నా కేమాత్రము రుచింపలేదు. సమాధాన మేమిచెప్పవలయునో నా కేమియు తోచకుండెను. ఆ విషయమును గురించి ఆలోచింప బోవుచున్నంతలో నామె, “నీవింక బయటకు పోవచ్చును.” అని యనెను. నేను వీధిద్వారముదాక బయటకు వచ్చితిని. సారా ద్వారమునకు తాళము వైచెను.

అప్పుడు నాకు తీవ్రమైన అసంతృప్తి బయలుదేరెను. నా ఇల్లు, వృత్తి మున్నగువాని నన్నిటిని నేను తీవ్రముగ అసహ్యించుకొనసాగితిని. హావిషమ్‌కన్య ఇంటికి వెళ్లుట వలన కలిగిన ఫలిత మది.

నేను పట్టణ వీధులలో తిరుగసాగితిని. అంతలో నొక పుస్తక శాలలోనుండి వాప్సుల్ బయటకు వచ్చెను. అతను నన్ను పలుకరించెను. “నేను పంబుల్‌చూక్ ఇంటికి పోవు చున్నాను. నీవుగూడ వచ్చుటకు రావలయును” అని నన్నతను బలవంతపెట్టెను. వీధిలేక నే నతనిననుసరించి పోతిని. ఇరువురము పంబుల్‌చూక్ గృహమునుచేరుకొంటిమి. అప్పటికే చీకటిపడెను.”

బాగుగా చీకటి పడినతరువాత నేను, వాప్సుల్ పంబుల్‌చూక్ గృహమును వదలిపెట్టి మా గ్రామమునకు బయలుదేరి

పోసాగితిమి. అప్పు డంతయు అంధకారమయముగా నుండెను. ఆ చీకటిలో మాకొక మనుజుడు కనబడెను.

మేము ఆగి, "హలో! ఆర్లిక్" అని అంటిమి.

"ఎవ్వరైనా జత దొరకుదురని ఆగినాను" అని ఆర్లిక్ అనెను.

"నీవు చాల ఆలస్యము చేసినావు" అని నేనంటిని.

నీవుమాత్రము చాల ఆలస్యము చేయలేదా?" అని అతడనెను.

"మేము పంబుల్‌చూక్ ఇంటివద్ద సారస్వత విషయము లను దీర్ఘముగా చర్చించుకొనుచుంటిమి" అని వాప్సల్ అనెను.

ఆర్లిక్ విషయమునుగూర్చి యింక ప్రస్తావింపలేదు.

"పట్టణమంతట బాగుగా తిరిగినావనుకొందును" అని అంటిని.

"ఆహా! తిరిగినాను. నేను నీ తరువాతనే వచ్చినాను. కాని నిన్ను మాత్రము చూచియుండలేదు. అన్నట్లు నేటిరాత్రి ఫిరంగులు తెగ మ్రోగుచున్నవి."

"కారాగారపు టోడల వద్దనా?"

"అవును. పంజరములలోనుండి కొన్ని పక్షులు ఎగిరిపోయి నట్లున్నవి. చీకటి పడినప్పటినుండి ఫిరంగిమ్రోత వినబడుచున్నది. త్వరలోనే నీకు మరల వినబడును."

మేము ఎంతో దూరము పోకపూర్వమే ఫిరంగిమ్రోత వినబడెను. మేము గ్రామము వంకకు పోవుచునే యుంటిమి. మధ్య మధ్య ఫిరంగిమ్రోత వినబడుచునే యుండెను. ఎట్టకేలకు మేము గ్రామము చేరుకొంటిమి. అప్పటికి రాత్రి పదునొకండు

గంటలయ్యెను. మేము సత్రము ముందుగా పోవుచుంటిమి. ఆ సమయమప్పుడుగూడ అచ్చట ఎంతో సందడిగా నుండెను. వీధి తలుపులు తెఱచి యుండెను. అచ్చటచ్చట దీపములు వెలుగుచుండెను. విషయమేమో తెలిసికొనుటకై ఆతడు లోనికి పోయెను. అనతికాలములో నతడు ఆందోళనతో తిరిగి వచ్చి, "మీ యింటనేమో జరిగినట్లున్నది, పిప్ ! మనము వెంటనే పరుగెత్తుకొని పోవలయును" అని అనెను. అట్లని అతడు పరుగెత్తసాగెను. నేను అతని వెంటపడి, "ఏమిజరిగినది ? ఏమి జరిగినది ?" అని ప్రశ్నింపసాగితిని. ఆర్లిక్ కూడ అటులనే చేయసాగెను.

"ఏమి జరిగినదో నాకు సరిగా అర్థమగుటలేదు. జో ఇంటలేనప్పుడు ఇంటిలోనికి బలవంతముగ నెవ్వరో ప్రవేశించినట్లున్నది. ఎవ్వరికో తీవ్రమైన గాయములు తగిలినట్లున్నది అని అతడనెను.

మేము పరుగెత్తుకొనిపోయి వంటగదిలో ప్రవేశించితిమి. అచ్చట పలువురు జనులుండిరి దొడ్డిలోగూడ పలువురుండిరి. నా సోదరి తెలివితప్పి నేలమీదపడి యుండెను. నా బావ, డాక్టరుగూడ అచ్చటనే యుండిరి. నా సోదరి కుంపటివంకకు తిరిగి యున్నప్పుడు ఎవ్వరో వెనుకనుండి వచ్చి ఆమెను బలముగా కొట్టిరని నేను తెలిసికొంటిని.

# 10

నా సోదరి మంచము పట్టెను. ఆమె మాట్లాడ లేకుండెను. ఆమెకు చూపుకూడ సరిగా లేకుండెను. ఆమె మాకేది చెప్ప దలచుకొన్నను ఒక పలకపై వ్రాసి చూపుచుండెను. మఱి ఆమె కోపమంతయు ఏమైపోయినదో! ప్రతి సందర్భమునను ఆమె అపూర్వమగు సహనభావమును ప్రదర్శింపసాగెను. ఆ విధముగా కొన్ని వారములు గడచిపోయెను.

అంతలో నొకముఖ్యమైన సంఘటనజరిగెను. పాఠశాలను నడుపుచున్న వాప్సుల్ బంధువు మరణించెను. ఆమెవద్ద బిడ్డీఅను నామె పనిచేయుచుండెను. ఇప్పుడామెకింక యజమానురాలు లేదు. మాయింట మాకు సాహాయ్యముచేయుట కొకర్త కావలసియుండెను. అందువలన బిడ్డీని మాయింటికి తెచ్చుకొంటిమి.

బిడ్డీ మాకందఱకు వరప్రసాదమువలె నుండెను. ముఖ్యముగా నామె జోకు ఎంతో ఉపయోగకరముగనుండెను. అతడు తనభార్య దుస్థితినిచూచి ఎంతయు విచారించుచుండెడివాడు. నా సోదరి అతనినెన్నడును దయతో చూచియుండలేదు. అయినను ఆమె తన్నెంతో చక్కగాచూచినట్లే అతడు ప్రవర్తించెడివాడు. బిడ్డీ నాసోదరికి పరిచర్యచేసి జోకు మనశ్శాంతి నొసగుచుండెడిది.

ఇక నాపరిస్థితి ఎట్లున్నది? నేనుఎప్పటివలె జోవద్ద అప్రెంటీసుగా పనిచేయుచుంటిని. ఒకరోజుకు, మఱియొకరోజుకు తేడా

ఏమియు కనబడకుండెను. నాకు జీవితము కడు దుర్భరముగ నుండెను.

నా పుట్టినరోజున నేను మఱియొకసారి హావిషమ్‌కన్య గృహమునకు పోతిని. ఇదివఱకువలెనే సారా తలుపులు తెఱచి నన్ను లోనికిప్రవేశపెట్టెను. హావిషమ్‌కన్య ఎప్పటివలెనే యుండెను. ఆమె ఎస్టెలాను గుఱించి ఇదివఱకువలెనే మాట్లాడెను. అంతయు కొన్నినిమిషములలో ముగిసిపోయెను. ఆమె నాకొక గినీనాణెము నీయబోయెను. "వలదు" అని నేనంటిని.

"ఇంకను ఎక్కువ ఆశించుచున్నావా?" అని ఆమె అనెను.

అంతట నేను ఆ నాణెమును తీసికొంటిని.

"ప్రతిసంవత్సరము నీజన్మదినమునాడు వచ్చుచుండుము" అని ఆమె అనెను. నేనామెవద్ద సెలవుతీసికొని బయటకువచ్చితిని.

ప్రతిసంవత్సరము నా జన్మదినమున నేను హావిషమ్‌కన్య గృహమునకుపోయి ఆమెయిచ్చు గినీనాణెమును స్వీకరించుచుంటిని. ఆమె ఎస్టెలానుగూర్చి చెప్పుమాటలను వినుచుంటిని. ఎస్టెలామాత్రము నాకు కనబడకుండెను. ఆమెను ప్రతినిత్యము తలచుకొని నేనుచేయుచున్నపనిని తీవ్రముగా ద్వేషింపసాగితిని. నా పరిస్థితికి సిగ్గుపడసాగితిని.

క్రమక్రమముగా బిడ్డీలో అపూర్వమైనమార్పు గోచరించుచుండెను. ఆమె కుంతలములు కడుప్రకాశవంతముగను, పరిశుభ్రముగను నుండెను. ఆమె చేతులుకూడ చాల పరిశుభ్రముగ నుండెను. ఆమె ఎస్టెలావలె అందమైనది కాదన్న

మాట నిజమే. ఆమె సాధారణయువతి అన్న మాట నిజమే. కాని ఆమె హృదయము చాలమంచిది. ఆమె కడు దయాపరురాలు. ఎప్పుడును ఇతరులకు మేలుచేయవలయునను సుగుణశీల. పరు లకు ఆహ్లాదమును కలుగుజేయు నేర్పరి.

ఆమె మాయింటికివచ్చి సుమారొక సంవత్సరమైనదను కొందును. ఒకనాటి సాయంకాలమున నేనామెకన్నులను చూచి తిని. అవి ఎంతో ఆలోచనాపూరితముగను, మనోహరములు గను నుండెను ఆ కన్నులు నేను చేయుచున్నపనిని పరిశీలించు చుండెను.

నేనప్పుడు నా భాషనభివృద్ధి చేసికోవలయునను తలంపుతో అచ్చు పుస్తకములోని కొన్ని వాక్యములను తెల్లకాగితముల పుస్తకములో వ్రాసికొనుచుంటిని. ఆ పనిచేయుచు నేను కన్నులు పైకెత్తి చూచితిని. నేను చేయుచున్న పనిని ఆమె గమనించు చుండుటను చూచితిని. అంతట నేను నా చేతిలోని కలమును క్రింద పెట్టితిని. అపుడామె తాను చేయుచున్న అల్లిక పనిని ఆపుచేసెను. సూది మొనలగు వానిని క్రింద మాత్రము పెట్ట లేదు.

“బిడ్డీ! నీవెట్లు ఆ పని చేయగలుగుచున్నావు? నేను పట్టి తెలివి తక్కువ వాడనా? లేక నీవు చాల తెలివైన దానవా?”

“నేను చేయుచున్న పని ఏమి? నాకు తెలియదు” అని ఆమె మందహాసము చేయుచు ననెను.

ఆమె గృహమునంతను చక్కగా సరిదిద్దునన్న మాట నిజమే. నిజముగా ఆమె చేయుచున్న పని అత్యద్భుతమైనది. కాని నాయుద్దేశ్యమప్పుడది కాదు.

"బిడ్డీ! నేను నేర్చుకొనుచున్న దంతయు నీవు ఎట్లు నేర్చుకొనుచున్నావు? నాతో బాటు ఎట్లు అభివృద్ధి చెందుచున్నావు?"

నేను నా విజ్ఞానమును గూర్చి గర్వించుచుంటిని. హావిషమ్ కన్య ఇచ్చిన గినీ నాణెమును విజ్ఞాన సంపాదనకే వినియోగించుచుంటిని. ఇతర విధముల వచ్చిన సొమ్మును గూడ అందుకొఱకే వినియోగించు చుంటిని.

"అదే ప్రశ్న నిన్నడుగుచున్నాను."

"నీవెప్పుడును కొలిమివద్దకు రావు. ఆ విషయములు నీకెట్లు తెలియుచున్నవి?"

"నీవద్దనుండి అంటు వ్యాధులవలె వచ్చుచున్నవి."

పిమ్మట నామె ఎప్పటివలె అల్లికపనిని చేసికోసాగెను. నేను కుర్చీ వెనుక భాగముపై ఆనుకొని ఆమె వంకకే చూడసాగితిని. ఆమె అసాధారణమైన యువతి అని తలపసాగితిని. మా వృత్తికి సంబంధించిన విషయము లన్నియు ఆమెకు తెలియును. మేముపయోగించు పనిముట్ల పేర్లన్నియు ఆమెకు తెలియును. మా వృత్తికి సంబంధించిన వేర్వేఱు పేర్లన్నియు ఆమెకు తెలియును. ఇన్నిమాట లెందులకు? నాకు తెలిసినదంతయు ఆమెకు తెలియును. ఆమె కమ్మరపు పనిచేసి యుండలేదన్న మాటయేగాని దానికి సంబంధించిన విషయములన్నియు ఆమెకు తెలియును.

"బిడ్డీ! కొందఱు లభించిన ప్రతి అవకాశమును సద్వినియోగము చేసికొందురు. అట్టివారిలో నీవు ఒకర్తవు. ఇచ్చటకు రాకపూర్వము నీకు అవకాశము లభింపలేదు. మఱి నీవు ఎంత అభివృద్ధి చెందినావో చూడుము."

ఆమె ఒక్క క్షణకాలము నావంక చూచి మరల నెప్పటి వలె అల్లికపని చేసికొనసాగెను. ఆ పని చేసికొనుచునే ఆమె ఇట్లనెను: "అయినప్పటికిని నీ మొదటి గురువును నేనే. కాదా?"

అంతట నేను ఆశ్చర్యముతో నిట్లంటిని: "బిడ్డీ! నీవెందుల కేడ్చుచున్నావు?"

ఆమె కన్నులు పైకెత్తి చూచి నవ్వుచు, "లేదు నేను ఏడ్చుటలేదు. ఆ అభిప్రాయము నీకు ఎందులకు కలిగినది?"

ఆ అభిప్రాయము నాకెందుకు కలిగినది. నేనామె కన్నుల లోని నీటిని చూచినమాట ముమ్మాటికిని నిజము. ఒకనీటిచుక్క క్రింద పడెనుగూడ. నేనామె వెనుకటి జీవితమునంతను జ్ఞప్తికి తెచ్చుకొంటిని. ఆమెలోని తెలివితేట లప్పుడు నిదురపుచ్చిన నిప్పువలెనున్నవి. ఆసమయముననే నేనామెవద్ద చదువు నేర్చు కొంటిని. ఆమె తెలివితేట లిప్పుడు చక్కగా ప్రకాశించు చున్నావు.

బిడ్డీ ఇంక కన్నీరు పెట్టుకొనలేదు. ఆమె కడు ప్రశాంతముగ అల్లికపని చేసికొనసాగెను. ఆమెపట్ల నేను సరియైన కృతజ్ఞతను ప్రకటింపలేదేమోయని అనుకొనసాగితిని. నేను ముభావముగ నుండకుండ ఆమెతో ఎక్కువగ మాట్లాడుట అనవసరమని అనుకొంటిని.

"అవును, బిడ్డీ! నీవు నాకు మొదటి గురువు వన్నమాట నిర్వివాదాంశము. అందును మన మీవిధముగ కలసియుందుమని అనుకోనప్పుడు జరిగినది. అందువలన దాని ఆధిక్యము హెచ్చు చున్నది.

మువ్వురమును సత్రమునువీడి ఇంటికి పోసాగితిమి. త్రోవలో నా గౌరవనీయుడు అప్పుడప్పుడు నా వంకకు చూచి తనచేతి వ్రేలు కొఱుకుకొనసాగెను. మేము ఇల్లు సమీపించితిమి. జో ముందుగా పోయి వీథి తలుపులు తెఱచెను. మేము మువ్వురము చావడిలో కూర్చుంటిమి. అచ్చట నొక క్రొవ్వువత్తి దీపము కొలదిగా కాంతి నొసగుచుండెను.

గౌరవనీయుడు టేబులువద్ద కూర్చుండి, క్రొవ్వువత్తి దీపమును దగ్గఱకు లాగుకొని, దాని వెలుగులో తననోటు పుస్తకములోని కొన్ని విషయములను చదువుకొనెను. తరువాత నతడు నోటు పుస్తకమును జేబులో పెట్టుకొనెను; క్రొవ్వువత్తి దీపమును యథాస్థానమున నుంచెను.

తరువాత నతడిట్లనెను: "నన్నందఱును జాగర్సు అందురు. నేను లండనులోని ఒక లాయరును. చాల ప్రసిద్ధిచెందినవాడను. నేను మీతో ఒక అసాధారణమైన విషయమునుగూర్చి మాట్లాడవలసి యున్నది. కాని నే నిందులకు ఏమాత్రము బాధ్యుడను కాను. నన్ను సలహా నడిగియుండినచో, నే నిచ్చటకు రావలసిన అవసరముండి యుండెడిదికాదు. నన్ను సలహా అడుగలేదు. కావున మీరిప్పుడు నన్ను ఇచ్చట చూచుచున్నారు. నే నొకరి తరఫున నమ్మకమైన ప్రతినిధిగా పనిచేయుచున్నాను. నేను చేయవలసిన పనియేమో నాకు బాగుగ తెలియును; అంతకంటె ఎక్కువ తెలియదు. తక్కువ తెలియదు. జోగార్జరీ! నీవన్న అప్రెంటిసుగా పనిచేయుచున్న ఈ బాలుని బాధ్యతను స్వీకరించుట కొఱకు సిద్ధముగా నున్నారు. మఱినీవు ఇతని శ్రేయస్సును

కాంక్షించి ఇతనిని వదలి వేయుటకు అంగీకరింతువా? అట్లు వదలి వేసినందుకు నీవు డబ్బేమియు ఆశింపవు గద!"

"పిప్ మార్గమున కడ్డువచ్చుపనిని దేనిని నేను చేయకుండు నట్లు భగవంతు డనుగ్రహించుగాక."

"భగవంతుని మాట అటుండనిమ్ము. ఇప్పుడు అసలు సమస్య వేఱు. అతనిని వదలివేసినందుకు నీవేమైన కోరుదువా?"

"కోరను అన్నదే నా సమాధానము."

"మంచిది. ఆ మాటలను జ్ఞప్తియందుంచుకొనుము. తరు వాత వెనుదీయుటకు ప్రయత్నింపకుము."

"ఎవ్వరు ప్రయత్నించు చున్నారు?"

"ఎవ్వరైన ప్రయత్నించుచున్నారని నేను అనలేదు. సరే కాని నీవద్ద కుక్క యున్నదా?"

"ఉన్నది."

"మంచిది. ఒక కుక్క మంచిది కావచ్చును. మఱి యొక కుక్క దానికంటె మంచిది కావచ్చును. ఈ విషయమును జ్ఞాపకముంచుకొనుము. జ్ఞాపకముంచుకొందువా? సరే, ఇంక ఈ పిప్ సంగతికి వత్తును. నేను చెప్పవలసిన దొక ముఖ్య విషయ మున్నది. ఇతడు మంచి భవిష్యత్తును ఆశింపవచ్చును."

నేను, జో ఒకరి వంక నొకరము చూచుకొంటిమి.

అతడింకను ఇట్లనసాగెను: "ఇతడు చక్కని ఆస్తికి స్వంత దారుడగునని తెలియజేయవలసినదిగా నాకు సూచన వచ్చినది. ఇప్పుడు ఆ ఆస్తి కలిగియున్న వారి ఉద్దేశ్యమేమో తెలి యునా? పిప్‌ను వెంటనే ఇప్పటి జీవిత విధానము నుండియు, ఈ ప్రదేశము నుండియు తొలగింపవలయును. అతనిని కులీనుని

వలె పెంచవలయును. అతని మంచి భవిష్యత్తును చక్కని పునాది వేయవలయును."

నా కలలు ఫలించు సమయము వచ్చినది! నా ఊహా గానము వాస్తవ పరిస్థితిని మించిపోయినది. హావిషమ్ కన్య నాకు మంచి భవిష్యత్తును కలుగజేయనున్నది!

అతడింకను చెప్పుచునే యుండెను: "పిప్! ఇంక నేను చెప్పవలసిన దంతయు నీకు చెప్పుచున్నాను. నీవు కొన్ని విషయములను చక్కగా అర్థము చేసికొనవలయును. నీకు ఆస్తినీయ బోవు వారికి రెండు కోరికలున్నవి. అందొకటి యేమన నీవు ఎప్పుడును, 'పిప్' అను నామమునే ధరించి యుండవలయును. ఇది చాల సులభమైన షరతు. నీకు ఎంతో ఆస్తిరానున్నది. మరి నీకు ఈ షరతుకెట్టి అభ్యంతరము ఉండదని భావించు చున్నాను. అభ్యంతర మున్నచో చెప్పివేయుట కిదియే తగిన సమయము."

"నాకెట్టి అభ్యంతరమును లేదు" అని నేను మెల్లన నంటిని.

"అభ్యంతర మెందులకుండును? నీకు ఆస్తినీయ బోవు వారిపేరు, వారు బయల్పరచుకొనువరకు పరమ రహస్యముగా నుండును. సమయము వచ్చినప్పుడు వారే నీ ఎదుటపడి తమ నామమును బయల్పరచు కొందురు. వారెప్పుడు అటుల చేయు దురో నేను చెప్పజాలను. ఎవ్వరును చెప్పజాలరు. కొన్ని సంవత్సరముల తరువాత ఆ పని జరుగవచ్చును. ఈ లోపల నీవు వారి నామమును తెలిసికొనుటకెన్నడును ప్రయత్నింపరాదు. నీవట్లు చేయరాదని గట్టిగా తెలిసికోవలయును.

వాడు ఫలానావారని ఊహించినచో ఆ తలంపును నీ మనస్సులోనే ఉంచుకోవలయునుగాని ఎవ్వరికిని చెప్పరాదు. ఎవ్వరికిని వ్రాయరాదు. ఈ నిషేధమునకు కారణము లేమని నీవు ప్రశ్నింపవచ్చును. ఆ కారణములుగట్టివి కావచ్చును. సామాన్యమైనవి కావచ్చును. వానితో నీకు ప్రసక్తిలేదు. ఆ కారణములను తెలిసికొనుటకు నీవు ప్రయత్నింపరాదు. ఈ ముఖ్యమైన కోరికకు నీవు అంగీకరింపవలయును. ఆ విధముగా ప్రవర్తింపవలయును. నీకు సాహాయ్యము చేయనున్నవారికి నాకు గల సంబంధ మీ విషయముననే ఇది మా యిద్దఱి మధ్య గల పరమ రహస్యము. మఱి నీవు ఈ కోరికకుగూడ అంగీకరింతువా? అభ్యంతరమేదేని యున్నచో చెప్పుటకిదే తగిన సమయము. వెంటనే చెప్పుము."

"నాకెట్టి అభ్యంతరమును లేదు."

"అభ్యంతర మెందులకుండును? పిప్! ఇక నేను చెప్పవలసిన వంతయునైపోయినది. కాని ఇంక నొక్కమాట. నీకు భవిష్యత్తులో మంచి ఆస్తివచ్చును? కాని యిప్పటి మాట? వాడు నావద్ద నీ విద్యకు, పోషణకు తగినంత ధనముపెట్టి యున్నాడు. ఇక నన్ను నీ సంరక్షకునిగా భావించుకొనుము. ఈ పనిని నేను ఉచితముగ చేయుటలేదు. నాకు ప్రతి ఫలము ముట్టినది. అందువలననే ఈ పని సంతను చేయుచున్నాను, నీ పరిస్థితి మాఱిపోవును. కావున దానికి అనుగుణమగు విద్యను నీవు సంపాదించుకొనవలయును. నీవు వెంటనే ఆ పని ప్రారంభింపవలయును. ఇక ఏ మాత్ర మాలస్యము చేయరాదు."

"నేనా విధముగ జరుగవలయునని ఎంతో కాలము నుండి కోరుకొనుచున్నాను."

"ఇదివఱకు సంగతి ఎందులకు? ఇప్పుడు కోరుకొనుచున్నచో చాలును. నిన్ను వెంటనే సరియైన ఉపాధ్యాయుని వద్ద ప్రవేశపెట్టెదను. అందుకు నీవు సిద్ధముగనున్నట్లే కదా?"

"సిద్ధముగ నున్నాను."

"మంచిది. నీవు ఎవరైన మంచి ఉపాధ్యాయుని పేరు నెప్పుడైన విని యున్నావా?"

"లేదు."

"నేనొక ఉపాధ్యాయుని పేరు విని యున్నాను. అతడు మనపనికి సరిపోవునని కొందును. అతనిని నేను సిఫారసు చేయుట లేదు. గుర్తుంచుకొనుము. నే నెవ్వరిని ఎప్పుడును సిఫారసు చేయను. ఆ ఉపాధ్యాయుని పేరు మత్తయి పోకెట్."

మత్తయి పేరును నే నిదివఱకు హావిషమ్‌కన్య ఇంట విని యుంటిని. అతనిని గూర్చి ఆమె నీచముగా మాట్లాడియుండెను. మత్తయి పేరు నాకు తెలియుచున్న సూచన నాముఖములో కనబడసాగెను.

"అతని పేరును నీ విదివఱకు వినియుంటివా?"

"వినియుంటిని."

"ఓహో! విని యుంటివా? నీ అభిప్రాయ మేమి?"

"నేను మీ సిఫారసు కెంతయు కృతజ్ఞుడను."

"అదికాదు. అదికాదు. జ్ఞప్తికి తెచ్చుకొని చెప్పుము."

"నేను మీ సిఫారసు కెంతయు కృతజ్ఞుడను."

"అదికాదు, మిత్రమా! జ్ఞప్తికి తెచ్చుకొని చెప్పుము. సిఫారసు అన్నది సరియైన మాటకాదు. మఱియొకమాటకొఱకు ప్రయత్నింపుము."

"మత్తయి పోకెట్ పేరు చెప్పినందుకు ఎంతయు కృతజ్ఞుడను."

"కొంచెము బాగున్నది."

"నేను సంతోషముతో అతనివద్ద చదువుకొందును."

"మంచిది. నీవు అతని ఇంటికేపోయి చదువుకొనుము, అందుకు కావలసిన ఏర్పాట్లను నేను చేయుదును. మొదట నీవు లండనులోనున్న అతని కుమారుని కలిసికొనవచ్చును. మఱి నీవు లండను నగరమున కెప్పుడు వత్తువు?"

"నేను వెంటనే రాగలను."

"మంచిది. కాని నీవు గౌరవనీయులు ధరించునంటి దుస్తులతో రావలయును. కూలివాండ్ర దుస్తులు పనికిరావు. సరిగా వారమురోజుల కిదే రోజున బయలుదేఱిరమ్ము. మఱి నీకుడబ్బు కావలయు ననుకొందును. ఇరువది గినీలు చాలునా?"

తరువాత నతడు తన పర్సులోనుండి ఇరువది గినీలను తీసి నాకిచ్చెను. తరువాత నతడు జోతో నిట్లనెను: "జో! నీ వట్లు మూగవానివలె కూర్చున్నావేమి? మాట్లాడవేమి?"

"అవును" అని జో అనెను.

"నీవు ఏమియు కోరనని అన్నావు. జ్ఞాపకమున్నదా?"

"అవును."

"కాని నీకు పరిహారముక్రింద కొంత సొమ్మియవలయునని నాకు సూచన చేయబడి యున్నదో?"

"పరిహారమా? ఎందులకు?"

"పిప్ నన్ను వీడిపోవుచున్నందుకు."

"పిప్‌కు మంచి భవిష్యత్తుండవలయుననియే నేను కోరు కొనుచున్నాను. అందు కతడు వెళ్ళిపోవుట నాకు సమ్మతమే. కాని నా బిడ్డవంటి పిప్ వెళ్ళిపోయిన తరువాత ఆలోటును డబ్బు పూడ్చగలదా? డబ్బు సరియైన పరిహారమగునా?"

నేను జోను ఓదార్చుటకు ప్రయత్నింపసాగితిని.

అంతట జాగర్సు ఇట్లనెను: "జో! ఇది నీ కడపటి అవ కాశమని హెచ్చరించుచున్నాను. నావద్ద ముసుగులో గుద్దులాట పనికిరాదు. నీ కేదైన బహుమానము కావలసినచో వెంటనే చెప్పుము. నేను ఇచ్చుటకు సిద్ధముగనున్నాను. ఈ అవకాశము పోయినచో నీకు మరల లభింపదు."

ఆ మాటలు జోకు కోపము కలిగింపసాగెను. అతడు తన మనోవ్యథను ప్రకటింపబూనెను. అంతట జాగర్సు గుమ్మము వద్దకుపోయి ఇట్లు చెప్పెను: "పిప్! నీవు కులీనుడవు కానున్నావు. కావున నీ వీ ప్రదేశమును ఎంత త్వరగా వదలిపెట్టిన అంత మంచిది, సరే. ఇదివరకే చెప్పినానుగదా. సరిగా వారము రోజు లలో నా దేరోజున లండనుకు బయలుదేరవలెను. నీ కీలోపల నా విలాసము తెలియజేసెదను. నీవు కోచి బండిలో తిన్నగా నావద్దకు రావచ్చును. నే నే అభిప్రాయమును వ్యక్తపరచుట లేదని అర్థము చేసికొనుము. నేను ప్రతిఫలమును తీసికొనియే ఈపని అంతయు చేయుచున్నాను. అర్థము చేసికొనుము."

అట్లని అతడు సత్రము వద్దనున్న అద్దె బండివద్దకు పో సాగెను. అప్పుడు నా మనస్సులోని కొక ఆలోచన వచ్చెను. అందువలన నేను పరుగెత్తుకొనిపోయి అతనిని కలిసికొంటిని.

"ఎందులకు వచ్చినావు?" అని అతడు ప్రశ్నించెను. "అయ్యా! నేను తు. చ. తప్పకుండ మీరు చెప్పినట్లే చేయు వలయునని నిశ్చయించుకొని యున్నాను. అందువలన ఒక సందేహము తీర్చుకొనుటకై మీవద్దకు వచ్చియున్నాను. నే నీ ప్రాంతమును వీడిపోవుటకు ముందు నాకు తెలిసిన వారివద్ద సెలవు తీసికొనుటకు మీకెట్టి అభ్యంతరమైన నున్నదా?"

"లేదు."

"అయ్యా! ఈ గ్రామములో మాత్రమేకాదు. సమీప పట్టణములో కూడ."

"లేదు. అభ్యంతరము లేదు."

"నేను మీకెంతయు కృతజ్ఞుడను."

తరువాత నేను మరల ఇంటికి పరుగెత్తుకొని పోతిని. నేను ఇంటికి పోవునప్పటికి జో వంటగదిలో కుంపటి ముందు కూర్చుండి కాలుచున్న బొగ్గులవంకకు చూచుచుండెను. అతడు రెండు మోకాళ్ళపై రెండుచేతుల పెట్టుకొని యుండెను. నేను కూడపోయి అచ్చటనే కూర్చుండి కాలుచున్న బొగ్గులవంకకు చూడసాగితిని. చాల సేపటి వఱకు ఎవరము మాట్లాడలేదు. జో గాఢముగ ఆలోచించు చున్నట్లుండెను.

నా సోదరి ఒకమూల మెత్తల కుర్చీపై కూర్చుండి యుండెను. బిడ్డీ కుంపటి ముందు కూర్చుండి అల్లికపని చేసి కొనుచుండెను. జో, బిడ్డీక ప్రక్కనే కూర్చుండి యుండెను. నేను

జోకు ప్రక్కనే కూర్చుండియుంటిని. చాల సేపటివఱకు నే నెంత ప్రయత్నించినను నా నోటినుండి మాట రాకుండెను.

ఎట్టకేలకు నేను ఇట్లంటిని: "జో! ఆ విషయమును బిడ్డీకి చెప్పి యున్నావా?"

అతడింకను కుంపటి వంకకే చూచుచు ఇట్లనెను: "లేదు, పిప్! ఆ విషయమును నీకే వదలిపెట్టి వైచినాను."

"నీవు చెప్పియుండిన ఎంతయు బాగుండెడిది."

"పిప్ మంచి ధనికుడు, గౌరవనీయుడు కానున్నాడు. భగవంతు డతనికి మేలు చేయుగాక" అని అతడనెను.

ఆ మాటలను వినగానే బిడ్డీ చేతిలోని సూదిని క్రిందజార విడిచి నా వంక చూచెను. జో తన మోకాళ్ళు పట్టుకొని నా వంక చూచెను. నేను ఇరువురి వంక చూచితిని. కొంచెము సేపైన తరువాత వారిరువురును నన్ను హృదయపూర్వకముగ అభినందించిరి. కాని వారి మనస్సులలో నొక విధమగు విచారమున్నట్లు తోచెను. అది నా కిష్టము కాకుండెను.

నేను జరిగిన విషయమునంతను బిడ్డీకి చెప్పితిని. "నాకు మేలు చేయనున్న వారెవ్వరని మీకు సందేహము కలుగవచ్చును. ఆ విషయమునుగూర్చి మీరు తెలిసికొనుటకు ప్రయత్నింపరాదు. ఎటువంటి ప్రశ్నలు అడుగరాదు. సరియైన సమయమున కాపేరు బయల్పడును. అంతవఱకు మనమా విషయమును గూర్చి మాట్లాడరాదు. ఒక నిగూఢ వ్యక్తి నాకు చక్కని ఆస్తి నొసగనున్నాడను విషయమును తెలిసికొనిన చాలును" అని నేను అంటిని.

అంతట వారిరువురును నన్ను మఱియొకసారి అభినందించిరి. బిడ్డీ కుంపటివంకకు చూచుచు, "నేను నిన్ను ఆ విషయమునుగూర్చి ఎట్టి ప్రశ్నలు అడుగను. ఆ విషయమున నేనుచాల జాగ్రత్తగ నుందును" అని అనెను. నాబావకూడ అట్లే అనెను.

ఈ విషయమును నా సోదరికి తెలియ జేయుటకు బిడ్డీ శతవిధముల ప్రయత్నించెను. నాకు తెలిసినంత వఱకు, ఆమె ప్రయత్నము లేశమాత్రము ఫలించలేదని గట్టిగా నమ్ముచున్నాను. ఆమె నవ్వుచు, తల ఎన్నోసార్లు ఊపెను. అప్పుడప్పుడు, 'పిప్', 'ఆస్తి' అను మాటల నుచ్చరించెను. కాని ఆమె కామాటల అర్థము తెలియదనియే నేను నమ్ముచున్నాను. నిజముగా నామె పరిస్థితి చాల ఘోరముగ నుండెను.

నేను కుంపటి వంకకు చూచుచుంటిని. బిడ్డీ జోలు నేను వెళ్ళి పోవుటనుగూర్చి మాట్లాడుచుండిరి. నేను వెళ్ళిపోయిన తరువాత ఏమి చేయవలయునను విషయమునుగూర్చికూడ వారు మాట్లాడుకొను చుండిరి.

నాటిరాత్రి భోజన సమయమున నేను ఇట్లంటిని: "శనివారమునాటి రాత్రి. అయిదురోజులు, నాటికి ముందురోజు ఉన్నవి! అవి త్వరలోనే గడచిపోవును."

"అవును, పిప్! అవి త్వరలోనే గడచిపోవును" అని జో హీనస్వరమున ననెను.

"అవి త్వరలోనే గడచిపోవును" అని బిడ్డీ అనెను.

"నేను సోమవారమునాడు పట్టణమునకు పోదును. నేనచ్చట క్రొత్త దుస్తులను కుట్టించుకొందును. నేనే అచ్చటకు వచ్చి దుస్తులను ధరింతునని దర్జీవానికి చెప్పెదను. లేక వానిని

పంబుల్ చూక్ గృహమునకు పంపవలయునని చెప్పెగను. ఏల యన ఇచ్చట ధరించినచో జనులందఱును నన్ను తేఱిపాఱ జూతురు. అవి నాకేమియు బాగుండదు."

"నీవు గౌరవనీయులు ధరించునట్టి వస్త్రులను ధరించి నపుడు చూచుటకు హబుల్ దంపతులు ఎంతయు సంతసింతురు. వాప్సల్ స్థితిగూడ అంతే. మిగిలినవారుకూడ సంతసింతురు" అని జో అనెను.

"నాకది ఇష్టముండదు. అంతయు మొఱటుగా తయా రగును. నేను దానిని సహింపజాలను."

"వారిమాట సరేకాని నీ వస్త్రులను నాకు, నీ సోదరికి, బావకు చూపు విషయమును ఆలోచించినావా? నీవు వానిని మాకు తప్పక చూపుదువనుకొందుము. చూపవా?" అని బిడ్డీ అనెను.

అప్పుడు నేనిట్లంటిని: "నీ వంత తొందఱపడెద వెందు లకు? నీవు ఒక్క క్షణకాలమాగి యుండినచో ఆవిషయమును గూర్చి చెప్పి యుండెడి వాడను. శుక్రవారమునాడు వానిని తెచ్చి మీకు చూపవలయునని అనుకొన్నాను."

బిడ్డీ ఇంక ఏమియు మాట్లాడలేదు. తరువాత నేను వారివద్ద సెలవు తీసికొని నిదురింపబోతిని.

తెల్లవాఱిన తరువాత నేను నిద్రనుండి లేచితిని. ఉదయ కాలపు భోజనము చేసితిని. అంతట జో నన్ను అప్రెంటిసుగా జేర్చుకొనుటకు సంబంధించిన కాగితములను తీసికొనివచ్చి కుంపటిలో బడవైచెను. అవి అగ్ని కాహుతి యయ్యెను. ఇక నేను అతనివద్ద అప్రెంటిసుగా పని చేయవలసిన అవసరము లేదు.

నేను సంపూర్ణమగు స్వేచ్ఛను పొందితిని. భోజనమైన తరువాత జోతో కలసి చర్చికి పోతిని.

మధ్యాహ్న భోజనమైన తరువాత నేనొక్కడనే చర్చి వద్దకు పోతిని. ఆ చర్చికి ప్రతి ఆదివారమునాడు వచ్చు బీద జనులనుగూర్చి సానుభూతితో ఆలోచింపసాగితిని. నేను ధనికుడనైన తరువాత వారికి తగిన సాహాయ్యము చేయవలయునని నిశ్చయించుకొంటిని.

నే నిదివరకచ్చట ఒక నేరగానికి సాహాయ్యము చేసియుంటిని. ఆ విధముగ చేసినందుకు నేను తరువాత సిగ్గుపడుచుండెడివాడను. నాకు అతని సంగతికూడా జ్ఞప్తికి వచ్చెను. "అది జరిగి చాలకాలమైనది. అతడిప్పుడు ఏదూర దేశములోనో ఉండియుండును. నాకు సంబంధించినంతవరకు అతడు మరణించినట్లే. ఒకవేళ నిజముగా నతడు మరణించినాడేమో!" అని నన్ను నేను ఓదార్చుకొనసాగితిని.

నేను బురుజువద్దకుపోయి కూర్చుంటిని. "నాకిచ్చి వివాహము చేయవలయునను ఉద్దేశముతోనే హవిషమ్‌కన్య, ఎస్టెల్లాకు ఉన్నతవిద్య చెప్పించుచున్నదా?" అని నేను ఆలోచించుకొనసాగితిని. ఆ యాలోచనతో నేను నిదుర పోతిని. నేను మేల్కొన్నప్పటికి జో నా ప్రక్కనే చుట్టకాల్చుకొనుచు కూర్చుండియుండెను. అతనినిచూచి నేను ఆశ్చర్యపడితిని. నేను కన్నులు తెరువగనే అతడు మందహాసముచేసి ఇట్లనెను: "కడసారికదా యని నేను నీవెంటపడి వచ్చినాను."

"నీవట్లు చేసినందుకు నేనెంతయు సంతసించుచున్నాను."

"మంచివి."

"నేను నిన్నెన్నడును మఱచిపోనని జ్ఞప్తియందుంచు కొనుము."

"ఆవిషయమున నాకెట్టి సందేహమునులేదు, పిప్!"

తరువాత మేమింకను కొంతసేపు మాట్లాడుకొంటిమి. పిమ్మట మేమింటికి తిరిగిపోయి తేనీరు సేవించితిమి.

తేనీరు సేవించినతరువాత నేను బిడ్డీని తోటలోనికి తీసికొనిపోయి ఇట్లంటిని: "యువతీమణీ! నేను నిన్ను ఎన్నటికిని మఱచిపోను. నీవు నాకొక సాహాయ్యము చేసిపెట్టవలయును. నీవు జోను అభివృద్ధిపఱచుటలో ఏలోటు చేయరాదు."

"నేను చేయవలసినది ఏమియున్నది?"

"అతనికి చదువు సరిగారాదు. ఎచ్చటనెట్లు ప్రవర్తింప వలయునో సరిగా తెలియదు."

"అతని యిప్పటిప్రవర్తన బాగుగలేదా?"

"ఇచ్చట బాగుగనేయున్నది. కాని..."

"ఇచ్చట బాగుగనేయున్నదా!"

"నామాట పూర్తిగా విన్నతరువాత మాట్లాడుము. నేను అతనిని ఉన్నతస్థితిలోనికి తీసికొనిపోవుటకు ప్రయత్నింతును. నాకు ఆస్తి పూర్తిగావచ్చినతరువాత అతని నిచ్చటనుండి తీసికొనిపోదును. మఱి యప్పుడతని ప్రవర్తన వేఱువిధముగ నుండ వలయునుగదా!"

"ఆవిషయ మతనికి తెలియదందువా?"

"బిడ్డీ! నీ యుద్దేశ మేమి?"

"అతనికికూడ గర్వముండుననువిషయమును నీవెన్న డును ఆలోచింపలేదా?"

"గర్వమా?"

"అవును. గర్వములో అనేకరకములుండును. గర్వమంతయు ఒకేరకమునకు చెందినది కాదని..."

"ఆగినావెందుకు? పూర్తిచేయుము."

"తెలిసికొనుము. అతడిచ్చట బాగుగనేయున్నాడు. ఎవ్వరైన అతని నిచ్చటనుండి తీసికొనిపోవుటకు అతడు అంగీకరింపకపోవచ్చును. నిజము చెప్పవలయునన్న అతడా ప్రయత్నమును ఏమాత్రము హర్షింపడు. సహించడు. నాకంటె నీకతనిని గూర్చి ఎక్కువ తెలిసియుండవచ్చును. అయినను నేను ఆవిధముగ చెప్పుటకు సాహసించుచున్నాను."

"బిడ్డీ! నీవావిధముగ మాట్లాడుచున్నందుకు నేనెంతయు విచారించుచున్నాను. నీవిట్లు మాట్లాడుదువని నేను ఎన్నడును అనుకొనలేదు. నీవు అసూయపడుచున్నావు, బిడ్డీ! నాకు అదృష్టము పట్టుచున్నదని నీవు అసంతృప్తిపడుచున్నావు. ఆ అసంతృప్తిని దాచుకొనలేక ఈవిధముగా బయల్పరచుచున్నావు."

"ఆవిధముగ అనుకొనదలచినచో అనుకొనుము. ఎన్నిసార్లయిన ననుకొనుము."

"బిడ్డీ! నీహృదయములోని విషయము నావిధముగ బట్టబయలు చేసికొనెదవెందులకు? నీ అభిప్రాయములను నా నెత్తిపైరుద్దుటకు ప్రయత్నింతు వెందులకు? నే నిందుల

కెంతయు విచారించు చున్నాను. ఇది మానవ స్వభావములోని వికృత భాగము. నేను వెళ్ళిపోయిన తరువాత అవకాశము చిక్కినప్పుడెల్ల జోను అభివృద్ధి పఱచుటకు ప్రయత్నింప వలసినదని నిన్ను కోరదలచినాను. కాని యిప్పుడింక నిన్నేమియు కోరను. నీలోని ఈ చిహ్నమును చూచుటకు నే నెంతయు విచారించు చున్నాను. ఇది మానవ స్వభావములోని వికృత భాగము."

"నీవు నన్ను దూషించినను, మఱియింక నేమి చేసినను నేనా విషయమున చేయగలిగినదంతయు చేయుదును. నీవు ఈ నామాట నమ్మవచ్చును. నీవు నన్ను గూర్చి ఏవిధముగ అభిప్రాయపడినను, నేను మాత్రము నిన్ను జ్ఞప్తియందుంచుకొందును. కాని గౌరవనీయుడు అన్యాయముగ ప్రవర్తింపరాదు."

"బిడ్డీ! నీవు అసూయ పడుచున్నావు. ఇది మానవ స్వభావములోని వికృత భాగము."

అట్లని నే నా ప్రదేశమును వీడిపోతిని. ఆమె ఇంటిలోనికి వెళ్ళిపోయెను.

మఱునాడు నేను పట్టణమునకుపోయి ట్రాబ్ అను దర్జీ వానిని కలసి కొంటిని. నాకు ఆస్తి రానున్న విషయము నతనికి తెలిపితిని. అతడు నన్నెంతయు అభినందించి గౌరవ భావముతో చూచెను. నే నతనివద్ద నా సూటునకు సరిపడు గుడ్డను కొంటిని. అతడు ఎంతో జాగ్రత్తగా నా కొలతలను తీసికొనెను. గురువారమునాటి సాయంకాలమున కా సూటును పంబుల్‌చూక్ గృహమునకు పంపుటకతడు అంగీకరించెను. తరువాత నేను మఱి కొన్ని అంగళ్ళకుపోయి నాకు కావలసిన వస్తువులను కొంటిని.

నే నెక్కడకు పోయినను, నాకు గొప్ప ఆస్తి రానున్నదను విష యమును తెలిసికొని అందఱును నన్ను గౌరవింపసాగిరి.

పిమ్మట నేను పంబుల్‌చూక్ గృహమునకు పోతిని. పంబుల్‌చూక్ నన్ను స్వీకరించుటకై వీధి ద్వారమువద్ద నిలబడి యుండెను. నాటి యుదయమున నతడు మా యింటికి పోయి యుండెను. నాకు గొప్పఆస్తి రానున్న విషయము నతడచ్చట తెలిసికొని యుండెను. అందువలన నతడు నన్ను ఎంతో గౌరవ భావముతో స్వీకరించి పరిపరి విధముల అభినందించెను.

అతడు నా కొఱకొక చక్కని విందునుగూడ నేర్పాటు చేసెను. మే మిరువురము ఆ విందులో పాల్గొంటిమి. ఆ సమ యమున నతడు నన్నెంతో ఆదరించెను. మేమా సందర్భమున ఎన్నో విషయములు మాట్లాడుకొంటిమి. తరువాత నేను ఇంటికి తిరిగి పోతిని.

మంగళవారము, బుధవారము, గురువారము గడచి పోయెను. శుక్రవారమునాటి యుదయమున నేను పట్టణమునకు బయలుదేఱి పోయి పంబుల్‌చూక్ గృహమును చేరుకొంటిని. కడచిన దినమున దర్జీవాడు నాసూటు నచ్చటకు చేర్చియుండెను. నేనా సూటును ధరించితిని.

తరువాత నేను హావిషమ్‌కన్య గృహమువద్దకుపోయి గంట మ్రోగించితిని. అంతట సారా అచ్చటకు వచ్చెను. ఆమె నాలోని మార్పునుచూచి ఆశ్చర్యపడెను. ఆమె ముఖకవళిక మాఱిపోసాగెను.

"నీవా? ఓయిభగవానుడా! నీవా? నీకేమి కావలయును?" అని ఆమె ఆశ్చర్యమును ప్రకటించుచు అనెను.

"సారా! నేను లండనుకు ప్రయాణమై పోవుచున్నాను. హావిషమ్‌కన్యవద్ద సెలవుతీసికొనవలయునని ఇచ్చటకు వచ్చియున్నాను."

కాని సారా తాళము తీయలేదు. ఆమె తిన్నగా పైనుకకు పోయి హావిషమ్‌కన్యను కలిసికొని నన్ను లోనికి ప్రవేశపెట్టు విషయమునుగూర్చి మాట్లాడి యుండెను. కొంతసేపైన తరువాత ఆమె తిరిగివచ్చి తలుపులు తెఱచెను. నన్ను తేఱిపాఱ జూచుచు లోనికి తీసికొని పోయెను.

నేను తిన్నగాపోయి హావిషమ్‌కన్య గదిలో ప్రవేశించితిని. ఆమె యప్పుడు పెద్దబల్లచుట్టును తిరుగుచుండెను. నేను ప్రవేశించిన సవ్వడి వినగానే ఆమె ఆగిపోయి నా వంకకు తిరిగెను.

ఆమె యిట్లనెను: "సారా! వెళ్ళిపోకుము. ఎందుకువచ్చినావు? పిప్!"

"మిస్ హావిషమ్! నేను రేపు లండను మహానగరమునకు బయలుదేఱి పోవుచున్నాను. మీవద్ద సెలవు తీసికొని పోవలయునని వచ్చినాను. ఇందుకు మీ రేమియు అనుకొనరనుకొందును."

"ఓహో!"

"మిస్ హావిషమ్! నాకు త్వరలో గొప్పఆస్తి రానున్నది. ఇందుకు నే నెంతయు కృతజ్ఞుడను; మిస్ హావిషమ్!"

"ఓహో! నేను జాగర్సును చూచియున్నాను. దానిని గూర్చి వినియున్నాను, పిప్! అయిన నీవు రేపు వెళ్లుచున్న మాట?"

"అవును, మిస్ హావిషమ్!"

"నిన్ను ధనికులు పెంచుకొని యున్నారా?"

"అవును, మిస్ హావిషమ్!"

"వారిపేరు తెలియుదా?"

"అవును, తెలియుదు."

"జాగర్సును నీకు సంరక్షకుడుగ నియమించి యున్నారా?"

"అవును, మిస్ హావిషమ్!"

"నీకు మంచి భవిష్యత్తు ఉన్నది, పిప్! మంచి గుణములు కలిగి యుండుము. సముచితముగ ప్రవర్తింపుము. జాగర్సు చెప్పిన చొప్పున నడచుకొనుము. గుడ్ బై, పిప్! నీవు ఎప్పుడును 'పిప్' అను నామమునే ధరించి యుందువుకదా?"

"అవును, మిస్ హావిషమ్!"

"గుడ్ బై, పిప్!"

అట్లని ఆమె తన చేతిని చాపెను. అప్పుడు నేనామె ముందు మోకరిల్లి దానిని ముద్దు పెట్టుకొంటిని. ఆమెవద్ద ఎట్లు సెలవు తీసికోవలయునను విషయమునుగూర్చి నేను అంతవఱకు ఆలోచించి యుండలేదు. కాని అటుల చేయవలయునని నాకు అప్పుడు సహజముగా బుద్ధిపుట్టెను.

తరువాత నేను బయటకు పోతిని. సారా నా వెనుకనే వచ్చి ఎప్పటివలె తలుపులకు తాళమువైచెను. పిమ్మట నేను పంబుల్‌చూక్ గృహమునకు వెళ్ళితిని. అచ్చట నా దుస్తులను విప్పి ఒకమూటగా కట్టి, దానిని తీసికొని ఇంటికి బయలుదేఱి పోతిని. ఎట్టకేలకు ఇల్లు చేరుకొంటిని.

శుక్రవారమునాటి సాయంకాలము జో, బిడ్డీల ఆనందము కొఱకు నగారూపధరించి, ఇంటిలో కూర్చుంటిని. నాటిరాత్రి మేము చక్కని విందులో పాల్గొంటిమి. కాని వారియువునను నిరుత్సా

హాముగ నున్నట్లు కనబడెను. తరువాత సూట్కు విప్పి పరుండ బోతిని.

తెల్లవారు సమయమున మా యూరు వదలి వెళ్ళిపో వలయునని నిశ్చయించుకొంటిని. నే నొక్కడనే నడచిపోదునని నిశ్చయించుకొంటిని. జోకూడ నాతో కలసి వచ్చినచో అవ మానకరముగ నుండునని భావించితిని. కాని అది కారణము కానట్లు నటింపసాగితిని. రాత్రి నా గదిలో పరున్న తరువాత మరల జో వద్దకు పోయి "నీవు కూడ నాతో కలసి రావల యును" అని అడుగవలయునను అభిప్రాయము కలిగెను. కాని నేను ఆవిధముగ చేయలేదు. ఆ రాత్రి నాకు సరిగా నిదురపట్ట లేదనియే చెప్పవలయును.

నాకు పెందలకడ ఉదయ కాలపు భోజనమును తయారు చేయుటకై బిడ్డీ నిదురనుండి లేచెను. ఆమె చక్కని భోజనమునే సిద్ధము చేసెను. కాని నేను తొందర తొందరగా భోజనము చేసితిని. ఆమె చక్కని భోజనమును తయారుచేసినను నాకు రుచికరముగ లేకుండెను. భోజనమైన తరువాత నేను నా సోద రిని ముద్దుపెట్టుకొంటిని. అపు డామె నవ్వుచు, తల యూపుచుం డెను. పిమ్మట బిడ్డీని ముద్దుపెట్టుకొంటిని. అటుపిమ్మట జో మెడ చుట్టును చేతులువేసి కౌగిలించుకొంటిని. తరువాత సామానులు సర్దుకొన్న చిన్న పెట్టెను చేతబుచ్చుకొని బయటకు పోతిని. బయ టకు పోయిన తరువాత నేను వెనుకకు తిరిగిచూచితిని. జో, బిడ్డీలు గుమ్మమువద్ద నిలబడియుండిరి. జో "హుర్రా." అని అరి చెను. బిడ్డీ మొగముమీద గుడ్డ కప్పుకొనెను.

నేను మరల ముందుకు తిరిగి ప్రయాణము సాగించితిని. ఆ సమయమున గ్రామమంతయు కడు ప్రశాంతముగ నుండెను. నేను చిన్నప్పటినుండియు ఆ గ్రామ వాతావరణములో పెరిగి పెద్దవాడ నైతిని. అచ్చటి సంగతు లన్నియు నాకు తెలియును. బయటి ప్రపంచము చాల విశాలమైనది. అచ్చటిసంగతులేవియు నాకు తెలియవు. ఆ విషయమును తలుచుకోగానే నా కన్నుల నుండి నీరు కారసాగెను. అప్పటికి నేను ఆగ్రామ పొలిమేరలో గల దారిని తెలుపుటకు బల్లకట్టిన స్తంభమును చేరుకొంటిని. నేను దానిని ముట్టుకొని, "ప్రియాతిప్రియమైన మిత్రమా! గుడ్ బై! గుడ్ బై!" అని అంటిని. తరువాత వేగముగ నడచి పోసాగితిని. మధ్య మధ్య కన్నీరు పెట్టుకొనుచునే యుంటిని. కాని ఆశాసౌధములో ప్రవేశింప వలయునని ఉత్సాహ పడు చుంటిని.

# 12

నేను పట్టణము చేరుకొని సూటు ధరించి నాలుగు గుఱ్ఱ ముల కోచిలో ప్రవేశించితిని. ఆ పట్టణము నుండి నగరముచేరు కొనుటకు సుమారు అయిదు గంటలు పట్టును. కోచి లండను చేరుకొనునప్పటికి మధ్యాహ్నము పండ్రెండు గంటలు దాటి పోయెను.

నేను మా గ్రామములో నున్నప్పుడే జాగర్సు తన మీగా సమును పంపియుండెను. అతని ఇల్లు కోచి ఆగు ప్రదేశమునకు దగ్గఱగనే యుండెను. అయినను నేనొక చిన్న కోచిలో ప్రవేశించి అతని యింటికి పోతిని. బండిలోనుండి దిగి, "ఎంత ఈయవలయును ?" అని ప్రశ్నించితిని.

"ఒక షిల్లింగు. మీరింకను ఎక్కువ ఈయదలచుకొన్నచో ఈయవచ్చును."

"ఈయ దలచుకోలేను."

"అయిన ఒక షిల్లింగును ఇచ్చిన చాలును."

నే నతనికి ఒక షిల్లింగు నాణెము నిచ్చితిని. అతడు వెళ్ళిపోయెను. పిమ్మట నేను పెట్టె చేతబుచ్చుకొని ముందు గదిలో ప్రవేశించితిని. అచ్చట జాగర్సు గుమాస్తా కూర్చుండి యుండెను.

"జాగర్సు ఇంటిలో నున్నారా ?" అని నే నతనిని ప్రశ్నించితిని.

"లేరు. ఇప్పుడాయన కోర్టులో నున్నారు. నే నిప్పుడు మాట్లాడుచున్నది పిప్‌గారితోనేనా ?"

"అవును."

"నిన్ను తన గదిలో వేచియుండవలసినదని అతడు చెప్పినాడు. అతడు కోర్టునుండి ఎంతసేపటికి తిరిగి వచ్చునో తెలియదు. కాని కాలము చాల విలువైనదను విషయ మతనికి బాగుగ తెలియును. అందువలన నతడు అవసరమైనంతసేపు మాత్రమే కోర్టులో నుండును. తరువాత నింటికి తిరిగివచ్చును."

అట్లని సన్నతడు ఒక గదిలోనికి ప్రవేశపెట్టెను. అచ్చట మైక్ అను పేరుగల ఒంటికంటి గౌరవనీయుడొకడు కూర్చుండి యుండెను. గుమాస్తా అతనిని బయటకు పంపించి వైచెను. నేను గదిలో ఒంటరిగా కూర్చుండియుంటిని. ఆ గదిలో కాంతి సరిగాలేదు. అంతయు చీకటిగా నుండెను. నాకచ్చట నేమియు తోచకుండెను. అందువలన నేను గుమాస్తాతో చెప్పి బయటకు పోతిని. కొంచెముసేపు అటునిటు తిరిగి మరల ఇంటికి వచ్చితిని. అప్పటికిగూడ నతడు ఇంటికి తిరిగి రాలేదు. అందువలన మరల బయటకుపోయి అటునిటు తిరిగితిని. పిమ్మట జాగర్సును కలసికొంటిని.

జాగర్సు నాకు మత్తయిపోకెట్ కుమారుడు నివసించుచున్న ఇంటి విలాసమును తెలిపి ఇట్లనెను: "నీ వచ్చట నుండుటకు తగిన ఏర్పాట్లు చేసినాను. సోమవారము వఱకు నీవచ్చట నుండవచ్చును. తరువాత నతడు నిన్ను తన తండ్రి యింటికి తీసికొని పోవును. నీకా ప్రదేశము సరిపోవునదీ, లేనిదీ ప్రయత్నించి చూచుకో వచ్చును."

నాకు ప్రతినెల తానిచ్చు సొమ్మెంతో కూడ అతడు చెప్పెను. అది చాల పెద్దమొత్తమనియే చెప్పవలసి యున్నది.

"నేను మత్తయిపోకెట్ కుమారుని ఇంటికి కోచిమీద పోదునా ?" అని ప్రశ్నించితిని.

"కోచి ఎందులకు ? ఇక్కడకు దగ్గఱలోనే యున్నది. నడచి పోవచ్చును. నీ కిష్టమైనచో నా గుమాస్తా వెమ్మిక్ కూడ నీతో కలసివచ్చును."

"అటులనే చేయుదును" అని నేను అంటిని,

తరువాత నేను, గుమాస్తా కలిసి మత్తయి కుమారుని ఇంటికి పోసాగితిమి. ఆ గుమాస్తాకు నలువదికి ఏబదికి మధ్య వయస్సుండును. అతడు బ్రహ్మచారి.

"అయిన నీ విదివఱకెన్నడును లండను మహా నగరమునకు వచ్చియుండ లేదన్న మాట ?" అని త్రోవలో గుమాస్తా అనెను.

"లేదు."

"ఒకప్పుడు నేనుగూడ ఈ మహానగరమునకు క్రొత్తవాడనే. అప్పటి విషయమునుగూర్చి ఇప్పుడాలోచించిన నెట్లుండును ?"

"ఇప్పుడు నీకు పట్టణ మంతయు బాగుగా తెలియు నన్న మాట !"

"ఆ విషయమున నీకు సందేహమెందులకు? ఈ మహానగరమంతయు నాకు బాగుగ తెలియును. ఎక్కడ ఏమిజరుగుచున్నది చెప్పగలను."

"ఇది చాల చెడ్డప్రదేశమా?" అని నేను ప్రశ్నించితిని. నిజముగా ఆసంగతిని తెలిసికోవలయుననిగాక, ఏదో ప్రశ్న వేయవలయునని అటులనడిగితిని.

"నిన్నిచ్చటివారు మోసముచేయవచ్చును; దోచుకొనవచ్చును; హత్యచేయవచ్చును. కాని ఇక్కడనే అననేల ? ఆవిధముగ చేయువారు ఎచ్చటనైన నుందురు."

"అవును. మనకు, వారికి విరోధమున్నచో అటుల జరుగును."

"విరోధమా! ఆసంగతి నాకు తెలియదు. కాని ఒక్క సంగతిమాత్రము నాకు బాగుగ తెలియును. ఆపనులు చేయుట వలన లాభమేమైన కలుగుచో వాడు తప్పక అట్లుచేయు చుడు."

"అయిన అది ఇంకను అధ్వాన్నమైన పరిస్థితి."

"నీవటుల అనుకొనుచున్నావా? ఎట్లయినను ఒకటే."

"మత్తయిపోకెట్ ఎచ్చట నివసించుచున్నాడో నీకు తెలియునా?"

"తెలియును. లండనుకు పశ్చిమముననున్న హామర్ స్మిత్ లో నివసించుచున్నాడు."

"చాలదూరమా?"

"అయిదుమైళ్ళ దూరమనుకొనుచు."

"అతనిని నీవెఱుగుదువా?"

"ఏమి! ఏమిప్రశ్నలు వేయుచున్నావు? అతనిని నేను ఎఱుగకపోవుటయా! అతనిని నేను ఎఱుగుదును! నేను ఎఱుగుదును!"

తరువాత మేమింక నేమియు మాట్లాడలేదు. అతడు నన్ను చాల అపరిశుభ్రముగానున్న ప్రదేశములోనికి తీసికొని పోయెను. అతడు నన్ను త్రిప్పిత్రిప్పి పడిపోవుటకు సిద్ధముగను, అపరిశుభ్రముగనున్న మెట్లమీదనుండి మేడపైనున్న గదుల వద్దకు తీసికొనిపోయెను. ఆ పైభాగముగూడ చాల అపరిశుభ్రముగ నుండెను. అతడు ఎట్టకేలకు నన్నొకగదివద్దకు తీసికొని పోయెను. ఆ గదితలుపులమీద "పోకెట్ జూనియర్" అని వ్రాయబడియుండెను. మఱియు ఆ తలుపులమీద ఒక కాగితము అంటించ

బడియుండెను. ఆ కాగితముమీద, "నేను త్వరలోనే తిరిగి వత్తును" అని వ్రాయబడియుండెను.

"నీవింత త్వరలో వత్తువని అతడు అనుకొనియుండడు. ఇంక నేనిప్పుడిచ్చట ఉండవలసిన అవసరము లేదుకదా!" అని గుమాస్తా అనెను.

"లేదు. నీవుచేసిన సాహాయ్యమునకు కెంతయు కృతజ్ఞుడను."

"నేను నీకు డబ్బునొసగుచుందునుగదా. అందువలన మనము తఱచుగా కలసికొనుచుందుము. ఇంక సెలవు."

"మంచిది."

అట్లని నేను చేయిచాచితిని. నేనేదో కొసలయునని కోరు చున్నట్లు అతడు నాచేతివంకకు చూడసాగెను. తరువాత నతడు నాకన్నులవంక చూచెను. అంతట నతడు తన అభిప్రాయమును సరిదిద్దుకొని యిట్లనెను: "ఓహో! కరచాలనముచేయు అలవాటు నీకున్నదా?"

కరచాలనముచేయు అలవాటు లండనులో లేదేమోయని నేను కలవరపడితిని. కాని, "ఉన్నది" అని సమాధానము చెప్పితిని.

"నేనేమో అనుకొన్నాను. నీ సంగతి ఇప్పటికి తెలిసినది. నీ పరిచయము కలిగినందుకు నేను ఎంతయు సంతసించు చున్నాను." అని యని అతడు నాతో కరచాలనము చేసెను. తరువాత నతడు వెళ్ళిపోయెను.

"త్వరలోనే తిరిగి వత్తును" అని మత్తయి కుమారుడు కాగితముమీద వ్రాసియుండెను. కాని 'త్వరలోనే' అనగా

అతని ఉద్దేశ్యమేమో! నేను అరగంట వఱకు వేచియుంటిని. కాని అతడు ఎంతకును రాలేదు. ఎట్టకేలకు మెట్లమీద సవ్వడి వినబడసాగెను. ఆ సవ్వడి క్రమ క్రమముగా పైకి వచ్చుచుండెను. ఎట్టకేలకు నావలెనే యున్న గౌరవనీయు డొకడు పైకివచ్చెను. అతని రెండు చంకలలోను రెండు కాగితపు సంచులుండెను. ఒక చేతిలో పండ్లబుట్ట యుండెను. అతడు ఎంతో శ్రమపడుచున్నట్లు ఒగర్చుచుండెను.

నన్ను చూడగనే అతడు, "పిప్!"అని యనెను.

"పోకెట్!"

"చాల ఆలస్యమై పోయినందులకు నేను ఎంతయు విచారించు చున్నాను" అని యని అతడు తలుపు తీయుటకు ప్రయత్నింపసాగెను. అతడు ఎంతయు శ్రమపడసాగెను. అందువలన నేనతని చంకలోని కాగితపు సంచులను పండ్లబుట్టను తీసికొంటిని. పిమ్మట నతడు అడవి మృగములతో పోరాడినట్లు తలుపులతో కుస్తీపట్టసాగెను. ఎట్టకేలకవి హఠాత్తుగా తెఱచుకొనెను. అప్పుడతడు వచ్చి నామీద పడెను. నేను పోయి నా వెనుకనున్న ద్వారముపై బడితిని. మే మిరువురము నవ్వుకొంటిమి.

"దయయుంచి లోనికిరమ్ము. నే నిచ్చట సరియైన సౌకర్యములు లేకుండ ఒంటరిగ నున్నాను. సోమవారము వఱకు నీవీ పరిస్థితిని సహింపగలవని తలచుచున్నాను. ఆదివారమునాడు నీవు తనతోకంటె నాతో నున్నచో నీకు బాగుండునని నాతండ్రి తలచినాడు. మన మిరువురము రేపు లండను మహానగరమును చూడవచ్చును. నేను నీకు లండను నగరమును చూపుటకు ఎంతయు సంతసింతును. జాగర్స సూచనల ననుసరించి నీ స్వంత ఖర్చు

మీాద నీ కిచ్చుటకు భోజనము వచ్చును. ఇక ఈ బస అంత మంచిది కాదని స్పష్టముగ తెలియుచునే యున్నది. మఱి నా ఖర్చులకు నేనే సంపాదించు కొనవలసి యున్నది. నా కిచ్చుటకు నా తండ్రివద్ద నేమియు లేదు. ఒకవేళ ఉన్నను తీసికొనుటకు నేను అంగీకరింపను. ఇది అతిథులు కూర్చుండు గది. ఇది నేను పరుండు గది. ఇది నీవు పరుండుగది. ఇందలి మంచము, కుర్చీలు మున్నగు వానిని నీ కొఱకు అద్దెకు తీసికొనివచ్చి యున్నాను. ఇవి నీకు సరిపోవునను కొందును. నీ కింకను ఏమైన కావలసివచ్చి నచో నేనుపోయి తెచ్చెదను. మన మిచ్చట ఒంటరిగా నుందుము. కాని మనము పోట్లాడుకోమని గట్టిగా చెప్పగలను. క్షమింపుము. ఆ సంచులను, బుట్టను నీవే పట్టుకొని యున్నావు. వాని నిటు తెమ్ము."

నేను అతనికి ఎదుట నిలబడి యుంటిని. నా చేతులలోని సంచులను, పండ్ల బుట్టలను అతని కీయసాగితిని. అప్పుడతని కండ్లలో నొక విధమగు వింతభావము కనబడసాగెను. నా పరిస్థితి కూడ నట్లే యుండెను. అతడు వెనుకకు పడిపోవుచు నిట్లనెను:

"నీ వానాడు కనబడిన బీద పిల్లవాడవు!"

"నీ వానాడు కనబడిన పాలిపోయిన యువకుడవు!" అని నే నంటిని.

మే మిరువురము ఒకరి వంక నొకరము చాలసేపు చూచు కొంటిమి. తరువాత పొట్ట చెక్కలగునట్లు నవ్వుకొంటిమి. "నీవా!" అని అతడనెను. "నీవా!" అని నేను అంటిని. మరల పొట్ట పగులు నట్లు నవ్వుకొంటిమి. అతడు నాతో కరచాలనముచేసి ఇట్లనెను: "అది అ తయు నైపోయినది. అప్పుడు నేను నిన్ను చిత్రిగా

కొట్టినాను. నీవు దానినంతను మఱచిపోయి నీ యుదార బుద్ధిని ప్రదర్శింపవలయును. నేను నీకెంతయు కృతజ్ఞుడను."

హావిషమ్ కన్య ఇంట నేనే అతనిని చిత్తుగా కొట్టి యుంటిని. కాని తానే జయించినట్లు అతడింకను తలచుచుండెను. అయినను నేనేమియు అనలేదు. మేము మఱియొకసారి హృదయ పూర్వముగ కరచాలనము చేసికొంటిమి. అతని పేరు హెర్బర్టు పోకెట్ అని తెలిసి కొంటిని.

"అప్పటికి నీ కింకను అదృష్టము పట్టలేదా?" అని అతడు ప్రశ్నించెను.

"లేదు."

"లేదు. నీకీ అదృష్టము ఇటీవలనే పట్టినదని విని యున్నాను. నేనుగూడ అప్పుడు నాకు అదృష్టము పట్టునని చూచుచుంటిని."

"నిజముగా?"

"అవును. హావిషమ్ కన్య నా కొఱకు కబురు పంపినది. నేను ఆశాసౌధములు నిర్మించుకొంటిని. కాని అవి కూలిపోయి నవి."

"ఆ సంగతి వినుట కెంతయు ఆశ్చర్యపడుచున్నాను."

"ఆశ్చర్యమెందులకు? అది నిజముగా జరిగిన సంగతి. ఆమె నాకొఱకు కబురు పంపినది. నేను వెళ్ళినాను. నేనా పరీక్షలో విజయమును సాధించి యుండినచో ఆమె నా పరిస్థితిని అభివృద్ధి చేసియుండెడిదే. బహుశా ఎస్టెలాకూడ నాకు దక్కి యుండెడిది."

"ఏమన్నావు?"

"ఎస్టెలా నన్ను వివాహము చేసికొని యుండెడిది."

"మఱి నీవు ఆశాసాధములు కూలిపోవుట నెట్లు భరింప గలిగినావు?"

"నేను దాని నే మాత్రము లెక్కచేయలేను. ఆమె వట్టి పనికి మాలినది. ఆమెను సంతృప్తి పఱచుట సామాన్యమైన పని కాదు."

"ఎవరు? హావిషమ్ కన్యయా?"

"నీ ప్రశ్నకు 'కాదు' అని సమాధానము చెప్పను గాని, నేను ఎస్టెలాను ఉద్దేశించి మాట్లాడినాను. ఆమె కఠిన హృదయురాలు; అహంకారము కలది; చపల చిత్తురాలు మగవారం దఱిపైన పగతీర్చుకొనుటకై హావిషమ్ కన్యఆమెను పెంచినది."

"ఆమెకు, హావిషమ్ కన్యకుగల బంధుత్వమెట్టిది?"

"ఏమియులేదు. ఆమెను పెంచుకొన్నది."

"హావిషమ్ కన్య మగవారందఱిమీద ఎందుకు పగతీర్చు కోవలయును? అదియేమి పగ?"

"ఓయి భగవానుడా! నీకు తెలియదా? పిప్!"

"నాకు తెలియదు."

"అది చాల పెద్ద కథ. దానిని తరువాత చెప్పెదను. అనగా భోజన సమయమున చెప్పెదను. కాని నిన్నిప్పుడొక ప్రశ్న నడుగుటకు స్వాతంత్ర్యము తీసికొనుచున్నాను. ఏమియు అను కొనకుము. నీవానాడు అచ్చటకు వచ్చుట ఎట్లు సంభవించినది?"

అంతట నేను ఆ విషయము నంతను వివరముగా చెప్పి తిని. అతడు నేను చెప్పిన దానినంతను శ్రద్ధగా ఆలకించెను. నేను చెప్పుట పూర్తియైన తరువాత అతడు పొట్ట చెక్కలగునట్లు నవ్వ సాగెను.

"జాగర్సు నీకు సంరక్షకుడను కొందును. అవునా?" అని అతడు ప్రశ్నించెను.

"అవును."

"అతడు హావిషమ్‌కన్య వ్యవహారములు చూచుచుండు ననియు, ఆమె కతనిపట్ల మంచి నమ్మకము కలదని నీకు తెలియునా?"

"మన మిసువురము పోరాడుకొనిన దినముననే, నేనతనిని హావిషమ్ కన్య గృహములో చూచియుంటిని. తరువాత నేనతని నెన్నడును చూడలేదు. నన్ను హావిషమ్‌కన్య గృహమున చూచి నట్లు అతనికి జ్ఞాపకము లేదని నమ్ముచున్నాను."

"నీకు ఉపాధ్యాయుడుగ నుండుటకు నా తండ్రి పేరును సూచించినవాడు జాగర్సే. నా తండ్రి హావిషమ్‌కన్యకు బంధువు. అందువలన నతడు నా తండ్రిని బాగుగ నెఱుగును."

హెర్బర్టునిన నాకు సదభిప్రాయము కలిగెను. అతడు మనస్సులో నేవిషయమును దాచుకొనలేడని గ్రహించితిని. మఱి యెందుచేతనో గాని, "ఇతడెన్నడును ధనికుడు కాలేడు" అని యను కొంటిని. నేను నా కథంతను అతనికి చెప్పితిని. నాకు మేలు చేయుచున్నవారి పేరును తెలిసికొనుటకు ప్రయత్నింపరాదను విషయమును నొక్కి చెప్పితిని. నేనింకను అతనితో నిట్లంటిని; "నే నొక గ్రామములో కమ్మరి యింట పెరిగినాను. అందువలన పెద్ద పట్టణమునకు సంబంధించిన మర్యాదలేవియును నాకు తెలియవు. కావున నేను దారి తప్పి నడచినప్పుడు నీవు నాకు మంచి సూచనలు చేసినచో నీ కెంతయు కృతజ్ఞుడనై యుందును."

"సంతోషముతో చేయుదును. కాని నీ కెప్పుడును అట్టి అవసరము రాదని నేను ఘంటాపథముగ చెప్పగలను. మనము తఱచుగా కలిసికొనుచుందుమనుటకు ఎట్టి సందేహము లేదు. మన మధ్య ఎటువంటి అరమరికలు ఉండరాదు."

"అవును." అని నేను అంటిని.

తరువాత మేము భోజనమునకు కూర్చుంటిమి. కొంచెము సేపైన తరువాత, "హావిషమ్ కన్యకు సంబంధించిన కథను చెప్పెదనని వాగ్దానము చేసియుంటివి. మఱి చెప్పుము" అని యంటిని.

"అవునవును. నా వాగ్దానము నెరవేర్చుకొందును" అని అత డనెను. మొదట నతడు చాకు, ఫోర్కు, స్పూను మున్నగు వానిని ఆహారము తీసికొను సందర్భమున ఉపయోగించు విధానమును, అట్లుపయోగించుట వలన కలుగు లాభములను వివరించి చెప్పెను.

తరువాత నతడిట్లనెను: "ఇక హావిషమ్ కన్యకు సంబంధించిన కథకు వత్తును. హావిషమ్ కన్య గారాబము వలన చెడిపోయిన బిడ్డయని నీవు గ్రహింపవలయును. ఆమెకు చిన్నప్పుడే తల్లి మరణించినది. తండ్రి ఆమెకు కావలసిన సమస్త సౌకర్యములను సమకూర్చు చుండెడివాడు. అతడు మీ ప్రాంతమునకు చెందిన గ్రామీణుడు; గౌరవనీయుడు. అతడు సారా తయారు చేయు పారిశ్రామికుడు. గౌరవనీయులు రొట్టెలు తయారుచేయు వ్యాపారము చేయరాదుగాని, సారా వ్యాపారములో పాల్గొనవచ్చును. అందువలన వారి గౌరవమున కెట్టి భంగము కలుగదు. ఈ విషయమును నీవు ప్రతిదినము గమనింపవచ్చును."

"మఱి గౌరవనీయులు సారా దుకాణము పెట్టరాదు గదా?" అని నేను అంటిని.

"అవును. పెట్టరాదు. కాని సారా దుకాణములలో గౌరవనీయులు ఉండవచ్చును. అది యటులుండనిమ్ము. తండ్రి హావిషమ్ చాల ధనికుడు, గర్వము కలవాడు. అతని కూతురు కూడ అంతియ."

"హావిషమ్ కన్య అతని ఏకైక పుత్రికయా?"

"ఆగుమాగుము. నేను ఆవిషయమునకు వచ్చుచున్నాను. ఆమె ఏకైకపుత్రిక కాదు. ఆమెకొక సవతిసోదరుడున్నాడు. ఆమె తండ్రిరహస్యముగా వంటదానిని పెండ్లియాడినాడనుకొందును."

"అతడు గర్వముకలవాడని అనుకొన్నాను."

"అవును. అతడు గర్వముకలవాడే. గర్వముకలవాడు కనుకనే ద్వితీయవివాహము రహస్యముగా చేసికొన్నాడు. ఆమెకొక కుమారుడు పుట్టినాడు. తరువాత నా రెండవభార్యకూడ చనిపోయినది. ఆమె మరణించినతరువాత తండ్రి తానుచేసినపనిని కూతురుకు చెప్పెను. అప్పుడు కొడుకుకూడ నా కుటుంబములోనివాడయ్యెను. అతడుకూడ ప్రస్తుతము హావిషమ్‌కన్య నివసించుచున్న గృహములోనే నివసింపసాగెను. ఆ కుమారుడు క్రమక్రమముగా పెరిగిపెద్దవాడయ్యెను. అతనికి అబ్బవలసిన చెడు గుణములన్నియు అబ్బెను. అతడు పూర్తిగా పాడైపోయెను. అంతట తండ్రి అతడు తనఆస్తికి వారసుడుకాడని ప్రకటించెను కాని మరణసమయమున నతడు మెత్తపడెను. హావిషమ్‌కన్యకిచ్చినంత ఆస్తినీయలేదుకాని, కుమారునకుకూడ మంచిఆస్తినే ఇచ్చెను.

హావిషమ్‌కన్య గొప్పఆస్తికి హక్కుదారురాలయ్యెను. ఆమెను వివాహము చేసికొనవలయునని పలువురు వాంఛింప సాగిరి. దుర్మార్గుడగు నామె సవతిసోదరునకుగూడ మంచిఆస్తి వచ్చెనని చెప్పియుంటినిగదా. కాని అతడు పూర్వపుదుర్గుణము లను మానుకొలేదు. అతడెప్పటివలె విచ్చలవిడిగా డబ్బుఖర్చు పెట్టసాగెను. కొంతకాలమునకు కతడెప్పటివలె బికారిఅయ్యెను. అతనికి, అతనితండ్రికి మధ్యనుండిన భేదాభిప్రాయములకంటె, అతనికి, ఆమెకుమధ్య ఎక్కువ భేదాభిప్రాయము లేర్పడెను. తన తండ్రికి తనపై కోపమేర్పడుటకు హావిషమ్‌కన్యయే కారణమని అతడు తలచుచుండెను.

ఇక కథారంగములోని కొకమనుజుడు వచ్చెను. అతడు హావిషమ్‌కన్యను అనేకరంగములలో కలసికొనుచు ఆమెపట్లతనకు గల ప్రేమను ప్రకటింపసాగెను. ఇదిజరిగి ఇరువదియు సంవత్సరమై రములైనది. అందువలన నేను అతనిని చూచియుండలేదు. కాని అతడు మంచిడాబుసరిగా నుండెడివాడని నా తండ్రి చెప్పగా విన్నాను. అతడు సరియైన గౌరవనీయుడుకాడని నా తండ్రి అభి ప్రాయము. అతడు హావిషమ్‌కన్యను వెంటాడసాగెను. ఆమెపట్ల అపరిమితమగు ప్రేమను ప్రకటింపసాగెను. అంతవరకు ఆమె ఎవ్వరిని ప్రేమించియుండలేదు. ఒక్కసారిగా ఆమె అతనిని ప్రేమింపసాగెను. ఆమె అతనినెంతిగా ప్రేమించెనో వర్ణించిచెప్పు టకు మాటలు చాలవు. ఆమె అతనిని తన హృదయపీఠమున ప్రతిష్ఠించుకొనుటకు సందేహ మణుమాత్రమైన లేదు. అతడు మాటిమాటికి ఆమెపట్ల ప్రేమను ప్రకటించుచు, ఆమెవద్దనుండి పెద్దపెద్ద మొత్తములను తీసికొనసాగెను.

అప్పటికామెకు నీకు సంరక్షకుడుగానున్న జాగర్సుసలహాదారుడుగా లేడు. ఆమె తన్ను ప్రేమించుచున్న ఆ మనుజుని గాఢముగ ప్రేమించుచుండెను. అందువలన నప్పుడామె ఇతరుల సలహాలనువిను పరిస్థితిలో లేకుండెను. ఆమెకు కొందఱు బంధువులు కలరు; వారిలో నా తండ్రి యొకడు. అతడుతప్ప మిగిలిన వారందఱును ఆమె వద్దనుండి ఏదో విధముగ ధనము సంపాదింపవలయునని చూచువారే. నాతండ్రి బీదవాడన్న మాటనిజమే. కాని అతడు అసూయపరుడుకాడు; ఏ ఎండకు ఆ గొడుగు పట్టువాడును కాడు. అతడు స్వతంత్ర భావములు కలవాడు. అందువలన నతడొకనాడు హావిషమ్‌కన్య నిట్లు హెచ్చరించెను: 'నీవు పెండ్లికాకపూర్వమే అతనికి పెద్దపెద్ద మొత్తములనిచ్చుచున్నావు. అతనికి సంపూర్ణముగా వశమై పోవుచున్నావు. ఇది ఏ మాత్రము వాంఛనీయముకాదు. ఆ విధముగ చేయవలదని, నీ మేలుకోరి, నిన్ను హెచ్చరించుచున్నాను.'

హావిషమ్‌కన్య అవకాశము చిక్కగానే తన ప్రియుని ముందు నా తండ్రిని అవమానించెను. అపరిమితమగు కోపముతో నామె, 'నా యింటినుండి వెంటనే వెళ్ళిపొమ్ము' అని ఆజ్ఞాపించెను. అంతట నాతండ్రి ఆ గృహమును వీడిపోయెను. అతడప్పటి నుండి ఇప్పటివఱకు మరల ఆయింటి గుమ్మము త్రొక్కలేదు.

అపుడు నాకు హావిషమ్‌కన్య, మత్తయినిగూర్చి అన్న మాటలు జ్ఞప్తికి వచ్చెను. తాను మరణించిన తరువాతనే మత్తయి వచ్చునని, తనతలవద్ద నిలబడునని ఆనాడు ఆమె అనియుండెను.

"నీ తండ్రి ఆమెపట్ల అంత వ్యతిరేక భావముగలవాడా?" అని నేను ప్రశ్నించితిని.

"కాదు. ఆమె తన ప్రియునిముందు నా తండ్రిని తీవ్రముగ అవమాన పఱచినది. నా తండ్రి వట్టి అసూయాపరుడట! తన ధనమును కైవసముచేసి కోవలయునని చూచుచున్నాడట! అందుకే ఆ విధముగ సలహాలిచ్చుచున్నాడట! కుట్రలు పన్నుచున్నాడట! మఱి ఆమె ఆ విధముగ అవమానించిన తరువాత మరల నా గుమ్మము త్రొక్కనిచో నామె యన్నమాటలు నిజమైనట్లేగదా!

హావిషమ్‌కన్య వివాహ దినము నిశ్చయింపబడెను. పెండ్లి దుస్తులు మున్నగునవన్నియు సిద్ధము చేయబడెను. అతిథులకు ఆహ్వానములు పంపబడెను. పెండ్లి దినము వచ్చెను. కాని పెండ్లి కుమారుడు మాత్రము రాలేదు. అతడొక ఉత్తరము వ్రాసెను-"

"దాని నామె వివాహపు దుస్తులను ధరించుచున్నప్పుడు అందుకొనెను. అప్పుడు సరిగా ఎనిమిది గంటల నలువది నిమిషము లయ్యెను" అని నే నంటిని.

"అవును. సరిగానప్పుడే. వెంటనే ఆమె తనయింటనున్న గడియారముల నన్నిటిని ఆపుజేసెను. ఆ ఉత్తరములో నేమి యున్నదో నేను చెప్పజాలను. ఏలయన నాకు తెలియదు. పెండ్లి మాత్రము ఆగిపోయెను. ఆమెకు గొప్ప జబ్బుచేసెను. ఆమె ఆ జబ్బునుండి తేఱుకొను నప్పటికి ఇల్లంతయు పాడుపడెను. నీవా పరిస్థితిని స్వయముగా చూచి యుంటివిగదా! అప్పటినుండి ఆమె సూర్య కాంతిని చూచియుండలేదు."

"కథ యంతయు నైపోయినదా?" అని యంటిని.

"నాకు తెలిసిన దంతయు నైపోయినది. దీని నంతను నేనే స్వయముగా పరిశీలించి తెలిసికొన్నాను. ఆ విషయమును నా తండ్రికూడ నాకు చెప్పడు. నన్నామె తన యింటికి ఆహ్వానించి యుండెను. అప్పుడుకూడ నాతండ్రి నాకు అవసరమైనంత వఱకు మాత్రమే చెప్పెను. అన్నట్లు నేనునీకు ఒక్కవిషయము చెప్పుట మాత్రము మఱచిపోయినాను. ఆమెపట్ల ప్రేమను ప్రకటించిన మనుజుడు, ఆమె సవతి సోదరునితో కలసియే మొదటినుండియు కుట్రను పన్నినాడనియు, అతని ప్రేమఅంతయు వట్టినటన అనియు తరువాత నందఱును అనుకొన్నారు. హావిషమ్‌కన్యవద్దనుండి సంపాదించిన ధనమును ఇరువురును పంచుకొనెడి వారట."

"మఱి అతడెందులకు ఆమెను వివాహమాడి ఆ స్తినంతను పొందలేదో నా కాశ్చర్యముగ నున్నది."

"అతడు మఱి యొకర్తను ఇదివఱకే వివాహమాడి యుండవచ్చును. మఱియు ఆమె సవతిసోదరుని సలహాననుసరించి ఆమెను తీవ్రముగ బాధ పెట్టుటకు, అవమానించుటకు ప్రయత్నించి యుండవచ్చును. నాకు మాత్ర మేసంగతియు తెలియదన్న విషయమును జ్ఞప్తియందుంచుకొనుము."

"మఱి ఆ ఇరువురు మనుజులును నేమైపోయినారు?"

"ఏమైనారు? వారు సర్వనాశనమైపోయినారు?"

"వారిప్పుడు జీవించియున్నారా?"

"నాకు తెలియదు."

"ఎస్టెలా హావిషమ్‌కన్యకు బంధువు కాదనియు, పెంచుకొన్న సంబంధమే అనియు చెప్పినావు. మఱి ఎప్పుడు పెంచుకొన్నది?"

అపుడు హెర్బర్టు భుజములు ఎగురవైచెను. "నేను హావిషమ్‌కన్య నెఱిగియున్నప్పటినుండియు నాయింట ఎట్లైలా ఉన్నది. నా కంతకంటె నేమియు తెలియదు. ఇప్పుడింక ఒక్క ముగింపు వాక్యము మాత్రము చెప్పెదను. హావిషమ్‌కన్యను గూర్చి నాకు తెలిసినదంతయు, నీకిప్పుడు తెలియును" అని అత డనెను.

"నాకు తెలిసినదంతయు నీకు తెలియును."

"నేను సంపూర్ణముగ విశ్వసించుచున్నాను. కావున నీకు నాకు మధ్య ఎట్టి భేదాభిప్రాయములేదు. నీకు సాహాయ్యము చేయువారినిగూర్చి నే నెన్నడును అడుగను. నాకు సంబంధించిన వారుకూడ ఆ విషయమునుగూర్చి ఎన్నడును అడుగరు."

అప్పుడు నాలో నేను ఇట్లనుకొంటిని: "హెర్బర్టు ఈవిధముగ చెప్పుట సముచితముగనున్నది. ఏలయన నేను మత్తయి ఇంటివద్ద ఎంతో కాల ముండవలసిన అవసరమున్నదికదా. ఇతడు ఎంతో గొప్ప అర్థముతో నే ఈవిధముగ అని యుండును. నాకు సాహాయ్యము చేయుచున్నది హావిషమ్‌కన్యయని నేను భావించుచున్నాను. ఆసంగతి ఇతనికి బాగుగా తెలియునని స్పష్టపడుచున్నది. దాని నీవిధముగ చెప్పుటకే ఈ కథనంతను చెప్పినాడు. ఇక మామధ్య ఎటువంటి అరమరికలు నుండవు."

తరువాత నేను ఇట్లంటిని: "మఱి నీవు ఏమిచేయుచున్నావు?"

"పెట్టుబడిదారును. నేకా భీమా వ్యాపారపుపని చేయుచున్నాను. పట్టణములో."

"అట్లయినా?"

"అవును నేను నాపెట్టుబడిని ఆవ్యాపారములోమాత్రమే ఉపయోగించుటతో సంతృప్తిచెందను. నేను కొన్ని జీవితభీమా షేర్లనుగూడ కొని ఆ వ్యారములో ప్రవేశింపవలయునని అనుకొనుచున్నాను. కొలదిగా గనుల వ్యాపారములోగూడ ప్రవేశింతును. నేనుగూడ కొన్నివేల టన్నుల నావలను తూర్పు ఇండియా దీవులకు పంపి పట్టు, శాలువలు, సుగంధ ద్రవ్యములు, రంగులు, మూలికలు, గంధపుచెక్క మున్నగు సరకులను తెప్పించి వ్యాపారము చేయుదును. ఆ వ్యాపారము చాల అనువైన వ్యాపారము."

"లాభము చాల ఎక్కువగా నుండునా?"

"ఎంత లాభమువచ్చునో చెప్పవలవికాదు."

అతని ఆశా సౌధములు, నా ఆశా సౌధములకంటె హెచ్చయినవని తలచితిని.

అత డింకను ఇట్లనెను: "పశ్చిమ ఇండియా దీవులనుండి పంచదార, పొగాకు, రమ్ము సారా మొదలగు వానిని తెప్పింతును. సింహళమునుండి ఏనుగు దంతములను తెప్పింతును."

"మఱి నీకు చాల నావలు కావలయునుగదా!"

"అవును. ఎన్నో నావలు కావలయును."

"నీవు భీమాచేసియుంచిన నౌకలు ఎచటెచట వ్యాపారము చేయుచున్నవి?"

"నేనింకను భీమా వ్యాపారము ప్రారంభింపలేదు. నా వ్యాపారము నేను చూచుకొనుచున్నాను."

"అట్లులనా?"

"అవును. నేను స్టాక్ ఎక్స్ఛేంజిలో పనిచేయుచున్నాను. నా సంగతి నేను చూచుకొనుచున్నాను."

"అందులో పనిచేయుట లాభకరమా ?"

"ఎవరి విషయము నీవడుగుచున్నది?"

"నీ సంగతియే"

"నాకు కాదు. ప్రత్యక్షముగ లాభకరము కాదు. అనగా నాకేమియు లభింపదు. నన్ను నేనే పోషించుకోవలయును."

"అందువలన లాభమేమియున్నది?"

"నేనచట సమయముకొరకు వేచియున్నాను. ఎప్పుడే అవకాశము వచ్చునో ఎవరికిని తెలియదు కదా? నాకు లాభదాయకమైన అవకాశము లభింపవచ్చును. అప్పుడు నాకు కావలసిన పెట్టుబడిసొమ్ము లభింపవచ్చును. అది లభించిన తరువాత నింక లోటేమున్నది? దానిని సద్వినియోగం చేయుటయే నే నింక చేయవలసిన పని."

అతని మాట లట్లున్నవి! హావిషమ్ కన్య ఇంట నాతో పోరి అతడు చిత్తుగా ఓడిపోయెను. కాని నేనే ఓడిపోతినని అతడు భావించుచుండెను. లండను మహానగరములో నివసించుచు నతడెన్నో బాధలు పడుచున్నాడనుటకు సందేహము లేదు. కాని అతడా బాధల నన్నిటిని ఎంతో సహనముతో భరించుచుండెను. అతనివద్ద సొమ్మేమియును లేదు. అతనికి కావలసిన సౌకర్యము లేవియు లేవు. ముందుముందు మంచిరోజులు వచ్చునను నాశతో నతడు జీవించుచుండెను.

సాయంకాలము మేమిరువురము నడచిపోయి లండను మహానగర వీధుల నెన్నిటినో చూచితిమి. తరువాత ఒక నాటక

శాలకు కూడ పోతిమి. మఱునాటి యుదయమున ప్రసిద్ధిగాంచిన వెస్ట్‌మినిస్టర్ చర్చికి పోతిమి. ఆనాటి సాయంకాలము ఎన్నో పార్కులను దర్శించితిమి.

సోమవారమునాటి యుదయమున ఎనిమిది గంటల నలు వదిరైదు నిముషములకు హెర్బర్ట్ స్టాక్ ఎక్చేంజికి వెళ్లెను. అతనితో బాటు నేనుకూడ వెళ్ళియుంటిని. "ఒకటి రెండుగంట లలో మన మిరువురము హామర్‌స్మిత్‌కు పోవుదము." అని అతడు నాతో చెప్పియుండెను. కాని మధ్యాహ్నము భోజనము చేసిన తరువాత మాత్రమే మేమచట నొక కోచిపై బయలు దేఱిపోతిమి. మే మాప్రదేశము చేరుకొను నప్పటికి మధ్యా హ్నము రెండు లేక మూడు గంటలయ్యెను. కోచి ఆగిన ప్రదే శము నుండి కొద్ది దూరము నడచిపోయి మేము మత్తయి గృహము చేరుకొంటిమి.

మేమిరువురము వీధిద్వారము తెఱచుకొని లోపలకు ప్రవేశించితిమి. అచ్చట నొక చిన్నతోటయుండెను. అందు మత్తయిపిల్లలు ఆడుకొనుచుండిరి. వారిని చూడగా వారికి సరి యైనపోషణ జరుగుటలేదను విషయము స్పష్టముగా అర్థమగు చుండెను.

మత్తయిసతి ఒకకుర్చీపైకూర్చుండి మఱియొక కుర్చీపై కాళ్ళు పెట్టుకొని ఏమో చదువుకొనుచుండెను. హెర్బర్టునన్నామె వద్దకు తీసికొనిపోయి, "అమ్మా! ఇతడు పిప్!" అని పరిచయము చేసెను. ఆమె నన్ను మర్యాదగా స్వీకరించెను. తరువాత నామె ఎప్పటివలె పుస్తకము చదువసాగెను.

మఱికొంత సేపటికి ఇంటిలోనుండి మత్తయి బయటకు వచ్చెను. అతడు నాతో నిట్లనెను: "నిన్ను చూచుటకు నేనంతయు సంతసించుచున్నాను. నన్ను చూచుటకు నీవు విచారించుటలేదని తలచుచున్నాను. ఏలయన నేను భయంకరమైన వాని జూడనుకొనను." కొంచెము సేపు గడచినతరువాత నతడు తన భార్యతో నిట్లనెను: "బెలిండా! నీవు వీనికి స్వాగతమొసగి నావనుకొందును" అని యనెను. అంతట నామె పుస్తకములోనుండి కన్నులుపైకెత్తి, "అవును" అని యనెను. తరువాతనామె నావంకకుచూచి, మందహాసముచేసి అసందర్భముగా నేమో ప్రశ్నించెను. నేను సమాధానమేమియు నీయలేదు.

మత్తయి నన్ను ఇంటిలోనికి తీసుకొనిపోయి, నేనుండవలసిన గదిని చూపెను. అది చాలచక్కనిగది. నేను సుఖముగ నుండుటకు కావలసిన సౌకర్యములన్నియు నందు అమర్పబడి యుండెను. తరువాత నతడు నన్ను మఱియొక గదులవద్దకు తీసికొనిపోయెను. ఆ గదులలో డ్రమ్మెల్, స్టార్ టాప్ అనువారలిద్దఱు నివసించుచుండిరి. అతడు వారినిరువురను నాకు పరిచయము చేసెను. డ్రమ్మెల్ ముసలి మొగము కలిగియున్న యువకుడు, అతడు ఈల వేయుచుండెను. స్టార్ టాప్ వయస్సులోను, చదువులలోను చిన్నవాడు. అతడు ఏదో పుస్తకము చదువుకొనుచుండెను. జ్ఞానము హెచ్చిపోయి తలగట్టిగా పట్టుకొని యుండెను.

రెండుమూడు దినములు గడచిపోయెను. ఈలోపల నేను లండనుకు పలుసార్లుపోయి తిరిగివచ్చితిని. నాకు కావలసిన వస్తువులను తెచ్చుకొంటిని.

ఒకనాడు మత్తయి నాతో దీర్ఘముగా సంభాషించెను. ఆ సందర్భమున నేనతనిని చాలవఱకు అర్థముచేసికొంటిని. మా యిరువురిమధ్య ఎటువంటి అరమరికలు లేకుండెను. నేను అతని వద్ద చదువుకొనసాగితిని. కాని ఒకనాడు నాకొక ఆలోచన వచ్చెను. నేను హెర్బర్టు నివసించుచున్నచోటనే నివసించుచు, మత్తయివద్ద చదువుకొన్నచో నెటులుండును? ఆ ఏర్పాటుచాల బాగుగనుండునని నేను తలపసాగితిని. ఆ విషయమును నేను మత్తయికి తెలిపి, "ఈ విషయమున మీ యభిప్రాయమేమి?" అని ప్రశ్నించితిని.

అప్పుడతడిట్లనెను: "నీకోరికకు అంగీకరించుటకు నాకు ఎట్టివిధమైన అభ్యంతరమును లేదు. కాని మన మేచర్యతీసికొనవలయునన్నను ముందు నీకు సంరక్షకుడుగానున్న జాగర్సు అనుమతిని సంపాదింప వలయును."

అంతట నేను ప్రయాణమైపోయి జాగర్సు గృహమును చేరుకొంటిని. జాగర్సును కలసి కొంటిని.

"ఏమి వచ్చినావు?" అని అతడు ప్రశ్నించెను.

"నేను కొన్ని వస్తువులను ఖరీదు చేయవలసి యున్నది. అప్పుడు నేను సుఖముగా జీవింపగలను."

"నీ కెంత కావలయును?"

"నా కెంత కావలయునో తెలియదు?"

"అది ఏమిమాట! చెప్పుము. ఎంత? ఏబది పౌనులు?"

"అంత కాదు."

"అయిదు పౌనులు?"

"దానికంటె ఎక్కువ."

"దానికంటె ఎక్కువయా? ఎంత ఎక్కువ?"

"ఎంతో సరిగా చెప్పజాలను."

"ఏమి? చెప్పజాలవా? రెండు ఐదులు; సరిపోవునా? మూడు ఐదులు; సరిపోవునా? నాలుగైదులు; సరిపోవునా?"

"బాగుగా సరిపోవునను కొందును."

"నాలుగైదులు బాగుగ సరిపోవును; అవునా? నాలుగైదులు ఏమి చేయునువు?"

"ఏమి చేయుదునా!"

"నాలుగైదులు ఎంత?"

"నాలుగైదులు ఇరువది చేయుదును."

"మిత్రమా! నేను ఎంతచేసిన నేమి? నీవెంతచేయుదువు?

"వెమ్మిక్! పిప్ వద్దనుండి వ్రాతమూలకమగు ఆజ్ఞను తీసికొని అతనికి ఇరువది పౌనుల నిమ్ము" అని అతడు గుమస్తాతో ననెను.

అంతట నేను వెమ్మిక్ వద్దకుపోయి ఇరువది పౌనులు కావలయునని వ్రాసియిచ్చి ఆసొమ్ము తీసికొంటిని.

తరువాత నేను హెర్బర్టుబసలో అతనితో కలసియుండి మత్తయివద్ద చదువుకొందుననను విషయమునుజాగర్సుకు తెలిపితిని. అతడందుకు అంగీకరించెను. నాటినుండి నేను హెర్బర్టు బసలోనే నివసించుచు మత్తయివద్ద చదువుకొనసాగితిని.

# 13

కొన్ని వారములు గడచిపోయెను. ఒక సోమవారము నాటి యుదయమున నాకు బిడ్డీ వద్దనుండి ఒక యుత్తరము వచ్చెను. ఆ యుత్తరములో నిట్లు వ్రాయబడి యుండెను.

ప్రియమైన పిప్,

ఈ యుత్తరమును నేను నీకు గార్జరీ కోరికపై వ్రాయుచున్నాను. అతడు వాప్సల్‌తో కలిసి లండన్ మహానగరమునకు వచ్చుచున్నాడు. నిన్ను చూచుట కనుమతి లభించినచో అతడెంతయు సంతసించును. అతడు నీ బసవద్దకు మంగళవారము నాడు ఉదయము తొమ్మిది గంటలకు వచ్చును. నీకిష్టము లేనిచో ఒక చీటీ వచ్చుట నుంచుము. పాపము, నీ సోదరి పూర్వము నీ వామెను వదలి వెళ్ళినప్పటివలెనే యున్నది. మేము ప్రతి రాత్రి వంటగదిలో నిన్నుగూర్చి మాట్లాడుకొనుచుందుము. నీవేమి చేయుచున్నావు? ఏమి మాట్లాడుచున్నావు? అను విషయములనుగూర్చి మేము ఆశ్చర్యపడుచుందుము. ఈ ఉత్తరము నీవిధముగా వ్రాసినందుకు క్షమింపుము, పిప్!

నీ ప్రియసేవకురాలు,

బిడ్డీ.

ఆ యుత్తరమును బట్టి జో మఱునాడే నన్ను కలసికొనుటకు వచ్చుచున్న విషయము అర్థమగుచుండెను. ఆ యుత్తరమును చదివినప్పుడు నాకు కలిగిన భావములు ఎట్టివి? నాకు జో ఈవద్య

గాఢమైన సంబంధమున్నది. అయినను నేనతని రాకను హర్షింపలేకుంటిని. అతనిని కలిసికొనుటకు ఆనందింపలేకుంటిని. డబ్బు పంపించినచో అతడిచ్చటికి రాకుండునుగదా? అయినను డబ్బు పంపించుటకు సిద్ధముగనే యుంటిని. అతడు హామర్‌స్మిత్‌కు గాక, హెర్బర్టు బసకే వచ్చుచున్నందున నాకొక విధముగా సంతోషముగ నుండెను. హెర్బర్టుకాని, మత్తయుకాని అతనిని చూచుటకు నాకెట్టి అభ్యంతరము లేదు. కాని డ్రమ్ముల్ చూచుట మాత్రము నాకిష్టమైన విషయముకాదు; అతడనిన నాకు సదభిప్రాయమేమాత్రము లేదు. అతనిని నేను తీవ్రముగా అసహ్యించుకొనుచుంటిని. పల్లెటూరి వాడగు జోను చూచి అతడు హేళన చేయవచ్చును.

మంగళవారము నాటి యుదయమున నేను జో కొఱకు వేచియుంటిని. సరిగా తొమ్మిదిగంటలకు మేడమెట్లమీద సవ్వడి కాసాగెను. ఎట్టకేలకు జో పైకి వచ్చెను.

"జో! నీవు క్షేమమేకద! జో!"

"పిప్! క్షేమమే! నీవు క్షేమమేకద!"

జో మొగము ఎంతో చక్కగా ప్రకాశించుచుండెను. అతడు టోపీ తీసి నేలమీద పెట్టెను. నా రెండు చేతులు గట్టిగా పట్టుకొనెను. అతని దృష్టిలో నేను దేవుడనుకాబోలు!

"జో! నిన్ను చూడగలిగినందుకు కెంతయు సంతసించుచున్నాను. ఆ టోపీ నిటు తెమ్ము. నేను పట్టుకొనెదను."

అంతట జో నేలమీదనున్న టోపీని తీసి రెండుచేతులతో గట్టిగా పట్టుకొనెను. తరువాత నిట్లనెను: "నీవు ఎంతో చక్కగా ఎదిగి పెద్దవాడవైనావు! మంచి బలిష్ఠుడవైనావు!

లా వెక్కినావు! నీ విప్పుడు గౌరవనీయునివలెనున్నావు. నీవు నీ రాజుకు, నీ దేశమునకు గర్వకారణమని నిశ్చయముగ చెప్ప గలను."

"నీవు మాత్రము! నీవు అద్భుతముగ కనబడుచున్నావు!"

"నేను భగవంతునికెంతయు కృతజ్ఞుడను. నేను పలువురు ఇతరులవలెనే బాగుగనున్నాను. నీ సోదరి పరిస్థితి మాత్రము ఇదివఱకుకంటె అధ్వానముగనున్నది. బిడ్డీ బాగుగనేయున్నది. ఆమె నాకు సాహాయ్యము చేయుట కెప్పుడును సిద్ధముగనే యున్నది. మిత్రులందఱును బాగుగనే ఉన్నారు."

తరువాత నత డింకను వాప్సల్‌కు సంబంధించిన విషయ మును తెలిపెను. వాప్సల్ నాటకములలో వేషములు వేయు చున్నాడట. అతడు వేయుచున్న నాటకమును చూచుటకే జో లండను మహానగరమునకు వచ్చియుండెను. జో నాబస నంతను పరిపరివిధముల ప్రశంసించెను!

అంతలో నచ్చటకు హెర్బర్టు వచ్చెను. నేను జోను అతనికి పరిచయము చేసితిని. జోను కలసికోగలిగి నందులకు హెర్బర్టు అపరిమితమగు సంతోషమును ప్రకటించెను.

"మీరు కాఫీతీసికొందురా? తేనీరు తీసికొందురా?" అని హెర్బర్టు జోను ప్రశ్నించెను.

"అయ్యా! నేను మీకెంతయు కృతజ్ఞుడను. మీకు ఎక్కువ ఏదిఇష్టమో అదే నాకును ఇష్టమైనది. దానినే నేను తీసికొందును."

"కాఫీ కేమందురు?"

"కృతజ్ఞుడను. మీరు దయతో కాఫీవేసు చెప్పినారు. కావున నేను మీ అభిప్రాయమునకు వ్యతిరేకముగపోను."

"అయిన తేనీరు సేవింపుడు."

అట్లని హెర్బర్టు జోకు తేనీటి నొసగెను.

"లండను నగరమునకు మీరు ఎప్పుడువచ్చినారు?" అని హెర్బర్టు ప్రశ్నించెను.

"నిన్న సాయంత్రమా నేనువచ్చినది? అహా. కాదు. అవునవును, అవును. నిన్న సాయంకాలమే వచ్చినాను."

"మఱి లండనునగరములో ఏమేని చూచినారా?"

"చూచినాను" అని యని జో తాను, వాప్స్లె కలసి చూచినవాని నన్నిటిని వివరముగా వర్ణించి చెప్పసాగెను.

మఱికొంతసేపటికి హెర్బర్టు వెళ్ళిపోయెను. హెర్బర్టు అచ్చటనున్నంతసేపు జో ముళ్ళమీద నున్నట్లుండెను. అతడు వెళ్ళిపోయినతరువాత జో ఇట్లనెను: "మనమిరువురము ఇప్పుడు ఒంటరిగానున్నాము, అయ్యా!..."

అంతట నేను మధ్యలో జోక్యముకలుగజేసికొని యిట్లంటిని: జో! నీవు నన్ను 'అయ్యా!' అని ఎందుకు పిలిచెదవు?"

అప్పుడు జో నన్నొకవిధముగాచూచి ఇట్లనెను: "మన మిరువుర మిప్పుడిచ్చట ఒంటరిగ నున్నాము. ఇక నేనిచ్చట ఎంతోసేపు ఉండుటకువీలులేదు. ఇప్పుడు నేనిచ్చటకువచ్చిన కారణమును తెలియజేసి నాపనిని ముగింతును. నేను నీకు ఉపయోగకరముగ నుండవలయునను ఉద్దేశ్యముతోనే వచ్చియున్నాను. లేనిచో నీవంటి గౌరవనీయులవద్దకు వచ్చియుండెడివాడనుగాను.

అయ్యా! నేను వచ్చినపని ఇది. నేనొకనాటిరాత్రి ఎప్పటి వలె సత్రములో కూర్చుండియుంటిని. అప్పుడు నావద్దకు పంబుల్ చూక్ వచ్చెను. అతడు నాతో నిట్లుచెప్పెను: 'జో! హావిషమ్ కన్య నిన్నొకసారి తనవద్దకు రమ్మనిచెప్పమన్నది. ఆమె నీతో ఏవో విషయములు మాట్లాడునట.' ఆ కబురువిని నేను ఆశ్చర్య పడితిని."

"హావిషమ్‌కన్య కబురుపంపినదా?"

"అవును."

"[illegible] తరువాత నేమిజరిగినది?"

"మఱునాడు నేను చక్కనిదుస్తులు ధరించి హావిషమ్ కన్యను సందర్శింపవలయునను నుద్దేశ్యముతో పట్టణమునకు పోతిని. హావిషమ్‌కన్య గృహములోనికిపోయి ఆమెను కలిసి కొంటిని. ఆమె నన్నిట్లు ప్రశ్నించెను: 'ఓయి కమ్మరీ! పిప్ సమాచారము నీకు తెలియుచున్నదా?' నీవు నాకంతకుముందు ఒక ఉత్తరము వ్రాసియుంటివిగదా. అందువలన, 'తెలియుచున్నది' అని ఆమెకు సమాధానమిచ్చితిని. అంతట నామె ఇట్లనెను: నీవు నాకు ఒకపనిచేసిపెట్టవలసియున్నది. ఎస్టెలా నా గృహమునకు తిరిగివచ్చినదనియు, ఆమె తన్నుచూచుటకెంతయు సంతోసించు ననియు అతనికి తెలియ జేయవలయును?. 'తప్పక చెప్పెదను' అని నేను వాగ్దానముచేసితిని. తరువాత నేను హావిషమ్‌కన్య గృహమును వీడి ఇంటికిపోతిని.

ఇంటికిపోయిన తరువాత నేను జరిగిన విషయమునంతను బిడ్డీకి తెలిపితిని. ఆ వార్తను నీకు ఉత్తరము ద్వారమున తెలియ జేయవలసినదని కోరితిని. కాని ఆమె ఇట్లనెను: 'ఈ విషయమును

ఉత్తరము ద్వారమున తెలియజేయుటకంటె స్వయముగాపోయి తెలిపిన నెంతయు బాగుండును. ఇవి సెలవు రోజులు. నీవతనిని చూడవలయునని గూడ కోరుకొనుచున్నావు. కావున నీవే స్వయముగాపోయి ఆ విషయమును చెప్పుట మంచిది.' నేనందుల కంగీకరించినాను. నే నిచ్చటకు వచ్చుచున్న విషయమును ముందుగా నామె నీకు వ్రాసినది. ఆమె వ్రాసిన ప్రకారము నే నిచ్చటకు వచ్చినాను. నిన్ను కలసికొన్నాను. నీకు చెప్పవలసిన విషయమును చెప్పినాను. నేను వచ్చిన పనిపూర్తి అయినది. ఇంక నేను పోయివత్తును. నే నెప్పుడును నీ క్షేమమునే కోరు కొనుచుందును, పిప్! నీవు దినదినాభివృద్ధి చెంది చాల గొప్ప వాడవగుదువని ఆశించుచున్నాను".

"ఇప్పుడు వెళ్ళిపోవుచున్నావా?"

"అవును".

"మఱి భోజనమునకు తిరిగి రావా?"

"రాను, పిప్! మిత్రమా! జీవితములో నిటువంటి వేలు పడుటలు ఎన్నో జరుగుచుండును. ఎవరి పనిని వారు చేసికొను చుందురు. కొందఱు ఇనుప పని, మఱి కొందఱు కంచు పని, ఇంకను కొందఱు బంగారపు పని, మఱి కొందఱు రాగిపని చేయు చుందురు. ఈనాడు ఏదైన లోటు జరిగియున్నచో ఆలోటు నాదే. నీవు, నేను లండను మహానగరములో కలసి తిరుగుటకు వీలులేదు. నీకు నాకు చాల భేదమున్నది. నీ వెక్కడ? సామాన్యుడనగు నే నెక్కడ? నేనిప్పు డిచ్చటకు వచ్చుటకు ఈ ప్రత్యేకమగు దుస్తులు ధరించి యున్నాను. ఇవి నాకు సరిపడవు నేను కొలిమివద్దను, పంట గదిలోను, చిత్తడి నేలలలోను మాత్రమే పనిచేవత్తును.

అవి దాటి బయటకు వచ్చినచో ఎందుకును పనికిరాను. నీకెప్పు డైన నన్నుచూడ కోరిక పుట్టవచ్చును. అప్పుడు నీవేమి చేయ వలయును? కొలిమి గది బయట నిలబడి కిటికీలోనుండి లోప లకు తొంగిచూడుము. అప్పుడు కమ్మరపు పనిచేయుచున్న నేను నీకు కనబడెదను. భగవంతుడు నీకు మేలుచేయుగాక. పిప్! భగ వంతుడు నీకు మేలుచేయుగాక."

అట్లని అతడు మెల్లన నానుదురు పట్టుకొనెను. తరువాత నతడు బయటకు వెళ్ళిపోయెను. కొంత సేపటివఱకు నేను అచేత నుడనైతిని. తెలివి వచ్చిన తరువాత నేనుకూడ వేగముగ బయటకు పోతిని. అతని కొఱకై నా సమీపప్రాంతపు వీధులన్నియు గాలించితిని. కాని అతడు ఎక్కడను కనబడలేదు. జోను సరిగా గౌరవించనందుకు నేనెంతయు పశ్చాత్తాప పడనాగితిని. కన్నీరు కార్చసాగితిని.

# 14

హావిషమ్మేకస్యను కలసికొనుటకై నేను మఱునాడు పట్ట ణమునకు బయలుదేఱిపోవలసి యుండెను. ఆ సందర్భమున నేను గ్రామములోనున్న జో ఇంటనే నివసింపవలయునని నిశ్చయించు కొంటిని. కాని తరువాత జో ఇంట నివసించు విషయమున నా అభిప్రాయమును మార్చుకొంటిని. ఆ విధముగ మార్చుకొను టకు కొన్ని కారణములను సృష్టించుకొనసాగితిని. నేను వెళ్ళి నచో జో ప్రభృతులకు అ సౌకర్యముగ నుండవచ్చును. నేను

వత్తునని వారు అనుకోరు. నాకు శయ్యసిద్ధముగా నుండదు. హావి షమ్ కన్య ఇంటికి ఆ గ్రామము చాల దూరమున నున్నది. నే నెక్కడ బసచేయుచున్నది. ఆమె అడిగి తెలిసికోవచ్చును. నేను జో ఇంట బసచేయుచున్నానను విషయము ఆమెకు ఇష్టముకాక పోవచ్చును. అందువలన నేను పట్టణములోని 'బ్లూబోర్' అను పేరుగల హోటలులో బసచేయవలయునని నిశ్చయించుకొంటిని. ఆ విధముగా నన్ను నేను మోసము చేసికొనుటకు ప్రయత్నించి తిని.

మఱునాడు రెండు గంటలకు నేను పట్టణమునకు పోవు కోచిలో ప్రవేశించితిని. అది చీకటిపడిన తరువాత రెండుమూడు గంటలకు పట్టణము చేరుకొనెను. నేను తిన్నగా 'బ్లూబోర్' హోటలుకుపోయి అచ్చట బసచేసితిని. ఆ రాత్రి నేనచ్చట భోజనముచేసి నిదురించితిని.

నేను పెందలకడ నిదురనుండి లేచితిని. కాలకృత్యములు తీర్చుకొంటిని. కాని నేను అంత పెందలకడ హావిషమ్‌కన్య ఇంటికి పోవుట బాగుండదని తలచితిని. అందువలన నేను బయటకుపోయి అటునిటు తిరుగసాగితిని. అప్పుడు నా మనస్సులోనికి ఎన్నో భావములు రాసాగెను.

హావిషమ్‌కన్య ఎస్టెలాను పెంచుకొన్నది. ఆమె నన్ను కూడ పెంచుకొనుచున్నట్లుగనే భావింపవలయును. మా యిరువురను కలుపుటయే ఆమె ఉద్దేశ్యమై యుండును. అందుకు సందేహమేమియులేదు. ఆమె ఆస్తియంతయు మాకేవచ్చును. ఇప్పుడు పాడుపడినట్లున్న గృహమును మరల ప్రకాశవంతముగ చేయు బాధ్యత నాపైననే ఉన్నది.

కొంతసేపు అటునిటు తిరిగిన తరువాత నేను హావిషమ్ కన్య గృహమువద్దకుపోయి గంట మ్రోగించితిని. అంతట నొక మనుజుడువచ్చి తలుపులు తెఱచెను. ఆ మనుజుడెవ్వరు? అతడు అచ్చట నుండునని నేను కలలోనైన నూహింపలేను.

"ఆర్లిక్!" అని నేను ఆశ్చర్యముతో నంటిని.

"అవునవును. ఇక్కడ ఎక్కువ మార్పులు వచ్చినవి. అది యటుండ నిమ్ము. లోనికి రమ్ము. నేను ఎక్కువ సేపు తలుపులు తెఱచియుంచుటకు వీలు లేదు."

అంతట నేను లోపల ప్రవేశించితిని. అప్పుడతడు ఎప్పటి వలె తలుపులకు తాళము వైచెను. పిమ్మట నతడిట్లనెను: "అవును! నే నిప్పుడు ఇచ్చట నున్నాను!"

"నీ విచ్చటకు ఎట్లు వచ్చినావు?"

"కాళ్ళమీదనడచి వచ్చినాను. పెట్టెను ఒంటి చక్రపు బండిపై తీసికొని వచ్చినాను" అని అతడు కోపముతో సమాధాన మిచ్చెను.

"ఇచ్చట నీవు మంచికే ఉన్నావా?"

"నేనిచ్చట హానిచేయుటకు లేననుకొందును."

కాని నాకతని మాటలపై నమ్మకము లేకుండెను. అతడంతకు మునుపు కోపముతో నన్న మాటలు నా చెవులలో మార్మ్రోగుచుండెను.

"అయిన నీవు కొలిమిని వదలిపెట్టి వైచితివన్న మాట?"

"ఇది కొలిమివలె కనబడుచున్నదా? ఇది కొలిమివలె కనబడు చున్నదా?"

"నీవు గార్జరీని వదలిపెట్టి ఎంతకాలమైనది?"

"ఇక్కడకు వచ్చిన తరువాత అన్ని రోజులును ఒకే విధముగా నున్నవి. అందువలన ఎప్పుడిచ్చటకు వచ్చినానో సరిగా చెప్పజాలను."

"నేను పైకి హావిషమ్‌కన్య వద్దకు పోవచ్చునా?"

"ఆ సంగతి నాకు తెలియదు. నిన్ను లోనికి ప్రవేశపెట్టుటతో నా పని పూర్తియైనది. ఇక నీకు తెలిసిన దారిని నీవు పోవచ్చును."

"నేను వత్తునని లోపలివారు అనుకొన్నారా?"

"నాకా సంగతి ఏ మాత్రము తెలియదు."

అంతట నేను ముందుకు పోతిని. ముందు నన్నొకచోట సారా కలసికొనెను. "ఓహో! నీవా! పిప్" అని ఆమె యనెను.

"అవును, నేనే. మత్తయి కుటుంబము వారందఱు క్షేమముగ నున్నారని నీకు తెలియజేయుట కెంతయు సంతసించుచున్నాను."

"వారికి తెలివి తేటలేమైన వృద్ధిచెందినవా? క్షేమముగ నుండుటకంటె తెలివితేటలు వృద్ధిచెందుట అత్యావసరము. పిప్! నీకు పైకిదారి తెలియునుగదా!" అని ఆమె అనెను.

అంతట నేను పైకిపోయి హావిషమ్‌కన్య గదిని చేరుకొంటిని. మెల్లన తట్టితిని. నా సవ్వడిని లోపలనున్న ఆమె గ్రహించెను. అందువలన నామె, "లోనికిరమ్ము, పిప్" అని యనెను.

హావిషమ్‌కన్య ఎప్పటివలె టేబులుముందున్న కుర్చీపై కూర్చుండియుండెను. ఆమె ప్రక్కనే ఒక యువతీరత్నము తల

వంచుకొని కూర్చుండి చేతనున్న హావిషమ్‌కన్య చెప్పును చూచుచుండెను.

హావిషమ్‌కన్య పైకిగాని చుట్టునుగాని చూడకుండ ఇంకను ఇట్లను చుండెను: "లోనికిరమ్ము, పిప్! ఎట్లున్నావు? పిప్! నేను రాణినైనట్లు నాచేతిని ముద్దు పెట్టుకొనుము."

హఠాత్తుగా నామె తలపైకెత్తి నావంకకు చూచెను.

"ఓహో! నీవా?"

"అవును, మిస్ హావిషమ్! మీకు నాపట్లగల అపరిమిత అభిమానముతో నన్నిచ్చటకురమ్మనమన్నారని తెలిసినది. అందువలన నేను వెంటనే ఇచ్చటకు వచ్చితిని."

"ఇంక?"

హావిషమ్‌కన్య ప్రక్కన ఒక మనోహర యువతి కూర్చుండి యున్నదనియు, ఆమె ఎవ్వరోనాకు తెలియదనియు ఇంతకుముందు చెప్పియుంటిని. ఆమె అంతలో కన్నులు పైకెత్తి నావంక చూచెను. ఆ కన్నులు ఎస్టెల్లా కన్నులనువిషయమును గ్రహించితిని. కాని ఆమె ఎంతో మారిపోయి యుండెను. ఆమె అందము ఎంతో హెచ్చెను. ఆమెలో స్త్రీత్వము హెచ్చెను. ఆమెలో ఎంతో ప్రశంసనీయమైన మార్పువచ్చెను. ఆమెలోని మార్పుతో పోల్చిచూచుకొనగా నాలోనెట్టి మార్పును వచ్చినట్లు లేకుండెను.

ఆమె తన మృదుహస్తమును నాకు అందిచ్చెను. "నిన్ను ఇంతకాలమునకు చూడగలిగినందులకు నేనెంతయు సంతసించుచున్నాను" అను నర్థము వచ్చునట్లు నేనేమో గొణిగితిని.

"పిప్! ఆమెలో నీకు అపూర్వమైన మార్పు కనబడు చున్నదా?" అని హావిషమ్‌కన్య నాతో ననెను. నన్నొక కుర్చీ మీద కూర్చుండుమను నర్థమువచ్చునట్లు ఆ కుర్చీపై తనచేతి కఱ్ఱతో కొట్టెను.

"మిస్ హావిషమ్! నేను మొదట చూచినపుడు ఆమెలో ఎస్టెలాకు సంబంధించిన ఆనవాళ్ళేవియు కనబడలేదు. కాని చూడగా అంతయు ప్రాత..."

"ఏమి? ప్రాత ఎస్టెలా వలెనే యున్నదని చెప్పబోవు చున్నావా? ఆమె యప్పుడు చాల గర్వముకలది. నిన్ను తీవ్రముగ అవమానించు చుండెడిది. ఆమెను విడిచి దూరముగా పోవల యునని నీ వప్పుడు అనుకొను చుండెడివాడవు. నీకు ఆ విషయ ములు జ్ఞాపకము లేవా?"

"మీరు ఎంతో కాలముక్రిందటిమాట చెప్పుచున్నారు. అప్పుడామె ఆ విధముగ ప్రవర్తించినమాట నిజమే."

అప్పుడు ఎస్టెలా గంభీరముగ నవ్వుచు నిట్లనెను: "అవును. నీవన్నమాట నిజమనుటకు సందేహమేమియు లేదు. అప్పుడు నేను అననుకూలముగ ప్రవర్తించుచుండెడిదానను.

"అతనిలో మార్పువచ్చినదా?" అని హావిషమ్‌కన్య ఎస్టె లాను ప్రశ్నించెను.

ఎస్టెలా నావంకకుచూచుచు, "చాల మార్పువచ్చినది" అని యనెను.

"ఇదివఱకుకంటె తక్కువ మొఱటుగానున్నాడా?" అని హావిషమ్‌కన్య ప్రశ్నించెను. ఆమె ఎస్టెలాజుట్టుతో ఆడుకొన సాగెను.

ఎస్టెలా నవ్వెను; తనచేతిలోనున్న చెప్పువంకకు చూచెను; మరల నవ్వి, నావంకకుచూచెను; చేతిలోని చెప్పును క్రిందపెట్టెను. ఆమె నన్నింకను బాలునివలెనే చూచుచుండెను. కాని నన్ను ఉవ్విళ్ళూరించుచుండెను.

ఆమె కొన్నిదినములకుముందే ఫ్రాన్సునుండి వచ్చిన దనియు, లండనుకు పోవుచున్నదనియు తెలిసికొంటిని. ఆ పగ లంతయు నేనచ్చటనే గడపవలయుననియు, రాత్రికి నా హోట లుకు పోవలయుననియు మఱునాడు లండను మహానగరమునకు పోవలయుననియు నిశ్చయింపబడెను.

మేము కొంచెముసేపు మాట్లాడుకొన్నతరువాత హావి షమ్కన్య ఇట్లనెను: "మీరిరువురును తోటలోనికిపోయికొంచెము సేపు తిరిగిరండు. పిప్! నీవు తిరిగివచ్చినతరువాత నన్ను చక్ర ముల కుర్చీపై కూర్చుండబెట్టి పూర్వము త్రిప్పినట్లు త్రిప్ప వచ్చును."

అంతట మేమిరువురము తోటలోనికిపోతిమి. అచ్చటనే నేను లోగడ పాలిపోయినయువకునితో పోరాడియుంటిని. ఆపాలి పోయిన యువకుడే ఇప్పుడు హెర్బర్టు. మేమిరువురము పోరాడిన ప్రదేశమువద్ద ఎస్టెలాఆగి ఇట్లనెను: "మీ రిరువురును ఆనాడు పోరాడుకొనుచుండగా నేను చాటునదాగుకొని చూచినాను. నేను చాల ఆనందించాను."

"తరువాత నీవు నన్ను సముచితముగ బహూకరించి యుంటివిగదా!"

ఆ విషయమును మఱచిపోయినట్లు ఆమె ఇట్లనెను: "బహూకరించితినా? అప్పుడు నేను నీతో పోరాడినవానిని తీవ్ర

ముగ అసహ్యించుకొనుచుండెడిదానను. ఏలయన అతఁడెప్పుడును నా వెంటపడి నన్ను పీడించుచుండెడివాఁడు. అది నాకు ఏమాత్ర మిష్టముండెడిదికాదు.''

"అతఁడు, నేను ఇప్పుడు గాఢస్నేహితులము."

"అటులనా? అవును, నీవిప్పుడతని తండ్రివద్ద చదువుకొనుచున్నావనుకొందును. అవునా?''

"అవును."

నేను అయిష్టముతోనే ఆ విధముగ సమాధానము చెప్పితిని. ఏలయన ఆమె నేనింకను పిల్లవాఁడనని భావించెను. ఆమె ఇప్పటికే అటులభావించుచున్నది."

"నీపరిస్థితి మాఱిపోయినప్పటినుండి, నీ స్నేహితులుకూడ మాఱిపోయినారనుకొందును.''

"సహజమేకదా!"

"అవసరముకూడ. ఒకప్పుడు నీకు తగుస్నేహితులు, ఇప్పుడు ఏమాత్రము తగరు. ఇది ముమ్మాటికి నిజము."

అప్పటికే జోను చూడవలయునను కోరిక నాలో చాలవఱకు అదృశ్యమైయుండెను. ఎస్టెలా మాటలతో నదిపూర్తిగా అదృశ్యమైపోయెను.

ఎస్టెలా కొలదిగా తనచేతి సంచినిటునిటూపుచు ఇంకను నిట్లు నేను: "నీకు ముందుముందు గొప్పఅదృష్టము పట్టనున్నదను సంగతి ఆరోజులలో నీకు తెలియునుగదా!"

''అణుమాత్రమైనను తెలియదు."

తరువాత మేము కొంచెముసేపు అటునిటు తిరిగితిమి. ఆమెను నేను జరిగిపోయిన సంఘటనలనుగూర్చి ప్రశ్నించితిని.

కాని ఆమె అన్నిప్రశ్నలకు, "నాకు జ్ఞాపకము లేదు" అని మాత్రమే సమాధానము చెప్పెను. ఎట్టకేలకు ఆమె ఇట్లనెను: "హృదయమునకు జ్ఞాపకశక్తితో సంబంధమేమైననున్నచో నాకు హృదయము లేదు. ఆవిషయమును నీవు గ్రహింపుము."

ఎస్టెల్లా చక్కనిదుస్తులను ధరించియుండెను. ఆమెయొక చేతితో నేలనానుకొనుచున్న దుస్తులను పైకెత్తి పట్టుకొనెను. రెండవచేతితో మెల్లన నాభుజమును పట్టుకొనెను. ఆవిధముగా మేమాతోటలో నడవసాగితిమి. మేము పాడుపడిన తోట చుట్టును రెండుమూడుసార్లు తిరిగితిమి. అది నాకెంతయు ఆనందకరముగ నుండెను.

మా యిరువురకుమధ్య వయస్సులో ఎంతో తేడా లేదు. అందువలన నామె నాకుదక్కకుండ పోవునను భయము లేదు. మేమిరువురము కొంచెమించుమించుగా ఒకేవయస్సువారమని చెప్పవచ్చును. కాని వయస్సు ఆమెలో స్పష్టముగా కనబడు చుండెను. ఆమె నాకొఱకే నిర్ణయింపబడినదనియు, నా పరిధిని దాటిపోలేదనియు నేను నిశ్చయించుకొంటిని.

ఎట్టకేలకు మేమిరువురము ఇంటిలోనికి తిరిగిపోతిమి. ఏదోపనియుండి నా సంరక్షకుడగు జాగర్సు, హావిషమ్ కన్యను చూచుటకు వచ్చినాడని తెలిసికొని ఎంతయు ఆశ్చర్యపడితిని. అతడు భోజనమునకు తిరిగివచ్చునని కూడ తెలిసికొంటిని. హావిషమ్‌కన్య చక్రములకుర్చీలో కూర్చుండి నా కొఱకు వేచి యుండెను. నేనా చక్రముల కుర్చీని గదిచుట్టును పూర్వమువలె త్రిప్పసాగితిని. అదృశ్యమను మనోహర యువతీరత్నము ఎస్టెల్లా

తిలకించుచునేయుండెను. ఆమె అంతకంతకు ఎక్కువ అందమైనదిగా కనబడసాగెను.

భోజనసమయము ఆసన్నముకాసాగెను. అందువలనతగిన ఏర్పాట్లుచేయుటకై ఎస్టెలా గదిని వీడిపోయెను.

ఎస్టెలా వెళ్ళిపోయిన తరువాత హావిషమ్‌కన్య నాతో మెల్లగనిట్లనెను: "ఆమె అందముగనున్నదా? మనోహరముగ నున్నదా? చక్కగా ఎదిగినదా? నీవామెను ప్రశంసించుచున్నావా?"

"మిస్ హావిషమ్! ఆమెను చూచువారందఱును తప్పక ప్రశంసింపవలయును. అందుకు సందేహమేమాత్రములేదు."

హావిషమ్‌కన్య నామెడచుట్టు చేయి వేసి నాతలను తనతల దగ్గఱకులాగి ఇట్లనెను: "ఆమెను ప్రేమింపుము! ఆమెను ప్రేమింపుము! ఆమెను ప్రేమింపుము! ఆమె నిన్నెట్లుపయోగించుచున్నది?"

నేనింకను సమాధానము చెప్పకపూర్వమే ఆమె ఇట్లనెను: "ఆమెను ప్రేమింపుము! ఆమెను ప్రేమింపుము! ఆమెను ప్రేమింపుము. ఆమె నీకనుకూలముగ నున్నచో, ఆమెను ప్రేమింపుము. ఆమె నిన్ను గాయపఱచుచున్నచో, ఆమెను ప్రేమింపుము. ఆమె నీహృదయమును ముక్కలు, ముక్కలు చేయుచున్నచో ప్రేమింపుమామెను! ప్రేమింపుమామెను! ప్రేమింపుమామెను!"

ఆమె ఆమాటలను ఎంతో ఉద్రేకముతోను, ఉద్వేగముతోను అనుచున్నట్లు గ్రహించితిని.

ఆమె యింకను ఇట్లనెను: "నామాటవినుము, పిప్! ప్రేమింపబడుటకే నేనామెను పెంచుకొన్నాను. ప్రేమింపబడుటకే నేనామెను పెంచినాను; విద్యాబుద్ధులు చెప్పించినాను. ప్రేమింపబడుటకే ఆమె నీవిధముగ అభివృద్ధిలోనికి తీసికొనివచ్చినాను. ఆమెను ప్రేమింపుము. నిజమైన ప్రేమ ఎట్టిదో చెప్పెదను వినుము. అది గ్రుడ్డి భక్తి, ఏ విధముగను ఎదురు ప్రశ్న వేయకుండ సంపూర్ణముగ లొంగిపోవలయును. పూర్తిగ నమ్మవలయును. ఎవ్వరేమి చెప్పినను సరే వ్యతిరేకభావమును ఏర్పాటు చేసికోరాదు. వేయేల? మాఱు మాటాడకుండ నీ హృదయమును, ఆత్మను అర్పించుకోవలయును. నేనావిధముగనే చేసియుంటిని. నీవు కూడ ఆ విధముగనే చేయవలయును."

అట్లని ఆమె కేకపెట్టి హఠాత్తుగా లేచినిలబడెను. అప్పుడు నేనామెను గట్టిగా పట్టుకొంటిని. అది యంతయు కొన్ని సెకనులలో జరిగిపోయెను. నేనామెను మరల కుర్చీపై కూర్చుండబెట్టితిని.

అంతలో ఆ గదిలో ఎవ్వరో క్రొత్తవారు ప్రవేశించినట్లు వాసన వేయసాగెను. నేను వెనుకకు తిరిగి చూచితిని. నా సంరక్షకుడగు జాగర్సు ఆ గదిలో ప్రవేశించి యుండెను. హావిషమ్ కన్యకూడ అతనిని చూచి ఎంతయు భయపడెను. ఏమియు జరుగనట్లుండుట కామె ప్రయత్నింపసాగెను. "మీరు చెప్పిన సమయమునకు సరిగా వచ్చినారు" అని మాత్రమామె గొణిగెను.

నేనెప్పుడును అన్న సమయమునకేవత్తును.పిప్! నీవిక్కడనున్నావన్నమాట!"

"ఇచ్చటి కొకసారివచ్చి ఎస్టెలాను చూచి పోవలసినదని హావిషమ్‌కన్య నాకు కబురు పంపినది. ఆమెను మన్నించుటకై నేనీ పట్టణమునకు నిన్న వచ్చియున్నాను. ఇచ్చటికీ యుదయమే వచ్చి యున్నాను," అని నేనంటిని.

"అవును! చాల చక్కని యువతి!" అని అతడనెను.

అతడొక కుర్చీపై కూర్చుండి ఇంకను నిట్లనెను: "పిప్! నీవిదివఱకు ఎస్టెలాను ఎంత తఱచుగా చూచి యున్నావు?"

"ఎంత తఱచుగా?"

"ఓహో! ఎన్నిసార్లు? వేయిసార్లు?"

"కాదు అన్నిసార్లు కాదు".

"రెండుసార్లు?"

కాని నా అదృష్టవశమున హావిషమ్‌కన్య అంతలో జోక్యము కలుగ జేసికొని ఇట్లనెను: "జాగర్స్! పిప్ను సంతటితో వదలివేయుడు. మీరు ఇరువురును కలసి భోజనమునకు పొండు."

జాగర్సు ఆమె కోరికను మన్నించెను. మేమిరువురము ఆ గదిని వీడి చీకటిలో క్రిందకు దిగిపోసాగితిమి. త్రోవలో నతడు నన్నిట్లు ప్రశ్నించెను: "హావిషమ్‌కన్య భోజనము చేయుచుండగా నీవెన్నిసార్లు చూచి యున్నావు? ఒకటికి, నూటికి మధ్య ఎన్నిసార్లు చూచి యున్నావు?"

నేను ఆలోచించి ఇట్లంటిని: "ఎప్పుడును చూచి యుండలేదు."

"ఇక నెప్పుడును చూడకుము. ఆమె కఠోర జీవితమును ప్రారంభించిన తరువాత, ఆ పని చేయు చుండగా చూచిన వారె

వ్వరును లేరు. ఆమె రాత్రి సమయములందు అటునిటు తిరుగుచు తన కిచ్చ వచ్చిన వానిని భుజించునట."

"అయ్యా! నేను మిమ్ముల నొక ప్రశ్న వేయవచ్చునా?"

"వేయవచ్చును. నేను దానికి సమాధానము చెప్పుటకు నిరాకరింపవచ్చును. ఏదీ నీ ప్రశ్న?"

"ఎస్టెలా పేరు హావిషమా లేక—?"

"లేక ఏమి?"

"అది హావిషమా?"

"అవును. హావిషమే."

తరువాత మేమిరువురము భోజనశాల చేరుకొంటిమి. అచ్చట ఎస్టెలా, సారా లిరువురు మాకొఱకు వేచియుండిరి. ప్రధాన అతిథి స్థానము నాక్రమించెను. నేను, సారా ఎదురెదురుగా కూర్చుంటిమి. మేము భోజనము చేయసాగితిమి. ఆ సందర్భమున నాకు జాగర్సుకు సంబంధించినది కొన్ని విషయములు చాల బాగుగ తెలిసెను. అతడా సమయమున ఒక్కసారియైన ఎస్టెలావంకచూడలేదు. ఎస్టెలా మాట్లాడించినపుడతడు సావధానముగ ఆలకించెడివాడు, జవాబు చెప్పెడువాడు. కాని ఒక్కసారియైన నతడామె మొగము చూడలేదు. ఆమె మాత్రమతని మొగమువంక ఎంతో ఉత్సాహముతోను, కుతూహలముతోను చూచుచుండెడిది.

భోజనము పూర్తియైన తరువాత ఇరువురు స్త్రీలును వెళ్ళిపోయిరి. ఇక నచ్చట పురుషుల మిరువురము మాత్రము మిగిలి యుంటిమి. కాని అతడు నాతో నేమియు మాట్లాడకుండెను. అతడు ద్రాక్ష సారాయము సేవించుచు కూర్చుండెను.

నేను మూడు నాలుగుసార్లు సంభాషణము ప్రారంభించుటకు ప్రయత్నములు చేయసాగితిని గాని లాభము లేక పోయెను.

"నీవు ప్రశ్నలు వేయుటవలన లాభమేమియు లేదు. నేను సమాధానములు చెప్పను" అను నర్థము వచ్చునట్లు అతడు ప్రవర్తింపసాగెను.

కొంతసేపటికి మేమిరువురము హావిషమ్‌కన్య గదిలోకి పోతిమి. అచ్చట నలుగురము రాత్రి పది గంటలగువఱకు పేకాట ఆడితిమి. పేకాట పూర్తియైన తరువాత హావిషమ్‌కన్య నాతో నిట్లనెను: "త్వరలోనే ఎస్టెలా లండను నగరమునకు చేరుకొనును. ఆమె చేరుకొను సరియైన సమయమును ముందుగా నీకు తెలియజేయుదును. నీ వామెను కోచివద్ద కలసికో వలయునని కోరుచున్నాను."

"అటులనే చేయుదును" అని నేను అంటిని.

తరువాత నేను ఎస్టెలావద్ద సెలవుతీసి కొంటిని. ఆమెను తాకితిని. పిమ్మట నామెను విడిచిపెట్టి వెళ్ళితిని. నా సంరక్షకుడు జాగర్సుకూడ 'బ్లూబోర్' హోటలుకే వచ్చెను. అతడు నా గదికి ప్రక్కనున్న గదిలోనే బసచేసెను. నాటిరాత్రి యంతయు, "ఆమెను ప్రేమింపుము! ఆమెను ప్రేమింపుము! ఆమెను ప్రేమింపుము!" అన్న హావిషమ్‌కన్య మాటలు నా చెవులలో మార్మ్రోగసాగెను. నేను నా తలగడవంకకు తిరిగి, "నేనామెను ప్రేమించు చున్నాను! నేనామెను ప్రేమించుచున్నాను! నేనామెను ప్రేమించుచున్నాను!" అని వందలకొలదిసార్లు అనసాగితిని. ఒకప్పుడు నేను కమ్మరి బాలుడను. కాని ఆమె కొఱకే నిర్ణయింపబడి యున్నది. అందుకు నేను భగవానున కెంతయు కృతజ్ఞుడను.

కాని ఎస్టెలా ఇంకను ఆవిధముగ భావించుట లేదని నేను అభిప్రాయ పడుచున్నాను. మఱి ఆమెలోగూడ నట్టి భావమెప్పుడు కలుగును? ఆమె నాపట్ల అభిమానము నెప్పుడు ప్రకటించును? నా మంచి చెడ్డలనుగూర్చి ఆమె ఎప్పుడు ఆలోచించును? ఆమె హృదయమింతవఱకు నిదురించు చున్నది. దానిని నే నెప్పుడు మేల్కొల్ప గలను?

అవి నా ఉన్నత భావములు! నా ప్రియ మిత్రుడు జోకు సంబంధించిన భావము లేవియు నా మనస్సులోక రాలేదు నే నతని సంగతిని తలంచుకొన్నచో ఎస్టెలా నన్ను నీచముగ చూచు నని నేను భయపడు చున్నాను కాబోలు! లండను నగరమునకు వచ్చిన జోను చూచి కన్నీరు కార్చితిని. కాని ఆ కన్నీరు అప్పుడే ఎండి పోయినది. సహృదయుడు, నా శ్రేయోభిలాషి యగు జోను కలసికొన కుండగనే లండను మహానగరమునకు పయనమై పోవలయునని నిశ్చయించు కొంటిని.

మఱునాటి యుదయమున నేను నిదురనుండి లేచితిని. అప్పుడు నేను నా సంరక్షకుడగు జాగర్సుతో నిట్లంటిని: "అయ్యా! హావిషమ్‌కన్య గృహమున ఆర్లిక్ ప్రవేశించినాడు. అతడు నమ్మకమైన స్థానమున నున్నాడు. కాని అతడు నమ్మ దగినవాడేమాత్రము కాడు. అతడు పట్టి దుర్మార్గుడు. పొగరు బోతు అతడచ్చట నుండుటకు సరియైనవాడు కాడు."

అంతట జాగర్సు ఇట్లనెను: "అవును, పిప్! అతడు సరియైనవాడు కాడు. కాని ఆలోచించి చూడగా ఏ మనుజుడును సరియైనవాడు కాడని తోచుచున్నది."

అప్పుడు ఆర్లిక్ కు సంబంధించిన పూర్వ చరిత్ర నంతను నే నతనికి వివరించి చెప్పితిని. అతడు నా కథనము నంతను సావధానముగా నాలకించెను. తరువాత అతడు ఇట్లనెను: "మంచిది ఈ విషయమును తెలిసికొనుట మేలైనది. నేనిప్పుడే అటుపోయి, అతనిని పంపించివైచెదను."

"అతడంత సులభముగా వెళ్ళిపోవునని నేను అనుకొనను. సులభముగా వెళ్ళిపోవుట అతని స్వభావము కాదు" అని నేనతనిని హెచ్చరించితిని.

కాని జాగర్సు ఇట్లనెను: "ఆ విషయమేమో నేను చూతును. అతడు నాతో తగవు పెట్టుకొన్నచో, తన సర్వనాశనమునకు పునాది వేసికొనుచున్నాడన్నమాట."

# 15

నేను లండను మహానగరమునకు పోవు మధ్యాహ్నపు కోచిలో ప్రవేశించితిని. జాగర్సుగారు అదే కోచిలో ప్రయాణము చేయుచుండెను. నేను సురక్షితముగ లండను మహానగరము చేరుకొంటిని. కాని నేను హృదయము లేనివాడనైతిని నా హృదయము మాయమైపోయెను.

నేను కోచిలోనుండి క్రిందకు దిగితిని. తరువాత నా బస చేరుకొంటిని. నేను పోవునప్పటికి హెర్బర్టు మాంసము భుజించు

చుండెను. నన్ను తిరిగి చూడగలిగినందులకతడు అపరిమితమగు సంతోషమును ప్రకటించెను. నా మనస్సులోని విషయము సంతను అతనికి విప్పిచెప్పవలయునని నేను నిశ్చయించుకొంటిని. నేనుకూడ భోజనము చేసితిని.

భోజనము పూర్తియైన తరువాత మేమిరువుర మొకచోట కూర్చుంటిమి. అపుడు నేను హెర్బర్టుతో ఇట్లంటిని: "నా ప్రియమైన హెర్బర్టు! నేను నీకు చాల ముఖ్యమైన విషయము నొక దానిని చెప్పవలసి యున్నది."

"ప్రియమిత్రమా! నీవు నాయందు నమ్మకముంచి ముఖ్యవిషయము చెప్పదలచి నందులకెంతయు సంతసించు చున్నాను."

"అది నాకు, మఱియొకరికి సంబంధించిన విషయము."

నేను నా చేతి నతని మోకాలిపై పెట్టి ఇట్లంటిని: "హెర్బర్ట్! నేను ఎస్టెల్లాను ప్రేమించుచున్నాను! ఆరాధించు చున్నాను."

ఆ వార్త అతని కెట్టి ఆశ్చర్యమును కలిగింపలేదు. అతడు నిశ్చేష్టుడు కాలేదు. అతడు ఎంతో ప్రశాంతముగ నిట్లనెను: "బాగున్నది తరువాత?"

"హెర్బర్ట్! నీవు చెప్పవలసిన దదియేనా?"

"నాకావిషయ మిదివఱకే తెలియును."

"నీ కిదివఱకే ఎట్లు తెలియును?"

"నా కెట్లు తెలియును? నీనుండియే తెలిసికొన్నాను."

"నేను నీ కిదివఱ కెన్నడును చెప్పియుండలేదే?"

"చెప్పుటయా? నీవు నాకెన్నడును సూటిగా చెప్పియుండని మాట నిజమే. కాని ఆ విషయమును గ్రహింపగలిగినంతటి తెలివితేటలు నాకున్నవి. నీవామె నెప్పుడును ఆరాధించుచునే యున్నావు. నిన్ను నేను ఎఱిగియున్నప్పటి నుండియు నాకా విషయము తెలియును. నీవు నీ ఆరాధనను పెద్దైను కలిపియే ఇచ్చుటకు తీసికొని వచ్చినావు. చెప్పుటయా! నీవు నాకు ఆ విషయమును రోజంతయు చెప్పియుండవచ్చును. నీవు నీ కథను నాకు చెప్పినావు కదా! నీవు మొట్టమొదట ఆమెను చూచినప్పుడే ఆరాధింప ప్రారంభించినావు. అప్పటికి నీవు చాల చిన్నవాడవు."

"మంచిది. నేనామెను మొదటినుండియు ఆరాధించుచునేయున్నాను. నేనా ఆరాధనను ఎన్నడును విడచిపెట్టియుండలేదు. ఇప్పుడామె ఎంతో మనోహరమైన, అందమైన యువతిగా విదేశముల నుండి తిరిగివచ్చినది. ఇదివరకు నేనామెను ఆరాధించుచుంటిని. ఇప్పుడు నేనామెను ద్విగుణీకృతముగ ఆరాధించుచున్నాను."

"నీవు చాలా అదృష్టవంతుడవు. నిన్ను నాకు ఎన్నుకొని, ఆమెను నీకు నిర్ణయించుట నీ అదృష్టమేనని చెప్పవలయును. ఇతరుల వ్యవహారములలో జోక్యము కలుగజేసికొనుచున్నానను భయము లేకుండ నేనొక విషయము చెప్పుచున్నాను. నీవు ఆమెకొఱకు, ఆమె నీకొఱకు నిర్ణయింపబడ్డారు. అందుకు సందేహమేమియు లేదు. కాని ఒక్కమాట. ఈ ఆరాధన సమస్యపై ఎస్టెలాకు గల అభిప్రాయము ఏట్టిదో నీకేమైనా తెలియునా?"

అంతట నేను నిరుత్సాహముగా తల ఊపి "ఆమె నాకు వేలకొలది మైళ్ళ దూరమున నున్నది" అని యంటిని.

"మిత్రమా! సహనము కలిగియుండుము. కావలసినంత కాలమున్నది. నీవింకను ఏమో చెప్పదలచుకొన్నట్లున్నది?"

"ఆవిషయము చెప్పుటకు నేనెంతయు సిగ్గుపడుచున్నాను. కాని దానిని మనసులో నుంచుకొనుట కంటె పైకి చెప్పుటయే మేలని తోచుచున్నది. నేను అదృష్టవంతుడనని నీవు చెప్పు చున్నావు. అవును, నేను అదృష్టవంతుడనే, నిన్న నేను కమ్మరి బాలుడను. మఱి నేడు నేను — మఱి నేడు నేను — ఏమని చెప్పుదును?"

"మంచివాడను నేను అని చెప్పుము. నీలో అనేక గుణ ములు కలిసియున్నవి. అనేక మంచి గుణములున్నవి."

"నేను అదృష్టవంతుడనని నీ వింతకుముందు చెప్పి నావు. కాని ఉన్నతస్థితికి వచ్చుటకు నేను చేసిన కృషి ఆవగిం జంత యైనను లేదు. అదృష్ట దేవతయే పాతాళలోకమున నున్న నన్ను పైకి లేవదీసినది. మఱి నిజముగా నది అదృష్టమే. కాని నేను ఎస్టెలాను గూర్చి ఆలోచించి నప్పుడు, ఇతరులపై ఆధా రపడి యున్నానను విషయము జ్ఞప్తికివచ్చును. పాత్రలోనిమధుర ద్రాక్ష సారాయమును సేవించులోపల ఏదేని దుస్సంఘటన జరుగవచ్చును గదా! రహస్య విషయముల జోలికి పోకుండగనే నిప్పుడొక విషయము చెప్పెదను. ఒకరి ఇచ్ఛల బుద్ధిపై నా భవిష్యత్తంతయు నాధారపడియున్నది. నేను ఆశాసౌధా గ్రమును చేరుకోగలనా? లేనా? ఈ ప్రశ్నకు ఎవరు సమాధా నము చెప్పగలరు? అదిఅంతయు ఒకరిఇచ్ఛాబుద్ధిపై నాధారపడి

యున్నది. నా భవిష్యత్తును స్పష్టముగా కనబడకుండుట ఎంత అసంతృప్తికరముగను, నిరాశాజనకముగను నున్నది."

"మిత్రమా! నీవు నిరాశచెందవలసినపని ఏమాత్రము లేదని నేను నిశ్చయముగ చెప్పగలను. ఒకయువతి అందమును మనకన్నులతోనే చూడవలయును. కాని భూతఅద్దము నుపయోగించిచూచిన నేమికనబడును? శరీరమంతటను కన్నములున్నట్లు కనబడును. మనమేదేని గుఱ్ఱమును ఖరీదుచేయదలచి నపుడు సూక్ష్మపరీక్షను పూనుకొందుము. అటులచేయుటలో దానిలోని మంచిగుణములను గమనింపనే గమనింపము. ఒకవేళ గమనించినను ఉపేక్షాభావముతో చూతుము. నీపరిస్థితికూడ అట్లేయున్నది. నీ భవిష్యత్తునుగూర్చి మొదటనే జాగన్నగట్టిగా నమ్మబలికినాడని నీవు చెప్పియుంటివిగదా? జాగన్న నమ్మకము లేనిపనులు చేయడు. అతనికి గట్టినమ్మకమున్నది కనుకనే నీకు సంరక్షకుడుగానుండు బాధ్యతను స్వీకరించినాడు. ఇంతకంటె హామీ నీకేమికావలయును?"

"అవునవును. ఇది బాగుగనేయున్నది. ఈ విషయమును నాకు జ్ఞప్తికి తెచ్చినందుకు నేను నీకెంతయు కృతజ్ఞుడను."

"మంచిది. నీవు సమయముకొరకు వేచియుండవలయును. త్వరలోనే నీఇరువదియొకటవ జన్మదినోత్సవము రానున్నదికదా. ఆలోపల అసలువిషయము చాలవఱకు నిర్ణయము కావచ్చును. నీవు విజయమును సాధించుటతప్పదు. ఆ విజయ చిహ్నములు త్వరలోనే కనబడునని నేను ఆశించుచున్నాను."

"నీఅభిప్రాయము చాలబాగున్నది. నీ ఉత్సాహము కడుంగడు ప్రశంసనీయమైనది" అని నేను అంటిని.

"అవునుమఱి. నాకు ఉత్సాహముతప్ప మఱియింక నేమి యున్నది? అదియుగాక నేను వెలిపుచ్చిన అభిప్రాయములు నా స్వంతముకావు. వానిని నాతండ్రివద్దనుండి నేర్చుకొన్నాను. అతడు నీకథనుగూర్చి ఈవిధముగఅన్నాడు: "విషయముసంపూర్ణముగ నిర్ణయమైపోయినదని నమ్మవచ్చును. లేనిచో జాగర్సు ఈవిషయములో జోక్యము కలుగజేసికొనియుండెడివాడు కాడు." అది యటుండనిమ్ము. ఒక్క-క్షణకాలము నేను నీకు వ్యతిరేకముగ మాట్లాడవలచుకొన్నాను.''

"నీవంతు విజయము సాధింపలేవు.''

"నేను తప్పక విజయముసాధింతును. ఒకటి, రెండు, మూడు. నామనస్సులోని విషయము చెప్పెదను. మన మీా విషయమునుగూర్చి మాట్లాడుకొనుచున్నప్పటినుండి నేనొకసంగతి ఆలోచించుచున్నాను. నీసంరక్షకుడు జాగర్సునీతో ఎస్టెలా విషయము నెన్నడును ముచ్చటించియుండలేదుగదా. దానినిబట్టి చూడగానీవు ఆస్తినిపొందుటకు ఎస్టెలాను వివాహముచేసుకోవలయునను షరతులేదని స్పష్టముగా తెలియుచున్నది. నీవునాకు చెప్పినదానినిబట్టి నీసంరక్షకుడు సూటిగాగాని, పరోక్షముగాగాని ఎస్టెలాపేరు నెప్పుడును తెచ్చియుండలేదని నేను ఊహించుచున్నాను. నా యూహ నిజమైనదేనా? అసలత డెప్పుడును నీ వివాహ ప్రసక్తిని తెచ్చియుండలేదుకదా!"

"ఎప్పుడును ఆ ప్రసక్తి రాలేదు."

"మఱి ఆస్తిని పొందవలయునన్నచో నీవామెను వివాహము చేసికొని తీఱవలయునను షరతు లేదుకదా. అటువంటి సందర్భమున నీవామెను ఆరాధించుట మానుకొనుట సముచిత

ముగ నుండునుకదా ? నేను నీకు వ్యతిరేకముగ మాట్లాడుదునని ఇదివఱకే చెప్పియున్నాను."

నేనేమియు మాట్లాడక తల ప్రక్కకు త్రిప్పుకొంటిని.

హెర్బర్ట్ ఇంకను ఇటుల చెప్పసాగెను: "హావిషమ్ కన్యను గుఱించి ఆలోచింపుము. ఆమె ఎస్టెలాను ఎట్లు పెంచినదో ఆలోచింపుము. ఎస్టెలా సహజముగ నెట్టిదో ఆలోచింపుము. ఆమెను వివాహము చేసికొన్నచో నీవు దుస్థితిలో పడవచ్చును."

"హెర్బర్ట్ ! నాకావిషయములన్నియు తెలియును. కాని నేనేమియు చేయజాలను."

"నీ వామెను విడిచిపెట్టలేవా ?"

"లేను. విడిచిపెట్టుట అసాధ్యము."

"ప్రయత్నించి చూడలేవా ?"

"అసాధ్యము."

"మంచిది. ఇక నేను నీకు అనుకూలముగను, నీమనస్సుకు నచ్చునట్లుగను మాట్లాడుటకు ప్రయత్నింతును."

"మంచిది."

అంతట హెర్బర్ట్ తనకుటుంబమునకు సంబంధించిన కొన్ని వివరములను చెప్పెను. ఆ సందర్భమున అతని సోదర సోదరీల వివాహ ప్రసక్తిగూడ వచ్చెను. అప్పుడు నే నతనితో నిట్లంటిని: "నీకు నేదేని వివాహ సంబంధము కుదిరినదా ?"

"కుదిరినది. కాని అదియంతయు గోప్యమైనవిషయము."

"నీవు నాతో ఆ రహస్యమును చెప్పుటకు భయపడవలసినపని యేమాత్రమును లేదు. నేను నీ రహస్యమును రహ

స్యముగనే యుంచెదను. కావున దయయుంచి నీ ప్రధానము నను సంబంధించిన వివరములను తెలియజేయ వలసినదిగా ప్రార్థించుచున్నాను.''

అతడు నా మానసిక బలహీనతనుగూర్చి మాట్లాడి యుండెనుగదా ! అతని మానసికబలమెట్టిదో తెలిసికొనవలయు నని నేను కుతూహలపడసాగితిని. అతడు నా ప్రశ్నలకు సముచిత మగు సమాధానముల నొసగుటకు అంగీకరించెను.

''నీ ప్రియురాలి పేరు ఏమో అడుగవచ్చునా ?''

''పేరు క్లేరా''

''లండనులో నివసించుచున్నదా ?''

''అవును. నా తల్లికి నేను పెద్దకుటుంబమునకు చెందిన అమ్మాయిని వివాహము చేసికొనవలయునను అభిప్రాయము కలదు. కాని ఆమె తండ్రి సామాన్యుడు. ఒకప్పుడతడేదో సామాన్యవ్యాపారము చేసినాడు.''

''మఱి యిప్పుడతడు ఏమిచేయుచున్నాడు ?''

''ఇప్పుడతడు ఏపని చేయలేని అనారోగ్య స్థితిలో నున్నాడు.''

''మఱి జీవనము —''

''మొదటి అంతస్తుమీద'' అని హెర్బర్టు అనెను. అత డెక్కడ నివసించుచున్నాడని నేను అడిగియుండలేదు. అతడెట్లు జీవనము గడుపుచున్నాడని నేను అడుగబోతిని. కాని అతడా సమాధానము చెప్పెను. అతడింకను నిట్లనెను: ''నేనతని నెన్న డను చూచి యుండలేదు. క్లేరా నెఱిగిన తరువాతకూడ అతనిని

చూచి యుండ లేదు. కాని అతని మాటలను మాత్రము చాల నాళ్లు విన్నాను."

"మఱి నీవతనిని చూడవలయునని కోరుకొనుట లేదా?"

"ఎందుకు కోరుకొనుట లేదు? కాని అతనిని చూచుటకు అవకాశము లభించుట లేదు."

పిమ్మట నతడు పొట్టచెక్కలగునట్లు నవ్వెను. తరువాత నతడింకను నిట్లనెను: "నేను ఇప్పుడు పెట్టుబడి సొమ్ముకొఱకు వేచి యున్నాను ఆసొమ్ము చిక్కగానే నేనా యువతీరత్నమును వివాహము చేసికొనవలయునని నిశ్చయించు కొన్నాను. నా సంగతి నే నిప్పుడు చూచుకొను చున్నాను. ఇటువంటి పరిస్థితిలో వివాహము చేసికొనుట సాధ్యమగు విషయముకాదు గదా."

"అవును."

"నా ప్రియురాలు నీ నామమును ఇదివఱకే వినియున్నది. నేను నిన్నామెకు పరిచయము చేయవలయునని అనుకొను చున్నాను."

హెర్బర్టుకు నామీద నెంతో నమ్మిక యున్నది. నాకు అతనిమీద ఎంతో నమ్మకమున్నది. అందువలననే మా రహస్య ప్రణయ గాథలను చెప్పుకొంటిమి. తరువాత కరచాలనము చేసికొంటిమి.

అటు పిమ్మట మే మిరువురము వాప్సల్ నటించుచున్న నాటకమునకు పోతిమి. ఆ నాటకము ఏమియు బాగుండలేదు. నాటకమైపోయిన తరువాత మే మతనిని మా యింటికి భోజనమునకాహ్వానించితిమి. భోజనమైపోయిన తరువాత నతడు మాకు తన భవిష్యత్కార్యక్రమమును వివరించి చెప్పెను.

నాయొక్క కళోద్ధరణయే తన ధ్యేయమని అతడు ఉద్ఘాటించెను. తరువాత నతడు తన దారిని వెళ్ళిపోయెను. మిగిలిన మే మిరువు రము నిమరింప బోతిమి.

# 16

ఒకనాడు నేను నా పుస్తకములను చదువుకొనుటలో నిమగ్నుడనై యుంటిని. అంతలో నాకొక యుత్తరము వచ్చెను. దాని పై భాగమును చూచినంత మాత్రముననే నేను కలతపడి తిని. నే నిదివఱకు ఆ వ్రాత ఎవ్వరిదో ఎఱిగియుండనిమాట నిజమే. కాని దానిని చూడగనే నా కొకరిపేరు హఠాత్తుగా తట్టెను.

ఆ ఉత్తరములో నిట్లుండెను:

నేను ఎల్లుండి మధ్యాహ్నపు కోచిలో లండను మహా నగరమునకు వచ్చుచున్నాను. నీవు నన్ను కలిసికోవలయునని ఇది వఱకే నిర్ణయింప బడినదని నమ్ముచున్నాను? ఏమైనను హావి షమ్‌కన్య మాటలనుబట్టి నాకా భావము కలిగినది. ఆమె ఆజ్ఞాను సారము నేనీ యుత్తరము వ్రాయుచున్నాను. ఆమె నీకు తన అభినందనలను తెలియజేయమన్నది.

ఇట్లు,
ఎస్టెలా.

తగినంత కాలము లేనుగాని, ఉన్నచో ఆ సందర్భమునకు నేనెన్నో సూట్లు కుట్టించి యుండెడివాడను. కాలము లేకపోయి నందున నేను ఉన్న సూట్లతో సంతృప్తి పడవలసి వచ్చెను. నాకు ఆకలిబాధ తక్షణమే అదృశ్యమైపోయెను. ఆరోజు వచ్చు వఱకు నాకు మనశ్శాంతి లేకుండెను. దానిరాక నాకు మనశ్శాంతిని చేకూర్చినదని కాదు; అది నా పరిస్థితిని మఱింత అధ్వానము చేసెను. నేను ఎంతో పెందలకడనే లేచి కోచి కార్యాలయము నకు పోతిని. అప్పటికి కోచి హావిషమ్‌కన్య నివసించుచున్న పట్టణములోని 'బ్లూ బోర్' హోటలునువదలిపెట్టి యుండునో ఉండదో!

నేను కోచి కార్యాలయమును చేరుకొని నాల్గైదు గంటలై యుండును. అంతలో నచ్చటకు గుమాస్తా వెమ్మిక్ పనుగెత్తుకొనివచ్చి ఇట్లనెను: "హలో! పిప్! ఎట్లున్నావు? నీవిచ్చట బీటు వేయుచుందువని నేను ఎన్నడును తలచియుండలేదు. ఎందుల కిచ్చటకు వచ్చినావు?"

"కోచిలో నన్నెఱిగియున్న వారొకరు రానున్నారు. వారిని కలిసికోవలయునను తలుపుతో నే నిచ్చటకు వచ్చియున్నాను."

"నే నిప్పుడెక్కడకు వెళ్ళబోవు చున్నా ననుకొనుచున్నావు?"

"జాగర్సు కార్యాలయమునకు పోవుచున్నా వనుకొందును."

"కాదు. న్యూగేట్ జైలుకు పోవుచున్నాను. నీవు కూడా వత్తువా?"

కోచి వచ్చుట కింకను కావలసినంత వ్యవధియున్నది. అందువలన నేను, "వత్తును" అని యంటిని.

పిమ్మట మే మిరువురము న్యూగేటుజైలుకు పోతిమి. అచ్చట వెమ్మిక్ కొందఱితో మాటలాడెను. జాగస్సు చాల పలుకుబడిగల వాడను విషయమును నే నచ్చట మఱియొకసారి గ్రహించితిని. వెమ్మిక్ పని పూర్తియైన తరువాత మే మిరువురము జాగస్సు కార్యాలయమునకు పోతిమి. నే నచ్చటనుండి కోచి కార్యాలయమునకు తిరిగి వచ్చితిని.

కొంచెము సేపటికి కోచి వచ్చి ఆగెను. కోచిలో కూర్చుండియున్న ఎస్టెలా మొగము నాకు కనబడెను. నన్ను చూచి ఆమె చేయి ఊపెను.

ఎస్టెలా కోచిలోనుండి క్రిందకు దిగెను. ఆమె చాల చక్కని ప్రయాణపు దుస్తులను ధరించియుండెను. ఆదుస్తులలో నామె ఇదివఱకటికంటె చాల అందముగా కనబడసాగెను. ఆమె ప్రవర్తనలోకూడ నాకొకవిధమైన మంచిమార్పు కనబడసాగెను. ఆ మార్పుకు కారణము హావిషామ్‌కన్య పలుకుబడి ప్రభావమని నేను తలచితిని.

ఎస్టెలా సామానులన్నిటిని ఒకచోట పెట్టించితిని. కాని ఆమె గమ్యస్థానమేదో మాత్రము నాకు తెలియకుండెను. అందువలన నే నామెను దానినిగూర్చి ప్రశ్నించితిని.

అప్పుడామె ఇట్లనెను: "నేను రిచ్మండుకుపోవలసియున్నది. కాని రెండు రిచ్మండు లున్నవి. ఒకటి సఱ్ఱేలోను, రెండవది యార్క్‌షైరులోను నున్నది. నేను సఱ్ఱే రిచ్మండుకే పోవలసి యున్నది. ఇచ్చట కది పదిమైళ్ళ దూరముననున్నది. నే నచ్చ

టకు బండిమీద పోవలయును. నీవు నన్నచ్చటకు తీసికొని పోవలయును. ఇదిగో నా పర్సు. నీవు ఖర్చునకగు సొమ్మును ఇందులోనుండి తీసికొనవచ్చును. నీ వీ పర్సును తప్పక తీసికో వలయును. నీవు, నేను 'మన కీయబడిన సూచనల ననుసరించి తీరవలసినదే. మనకు వేఱుగత్యంతరము లేదు. నీవు నేను మన యిష్టము వచ్చినట్లు చేయుటకు స్వేచ్ఛాజీవులము కాము.''

ఆమె పర్సును నా కిచ్చుచు నావంక కది యొకవిధముగా చూచెను; అందువలన నామె మాటలలో నేదో అంతరార్థ మున్నదని నేను భావింపసాగితిని. ఆమె యా మాటలను తిరస్కార భావముతో ననెను; కాని అందు అనిష్టములేదు.

“ఎస్టెలా! బండికొఱకు కబురు పంపింపవలసియున్నది. మఱి నీవిచ్చట కొంచెముసేపు విశ్రాంతి తీసికొందువా?''

“అట్లనే. నే నిచ్చట కొంచెముసేపు విశ్రాంతి తీసికో వలయును. తేనీరు తీసికొనవలయును. మఱి నీవే నా బాధ్యత వహింపవలసి యున్నది.

అంతట నేనొక సేవకుని పిలచి, “మేమిరువురము విశ్రాంతి తీసికొనుటకొక గదిని చూపుము” అని యంటిని.

అంతట నతడు మమ్మొకగదివద్దకు తీసికొనిపోయెను. అది యొక చీకటికొట్టు. “ఇది ఏమియుబాగుండలేదు” అని నేను అంటిని.

అపుడా సేవకుడు మమ్ము వేఱొకగదివద్దకు తీసికొని పోయెను. ఆగదికూడ ఏమంత బాగుండలేదు. అయినను విధిలేక మేము ఆ గదిలో ప్రవేశించితిమి. తరువాత నేను సేవకునితో

నిట్లంటిని: "యువతీమణికి తేనీటిని తీసికొనిరమ్ము." అంతట నా సేవకుడు మమ్ము వదలి వెళ్ళిపోయెను.

ఆ గది బాగుండలేదని చెప్పియుంటిని. కాని అందు ఎస్టెలా ఉన్నదికనుక నేనుకూడ అచ్చట నుండకతప్పదు. ఆమె యచ్చటనుండగా, నేను జీవితాంతమువఱకు సుఖముగా నుండ వచ్చునని భావించితిని. కాని అప్పుడుమాత్రము నేను సుఖముగా లేను.

"రిచ్మండులో నీవు ఎవరి ఇంటికి వెళ్ళుచున్నావు?" అని నేను ఎస్టెలాను ప్రశ్నించితిని.

"నేనచ్చట చాలఖర్చుమీద ఒక గౌరవనీయురాలి ఇంట నివసింపవలయును. నన్ను పలువురకు పరిచయముచేయుశక్తి ఆమెకుకలదట."

"పలువురను కలసికొని వారిప్రశంసలను పొందుటకు నీ వెంతయు సంతసింతువనుకొందును."

"అవును, నేను అటు లనుకొనుచున్నాను."

"నీవు నీవుగాగాక మఱియింకెవ్వరోవలె మాట్లాడు చున్నావు."

ఎస్టెలా మనోహరముగ మందహాసముచేయుచునిట్లనెను: "నీవావిధముగ నెందులకు భావింపవలయును? నేను నాకు తోచినవిధముగా మాట్లాడుచుందును. అదిసరేగాని మత్తయివద్ద నీజీవితమెట్లు గడచిపోవుచున్నది."

"ఆనందకరముగనే గడచిపోవుచున్నది. కనీసము..."

"కనీసము?"

"నీనుండి దూరముగా ఎంత ఆనందకరముగా జీవింప వచ్చునో, అంత ఆనందకరముగ జీవించుచున్నాను."

కాని ఎస్టెలా ఎంతో నిబ్బరముగా నిట్లనెను: "ఓయీ అవివేకీ! అంత అసందర్భముగ నెందులకు మాట్లాడెదవు? నీస్నేహితుడు హెర్బర్టు ఆ కుటుంబములోని వారందరికంటె అధికుడనుకొందును.

"చాల అధికుడు. అతడెవ్వరికిని శత్రువుకాడు."

"ఆరకపు మనుజుని నేను అసహ్యించుకొనుచుందును. కాని అతనికేవిషయమునను పట్టింపులేదనియు, అతడు అసూయా మాత్సర్యములు లేనివాడనియు వినియున్నాను."

"నేనుగూడ అట్లనే భావించుచున్నాను."

"మిగిలినవారినందఱనుగూర్చి నీవావిధముగ భావించుటకు వీలులేదు. ఏలయన పలువురు నీకు వ్యతిరేకముగ హావిషమ్కన్యకు చెప్పుచుందురు. అందువలన నీకు నష్టముచేకూరవచ్చును. వారు నిన్నుకనిపెట్టి చూచుచుందురు. నిన్నుగూర్చి తప్పుడుసమాచారము పంపించుచుందురు. నిన్నుగూర్చి వారు ఉత్తరములు వ్రాయుచుందురు. ఒక్కొక్కప్పుడు ఆకాశరామన్న ఉత్తరములు వ్రాయుచుందురు. నిన్నుగూర్చి ఆ విధముగ వ్రాయుచుండుటయే వారి జీవితధ్యేయము కాబోలు. వారు నిన్నెంతగా ద్వేషించుచున్నారో నీవు గ్రహింపలేవు."

"వారు నాకెట్టిహానియు చేయగలకద?"

ఎస్టెలా నాప్రశ్నకు సమాధానముచెప్పుటకుబదులు, పొట్ట బ్రద్దలగునట్లు నవ్వసాగెను. అది నాకెంతయు వింతగా కనబడసాగెను. నేను కలవరపాటుతో ఆమెవంక చూడసాగితిని.

ఆమె నవ్వుట పూర్తిచేసిన తరువాత నేనిట్లంటిని: "వారు నాకు హానిచేయుట నీకు ఆనందకరమైన విషయము కాదనుకొందును."

"ఏమాత్రము కాదు. ఏమాత్రము కాదు. ఆ విషయమున నీవు నిశ్చింతగ నుండవచ్చును. వారు నీకెట్టి హానియు చేయలేక పోవుచున్నారు కనుకనే నేను నవ్వుచున్నానని జ్ఞప్తియుంచుకొనుము. నిజముగా వారే బాధపడుచున్నారని తెలిసికొనుము."

అట్లని ఆమె మరల నవ్వసాగెను. తన నవ్వుకు కారణము నామె చెప్పియుండెను. అయినను ఆమె నవ్వు నాకు వింతగా కనబడసాగెను. ఆమె చెప్పినది నిజమేయై యుండ వచ్చును. కాని అప్పుడామె ఎందులకంతగా నవ్వవలసి వచ్చెనో నాకు అర్థము కాకుండెను. ఆ నవ్వులో ఇంకను గూఢార్థమేదో యున్నదని నేననుకొన సాగితిని.

నా మనస్సులోని విషయము నామె గ్రహించినది కాబోలు. ఆమె యిట్లనెను: "వారి ప్రణాళికలన్నియు భగ్నమై పోవుచున్నందున నాకు ఎంతో సంతృప్తి కలుగుచున్నది. ఆసంతృప్తి ఎంతటిదో తెలుసుకొనుట నీకు సులభముకాదు. వారు ఓటమిని పొంది తెల్ల మొగము వేసికొన్నప్పుడు నాకు కలుగు ఆనందము వర్ణనాతీతమైనది. అది ఎంతటిదో నీకు తెలియదు. ఏలయన నీవు చిన్నప్పటినుండి ఆ వింతభవనములో పెరిగియుండ లేదు. నేను పెరిగియుంటిని. నాకు వారికి సంబంధించిన విషయములన్నియు సంపూర్ణముగ తెలియును.

నీకు నేను రెండువిషయములను చెప్పగలను. వారు హావిషమ్‌కన్యకు నీపైగల అభిమానమును అణుమాత్రమైనను

తగ్గింపలేరు. ఆ విషయమున నీవు నిశ్చింతగ నుండవచ్చును. వారా విధముగ నీచముగ ప్రవర్తించుటకు కారణము నేను. కాని వారు ఏమియు చేయజాలరు. ఇదిగో నా హస్తము."

నేనామె హస్తమును తీసికొని నా పెదవులవద్ద పెట్టుకొంటిని. అప్పుడామె యిట్లనెను: "పరిహాసాస్పదుడా ? నీవెన్నడును హెచ్చరికను గమనింపవా ? లేక ఒకప్పుడు నేనొక భావముతో నిన్ను నా బుగ్గను ముద్దుపెట్టుకోనిచ్చితిని; ఇప్పుడు నీవా భావముతోనే నా హస్తమును ముద్దుపెట్టుకొనుచున్నావా ?"

"ఆభావ మెట్టిది ?"

"ఒక్క క్షణకాలము ఆలోచించుకొనుము. కృతజ్ఞతాపూర్వకమైన పట్లుగల తిరస్కారభావము."

"అవును అని యన్నచో మరల నీ బుగ్గను ముద్దుపెట్టుకోనిత్తువా ?"

"నీవు నా హస్తమును ముట్టుకోకపూర్వమే అడిగియుండవలసినది. నీకిష్టమైనచో ఇప్పుడైనను ముద్దుపెట్టుకోవచ్చును."

ఎస్టెలా ముఖము విగ్రహమువలె కడు ప్రశాంతముగ నుండెను. నేను వంగి ఆమెబుగ్గపై ముద్దుపెట్టుకొంటిని. నేనామె బుగ్గను తాకిన వెంటనే ఆమె ప్రక్కకు తప్పుకొని ఇట్లనెను: "నేను శ్రేణి జేసిని సేవింపవలయును. నీవు నన్ను దిగ్బ్రాంతుకు పోవలయును. ఈ విషయమును జ్ఞప్తియందుంచుకొనుము."

ఆమెమాటలు మా సంబంధము నెవ్వరో మాపై బలవంతముగ మద్దిసట్లును, మేము ఇతరులచేతులలో పట్టి కీలుబొమ్మలైనట్లును నుండెను. అది నాకెంతయు బాధను కలిగిం

చెను. మా సంభాషణలోని ప్రతివిషయమును నాకు బాధను కలిగించుచుండెను. ఆమె నాతో మాట్లాడినతీరు ఎట్లున్నప్పటికిని నేను దానిని నమ్ముటకు వీలులేదు, దానిపై ఆశపెట్టుకొనుటకు వీలులేదు. అయినను నేనందుకు వ్యతిరేకముగా వ్యవహరించితిని.

నేను తేనీటి కొఱకు గంట ప్రయోగించితిని. సేవకుడు తేనీరు తప్ప మిగిలిన వాని నన్నిటిని తీసికొని వచ్చెను. మఱి కొంత సేపటికి నేనేదో విధముగ తేనీటిని తయారుచేసి ఎస్టెలా కొసగితిని.

తరువాత మేము ఒకబండిలో ప్రవేశించి రిచ్మండునకు బయలుదేరితిమి. బండిలో కూర్చున్న మేము అనేక విషయము లనుగూర్చి మాట్లాడుకోసాగితిమి.

ఒక సందర్భమున మా సంభాషణ జాగర్సు పైకి మళ్ళెను.

"అతనికి ప్రతి ప్రదేశమునకు సంబంధించిన రహస్యము లన్నియును తెలియుననుకొందును" అని ఎస్టెలా మెల్లగ ననెను.

"నీవు తఱచుగా అతనిని చూచుటకు అలవాటుపడి యున్నా వనుకొందును."

"నాకు జ్ఞానము వచ్చినప్పటినుండి అతని నప్పుడప్పుడు చూచుట కలవాటుపడియున్నాను. నాకు మాటలు రాకముందు అతనిని ఎంతగా అర్థము చేసికొంటినో ఇప్పుడును అంతగానే అర్థముచేసుకొనుచున్నాను. అతనితో నీకుగల అనుభవమెట్టిది? నీవు ముందుకు సాగిపోవుచున్నావా?"

"అతనితో నాకు సత్సంబంధమేయున్నది."

"మీరు స్నేహముగా నున్నారా?"

"ఒకసారి అతనితో కలిసి భోజనము చేసినాను."

"అటులనా?"

తరువాత మా సంభాషణ ఇతర విషయముల పైకి వెళ్ళెను. ముఖ్యముగా మేము ప్రయాణము చేయుచున్న మార్గమును గూర్చి ఆమెకు వివరించి చెప్పసాగితిని. "ఈ లండను మహానగరము నాకు పూర్తిగా క్రొత్త అనియే చెప్పవలయును. ఏలయన నేను చిన్నప్పటినుండియు హావిషమ్ కన్య ఇంటి ప్రాంతమును వదలిపెట్టి ఎచ్చటకును పోయియుండలేదు. ఫ్రాన్సుకు వెళ్ళినప్పుడు మాత్ర మీ నగరము మీదగా వెళ్ళినాను. మఱియు తిరుగుప్రయాణములో నీనగరముమీదగా ప్రయాణము చేసి హావిషమ్‌కన్య ఇల్లు చేరుకొన్నాను" అని ఆమె నాకు చెప్పియుండెను. అందువలన నేనామెకు లండను మహానగరమునకు సంబంధించిన విషయములను చెప్పసాగితిని. మధ్యలో నే నామె నిట్లు ప్రశ్నించితిని: "నా సంరక్షకుడు జాగర్సు నీ విచ్చట నున్నప్పుడు నీ బాధ్యతను వహించియున్నాడా?"

అంతట ఎస్టెలా "పాపము శమించుగాక!" అని మాత్ర మనెను. ఆమె యింక నేమియు చెప్పలేదు.

ఎస్టెలా నన్ను ఆకర్షించుటకు ప్రయత్నించుచున్నదని నేను గ్రహించితిని. ఆమె నన్ను జయించుటకు ప్రయత్నించుచుండెను. ఎన్ని కష్టములు పడియైనను నన్ను జయించుటకు ప్రయత్నించునని నేను అనుకొనసాగితిని. కాని అదియేమోకాని నాకు సంతోషము కలుగకుండెను.

మాబండి హామర్‌స్మిత్ మీదగా ప్రయాణమై పోవు చుండెను. అప్పుడు నే నామెకు మత్తయి పోకెట్ నివసించు చున్న గృహమును చూపితిని. పిమ్మట నిట్లంటిని: "రిచ్మండు ఇచ్చటకు సమీపముననే యున్నది కదా! కావున నేనచ్చటకు తఱచుగా వచ్చి నిన్ను కలుసుకొనుచుందును."

"అవునవును. నీవు తప్పక వచ్చి నన్ను చూడవలయును. ఉచితమని తోచినప్పుడెల్ల నీవు నాదగ్గఱకు రావలయును. నీ వా కుటుంబమువారితో పరిచయము కలిగించు కోవలయును. నిన్ను గూర్చివారికి ఇదివఱకే తెలియును."

"నీవు నివసింప బోవుచున్న కుటుంబము చాలపెద్ద కుటుంబమా?"

"కాదు. ఆ కుటుంబములో ఇరువురు మాత్రమే యున్నారు. వారు తల్లీ కూతుండ్రు. తల్లి ఉన్నతస్థాయికి చెందిన స్త్రీ. కాని తన ఆదాయమును వృద్ధిచేసి కొనుటకు ఆమె కెట్టి అభ్యంతరమును లేదు."

"నీవు హావిషమ్‌కన్యను విడిచిపెట్టి చాల కాలము ఫ్రాన్సులో నుంటివి. మఱి యింత త్వరలో ఆమె నిన్ను విడిచి పెట్టు చున్నందుకు నేను ఎంతయు ఆశ్చర్య పడుచున్నాను."

బాగుగ అలసిపోయిన దానివలె ఎస్టెలా నిట్టూర్పుపుచ్చి ఇట్లనెను: "పిప్? ఇది హావిషమ్‌కన్య నా కొఱకు నిర్ణయించిన ప్రణాళికలలో నొక భాగము. నే నామెకు ఎప్పుడును వ్రాయు చుండ వలయును. మధ్య మధ్య ఆమెను కలసి కొనుచుండ వల యును. నేను అభివృద్ధి చెందుచున్న విధానము నామెకు తెలియ జేయుచుండ వలయును."

ఆమె నన్ను పేరుపెట్టి పిలుచుట కదియే మొదటి పర్యాయము. ఆమె ఉద్దేశ్య పూర్వకముగనే అటుల పిలిచె ననుటకు సందేహ మే మాత్రమును లేదు. నేను దానిని ఆప్యాయముగ దాచుకొందుననువిషయ మామెకు బాగుగ తెలియును.

మేము అనతి కాలములో రిచ్మండు చేరుకొంటిమి. తరు వాత తల్లీ కూతుండ్రు నివసించుచున్న గృహమును చేరుకొం టిమి. మే మిరువురము బండిలోనుండి క్రిందకు దిగితిమి. నేను ఇంటి ముందున్న గంటను ప్రయోగించితిని. అంతట ఇరువురు యువతి లు పరుగు పరుగున వచ్చిరి. వారు ఎస్టెలాను సాదరముగ నాహ్వానించిరి. నేను బండిలోని ఆమె సామానులను క్రిందకు దింపించితిని. ఎస్టెలా మందహాసము చేయుచు తన చేతిని నా కిచ్చి, "గుడ్ నైట్!" అని యనెను. పిమ్మట నామె లోనికి వెళ్లి పోయెను.

నేను బయటనే నిలబడియుండి ఆ యింటివంకకు చూడ సాగితిని. ఆ యింటిలో నామెతో కలసియున్నచో ఎన్నో సౌఖ్య ముల ననుభవింప వచ్చునని అనుకొనసాగితిని. ఆమెతో కలసి యున్నప్పుడు నేను ఎప్పుడును సౌఖ్యము ననుభవించి యుండ లేదు. ఆ సంగతి తెలిసియు నేనట్లు అనుకొంటిని!

తరువాత నేను బండిలో ప్రవేశించి హామర్స్మిత్ కు తీసి కొని పోవలసినదని బండివానిని కోరితిని. అప్పుడు నా హృద యము ఎంతో అల్లకల్లోలముగ నుండెను. త్వరలోనే బండి హామర్స్మిత్ చేరుకొనెను. నేను బండిలోనుండి క్రిందకు దిగు నప్పటికి నా పరిస్థితి ఇంకను అధ్వాన్నముగ నుండెను.

# 17

భవిష్యత్కాలములో నాకు గొప్ప అదృష్టము పట్టనున్న దను ఆలోచనలకు నేను అలవాటు పడిపోతిని. ఆ ఆలోచనలు నామీద, నా చుట్టునున్న వారిమీద దుష్ప్రభావమును చూపు చున్నవను విషయమును నేను గ్రహించితిని. జో మొదటి నుండియు నాకు ముఖ్య స్నేహితుడు. బిడ్డీకి నే ననిన నెంతయు అభిమానము. అట్టివారిని నేను తృణప్రాయముగ భావించుచుం టిని. వారినట్లు చూచుట నా కెంతయు బాధాకరముగ నుండెను. నాకు రాత్రులందు అప్పుడప్పుడు మెలకువ వచ్చుచుండెడిది. హావిషమ్‌కన్య మొగము నసలు చూచియుండక పోయినచో నా జీవితము సుఖముగా గడచి యుండెడిదని అప్పుడు అనుకొను చుండెడివాడను. జోతో బాటు నేనుకూడ పనిచేసికొనుచు సౌఖ్య ముల ననుభవించు చుండెడివాడను.

సాయంకాల సమయములందు నేను కుంపటిముందు ఒంట రిగ కూర్చుండి నిప్పువంకకు చూచుచుండెడివాడను. వంటగది లోని నిప్పుకంటెను, కొలిమిలోని నిప్పుకంటెను మించిన నిప్పు లేదని నేనప్పుడు అనుకొనుచుండెడివాడను. కాని నేను ఎస్టె లాను మాత్రము మఱచిపోలేకుంటిని.

నా సహవాసము ఎవరికిని లాభకరముగ లేదని గ్రహించి తిని. ముఖ్యముగ నా మిత్రుడు హెర్బర్టుకు లాభకరముగ లేదని గ్రహించితిని. నేను ధనమును అపరిమితముగ ఇచ్చువచ్చినట్లు

ఖర్చుపెట్టసాగితిని. ఆ అంటువ్యాధి హెర్బర్టుకుకూడసోక అతని నిరాడంబర జీవితమును కలుషితముచేసెను. అతడు భరింపలేని ఖర్చులు చేయసాగెను. ప్రశాంతముగ నుండెడి అతని మనస్సు ఆందోళనపూరితమయ్యెను. హెర్బర్టు స్థితికి నేనెంతయును విచారింపసాగితిని.

నా సంరక్షకుడు జాగర్సు నాకిచ్చుచున్న సొమ్ము విపరీతపు ఖర్చులకు సరిపోకుండెను. అందువలన నేను అప్పులు చేయసాగితిని. నాతోబాటు మిత్రుడు హెర్బర్టుకూడ అప్పులు చేయసాగెను. నా అప్పులకు నేనేమాత్రము భయపడకుంటిని. ఏల యనగ ఎప్పటికైన నాకు గొప్పఆస్థివచ్చుననియు, అప్పుడా అప్పుల నన్నిటిని తీర్చివేయగలననియు నేను ధైర్యము వహింపసాగితిని. కాని హెర్బర్టు అప్పుల నెట్లుతీర్చగలడు? హెర్బర్టు ఖర్చులనన్నిటిని నేనుభరించుటకు సిద్ధముగనుంటిని. కాని హెర్బర్టు గర్వము కలవాడు. అందువలన అతనికామాట చెప్పుటకు నేనేమాత్రము సాహసింపలేకుంటిని. అతడు అన్నివిధముల చిక్కులుపడసాగెను. అతనిపరిస్థితి ఆందోళనకరముగ నుండెను.

నేను సాధారణముగా వారములో సగమురోజులు హామర్‌స్మిత్‌లో నుండెడివాడను. నేనచ్చట నున్నప్పుడెల్ల రిచ్మండున పనిగల్గియుండెడివాడను. నేను హామర్‌స్మిత్‌లో నున్నప్పుడు హెర్బర్టుకూడ అప్పుడప్పుడచ్చటకు వచ్చుచుండెడివాడు.

లండనులో మా పరిస్థితి కడుదుర్భరముగ నుండెను. ఒకనాడు నేను హెర్బర్టుతో నిట్లంటిని: "మిత్రమా! మన పరిస్థితి రోజురోజుకు అధ్వానమైపోవుచున్నది."

"నేనుకూడ అదేమాట చెప్పదలచుకొన్నాను. నీవు నాకంటె ముందుచెప్పివైచినావు" అని హెర్బర్టు అనెను.

"అయిన మన వ్యవహారములు నొకసారి జాగ్రత్తగా పరిశీలించి చూతము."

తరువాత మేము భోజనముచేసితిమి. భోజనముచేసిన తరువాత మేము కాగితములు, కలములు తీసికొని ఒకచోట కూర్చుంటిమి. నేను నా అప్పులపట్టికను తయారుచేసితిని. హెర్బర్టు తన అప్పులపట్టికను తయారుచేసెను.

ఒకనాటిసాయంకాలము మేమిరువురము అటువంటి పట్టికలను తయారుచేయుటలో నిమగ్నులమైయుంటిమి. అంతలో పోస్టుబంట్రోతువచ్చి తలుపుసందులోనుండి లోనికొక యుత్తరము పడవైచెను.

దానిపై విలాసమునుజూచి హెర్బర్టు ఇట్లనెను: "మిత్రమా! ఈ యుత్తరము నీదే. ఈ యుత్తరములో విషాదకరవార్త ఏదియు నుండరాదని నేను కోరుచున్నాను." ఆ యుత్తరముచుట్టును నల్లనిగీత యుండుటవలన నతడావిధముగ ననెను.

ఆయుత్తరమును ట్రాబ్ ఎండ్ కంపెనీవారు వ్రాసియుండిరి. నిజముగా నా యుత్తరము విచారకరమగు వార్తనే తెలియజేసెను. నా సోదరి కడచిన సోమవారమునాటి సాయంకాలమున ఆఱుగంటల ఇరువది నిమిషములకు మరణించెనట. ఆమె అంత్యక్రియలు రాబోవు సోమవారమునాడు సాయంకాలము మూడు గంటలకు జరుగునట. అప్పటికి హాజరుకావలయునని ఆ కంపెనీవారు నన్ను కోరియుండిరి. ఆ యుత్తరమును

చదివినప్పటినుండి రాత్రింబగళ్లు నా సోదరి నా కన్నుల ముందు ప్రత్యక్షము కాసాగెను.

నేను చిన్నపిల్లవాడుగ నున్నపుడు నా సోదరి నా పట్ల ఏ విధమగు దయను చూపియుండలేదనుమాట నిజమే. దయను చూపకుండుటయే గాక ఆమె అపారమగు కాఠిన్యమును, క్రౌర్యమును ప్రదర్శించుచుండెడిది. అయినను నేనామె మరణించినందులకెంతయు విచారింపసాగితిని. కొన్ని సంవత్సరముల క్రిందట ఆమె నెవ్వరో కొట్టియుండిరి. అందువలననే ఆమె మంచము పట్టెను; కడకు మరణించెను. ఆమెనుకొట్టి మరణమునకు కారణభూతమైన వారిపైన నాకు అపరిమితమగు ఆగ్రహము కలుగ నాగెను. ఆమెను కొట్టినవాడు దుర్మార్గుడగు ఆర్లిక్ అని నేను మొదటినుండియు అనుకొనుచుంటిని. అతని నేవిధముగనైన కఠినముగ శిక్షింపవలయునని నేను అనుకొనసాగితిని. మఱి యెవడు ఆమెను కొట్టియుండినచో ఆ మఱియొకనినే కఠినముగ శిక్షింపవలయుననుకొంటిని.

నేను వెంటనే నా ప్రియమైనబావ జోకు ఒకయుత్తరము వ్రాసితిని. ఆయుత్తరములో నేను నా సోదరి మరణముపట్ల అపారమగు విచారమును ప్రకటించితిని. నా సానుభూతిని ప్రదర్శించితిని. అంత్యక్రియలకు తప్పక హాజరగుదునని తెలిపితిని. మధ్యనున్న రోజులను ఏదో విధముగ గడిపివైచితిని. సోమవారమునాటి యుదయమున నేను పట్టణమునకు బయలుదేఱి పోవు కోచిలో ప్రవేశించితిని. 'బ్లూబోర్' హోటలువద్ద నేను కోచిలోనుండి క్రిందకు దిగితిని. అక్కడినుండి నేను జో నివసించుచున్న గ్రామమునకు నడచిపోతిని.

అది చాల చక్కని వేసవికాలపు దినము; నేనునడచిపోవు చుండగా చిన్నప్పటి నా నిస్సహాయస్థితి. నా సోదరి కాఠిన్యము మున్నగునవి అన్నియు జ్ఞప్తికివచ్చెను. కాని వేసవికాలపు వాతావరణము కడు మనోహరముగ నుండుటవలన నేను నా సోదరినిగూర్చి మంచిగనే భావింపసాగితిని.

నేను ఇంటికిపోవునప్పటి కచ్చట కావలసిన ఏర్పాట్లన్నియు చేయబడి యుండెను. ఆ ఏర్పాట్లన్నియు ట్రాబ్ ఎండ్ కంపెనీ వారి ఆధ్వర్యమున జరిగెను.

నల్లని దుస్తులను ధరించిన నా బావ జో గదిలో నొక ప్రత్యేకస్థలమున కూర్చుండియుండెను. అతడు కనబడిన వెంటనే నేనతనియొద్దకు పోతిని. "ప్రియమైన జో! నీ వెట్లున్నావు?" అని ప్రశ్నించితిని. అంతట నతనిట్లు చెప్పసాగెను: "పిప్! మిత్రమా! ఆమె చాల అందమైనదను విషయము నీకు..." అతడింక ఆ వాక్యమును ముగింపలేకపోయెను. అతడు నా చేతిని గట్టిగా బట్టుకొనెను.

నల్లని దుస్తులను ధరించిన బిడ్డీ ఎంతో పరిశుభ్రముగా కనబడసాగెను. ఆమె ప్రశాంతముగా అటు నిటు తిరుగుచు పనులలో ఎంతో సహాయ్య పడుచుండెను. నేనామెను పలుకరించితిని. దీర్ఘముగా మాట్లాడుట కది సమయముకాదని ఎంచి నేనుపోయి మరల జో వద్ద కూర్చుండి యుంటిని.

కొంతసేపటికి కచ్చట పంబుల్‌చూక్ కూడనున్నాడను విషయమును గ్రహించితిని. అతడు నా దృష్టి నాకర్షించుటకు ఎంతో తంటాలు పడుచుండెను. నేను చూడగనే అతడు నాదగ్గ

రకు వచ్చి ఎంతో గౌరవభావముతో పలుకరించెను. నేనచ్చట హాంబుల్ దంపతులను కూడ చూచితిని.

తరువాత మేము నా సోదరిని స్మశానమునకు తీసికొని పోయి యథావిధిగా పాతిపెట్టితిమి, కర్మకాండ అంతయు పూర్తియైన తరువాత మేమందఱము మా యింటికి తిరిగి వచ్చితిమి. తరువాత ఎవరి ఇండ్లకువారు పోయిరి.

నేను, జో, బిడ్డీ కలసి భోజనము చేసితిమి. భోజన సమయమున జో పరిస్థితి అధ్వాన్నముగ నున్నట్లు గ్రహించితిని. కాని తరువాత అతని పరిస్థితి మెఱుగయ్యెను.

"నేను చిన్నప్పుడచ్చట పరుండెడి చిన్న గదిలో పరుండుట కనుమతింప వలయును" అని నేను నా బావను కోరితిని. అందుకతడు ఎంతయు సంతసించెను. ఆ విధముగ కోరినందుకు నేనుకూడ ఎంతయు సంతసింపసాగితిని. ఏలయన నేనా విధముగ చేయుటలో జోను గౌరవించుచున్నట్లు భావింపసాగితిని.

సంధ్యా సమయమున నేను, బిడ్డీ కలసి తోటలోనికి పోతిమి.

నేను బిడ్డీతో నిట్లంటిని: "బిడ్డీ! ఈ విచారకర విషయములను నీవు నాకు వ్రాసియుండవలసినదని భావించుచున్నాను."

"పిప్! నీవటుల భావించుచున్నావా? ఆ సంగతిని అనుకొనియుండినచో నేను వ్రాసియుండెడిదానసనే."

"బిడ్డీ! నీవా విధముగ అనుకొని యుండవలసినది. నేనిప్పుడు కఠినముగ మాట్లాడుచున్నానని మాత్రమనుకొనకుము."

"అట్లయినా పిప్!"

ఆమె కన్నీరు పెట్టుకొనుచున్నదని గ్రహించితిని. అందు వలన నేనింక ఆవిషయమును గురించి మాట్లాడుట మానివైచితిని.

తోటలో అటు నిటు తిరుగుచున్నప్పుడు నే నామెతో నిట్లంటిని: "ప్రియమైన బిడ్డీ! నీవింక నిచ్చట నుండుట కష్టముగ నుండునను కొందును."

"ఓ పిప్! నేనావిధముగ చేయలేను. నేనా విషయమును గూర్చి హాబుల్ సతితో మాట్లాడియుంటిని. నేను ఆమె వద్దకు త్వరలో పోనున్నాను. గార్జిరీ కొంచెము స్థిరపడు వఱకు మే మిఱువురము కలసి అతని జాగ్రత్తను తీసికొనగల మను కొందును."

"బిడ్డీ! నీ వెట్లు జీవనము గడప బోవుచున్నావు? నీ కేమైన సొ......"

"నే నెట్లు జీవనము గడపబోవుచున్నాను? నీకు చెప్పెదను పిప్! అచట క్రొత్తపాఠశాల నిర్మాణము చాల వఱకు పూర్తియైనది. నే నందు టీచరుగా ప్రవేశించుటకు ప్రయత్నింప బోవుచున్నాను. ఇచ్చటి వారందఱును నన్నా యుద్యోగమునకు సిఫారసుచేయుదురని నేను గాఢముగ విశ్వసించుచున్నాను. నేను సహనముతో పరిశ్రమ చేయుదును. ఇతరులకు బోధించు సందర్భమున నాకు నేను బోధించుకొందును. క్రొత్త పాఠశాలలు ప్రాత పాఠశాలల వంటివి కావను విషయము నీకు తెలియును. కాని నేను నీవద్దనుండి అనేక విషయములు నేర్చుకొన్నాను. తరువాత గూడ ఎంతో అభివృద్ధి సంపాదించినాను."

"ఎటువంటి పరిస్థితులలోనైనను నీ వెప్పుడును అభివృద్ధి చెందుచుందువను విషయము నాకు తెలియును, బిడ్డీ!"

"మానవ స్వభావములోని వికృతభాగములో తప్ప!"

ఆమె ఆవిధముగ నన్నది నన్ను దూషించుటకు గాదు. తన మనస్సులోని విషయము నామె పైకి అనెను. దాని పర మార్థ మంతియు. ఆ విషయమునగూడ నింక చర్చ కొనసాగించుట మంచిది కాదని నేను భావించితిని.

మేము మఱి కొంతదూరము పోయిన తరువాత నేను ఇట్లంటిని: "బిడ్డీ! నా సోదరి మరణమునకు సంబంధించినవివరము లేవియు తెలియలేదు"

"వివరము లంతగా లేవు. ఆమె పరిస్థితి ఒకప్పుడు అధ్వాన ముగ నుండును మఱియొకప్పుడు బాగుగనుండును. ఇటీవల ఆమె నాలుగురోజులు అధ్వానస్థితిలో నుండెను. సాయంకాల మగునప్పటి కామె పరిస్థితి కొంత మెఱుగుపడెను. అప్పటికి తేనీరు సేవించు సమయమైయుండెను. అప్పుడామె మెల్లన 'జో' అని యనెను. ఆమె ఆవిధముగ మాటలాడి చాలకాలమై యుండెను. అందువలన నేను పరుగెత్తుకొనిపోయి కొలిమిలో పనిచేయు చున్న జోను అచ్చటకు తీసికొని వచ్చితిని. అంతట నామె నాకు కొన్ని సంజ్ఞలుచేసెను. ఆమె సంజ్ఞలప్రకారము నేను జోను ఆమెప్రక్కనే కూర్చుండబెట్టితిని. తరువాత నామె చేతులను అతని మెడచుట్టును బెట్టితిని. ఆమె ఎంతో సంతృప్తి చెందిన దానివలె తన తలను ఆతని భుజముపై బెట్టెను. తరువాత నామె మఱియొకసారి 'జో' అని అనెను. ఒకసారి 'క్షమింపుము' అని యనెను. ఒకసారి 'పిప్'అని యనెను. ఆమె యింక జో భుజము

మీాదనున్న తన తలను పైకెత్తలేను. ఒక గంట గడచిపోయిన తరువాత నామె మరణించినదని మేము గ్రహించితిమి. అందువలన నామెను తీసి పక్కపై పరుండబెట్టితిమి.''

అటుల చెప్పి బిడ్డీ ఏడువసాగెను.

"బిడ్డీ! నాసోదరి నెవ్వరు కొట్టినారన్న విషయలను గూర్చి ఏమియు తెలియలేదా?''

"ఏమియు తెలియలేదు.''

"ఆర్లిక్ సంగతి ఏమైన నీకు తెలియునా?''

"అతని దుస్తుల రంగునుబట్టి అతడు క్వారీలలో పని చేయుచున్నాడని తలచుచున్నాను.''

"అయిన నీ వతని నిటీవల చూచినావన్న మాట ?— ఆ సందులోని వృక్షమువంక కేంసుకు చూచుచున్నావు?''

"ఆమె చనిపోయిననాటిరాత్రి అతని నచ్చటచూచినాను.''

"బిడ్డీ! అతని నీ వచ్చట ఆనాడు చూచుట కడసారి కాదనుకొందును.''

"కడసారికాదు. మన మీా తోటలో తిరుగుచున్నప్పటి నుంచియు అతని నచ్చట చూచుచునే యున్నాను. ఇప్పుడింక లాభ మేమియు లేదు. నేను నిన్ను మోసగింపనను విషయము నీకు బాగుగ తెలియును. అత డిప్పుడు వెళ్లిపోయినాడు.

దుర్మార్గుడగు ఆర్లిక్ బిడ్డీ నింకను వెంబడించుచున్నాడను విషయమును తెలిసికోగానే నాకు అతనిపై అపరిమితమగు ఆగ్రహము వచ్చెను. అతని నేవిధముగనైనను కఠినముగ శిక్షింప వలయునని తలచితిని. ఆ విషయము నామెకు చెప్పితిని. ఇంకను ఇట్లంటిని: "అతనిని ఈ దేశమునుండి వెళ్ళగొట్టుటకు ఎటువంటి శ్రమనైన

తీసికొనెదను. ఎంతడబ్బునైన ఖర్చు పెట్టెదను. ఆగ్రహముతో నా యొడలు ఉడికి పోవుచున్నది."

కాని ఆమె నా ఆగ్రహమును తన మాటలతో క్రమక్రమముగా తగ్గింపసాగెను. జో నన్ను అపరిమితముగా ప్రేమించుచున్నాడని ఆమె తెలిపెను. "జో ఎన్నడును ఏ విషయమును గూర్చికాని ఫిర్యాదు చేయలేదు. అతడు బలమైన హస్తముతోను, ప్రశాంతమైన నాలుకతోను, మంచి హృదయముతోను ప్రతి నిత్యమును తన పనులను చేసికొని పోవుచుండును" అని ఆమె చెప్పెను.

"బిడ్డీ! మనము తఱచుగా ఈ విషయములనుగూర్చి మాట్లాడుకొను చుండవలయును. నేను అప్పుడప్పుడు లండను మహానగరమునుండి ఇచ్చటకు వచ్చుచుందును. నేను నిస్సహాయుడగు జోను ఒంటరిగ విడిచిపుచ్చ జాలను. అతనిని చూడకుండ నుండ లేను."

బిడ్డీ ఒక్కమాటయైన మాట్లాడ లేదు.

"బిడ్డీ! నా మాటలు నీకు వినబడుట లేదా?"

"అవును, పిప్!"

"నీవు నన్ను 'పిప్' అని పిలుచుచున్నావు. అది నాకు రుచించుట లేదు. ఆ మాట అట్లుండనిమ్ము. నీ యుద్దేశ్యమేమి?"

"నా యుద్దేశ్యమేమి?"

"బిడ్డీ! దీని యుద్దేశ్యమేమో తెలియ జేయవలయునని ప్రార్థించు చున్నాను."

"దీని యుద్దేశ్యమా?"

"అటుల మాటలాడెద వెందులకు? నీవటుల మాట్లాడుట కిది వఱకు అలవాటు పడియుండ లేదే!"

నే నింక ఆ విషయమును గూర్చికూడ మాట్లాడరాదని నిశ్చయించుకొంటిని. కొంచెముసేపు నే మిసుమంతయు ఏమియు మాట్లాడ లేదు. కాని తరువాత నేను ఇట్లంటిని: "బిడ్డీ! జోను చూచుటకై నే నిచ్చటకు తఱచుగా వచ్చుచుందునని ఇంతకు ముందే అంటిని. అదియేమి మాయయోకాని నీ వప్పుడు ఏమియు మాట్లాడ లేదు. నీ వెందువలన మాటలాడ లేదో దయయుంచి చెప్పుము."

"అయిన నేను మాట్లాడెదను. నీవు జోను చూచుట కిచ్చటకు తఱచుగా వత్తునను చున్నావు. నీవు తప్పక రాగలవా? తప్పక వత్తునని అనుకొనుచున్నావా? నీ మాటను నిలబెట్టుకో గల నమ్మక మున్నదా?"

అపుడు నేను నిస్పృహతో నిట్లంటిని: "ఇది నిజముగా మానవ స్వభావములోని వికృత భాగమనుటకు ఎట్టి సందేహ మును లేదు. వీలైనచో ఇంక నేమియు మాట్లాడకుము, బిడ్డీ! నీ మాటలు నా హృదయములో శూలములవలె గ్రుచ్చుకొను చున్నవి."

రాత్రి భోజన సమయమున నేను బిడ్డీకి దూరముగా కూర్చుంటిని. భోజనమైన తరువాత నేను నా చిన్న గదిలోనికి పోయి శయ్యపై నేను వ్రాల్చితిని. ఆరాత్రి నాకు సరిగా నిదుర పట్టకుండెను. బిడ్డీ నాపట్ల నిర్దయతో ప్రవర్తించినదనియు, నన్ను తీవ్రముగ గాయ పఱచినదనియు, నాకు తీఱని అన్యాయము చేసినదనియు ఆ రాత్రి యంతయు అనుకొనుచునే యుంటిని.

మఱునాటి యుదయమున నేను లండను మహానగరమున కు పయనమై పోవలసియుండెను. నేను పెందలకడ లేచి బయటకు పోతిని. ఎవ్వరికిని కనబడకుండ కొలిమిగది కిటికీవద్ద నిలచి లోనికి చూడసాగితిని. అప్పటికప్పుడే జో లేచి కొలిమి వెలిగించి పనిచేయుచుండెను. అతనిముఖము అపూర్వమగు తేజస్సుతో వెలుగుచుండెను. నేనతనిని కొన్ని నిమిషములసేపు చూచితిని.

తరువాత ఇట్లంటిని: "ప్రియమైన జో! గుడ్ బై! నీచేతిని తుడుచుకోవలసిన పని లేదు. ఆ నల్లనిచేతినే ఇటు అందిమ్ము. నేని చ్చటకు తఱచుగా వచ్చుచుందును."

"పిప్! అతితఱచుగా వలదు. అతిత్వరగా వలదు" అని జో అనెను.

బిడ్డీ నా కొఱకు వంటగది గుమ్మమువద్ద వేచియుండెను. ఆమెచేత తాజాపాలున్న పాత్ర, రొట్టెయుండెను. నేను పాలు త్రాగితిని. రొట్టె తింటిని. ఆమెకు నాచేతినందిచ్చుచు ఇట్లంటిని: "బిడ్డీ! నాకు నీపై ఎట్టికోపమును లేదు, కాని నేను గాయపడి నాను."

నేను బయటపడి పట్టణమువంకకు నడచిపోసాగితిని. ఆసమయమున మంచుతెరలు తొలగిపోవుచుండెను. అవి నాకేమి తెలియజేయుచున్నవి? నేను తిరిగిరాననియు, బిడ్డీ చెప్పినమాటలు సరియైనవనియు తెలియజేయుచున్నవా? అవును, అవి సరియైన విషయమునే తెలియజేసినవి. ఆసంగతి ముందు ముందు తేల గలదు.

# 18

నా పరిస్థితి, హెర్బర్టు పరిస్థితి అంతకంతకు అధ్వాన్నమై పోవుచుండెను. అనగా మా అప్పులు పెరిగిపోవుచుండెనని నా భావము. కాలముమాత్రము గడచిపోవుచుండెను. నాకంటె ఎనిమిదినెలలకు ముందే హెర్బర్టు యుక్తవయస్సుకలవాడయ్యెను. కాని అతని జన్మదినోత్సవము మా బసలోగాని, మఱి యింక నెచ్చటగాని ఎటువంటి సంచలనమును కలిగింపలేదు. నా జన్మదినోత్సవపు సంగతిమాత్ర మటులకాదు. మేము దాని కొఱకు ఎంతో సంచలనముతో ఎదురుచూడసాగితిమి. ఏలయన ఆనాడు నా సంరక్షకుడగు జాగర్సు ఏదేని ముఖ్యమైన విషయమును ప్రకటించునని మేము అనుకొనసాగితిమి. అది నాకు లాభసాటిగ నుండునని కూడ అనుకొనసాగితిమి. నా ఇరువదియొకటవ జన్మదినోత్సవ మెప్పుడో ముందుగనే జాగర్సుకు తెలియునట్లు ఏర్పాట్లుచేసితిని.

నా జన్మదినోత్సవమునకు ముందురోజున వెమ్మిక్ వద్దనుండి నాకు అధికారపూర్వకముగ లేఖయొకటి వచ్చెను. "రేపు నీ ఇరువదియొకటవ జన్మదినోత్సవమునాడు సాయంకాలము ఐదుగంటలకువచ్చి జాగర్సును కలసికోవలయును. నీవువచ్చి కలసికొన్నచో అతడు ఎంతయు సంతసించును." అని ఆ లేఖలో వ్రాయబడియుండెను. ఆ లేఖను చూడగానే మఱునాడేదో గొప్పసంఘటన జరుగునని మేము భావించితిమి. అందుకు మేమెంతయు సంతసింపసాగితిమి.

మఱునాటి సాయంకాలము సరిగా అయిదుగంటలకు నేను జాగర్సు కార్యాలయమునకుపోతిని. మొదట నన్ను వెమ్మిక్ కలసికొని తనహృదయపూర్వకమగు అభినందనలను తెలిపెను. తరువాత నతడు నన్ను జాగర్సుడున్న గదిలోనికి పంపెను. అది నవంబరు మాసమగుటవలన నా సంరక్షకుడు నిప్పుకుంపటి ముందుగా నిలబడి యుండెను.

అతడు నన్ను చూడగనే ఇట్లనెను: "వచ్చినావా, పిప్! నేడు నిన్ను మిస్టర్ పిప్ అని పిలువవలయును. నాఅభినందనలను స్వీకరింపుము, మిస్టర్ పిప్!"

మేమిరువురము కరచాలనము చేసికొంటిమి. నేనతనికి నా కృతజ్ఞతను తెలియజేసితిని.

"మిస్టర్ పిప్! కుర్చీమీద కూర్చుండుము" అని అతడనెను. అంతట నేనొక కుర్చీమీద కూర్చుంటిని.

"నా చిన్నారిమిత్రమా! నేను నీతో ఒకటి, రెండు మాటలు మాట్లాడవలసి యున్నది" అని అతడనెను.

"అయ్యా! తమ ఇష్టము."

జాగర్సు మొదట తల క్రిందకువంచెను. తరువాత ఇంటి కప్పువంకకు చూడసాగెను. "నీవు ఎంతచొప్పున జీవించుచున్నా ననుకొనుచున్నావు?" అని అతడు ప్రశ్నించెను.

"అయ్యా? ఎంతచొప్పున?"

"ఎంత చొప్పున?" అతడింకను ఇంటి పైభాగమువంకకు చూచుచునే యుండెను. తరువాత గదిచుట్టును కలయజూచెను.

"నేను మీప్రశ్నకు సమాధానము చెప్పలేను" అని నేను విధిలేక అంగీకరించితిని,

ఆ సమాధానము జాగర్సుకు నచ్చినట్లుండెను. ఆ సంతృప్తితో నతనిట్లనెను: "నేను అటులే అనుకొన్నాను."

తరువాత నతనింకను నిట్లనెను: "మిత్రమా! నేను నిన్నొక ప్రశ్న అడిగినాను. నీవేమైన నన్ను అడుగవలసి యున్నదా?"

"నేను మిమ్ములను చాల ప్రశ్నల నడుగవలసి యున్నది. వానినన్నింటిని అడిగినచో నా హృదయము కొంచెము తేలిక పడును. కాని మీ నిషేధము నాకు జ్ఞప్తియందున్నది."

"ఒక్క ప్రశ్న అడుగుట కనుమతి యొసగుచున్నాను"

"నాకు సహాయ్యము చేయుచున్నవారెవరో ఈ నాడు నాకు తెలియజేయుదురా?"

"వీలు లేదు. మఱియొక ప్రశ్న అడుగుము."

"ఆవిషయమును నాకు త్వరలోనే తెలియజేయుదురా?"

"ఆ ప్రశ్నను కొంచెముసేపు ఆపుము. మఱియొక ప్రశ్న అడుగుము."

ఏ ప్రశ్న అడుగవలయును? ఎట్టకేలకు నేనిట్లంటిని. "అయ్యా! నాకు నేడేమైన ఇచ్చెదరా?"

ఆ ప్రశ్నను వినగానే జాగర్సు విజయసూచకముగ నిట్లు చెను: "ఆ విషయమునకు వత్తుమని తలచినాను" పిమ్మట నతడు వెమ్మిక్‌ను పేరుపెట్టిపిలిచి, "ఆ కాగితము నిటు తీసికొనిరమ్ము" అని యనెను. అంతట వెమ్మిక్ ఒక కాగితమును జాగర్సు చేతికిచ్చి వెంటనే వెళ్ళిపోయెను.

తరువాత జాగర్సు ఇట్లనియెను: "మిస్టర్ పిప్! ఇటు వినుము. నీవు స్వేచ్ఛగా డబ్బు వాడుకొనుచున్నావు. నీ పేరు

కాతా పుస్తకములో తెలిసుగా కనబడుచున్నది. అయినను నీవు అప్పులలో మునిగి యున్నావనుకొందును?"

"అవును అని చెప్పవలసి వచ్చినందుకు భయపడు చున్నాను."

"అవును అని సమాధానము చెప్పవలయునను విషయము నీకు తెలియును. తెలియదా?"

"అయ్యా! అవును."

"నీకు ఎంత అప్పు ఉన్నదను విషయమును నేను అడుగ బోవుటలేదు. ఏలయన ఎంత అప్పుఉన్నదో నీకు సరిగా తెలి యదు. ఒకవేళ నీకు తెలిసినను, సరిగా చెప్పవు. తక్కువ మొత్త మునే చెప్పెదవు. తక్కువ మొత్తము చెప్పవని నీవు అనుకో వచ్చును. కాని తప్పక చెప్పెదవు. నీకంటె బాగుగ నాకే తెలి యును. ఇట్లనుచున్నందుకు క్షమింపుము. అది సరేగాని ఈ కాగి తమును నీచేతితో తీసికొనుము, తీసికొన్నావుకదా? చాల మంచిది. ఇప్పుడు దాని మడతలు విప్పుము. అది ఏమో చెప్పుము."

"అయ్యా! ఇది అయిదువందల పౌనుల బ్యాంకునోటు."

"అది అయిదు వందల పౌనుల బ్యాంకునోటు. అదిచాల పెద్ద మొత్తము. నీవా విధముగ భావించు చున్నావా?"

"నేను మఱియొక విధముగ నెట్లు భావింపగలను?"

"అది సరేకాని, నా ప్రశ్నకు సమాధానము చెప్పుము."

"నిస్సందేహముగ."

"నిస్సందేహముగ నీవు దానిని పెద్దమొత్తముగ భావించు చున్నావు. మఱి, పిప్, ఆ పెద్ద మొత్తమిప్పుడు నీయది. నీకు

భవిష్యత్తుకాలమున పట్టనున్న అదృష్టమునకు సూచనగా నేడు నీకు వచ్చిన బహుమాన మియ్యది. నీ విప్పటినుండి ప్రతి సంవత్సరము ఆ పెద్దమొత్తముమీద జీవించు చుండవలయును. అంతకంటె ఎక్కువరాదు. నీకుమేలు చేయుచున్నవారు ప్రత్యక్షముగ కనబడువఱకు నీవటుల చేయుచుండ వలయును. అనగా నీడబ్బు వ్యవహార మిప్పటినుండి సంపూర్ణముగ నీచేతిలోనే యుండును. నీవు వెమ్మిక్ వద్దనుండి ప్రతి మూడు నెలలకు నూట ఇరువదియైదు పౌనులు తీసికొనవచ్చును. అసలు మనిషి కనబడువఱకు నీవటుల చేయవచ్చును. అతడు కనబడిన తరువాత నీవింక అతని ప్రతినిధితో వ్యవహరింపవలసిన పనియింక నుండదు. నేను అతని ప్రతినిధిని మాత్రమే యని నీ కిదివఱకు చెప్పియుంటిని. అతడిచ్చు సూచనలను నేను పాటించు చుందును. అందుకు ప్రతిఫలమును స్వీకరించు చుందును. ఆ సూచనలు సరియైనవి కావని నే ననుకొందును; కాని వాని మంచిచెడ్డలమీద అభిప్రాయము నిచ్చుటకు నాకు ప్రతిఫల మేమియు నిచ్చుట లేదు."

"నన్ను ఇంత చక్కగా ఉదార బుద్ధితో చూచుచున్నందుకు నాకు మేలుచేయుచున్న వారికి నే నెంతయు కృతజ్ఞుడను" అని నేను చెప్పబోవు చుంటిని.

కాని అంతలో జాగర్సు నన్ను ఆపి ఇట్లనెను: "నీ యీ మాటలను నే నెవ్వరికి చెప్పను. ఏలయన అందుకు ఎవ్వరును నాకు ప్రతిఫలము నొసగుట లేదు. కావున నీ మాటలు వృథా."

కొంచెమాగి నేను ఇట్లంటిని: "నే నింతకు ముందు మిమ్ముల నొక ప్రశ్న అడిగి యుంటిని. దానిని కొంచెముసేపు

ఆపవలయునని మీరు అంటిరి. ఆ ప్రశ్నను తిరిగి అడుగుటలో తప్పేమియు లేదను కొందును."

"ఆ ప్రశ్న ఏమి?"

నేను కొంచెముసేపు తటపటాయించి ఇట్లంటిని: "అయ్యా! నాకు మేలు చేయుచున్నవారు త్వరలోనే—"

అంతటితో నేను ఆగిపోతిని.

"త్వరలోనే ఏమిటి? నీ మాటలు ప్రశ్నరూపమున లేవను విషయము నీకు తెలియును."

కొంచెముసేపు ఆలోచించి నేనా వాక్యము నిట్లు పూర్తి చేసితిని: "లండను మహానగరమునకు విచ్చేయుదురా? లేక నన్నచ్చటికైనను పిలిపించు కొందురా?"

"నేను నిన్ను మొట్టమొదటిసారిగా ఒకనాటి సాయంకాలమున మీ గ్రామములో కలిసికొని యుంటిని. అప్పుడా విషయమునుగూర్చి నేను నీకేమి చెప్పియుంటిని?"

"నాకు మేలు చేయువారు కనబడుట చాల సంవత్సరములు పట్టునని మీరు చెప్పియుండిరి.''

"నీప్రశ్నకు అదే సమాధానము."

"ఇంకను చాల సంవత్సరములు పట్టునని మీరుభావించుచున్నారా?"

"ఛీ! మిత్రమా! నేను నీతో దాపరికము ఏమియు లేకుండ మాట్లాడుదును. ఆ ప్రశ్నను నీవు నన్నడుగరాదు. నన్ను ఇఱుకునపెట్టు ప్రశ్న అది. ఇప్పుడు నీవు నా పరిస్థితిని బాగుగ అర్థము చేసికొనగల వనుకొందును. నేను ఇంకను కొంచెము ముందుకు పోదును. మఱికొంచెము వివరించి చెప్పెదను."

కొంచెము సేపు ఆగిన తరువాత అతడింకను నిట్లనెను: "నీకు మేలుచేయువారు ప్రత్యక్షమైన తరువాత, నీవు, వారు కలసి మీ వ్యవహారమునుగూర్చి మాట్లాడుకొనవచ్చును. వారు ప్రత్యక్షమైన తరువాత ఈ వ్యవహారములో నా పాత్ర అంతమై పోవును; నాకింక జోక్యమేమియు నుండదు. వారు ప్రత్యక్షమైన తరువాత, దానిని గురించి తెలిసికొనవలసిన అవసరమేమియు నాకుండదు. నేను చెప్పవలసిన దంతయు నింతియే."

"మీరు చెప్పవలసినదంతయు అదియే యైనచో నేనింక చెప్పవలసిన దేదియు నుండదు."

"అవును" అన్నట్లు అతడు తల యూపెను. తన జేబులో నుండి గడియారమును బయటకు తీసి చూచెను. "నీ వెచ్చట భోజనము చేయబోవుచున్నావు?" అని నన్ను ప్రశ్నించెను. "నేను నా మిత్రుడు హెర్బర్టుతో కలసి మా బసలోనే భోజనము చేయుదును. దయయుంచి మీరుకూడ మాతో బాటు భోజనము చేయుటకు రావలయునని ఆహ్వానించుచున్నాను."

"నేను నీ ఆహ్వానమును సంతోషముతో అంగీకరించుచున్నాను. మన మిరువురము కలసి నీబసకు నడచియే పోదము. నా కోసము ప్రత్యేక పదార్థము లేవియు తయారుచేయరాదు. నే నిప్పుడు ఒకటి రెండు ఉత్తరములు వ్రాసికొనవలసి యున్నది. తరువాత చేతులు కడుగుకొనవలసి యున్నది."

"నేను వెమ్మిక్ వద్దకుపోయి కూర్చుండెదను."

నా చేతికి అయిదువందల పౌనుల బ్యాంకునోటువచ్చినది గదా. దానితో ఒకపని చేయవలయునన్న విషయమున నేను

వెమ్మిక్ సలహాను అడుగవలయు ననుకొంటిని. ఆ యుద్దేశ్యముతో నేను వెమ్మిక్ వద్దకు పోతిని.

నేను పోవునప్పటికి అతడు తన ఇనుపపెట్టెకు తాళము వైచి, ఇంటికి పోవుటకు సిద్ధపడుచుండెను.

"వెమ్మిక్! నేను నీ సలహాను అడుగవలయు ననుకొను చున్నాను. ఒక స్నేహితుని కుపయోగ పడవలయునని నేను తీవ్రముగ వాంఛించు చున్నాను."

వెమ్మిక్ ఏమియు మాట్లాడలేదు.

నేనింకను ఇట్లంటిని: "ఆ మిత్రుడు మంచి వ్యాపారము చేసి అభివృద్ధి చెందవలయునని తీవ్రముగ వాంఛించుచున్నాడు. కాని అతని వద్ద పెట్టుబడి సొమ్ము లేదు. అందువలన అతడు వ్యాపారము ప్రారంభింప లేకున్నాడు. నే నతనికి సహాయ్యము చేయవలయునని తీవ్రముగా వాంఛించుచున్నాను."

"కొంత సొమ్మిచ్చియా?"

"అవును. కొంత సొమ్ముఇచ్చి సహాయ్యము చేయవలయునని అనుకొనుచున్నాను."

"పిప్! నేను నీ కొక విషయము చెప్పెదను వినుము. థేమ్స్ నదిమీద ఎన్ని వంతెన లున్నవో లెక్కపెట్టుము. ఒకటి రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు. మొత్తము ఆరు వంతెన లున్నవి. అందులో నీవొక వంతెనను ఎన్నుకోవచ్చును."

"నీ మాటలు నాకు అర్థమగుట లేదు."

"ఎందుకు అర్థము కావు? నీకు ఏ వంతెన కావలయునో కోరుకొనుము. ఆ వంతెనమీద నిలబడుము. నీ చేతిలోనున్న సొమ్మును థేమ్స్ నదిమధ్యకు విసరివేయుము. నీ సొమ్మునకు

ఎట్టిగతిపట్టునో బాగుగా తెలియును కదా! మిత్రునకు డబ్బు సహాయము చేసినప్పుడు గూడ ఆ డబ్బుకు అంతే గతిపట్టును. పైగా నిష్ఠురములు కూడ నుండును" అట్లని యతడు నోరు బాగుగ తెఱచెను.

"నీమాటలు చాల నిరుత్సాహకరముగ నున్నవి" అని యంటిని.

"అవును. అటులనే యుండును."

"అయిన నీ అభిప్రాయము ఏమనుజుడును, ఎప్పుడును తన స్నేహితులకు సొమ్ము సహాయ్యము చేయరాదనియా?"

"అవును. ఎవ్వరును, తమ స్నేహితుల కెప్పుడును డబ్బు సహాయ్యము చేయరాదని నేను గట్టిగా అభిప్రాయపడు చున్నాను. ఈ విషయమున మరియొక అభిప్రాయమునకు తావు లేదని నేను సంపూర్ణ విశ్వాసముతో చెప్పగలను. కాని ఒక సందర్భమున మాత్రము స్నేహితులకు సహాయ్యము చేయ వచ్చును. ఆ స్నేహితులను పోగొట్టుకో దలచిన సందర్భమున, వదలించుకో దలచిన సందర్భమున మాత్రము వారికి డబ్బు సహాయ్యము చేయవచ్చును. ఆ స్నేహితులను వదలించుకొనుటకు ఎంత డబ్బు ఖర్చు పెట్టవలయునన్నది మాత్రము విచారణీయమయిన అంశము."

"అది నీ నిశ్చితమైన అభిప్రాయమా?"

"అవును. ఈ కార్యాంశములో అదియే నా నిశ్చితమైన అభిప్రాయము."

అతని మాటలలో నాకు కొంచెము సందు కనబడెను. అందువలన నేనిట్లంటిని: "మఱి నీ యింటివద్ద నీ అభిప్రాయ మెట్లుండును?"

"షిష్! మా ఇల్లు ఒక ప్రదేశము. ఈ కార్యాలయము మఱియొక ప్రదేశము. ఈ రెండింటిని కలుపరాదు. మా ఇంటి వద్ద నా కెట్టి అభిప్రాయములుండునో అచ్చటనే తెలిసికోవల యును. ఈకార్యాలయమున ఇచ్చటి అభిప్రాయములనే తెలియ జేయుదును. మఱియొక ప్రదేశమున నాకుండు అభిప్రాయము లను ఇచ్చట తెలియజేయను."

"అయిన నేను నిన్ను మీ యింటివద్ద తప్పక కలిసికొనె దను. నీవు నా మాటపై ఆధారపడి యుండవచ్చును."

"మంచిది. నేను నిన్నచ్చట సాదరముగ ఆహ్వానింతును. మన మచ్చట వ్యక్తిగత హోదాలో మాట్లాడు కొనవచ్చును."

జాగర్సు చెవులు పాము చెవులు. అందువలన మేము అతనికి వినబడకుండ మెల్లిగ మాట్లాడి జాగ్రత్త తీసికొంటిమి. మామాటలు ముగియు నప్పటి కచ్చటకు జాగర్సు వచ్చెను. మేము ముగ్గురము కలసి ఇంటిలోనుండి బైటికి పోతిమి. బయ టకు పోయిన తరువాత వెమ్మిక్ తనదారిని వెళ్ళిపోయెను. మిగి లిన ఇద్దరము నా బసకుపోసాగితిమి.

మేము బసను చేరుకొంటిమి. అప్పుడచ్చట హెర్బర్టు కూడ నుండెను. మేము ముగ్గురముకలసి భోజనముచేసితిమి. కాని జాగర్సువద్దనుండి క్రొత్తవిషయము లేవియు తెలియలేదు. అందుకు నేనెంతయు విచారింపసాగితిని. భోజనమైపోయిన తరు వాత జాగర్సు తనయింటికి వెళ్ళిపోయెను.

మఱునటి ఆదివారమునాడు నేను వెమ్మిక్ ఇంటికిపోయి అతనిని కలసికొంటిని. అతనికి హెర్బర్టు చరిత్రనంతను చెప్పితిని. అతనికి సాహాయ్యము చేయవలసిన ఆవశ్యకతనుగూడ వివరించి చెప్పితిని. "నేను సాహాయ్యము చేయుచున్నానని అతని కిసుమంతయు తెలియరాదు. కాని అతనికి సాహాయ్యమందవలెను. నేను సాహాయ్యము చేయుచున్నానని తెలిసినచో అతడా సాహాయ్యమును స్వీకరింపడు" అని నేను అంటిని.

వెమ్మిక్ తానుగూడ బయటపడకుండ హెర్బర్టుకు సాహాయ్యమందునట్లు చేయుటకు అంగీకరించెను.

వెమ్మిక్ కృషి సఫలమయ్యెను.

మాకు క్లారికర్ అను పేరుగల యువకవర్తకుడొకడు లభించెను. అతనికి పెట్టుబడి, పనిచేయుటకొక యువకుడు కావలసియుండెను. అందువలన నేను అతనితో రహస్యముగా నొక యొడంబడిక చేసికొంటిని. ఆ యొడంబడిక ప్రకారము అతని కొక్కసారిగా రెండువందలఏబదిపౌను లిచ్చితిని. ముందు ముందు మఱికొన్ని మొత్తముల నిచ్చుటకుగూడ అంగీకరించితిని. హెర్బర్టు అతనివద్ద పనిచేయునటుగూడ చెప్పితిని. ఆ ప్రకారము హెర్బర్టు అతనివద్దపనిచేయసాగెను.

తన అదృష్టమునకు నేను కారకుడనని హెర్బర్టు అణుమాత్రమైనను అనుమానింపకుండెను. క్లారికర్‌తో పరిచయమైన మొదటినాడు అతడు ఎంతో ప్రకాశవంతమైన మొగముతో నావద్దకు వచ్చెను. ఆ మొగమును నేను ఎన్నటికిని మఱచిపోజాలను. అతడా మొగముతో నావద్దకువచ్చి ఎట్లకేలకు తనకు దారిదొరికిన విషయమును వివరించిచెప్పెను. రోజులు

గడచుచున్నకొలది అతనిఆశలు ఫలించుచున్నట్లుండెను. ఎట్టకేలకతని ఆశలు ఫలించెను. అతడు క్లారికర్ వ్యాపారసంస్థలో వాటాదారుగా ప్రవేశించెను. ఆనాడు నేనెంతయు సంతసించితిని.

నేనానాటిరాత్రి పక్కమీద పరుండి ఆనందబాష్పములు కార్చితిని. నా భవిష్యత్తుమాట ఎట్లున్నను హెర్బర్టుకు ఆనందమయమైన భవిష్యత్తు ఏర్పడనున్నందుకు నేనెంతయు సంతసింపసాగితిని.

# 19

ఎస్టెలా రిచ్మండులో నివసించుచున్నదికదా. నేనామె వద్దకు ఎన్నోసార్లు పోసాగితిని. ఆమె నివసించుచున్న ఇంటి యజమానురాలిపేరు బ్రాండ్లీ. ఆమె విధవ, ఆమెకూతురు ఎస్టెలా కంటె చాలఏండ్లు పెద్దది, కాని ఆశ్చర్యకరమైన విషయమేమన తల్లి పడుచుపిల్లవలె కనబడును. కూతురు ముసలిదానివలె కనబడును. వారి అభిరుచులుగూడ వేఱు. తల్లికి ప్రాపంచిక విషయములన్న నెక్కువ ఇష్టము. కుమార్తెకు ఆధ్యాత్మిక విషయములన్న నెక్కువ ఇష్టము. వారు ఇతరుల ఇండ్లకు పోవుచుండెడివారు. ఇతరులు వారియింటికి వచ్చుచుండెడివారు. హావిషమ్కన్య ఏకాంత నివాసములోనికి పోక పూర్వము బ్రాండ్లీకి మిత్రురాలు. అందువలననే ఆమె ఎస్టెలాను బ్రాండ్లీ వద్దకు పంపియుండెను.

బ్రాండ్లి గృహములోను, బయటనుకూడ ఎస్టెలానన్ను ఎన్ని విధముల బాధపెట్టుటకు వీలుండునో, అన్ని విధముల బాధ పెట్టసాగెను. నేను తఱచుగా ఆమె వద్దకు పోవుచుండుటవలన మాకు పరిచయము హెచ్చుచుండెను. కాని ఆమెకు నాపట్ల అభిమానము మాత్రము హెచ్చకుండెను.

ఆమెను ప్రశంసించు మగవారు పలువురుండెడివారు. వారినందఱును బాధపెట్టుటకు ఆమె నన్నుపయోగించుకొనుచుండెడిది. నే నామెకు దగ్గఱగనున్నను దూరముగ నున్నట్లే భావించుకొనసాగితిని. ఎంతో బాధపడుచుంటిని. కాని ఆమెను నా దానిని గాచేసికోవలయుననియు, ఆమెతో జీవితాంతముచఱకు సౌఖ్యముల ననుభవింప వలయుననియు ఆశించుచుంటిని.

ఒకనాటి సాయంకాలము మే మిరువురము రిచ్మండు గృహములో నొక కిటికీవద్ద కూర్చుండి యుంటిమి. అప్పుడామె యిట్లనెను: "పిప్! పిప్! నీవెన్నడును హెచ్చరికను గ్రహింపవా?"

"దేనినిగూర్చి?"

"నన్నుగూర్చి."

"నీచే ఆకర్షింప బడకుండ హెచ్చరికయా? అదియేనా నీ యుద్దేశ్యము? ఎస్టెలా!"

"నా యుద్దేశ్యమదియా? నా యుద్దేశ్యమేమో నీకు తెలియకపోయినచో, నీవు అంధుడవన్నమాట."

"ప్రేమ గ్రుడ్డిది" అని జవాబీయవలయునను కొంటిని. కాని నేనా విధముగ సమాధానమీయ లేదు. సమాధానము లిచ్చుటలో కొంచెము తగ్గియుండుటయే మేలని భావించితిని.

హావిషమ్‌కన్య చెప్పినట్లు చేయుటతప్ప, వేఱు గత్యంతరము లేదను విషయము మాామెకు బాగుగ తెలియునుగదా!

"నీ దగ్గఱకు రావలసినదని ఉత్తరము వ్రాసినావు. కాని నాకు ఎట్టి హెచ్చరికను చేయలేదు" అని నే నంటిని.

"అది నిజమే. నే నొకరోజు తనతో గడపవలయునని హావిషమ్‌కన్య అభిప్రాయ పడుచున్నది. ఆరోజు వచ్చినది. నీవు నన్నచ్చటకు తీసికొని పోవలయును. తిరిగి ఇచ్చటకు తీసికొని రావలయును. నేను ఒంటరిగ ప్రయాణము చేయరాదని ఆమె అభిప్రాయము. కాని నేను సేవకురాలిని తీసికొని పోరాదని ఆమె ఆజ్ఞ. మఱి నీవు నన్ను తీసికొని పోదువా?"

"ఎస్టెలా? నేను నిన్ను తీసికొనిపోనా?"

"తీసికొని పొమ్ము. నీ కిష్టమైనచో నన్ను ఎల్లుండి తీసికొని పోవచ్చును. నీవు నీ స్వంతడబ్బు ఖర్చుపెట్టుటకు వీలు లేదు. ఈ నా పర్సులోని సొమ్మును మాత్రమే ఖర్చుపెట్ట వలయును. ఈ షరతు నీకు వినబడు చున్నదా?"

"ఆ షరతు ప్రకారమే నడచు కొందును."

మఱి ఆ ప్రయాణమునుగూర్చి నాకు తెలిసిన వివరము లివి. అన్ని ప్రయాణములకు సంబంధించిన వివరములును అంతియ. హావిషమ్‌కన్య నా కెన్నడును వ్రాసియుండలేదు. నేనామె స్వంత దస్తూరీని ఎన్నడును చూచి యుండలేదు.

నిర్ణీత దినమున నేను, ఎస్టెలాకన్య కలసి హావిషమ్‌కన్య గృహమునకు చేరుకొంటిమి. హావిషమ్‌కన్య లోగడ నేను చూచి నప్పటికంటె ఎక్కువగా ఎస్టెలా పట్ల ప్రేమను, అభిమానమును ప్రకటింపసాగెను. ఆమె ఎస్టెలా సౌందర్యమును ఆస్వాదింప

సాగెను. తరువాత నామె నా వంకకు తిరిగి యిట్లనెను: "ఆమె నిన్ను ఎట్లు ఉపయోగించుకొనుచున్నది? ఆమె నిన్ను ఎట్లు ఉపయోగించుకొనుచున్నది?" నేను సమాధానమేమియు చెప్పలేను.

నాటిరాత్రి హావిషమ్‌కన్య ఎస్టెలాను దగ్గఱ కూర్చుండబెట్టుకొని అనేక విషయములను తెలిసికొనెను. ఎస్టెలాచే బాధలు పెట్టబడుచున్న యువకుల పేర్లను వారి పరిస్థితులను పూర్తిగా తెలిసికొనెను. అప్పటి పరిస్థితినంతను చూడగా నా కొక అభిప్రాయము తట్టెను. హావిషమ్‌కన్య తన ప్రియునిచే మోసగింపబడినది. అందువలన నామె పురుషులపై ప్రతీకారము తీర్చుకోదలచుకొన్నది. అందుల కామె ఎస్టెలా నొక సాధనముగా నుపయోగించుకొనుచున్నది. ఆమె పగ పూర్తిగా తీఱువఱకు నేను ఎస్టెలాను వివాహము చేసికొను నవకాశము లభింపదు. ఇతరులను బాధ పెట్టవలయునను నుద్దేశ్యముతోనే ఆమె ముందుగా ఎస్టెలాను నా కీయవలయునని నిర్ణయించుకొన్నది. అందువలననే ఆమె ఎస్టెలాను బయటకు పంపి పలువురు బాధలు పడునట్లు చేయుచున్నది.

హావిషమ్‌కన్య ఎస్టెలా చేతులను గట్టిగా పట్టుకొని యుండెను. కాని ఎస్టెలా వానిని విడిపించుకొనుటకు ప్రయత్నింపసాగెను.

ఆ విషయమును గ్రహించిన హావిషమ్‌కన్య ఇట్లనెను: "ఏమి! నేనన్న నీకు విసుగు పుట్టినదా యేమి?"

ఎస్టెలా చేతులను వదలించుకొని కొంచెము దూరముగా బోయి యిట్లనెను: "నేనన్న నాకే కొంచెము విసుగు పుట్టినది."

అంతట హావిషమ్‌కన్య చేతికఱ్ఱతో నేలపై గట్టిగా కొట్టి ఇట్లనెను: "కృతఘ్నురాలా! నిజము పలుకుము. నీకు నేనన్న విసుగు పుట్టినది. ఇది నిజము కాదందువా?"

ఎస్టెలా ఏమాత్రము చలింపక కడు నిబ్బరముగా హావిషమ్‌కన్య వంక చూచెను. తరువాత కుంపటివంక చూచెను. కాని సమాధాన మేమియు చెప్పలేదు. ఆమె హావిషమ్‌కన్యను ఏమాత్రము లెక్కచేయని దానివలె నిలబడి యుండెను.

"ఓసీ! శిలా హృదయురాలా? నీహృదయము కరిగించుట లేదా?" అని హావిషమ్‌కన్య అనెను.

"ఏమి! నే నీవిధముగ నున్నందుకు నన్ను దూషించుచున్నావా? నీవు!"

"నీ వటువంటిదానవు కావా?"

"ఆ విషయము నీకే బాగుగ తెలియును. పొగడుము నీవు తయారు చేసినట్లుగనే నేను తయారైనాను. పొగడ్తలన్నియు తీసికొనుము; దూషణలన్నియు తీసికొనుము; విజయము తీసికొనుము; ఓటమి తీసికొనుము. వేయేల! నన్నే తీసికొనుము."

"అయ్యో! ఆమెను చూడుడు! ఆమెను చూడుడు! ఆమె ఎంత కఠినముగను, కృతజ్ఞతారహితముగను మాట్లాడుచున్నదో! ఆమెను నేను చిన్నప్పటినుండియు పెంచి పెద్దచేసినాను. ఆమెకొరకు ఎంతో త్యాగము చేసినాను. మఱి యామె నన్నీవిధముగ మాట్లాడుచున్నది. ఏమి చెప్పవలయును? అంతయు వృథా! అంతయు వృథా!"

"నాకా సంగతు లేవియు తెలియవు. అప్పుడు నేను చాల చిన్నదానను. అది సరేకాని నీ కిప్పుడేమి కావలయును? నీవు

నాకు చాల మంచి చేసినావు. నేను నీకెంతయు ఋణపడి యున్నాను. మఱి నీకేమి కావలయునో చెప్పుము."

"ప్రేమ !"

"నీవద్దనే యున్నది."

"నావద్ద లేదు."

"పెంపుడు తల్లీ! పెంపుడు తల్లీ! నా సర్వస్వము నీదే! నావద్ద నున్నవన్నియు నీవే! నీవు నాకిచ్చినవాని నన్నిటిని తిరిగి నావద్దనుండి పొందవచ్చును. అంతకుమించి నావద్దనేమియు లేదు. నీవు నాకీయనివానిని ఇప్పుడిమ్మన్నచో నేనెక్కడనుంచి తెచ్చి యీయఁగలను? నా కృతజ్ఞత, విధ్యుక్త ధర్మము అసాధ్యమగు కార్యమును చేయ లేవు గదా!"

"నేను ఆమె కెన్నడును ప్రేమనిచ్చియుండలేదా? నేను ఎన్నడును ఆమెకు ప్రేమ నిచ్చియుండ లేదా? చూడు మామె ఎట్లు మాటలాడుచున్నదో! నేను పిచ్చిదాననని ఆమె పిలుచు గాక! నేను పిచ్చిదాననని ఆమె పిలుచుగాక!"

"నీవు పిచ్చిదానవని నేనెందులకు పిలువ వలయును? ఇందఱు జనులుండగా నేనే ఎందులకు పిలవవలయును? నీ మనస్సు లోని అభిప్రాయము లేవో నాకు బాగుగ తెలియును. నీజ్ఞాపక శక్తి ఎట్టిదో నాకు బాగుగా తెలియును. నేను నీ మొగము వంక చూచుచు ఎన్నో పాఠములు నేర్చుకొన్నాను."

"అన్నియు మఱచిపోయినావు. మఱచిపోయినావు!"

"మఱచిపోలేదు, వాని నన్నిటిని జ్ఞప్తియందుంచు కొన్నాను. నీపాఠములకు వ్యతిరేకముగ నే నెప్పుడు నడచు కొన్నాను? నీ పాఠములను నేను ఎప్పుడు నిరాదరణ చేసినాను?

నీవు చెప్పని వానికి నా హృదయములో నెప్పుడు స్థానమిచ్చి నాను? న్యాయముగ మాట్లాడుము."

"ఏమి గర్వము, ఏమి అహంకారము!"

"అహంకారముగ నుండవలసినదని నాకు నేర్పినదెవరు? నే నా పాఠమును నేర్చుకొనునప్పుడు నిన్ను ప్రశ్నించిన దెవరు?

"ఏమి కాఠిన్యము! ఏమి కాఠిన్యము!"

"కఠినముగ నుండవలసినదని నాకు నేర్పినదెవరు? నే నా పాఠమును నేర్చుకొన్నప్పుడు నన్ను ప్రశంశించిన దెవరు?"

"కాని నాముందా గర్వమును, కాఠిన్యమును ప్రదర్శిం చుట! నా మీదనే నీ అహంకారమును, కాఠిన్యమును ప్రదర్శిం చుటయా!"

"మన మిరువురము వేఱుపడి చాల కాలమైనది. నే నిప్పుడు నీవద్దకు తిరిగివచ్చినాను. మఱి నీవు ఎందులకింత అన్యాయముగ ప్రవర్తించుచున్నావో నేను ఊహింపలేకున్నాను. నేను నీతప్పులను, వానికి గల కారణములను ఎన్నడును మఱచిపోయి యుండలేదు. నేను నీపట్లగాని, నీపాఠముల పట్లగాని, ఎన్నడును అవిశ్వాసమును ప్రదర్శించియుండలేదు. విరుద్ధముగ నడచుకొని యుండలేదు. నేనెన్నడును ఎటువంటి బలహీనతను ప్రదర్శించి యుండలేదు."

"నా ప్రేమను నాకు తిరిగి యిచ్చి వేయుట బలహీనత యగునా?"

"మీరు నన్ను ఒకందుకు తయారు చేసినారు. మఱి విజ యముతోను, ఓటమితోను నాకెట్టి సంబంధమును లేదు."

అంతట హావిషమ్‌కన్య నేలమీద కూర్చుండెను. నేను అదే సమయమనుకొని బయటకు పోతిని. ఒకగంటసేపు అటు నిటు తిరిగితిని. మరల ధైర్యముతో లోనికి వచ్చెను. అప్పటికి ఎస్టెల్లా హావిషమ్‌కన్య మోకాళ్ళవద్ద కూర్చుండి దుస్తులలో పాడైపోయిన భాగమును కుట్టుచుండెను. ఆ పని పూర్తియైన తరువాత మేమిరువురము పేకాట ఆడితిమి. తరువాత భోజనము చేసి నిదురింపబోతిమి.

నేనా గృహములో నిదురించుటకదియే మొదటిసారి. నిద్రాదేవత నన్నావహించుటకు తీవ్రముగ నిరాకరింపసాగెను. వేయిమంది హావిషమ్‌కన్యలు నాచుట్టును తిరుగుచున్నట్లుండెను. రాత్రి రెండుగంటలకు లేచి బయటకుపోతిని. తెల్లవారువరకు బయటనే తిరుగుచుంటిని. మరునాడు నేను, ఎస్టెల్లాకలసి రిచ్మండుకు తిరిగిపోతిమి.

నాతోబాటు మత్తయిపోకెట్ ఇంటివద్ద డ్రమ్మెల్, స్టార్టాప్ అనువారిద్దరుకూడ చదువుకొనుచుండిరని ఇదివరకు చెప్పియుంటిని. వారిలో డ్రమ్మెల్‌కు సంబంధించిన విషయము నొకదాని నిచ్చట చెప్పవలసియున్నది.

మేము కొందరము ఒకనాడు ద్రాక్షారసమును సేవింపబోవుచుంటిమి. అప్పుడు మాలో నొకడగు డ్రమ్మెల్ "ఎస్టెల్లా ఆరోగ్యముకొరకు ద్రాక్షారసమును సేవింతము" అనియనెను.

"ఏ ఎస్టెల్లా?" అని నేను ప్రశ్నించితిని.

"ఎవరైన నీకేమి?" అని అతడు అనెను.

"ఎక్కడికి ఎస్టెలా?" ఆమె ఎచ్చట నివసించుచున్నదో నీవు తప్పక చెప్పవలయును."

"రిచ్మండులో నివసించుచున్నది ఆమె సౌందర్యరాశి."

"ఆ యువతిని నేనెఱుగుదును" అని హెర్బర్టు అనెను.

"నీవు ఎఱుగుదువా?" అని డ్రమ్ముల్ అనెను.

"నేనుకూడ ఎఱుగుదును" అని నేను అంటిని.

"నీవుకూడనా! ఓయి భగవానుడా!" అని డ్రమ్ముల్ అనెను.

అంతట నేను కోపముతో లేచినిలబడి అతనితో నిట్లంటిని: "ఓయీ! నీకు ఆమెకు సంబంధించిన పూర్తివిషయములు బాగుగ తెలియవు. అట్టి యువతీరత్నము పేరెత్తుట నీ తెలువతనమును సూచించుచున్నది."

"అటుల మాట్లాడుటలో నీయుద్దేశ్యమేమి?" అని అతడనెను.

"మనకు వాదములెందుకు? నేను నీతో పోట్లాడి ఈ విషయమును తేల్చుకొనుటకు సిద్ధముగ నున్నాను" అని అంటిని.

కాని తరువాత మేము రాజీపడితిమి. ఎస్టెలా అతనితో కలసి చాలసార్లు నాట్యముచేసినదని తెలియవచ్చుటచేతనే నేను రాజీకి అంగీకరించితిని. కాని డ్రమ్ముల్ వంటి పనికిమాలినవానితో ఆమె సంబంధము పెట్టుకొనుచున్నందుకు నేనుఎంతయు బాధపడసాగితిని.

ఒకనాడు రిచ్మండులో యువతులు, యువకులు, కొందరు సమావేశమైరి. అందఱు నాట్యప్రదర్శనము లిచ్చిరి. కానిఎస్టెలా అత్యద్భుత నాట్యప్రదర్శనము నిచ్చెను. ఆ సందర్భమున

డ్రమ్మోల్ ఆమెను వెంబడింపసాగెను. ఆమె యతనిని తిరస్కరింపక సహించి యూరకుండెను. అది నాకెంతయు బాధాకరముగ నుండెను.

అవకాశము చిక్కగానే నేనామెతో నిట్లంటిని: "ఎస్టెలా! నీవు బాగుగ అలసిపోయియుంటివా?"

"అవును, కొలదిగా అలసిపోయియుంటిని."

"నీకు మఱియింక నేపనియు లేదనుకొందును."

"లేకేమి? నిదురించుటకుముందు హావిషమ్‌కన్య కొక యుత్తరము వ్రాయవలసియున్నది."

"నేటివిజయమును వర్ణించుచు వ్రాయవలయునా? ఇది ఏమంత పెద్ద విజయముకాదే!"

"అట్లు మాట్లాడుటలో నీ యుద్దేశ్యమేమి? నేడు నేను విజయము పొందినట్లు నాకేమియు తెలియదే!"

"తెలియకేమి! అదిగో ఆ మూల కూర్చున్నవానిని చూడుము. అతడు మన వంకకే చూచుచున్నాడు."

"నే నెందులకు చూడవలయును? ఆమూల కూర్చున్న వానిలో నేమి యున్నదని నే నతని వంక చూడవలయును?"

"నేను అదే ప్రశ్నను నిన్ను అడుగదలచుకొన్నాను. అతడీ రాత్రి యంతయు నీ వెంటబడి తిరిగినాడు కదా!"

"చిమ్మటలు, మఱి ఇతర రకముల అసహ్యాకరమైన పురుగులు వెలుగుచున్న క్రొవ్వువత్తిచుట్టు తిరుగుచుండును. మఱి క్రొవ్వువత్తి ఏమి చేయగలదు?"

"క్రొవ్వువత్తి ఏమియు చేయలేదన్నమాట నిజమే. కాని ఎస్టెలా ఏమియు చేయలేదా?"

పుటయందు ఎక్కువ ఆసక్తిని చూపుచుంటిని. ప్రతిదినము నిర్ణీత సమయమున కొన్ని గంటలు ఉపయోగకరమైన గ్రంథములు చదివి నా విజ్ఞానము నభివృద్ధి చేసికొను చుంటిని. హెర్బర్టు తన వ్యాపారము నభివృద్ధి చేసికొనుటలో నిమగ్నుడై యుండెను.

వ్యాపార సందర్భమున హెర్బర్టు మార్సెయిల్సుకు వెళ్ళి యుండెను. అందువలన నేను ఒంటరిగ నా గదిలో కూర్చుండి యుంటిని. ఆ సమయమున నామనస్సు చాల నిరుత్సాహకరముగ నుండెను. నా భవిష్యత్తునుగూర్చి ఇంకను స్పష్టముగ తెలియ నందున నేను ఆందోళన పడుచుంటిని. హెర్బర్టు లేక పోవుట వలనగూడ నాకేమియు తోచకుండెను.

నాటిరాత్రి గాలి ప్రచండముగ వీచుచుండెను. వర్షము గూడ కురియు చుండెను. నేను గదిలో నొంటరిగ కూర్చుండి ఏదో పుస్తకము చదువుకొను చుంటిని. నా గడియారము పది నొకండు గంటలైనదను విషయమును తెలుపగానే నేను పుస్తకము మూసివైచితిని. అదే సమయమున సెయింట్ పాల్ చర్చి లోని గడియారము, మఱి కొన్ని ఇతర గడియారములు పది నొకండు గంటలు కొట్టెను. నేను వాని సవ్వడిని వినుచుంటిని. అంతలో మేడమెట్లమీద నేదో సవ్వడి వినబడెను.

అది నా చనిపోయిన సోదరి అడుగుల సవ్వడివలె నుండెను. ముహూర్తకాలములోనే నా తలంపును మాని మరల వినసాగితిని. మేడమెట్లమీద నెవ్వరో నడచి వచ్చు చున్నట్లుండెను. మేడమెట్లు సరిగా లేవను విషయము జ్ఞాపకము వచ్చి దీపము తీసికొనిపోయి మేడమెట్ల పై భాగమున నిలబడి

తిని. నా దీపమును చూడగానే మేడమెట్లమీదనున్నవాడు ఆగి పోయిరి. నాకు సవ్వడి వినబడ కుండెను.

"క్రింద నెవ్వరో ఉన్నారను కొందును. ఎవ్వరును లేరా?" అని నే నంటిని.

"అవును" అన్నగొంతు వినబడెను.

"మీకు ఏ అంతస్తు కావలయును?"

"పై అంతస్తు. పిప్ కావయును."

"అది నాపేరు. పొరపాటేమియు లేదను కొందును."

"పొరపాటేమియు లేదు."

ఆ మనుజుడు పైకి రాసాగెను. దీపపు కాంతిలో నే నతనిని చూడ సాగితిని. అతడు సముద్ర ప్రయాణికునివలె ముతుకు దుస్తులను ధరించి యుండెను. అతనికి సుమారు అరువది సంవత్సరముల వయస్సుండును. అతడు మంచి కండలు తీరిన బలిష్టునివలె నుండెను. అతడు చాల పైకి వచ్చెను. అప్పుడతడు రెండు చేతులను నా వంకకు చాపు చున్నాడను విషయమును గ్రహించితిని.

"అయ్యా! నాతో మీకేమి పనియో చెప్పుడు."

"నా పనియా? అవును. నాపనియేమో నీ యనుమతితో వివరించి చెప్పెదను."

"మీరు లోపలికి రాదలచు కొన్నారా?"

"వత్తును. నేను లోపలికి రాదలచు కొన్నాను."

అతని సమాధానము నాకు రుచింపలేదు. అయినను నే నతనిని నా గదిలోనికి తీసికొని పోతిని. దీపమును బల్లమీదపెట్టి

"అయ్యా! మీరు వచ్చిన పనియేమో వివరించి చెప్పుడు" అని అంటిని.

అతడు తనచుట్టును ఎంతో సంతృప్తితో కలయజూచెను. తరువాత తనకోటును, టోపీని తీసివైచెను. అప్పుడతడు బట్టతల వాడని విషయమును గ్రహించితిని. కాని అతని నరము చేసికొనుటకు తగిన సూచనలేవియు కనబడలేదు. అతడు తనరెండు చేతులను నా వంకకు చాపుచుండెను.

అతడు పిచ్చివాడేమో యని నేను అనుమానపడసాగితిని. "మీయుద్దేశ్యమేమి ?" అని అంటిని.

అంతట నతడిట్లనెను: "ఎంతో కాలమునుండి రావలయునని అనుకొని, ఎంతో దూరమునుండి వచ్చిన తరువాత ఈవిధముగ జరుగుట నిరాశాజనకముగ నుండును. కాని అందుకు నిస్సనవలసినపని ఏమియు లేదు. నన్నుగూడ అనుకోవలసిన పనిలేదు. నేను ఒక్క అరనిమిషములో మాట్లాడెదను. దయయుంచి నాకు ఒక్క అరనిమిషము వ్యవధి యిమ్ము."

తరువాత నతడు కుంపటిముందున్న కుర్చీమీద కూర్చుండెను. మొగమును రెండుచేతులతో కప్పుకొనెను. నేనతని పరిశీలనగాచూచి కొంచెము వెనుకకు తగ్గితిని. అతడెవ్వరో మాత్రము నాకు అర్థముకాలేదు.

అతడు చుట్టునుచూచి, "ఇచ్చట మఱియింక నెవ్వరును లేరుకద! ఎవ్వరును లేరుకద!"

"మీరెవ్వరో క్రొత్తవారు. ఈ అర్థరాత్రి సమయమున నిచ్చటకు వచ్చినారు. మఱి అటువంటి సందర్భమున ఆ ప్రశ్న నెందుకు కడిగెదరు?"

"నీవు చాల ధైర్యవంతుడవు; గౌరవనీయుడవు. నీవు ఈ విధముగ తయారైనందుకు నేనెంతయు సంతసించుచున్నాను. కాని నన్ను పట్టుకొనకుము. పట్టుకొన్నచో నీవు తరువాత విచారింపవలసి వచ్చును."

నా మనస్సులోని అభిప్రాయము నతడు గ్రహించెను. నేనింక ఆపని చేయు ఉద్దేశ్యమును మానుకొంటిని. ఏలయన అతనిని నేను గుర్తించితిని! అతడు తన జేబులోని ఆకురాయిని తీసిచూపవలసిన పని లేదు. నేనతనిని గుర్తించితిని. ఒక్క క్షణకాలమునకు ముందు అతడెవ్వరో నాకు తెలియదు. కాని అతడెవ్వరో ఇప్పుడు నాకు తెలియును.

అతడు నేను నిలబడియున్న ప్రదేశమునకువచ్చి మరల రెండుచేతులు చాపెను. ఏమిచేయవలయునో నాకు తోచకుండెను. ఇష్టము లేకుండగనే నా చేతుల నతనికి అందిచ్చితిని. అతడు వానిని సంతోషముతో పట్టుకొని, తన పెదవులవద్ద పెట్టుకొని, ముద్దుపెట్టుకొనెను. తరువాతగూడ వానిని పట్టుకొనియే యుండెను.

"నీవు చాల ఉదారముగ ప్రవర్తించినావు, నాయనా! ఘనుడవైన పిప్! నేను దానినెన్నడును మఱచిపోలేను!" అని అతడు అనెను.

తరువాత నతడు నన్ను కౌగిలించుకొనబోవుచున్నట్లుండెను. అంతట నేను అతనిఱొమ్ముమీద చేయిపెట్టి దూరముగా నుంచితిని.

నే నిట్లంటిని: "ఆగుము! దూరముగా నుండుము. నేను చిన్నవాడుగా నున్నప్పుడు నీకు చేసిన సహాయమునకు కృతజ్ఞత

చూపదలచుకొన్నావా ? అయిన నీవు నీ జీవిత విధానమును మార్చుకొని బాగుపడినావనుకొనుచున్నాను. అదియే నీవు నాకు చూపదగిన కృతజ్ఞత. నన్ను అభినందించుటకే నీవిచ్చటకువచ్చియున్నచో, అది అనవసరమని చెప్పదలచుకొన్నాను. అయినను నీ విచ్చటకు వచ్చి నన్ను కనుగొన్నావు. నీ వేదో సద్భావముతోనే ఇచ్చటకు వచ్చియున్నావని భావించుచున్నాను. అందువలన నేను నిన్ను వెళ్ళగొట్టను. అయినను నీవు తప్పక అర్థము చేసికోవలసిన దొకటియున్నది. అని ఏమియనగా నేను..."

అతడు నన్ను తేఱిపాఱజూచుచుండెను. అందువలన నింక నానోటినుండి మాట రాకుండెను.

కాని అతడిట్లనెను "నేను తప్పక అర్థముచేసికోవలయునని నీవేదో చెప్పుచుంటివి. నేను తప్పక అర్థముచేసికోవలసిన దేది?"

"నేను చాలకాలమునుక్రిందట ఏదో దైవవశమున నీతో మాట్లాడుట తటస్థించినది. ఇప్పుడు పరిస్థితులన్నియు మారి పోయినవి. అందువలన నీతోనింక ఇదివఱకువలె మాట్లాడుటకు వీలులేదు. నీవు పశ్చాత్తాపపడినావనియు, జీవితవిధానమును మార్చుకొన్నావనియు నమ్ముచున్నాను. అందులకెంతయు సంతసించుచున్నాను ఈవిధముగ చెప్పుటకు నేనెంతయు సంతసించుచున్నాను. నేను అభినందింపబడుటకు తగినవాడనని నన్ను అభినందించుటకు వచ్చినావు. అందులకెంతయు సంతసించుచున్నాను. కాని మనమార్గములు విభిన్నములు. నీవు తడిసిపోయియున్నావు. బాగుగ అలసిపోయినట్లు కనబడుచున్నావు. నీవిచ్చటనుండి వెళ్ళి పోవుటకుముందు ఏదేని పానీయమును సేవింతువా?"

"నేను వెళ్ళిపోవుటకుముందు తప్పక పానీయమును సేవింతుననుకొందును."

నేనతనికి కొన్ని సీసాలనుచూపి, "నీకేపానీయము కావల యును?" అని ప్రశ్నించితిని. అతడు ఆ సీసాలవంకకు చూడ కుండగనే, ఏమియు మాటలాడకుండగనే ఒకసీసాను పట్టు కొనెను. అంతటనేను అతనికొరకు వేడిపానీయమును తయారుచేసి యిచ్చితిని. అప్పుడతనికన్నులు బాష్పములతో నిండియున్నదృశ్య మునుజూచి ఎంతయు ఆశ్చర్యపడితిని.

అతడు వెంటనే వెళ్ళిపోవలయునను విషయమును స్పష్ట ముగా తెలియజేయుటకై నేనంతవరకు నిలబడియేయుంటిని. కాని అతనికన్నీటిని చూడగానే నా మనస్సు మెత్తబడెను. నా ప్రవర్తనకు నన్ను నేను నిందించుకొనసాగితిని. నేనతనికి దగ్గ రగా ఒకకుర్చీమీద కూర్చుండియిట్లంటిని: "నేనింతకుముందు కఠినముగ మాట్లాడితినని నీవు ఏమాత్రము అనుకొనరాదు. కఠి నముగ మాట్లాడవలయునను నుద్దేశ్యము నాకెప్పుడును లేదు. ఒకవేళ నేను కఠినముగ మాట్లాడియుండినచో అందులకెంతయు విచారించుచున్నాను. నీవు సుఖముగనుండవలయుననియు, క్షేమ ముగ నుండవలయుననియు వాంఛించుచున్నాను."

నేనుగూడ గ్లాసులో పానీయమును పోసికొని దానిని నా పెదవులవద్ద పెట్టుకొనుచుంటిని. అంతట నతడు తనచేయి చాచెను. నేను నాచేతిని నతనికందిచ్చితిని. అంతట నతడు తన గ్లాసులోని పానీయమును త్రాగెను.

"నీవెట్లు జీవనము గడుపుచున్నావు?" అని నేను ప్రశ్నిం తిని.

"ఒకవిధముగా పని ఏమియున్నది? నేను ఎన్నో పనులు చేసితిని. ఇచ్చటికి కొన్ని వేలమైళ్ళ దూరముననున్న నూతన ప్రపంచములో ఎన్నో పనులు చేసితిని."

"నీవు బాగుగ పనిచేసినావనుకొందును."

"నేను అత్యద్భుతముగ పనిచేసినాను. అత్యద్భుత విజయమును సాధించినాను. నాతోబాటు అచ్చటకువచ్చిన పలువురుగూడ బాగుగపనిచేసి మంచిలాభములు గడించినారు. కాని వారికిని నాకును పోలిక లేదు. వారిలాభములకు నా లాభములకు పోలిక లేదు. నా లాభము అపారమైనది, అత్యద్భుతమైనది."

"నేనా విషయమును వినుటకెంతయు సంతసించుచున్నాను."

"నీ పనులు సఫలమగుననియే ఆశించుచున్నాను, నాయనా!"

అతని మాటలనుగాని, ధోరణినిగాని అర్థము చేసికొనుటకు ప్రయత్నింపకుండగనే నే నిట్లంటిని: "ఒకప్పుడు నీవు నావద్దకొక వార్తాహరుని పంపినావు. తరువాత అతని నెప్పుడైన చూచినావా?"

"ఎప్పుడును చూచియుండలేదు. ఇకముందు చూడను గూడ."

"అతడు నమ్మకముగానే వచ్చి నాకు రెండు ఒకపౌను నోట్లు నిచ్చినాడు. అప్పుడు నేను బీదబాలుడను. అందువలన నా కప్పుడా డబ్బు పెన్నిధివలె నుండెను. అప్పటినుండి నీపరిస్థితి అభివృద్ధిచెందుచున్నట్లే, నా పరిస్థితికూడ అభివృద్ధి చెందినది. అందువలన నేను ఆ బాకీని తీర్చివేయుదును. నీ విందులకనుమతింప

వలయును. నీ వీ సొమ్మును మఱియొక బీదబాలుని కుపయో గింపవచ్చును."

అట్లని నేను నా పర్సును బయటకు తీసితిని.

నేను పర్సును తెఱచితిని. అందులోనుండి రెండు ఒక పౌను నోట్లను బయటకు తీసితిని. నే నట్లు చేయుచుండగా అతడు చూచుచునే యుండెను. నేను బయటకు తీసినవి క్రొత్త నోట్లు. వానిని నేను అతని కిచ్చితిని. అతడు వానిని తీసికొని చుట్ట చుట్టి దీపమునకు ముట్టించెను. అవి క్షణకాలములో బూడిదయై పోయెను.

తరువాత నతె ట్లనెను: "నేను నిన్ను సాహసముతో ప్రశ్నించుచున్నాను. వినుము. నీవు నేను చిత్తశినేలలో కలసి కొన్న తరువాత నీ పరిస్థితి ఎట్టుల అభివృద్ధి చెందినది?"

"ఎట్టుల?"

"అవును."

అతడు గ్లాసు ఖాళీచేసి కుంపటిముందు నిలబడెను. అతడు నాపంక తేఱిపాఱ జూడసాగెను. అప్పుడు నాకు వణుకు ప్రారంభ మయ్యెను.

నా నోటివెంట మాట రాకుండెను. ఎట్టకేలకు ఎంతో కష్టపడి నేను ఇట్లంటిని: "ఎవ్వరో ఒకరు నాకు గొప్ప ఆస్తిని ఈయనున్నారు."

"ఏ ఆస్తి?"

"నాకు తెలియదు."

"ఏ ఆస్తి?"

"నాకు తెలియదు."

“నీకు యుక్తవయస్సు వచ్చినప్పటినుండియు నీసంవత్సర ఆదాయ మెంతో ఊహించి చెప్పనా? అయినను...”

అప్పుడు నా హృదయము తట తట కొట్టుకొనసాగెను. నేను కుర్చీలోనుండి లేచి వెనుకకుపోయి దానిని పట్టుకొని వెఱ్ఱి వానివలె చూడసాగితిని.

“ఇక నీ సంరక్షకునిగూర్చి చెప్పెదను. నీవు మైనరుగా నున్నప్పుడు నీకొక సంరక్షకు డుండెడివాడు. అతడొక లాయ రనుకొందును. అతని పేరులోని మొదటి అక్షరము జ.”

నా మనస్సు పరిపరివిధముల పోసాగెను.

అత డింకను ఇట్లనసాగెను: “ఆ లాయరు పేరు జాగర్సు. నేను నీ విచ్చట నున్నానను విషయము నెట్లు తెలిసికొన్నననుకొన్నావు? నేను క్రొత్తప్రపంచమునుండి వచ్చి పోర్ట్సుమత రేవులో దిగినాను. నేను అక్కడనుండి లండనులోని ఒక వ్యక్తికి నీ విలాసమును తెలియజేయవలసినదని ఉత్తరము వ్రాసినాను. అతడు నీ విలాసమును తెలియజేసినాడు. ఆ వ్యక్తి ఎవ్వరనుకొనుచున్నావు? వెమ్మిక్.”

పిమ్మట నతడు నన్ను పట్టుకొని సోఫానద్దకు తీసికొని పోయి దానిమీద నన్ను కూర్చుండబెట్టెను. అతడు నాముందు మోకరిల్లి తన మొగమును నా మొగమునద్ద పెట్టెను.”

అత డిట్లనెను: “నాయనా! పిప్! నిన్ను గౌరవనీయునిగా చేసినది నేనే. అంతయు చేసినది నేనే! నేను ఒక గినీ సంపాదించినచో నీ కా గినీ చెందవలయునని అనుకొన్నాను. నేను ధనవంతుడ నైనచో, నీవును ధనవంతుడవు కావలయుననుకొన్నాను. నీవు సుఖముగ జీవింపవలయునని, నేను కష్టపడి పనిచేసినాను.

నే నీవిషయము నెందులకు చెప్పుచున్నాననుకొన్నావు? నీవు నాకు ఎప్పుడును కృతజ్ఞుడవై యుండవలయునన్న భావముతో చెప్పుట లేదు. ఆ యుద్దేశ్యము నాకు అణుమాత్రమైనను లేదు. నీపట్ల నాకుగల కృజ్ఞతా భావమును వెలిపుచ్చుటకే, నేను కష్టపడి పని చేసినాను. ఆ విషయమునే నీకు తెలియజేసినాను. పిప్! నీవు గౌరవనీయుడవు"

నేనతని మాటలను విని ఎంతయు భయపడసాగితిని.

అతడింకను ఇట్లనెను: "పిప్! ఇటుచూడుము. నేను నీ రెండవ తండ్రిని. నీవు నా కుమారుడవు. నేను ధనము నెందుకు కూడబెట్టినాను? నీవు ఖర్చుపెట్టుకోవలయుననియే. నేను గొర్రెల కాపరిగా నున్నప్పుడు నీ మొగ మెప్పుడును నాముందు ప్రత్యక్ష మగుచుండెడిది. అప్పుడు నేను ఇట్లనుకొనుచుండెడివాడను: 'నేనెప్పుడైన యజమానుడనగుట తటస్థించినచో ఆ బాలుడు గౌరవనీయుడగునట్లు చేయుదును.' ఆవిధముగా నేను ప్రతిసారి అనుకొనెడివాడను. నేను అపారమగు ధనము సంపాదించినాను. నిన్ను గౌరవనీయుని చేసినాను. అందువలననే నీవిచ్చట జీవించు చున్నావు."

అదృష్టవశమున నతడు నేను తన్ను సాదరముగ స్వీకరింప లేదను విషయమును గూర్చి ముచ్చటింపలేదు. అది నాకు కొంచెము ఉపశమనముగా నుండెను. అతడు మఱియొకసారి నా రెండుచేతులను పట్టుకొని ముద్దుపెట్టుకొనెను. అప్పుడు నా శరీ రములోని రక్తము చల్లబడినట్లయ్యెను.

అతడింకను నిట్లనెను: "మాట్లాడుటకు ప్రయత్నింపకుము పిప్! నాయనా! నీవిప్పుడు మాట్లాడకుండ నూరకుండుటయే

మంచిది. మన యీ సమావేశము జరుగునని నీవెన్నడును అను కొనియుండవు. అది సరియేగాని, నీకు సహాయ్యము చేయుచున్న వాడను నేనైయుండునని నీవెన్నడును అనుకొని యుండలేదా?"

"నేను ఎప్పుడును అనుకొనియుండలేదు! ఎప్పుడును అను కొనియుండలేదు."

"కాని యిప్పుడు తెలిసినది కదా. నీకు సహాయ్యము చేసినది నేనే. నీకు సహాయ్యము చేసినది నేనే. ఈ విషయము నాకు, జాగర్సునకు తప్ప యింకెవ్వరకును తెలియదు."

"ఇంకెవ్వరికిని తెలియదా?" అని నేను ప్రశ్నించితిని. ఆ వ్యవహారముతో హావిషమ్ కన్యకు సంబంధము కలదనియు, ఎస్టెలా నాకుభార్యకావలయునని నిర్ణయింపబడినదనియు నేనింకను తలంచుచుంటిని. అందువలననే నేనా విధముగ ప్రశ్నవేసితిని.

అతడు ఆశ్చర్యముతో నిట్లనెను: "ఇంక నెవ్వరికి తెలియ వలయును? ఎవ్వరికిని తెలియదు. అబ్బాయి! నీవు ఎంతచక్కగా ఎదిగినావు! నీవు ఎక్కడనో ఉన్న ప్రకాశవంతమైన కన్నులను వాంఛించుచున్నట్లున్నావు. డబ్బుతో వానిని పొందుట సాధ్యమైన చో నీవు వానిని పొందగలవు."

అతడు నా భుజముపై చేయివైచి యింకను ఇట్లు చెప్ప సాగెను: "నాయనా, పిప్! నేను క్రొత్త ప్రపంచమునుండి అనగా ఆస్ట్రేలియానుండి ఇచ్చటకు వచ్చుట అంత సులభమైన పని కాదు. అది చాల అపాయకరమైన పని. అయినను నేను ఇచ్చ టకు వచ్చి నిన్ను చూడవలయునని నిశ్చయించుకొన్నాను. ఆ నిశ్చయము ప్రకారము నే నిచ్చటకువచ్చి నిన్ను చూచినాను. ఈ విధముగ చేయ గలిగినందుకు నే నెంతయు సంతసించు

చున్నాను. ప్రభుత్వమువారు నాకు ద్వీపాంతరవాస శిక్ష విధించి ఆస్ట్రేలియాకు పంపినారు. నే నచ్చట స్వేచ్ఛగా జీవింపవచ్చును. కాని ఈ దేశమునకు తిరిగి వచ్చుట మాత్రము పనికిరాదు. ఇప్పుడు నేను పట్టుపడినచో ఉరి తీయుదురు. నేను నిన్ను చూడవలయునను నుద్దేశ్యముతో సాహసించి ఇచ్చటకు వచ్చినాను. మరి నీవు నన్నెచ్చట ఉంచెదవు? నన్నెచ్చట ఉంచెదవు?"

"నిద్రించుటకా?"

"అవును. నేను గాఢముగ నిదురించుటకు తగిన వసతి కావలయును. ఏలయన నేను నెలల తరబడి సముద్ర ప్రయాణము చేసి సరియైన నిదుర లేక అలసి పోయినాను."

"నా మిత్రుడు లేడు. అందువలన నీవు అతని గదిలో పడుండవచ్చును.."

"అతడు రేపు తిరిగి రాడా?"

"రాడు. రేపు రాడు."

"నే నెందుకు అడుగుచున్నాననగా మనము చాల జాగ్రత్తగ నుండవలయును."

"జాగ్రత్త ఎందుకు?"

"జాగ్రత్త లేకపోయినచో మరణమే ఫలితము."

"మరణమా?"

"అవును. నే నదివరకే చెప్పియుంటినికదా. నేను జీవితకాలమంతయు ఆస్ట్రేలియాలోనే ఉండవలయును. ఆ దేశమును విడిచిపెట్టి ఇచ్చటకు రారాదు. పట్టుపడినచో మరణమే శరణ్యము."

నేను వెంటనే తలుపులు మూసివైచితిని. లోపలకు కాంతి రాకుండ చేసితిని.

"ఇక నీవు నిదురింతువా?" అని అంటిని.

"అవును."

అంతట నేను అతనిని హెర్బర్టు గదిలోనికి తీసికొనిపోయి పరుండబెట్టితిని. తరువాత నా గదిలోనికి తిరిగివచ్చి కుంపటి ప్రక్కనే కూర్చుంటిని. కొంచెముసేపు నేను ఆలోచింపలేని పరిస్థితిలో నుంటిని. తరువాత ఆలోచింప సాగితిని. నా జీవితనౌక ముక్కలు ముక్కలై పోయినదని భావింపసాగితిని.

హావిషమ్‌కన్య నాకేదో సాహాయ్యము చేయునను ఆశ అంతయు నొక కలవలె కరగి పోయినది. ఎస్టెలా నా కొఱకు నిర్ణయింపబడి యుండలేదను విషయము నాకు స్పష్టముగా తెలిసినది. హావిషమ్‌కన్య తన పగతీర్చుకొనుటకే నన్నుపయోగించుకొన్నది. ఒక నేరగాని కొఱకు నేను జోను వదలిపెట్టి వచ్చితినన్న తలంపు నాకెంతో బాధ కలుగజేయ సాగెను. కాని యిప్పుడింక నేను ఏ మొగము పెట్టుకొని జో వద్దకు, బిడ్డీ వద్దకు పోను?

నేను ఆ విధముగ ఆలోచించుచు నిదురపోతిని. నేను తిరిగి లేచు సరికి గడియారములన్నియు అయిదు గంటలు కొట్టుచుండెను. కుంపటిలోని నిప్పు పూర్తిగా ఆరిపోయి యుండెను.

# 21

రాత్రివచ్చిన అతిథిని సురక్షితముగ కాపాడవలసినభారము నాపైనున్నది. కాని అతడు ఎవ్వరికిని కనబడకుండ దాచి వేయుట కష్టము. అందువలన ఇతరులకు అనుమానము కలుగునే కాని లాభమేమియునుండదు. మా ఇంటికి పనిచేయుట కిరువురు స్త్రీలు వచ్చుచుందురు. అతిథిని వారికి కనబడకుండదాచుట కష్టము. వారు అనుమానముతో గోరంతలు కొండంతలుచేసి చెప్పవచ్చును. అందువలన వారు మా యింటికి రాగానే, "మా పినతండ్రి అనుకోకుండ తన గ్రామమునుండి ఇచ్చటకువచ్చి యున్నాడు." అని చెప్పితిని. బయటకుపోయి కాపలావానితో గూడ కొన్ని విషయములు మాట్లాడితిని.

బాగుగ తెల్లవారినతరువాత అతిథి నాగదిలోనికివచ్చెను. అతను రాత్రికంటె పగలు అధ్వానముగ కనబడసాగెను.

"నిన్ను నేను ఏ పేరుతో పిలువవలయునో నాకింతవఱకు తెలియదు. నీవు నా పినతండ్రివని అందఱకు చెప్పినాను."

"బాగుగనేయున్నది. నన్ను చిన్నాన్న అని పిలువుము."

"ఓడప్రయాణములో నీవేదో మారుపేరు పెట్టుకొన్నా వనుకొందును."

"అవును, నాయనా! నేను ప్రోవిస్ అను పేరుపెట్టు కొన్నాను."

"నీకింకను ఆపేరే ఉంచుకోవలయునని యున్నదా?"

"నాపేరునా? ఏపేరైననేమి? అన్నిపేర్లును నాకటే. నీకే పేరునచ్చనిచో మఱియొకపేరు పెట్టుకొందును."

"నీ అసలు పేరేమి?"

"అబెల్ మాగవిచ్."

"నీవు నిన్నరాత్రి యిచ్చటకు వచ్చినప్పుడు—"

"పూర్తిచేయుము."

"కాపలావానితో మాట్లాడియుంటివిగదా?" అప్పుడు నీతో నింక ఎవ్వరైన నున్నారా?"

"నాతోనా? ఎవ్వరునులేరే!"

"నీతో కూడ మఱియొకడున్నాడటగదా!"

"నేను ప్రత్యేకముగ గమనింపలేదు. కాని నావెంట నొక మనుజుడు వచ్చినాడనుకొందును."

"నన్ను లండనులో పలువురు ఎఱుగుదురా?"

"ఎఱుగరనుకొందును."

"నన్ను లండనులో విచారణచేసినారా?"

"ఎప్పుడు?"

"కడసారి."

"అవును. అప్పుడే మొట్టమొదటిసారిగా నాకు జాగన్నతో పరిచయమేర్పడినది. అప్పుడు జాగన్న నాతరపున పని చేసినాడు."

"నన్ను ఎందుకువిచారణచేసినారు?" అని నేను అడుగ దలచితిని గాని అడుగలేను.

తరువాత నతడు ఉదయపుకాలపు భోజనము ముగించెను.

సిమ్మన్ట నతడు చుట్టకాల్చుకొనుచు నా చేతులు పట్టుకొని, "నన్ను గౌరవనీయునిచేసినాను. ఇది నాకెంతయు సంతృప్తి

కరమైన విషయము. నిన్ను చూచుకొనుచు సంతోషించు చుందును" అని యనెను.

అటుపిమ్మట నతడు జేబులోనుండి ఒక పుస్తకమును తీసి దానిని బల్లమీద పడవైచి యిట్లనెను: "నాయనా! ఆపుస్తకములో చాలవిలువైన నోట్లున్నవి. అవియన్నియు నీవే. నీవు ఆ సొమ్మును స్వేచ్ఛగా ఖర్చుపెట్టుకొనవచ్చును. నీకు ఇంకను ఎక్కువ సొమ్ము ముట్టును. కావున నీవీ సొమ్ము ఖర్చుపెట్టుకొనుటకు భయపడవలసిన పనిఏమియు లేదు. నీవు గౌరవనీయునివలె డబ్బు ఖర్చుపెట్టుకొనుచుండగా నేను చూడవలయును. అది నాకు ఆనందము నొసగును. నీవు మిగిలిన గౌరవనీయులకంటె గొప్పవాడవని ఋజువు కావలయును."

"తగును. నేను నీతో మాట్లాడవలసియున్నది. ఇప్పుడేమి చేయవలయునో నేను తెలిసికొనవలసియున్నది. నిన్ను ఏ అపాయము లేకుండ దాచుట ఎట్లు? నీ వెంత కాలమిచ్చట నుండ దలచుకొన్నావు? నీ భవిష్యత్ప్రణాళిక ఏమి ?"

"నా గుఱించి ఏ విచారము వలదు."

"అట్లనరాదు. మొదట ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుము. నిన్నెవ్వరు కాని గుర్తించి పట్టుకొనకుండ తీసికొనవలసిన జాగ్రత్తలేవి ? నిన్ను అపాయమునుండి రక్షించుట ఎట్లు?"

"నాయనా! అపాయ మేమంత పెద్దది కాదు. ఎవ్వరైన పోయి పోలీసువారికి చెప్పిన నేను భయపడవలయును. అంతవఱకు నాకు ఎట్టి భయమును లేదు. నా గుఱించి జాగర్సుకు తెలియును. అతని గుమాస్తా వెమ్మిక్‌కు తెలియును. నీకు తెలియును. మఱి పోలీసువారికి చెప్పుట కింకెవరున్నారు?"

"వీధులలో నడచిపోవుచున్నప్పు డెవ్వరైన నిన్ను గుర్తు పట్టవచ్చును కదా!"

"నన్ను గుర్తుపట్టగలవారు ఎంతో మందియుందురు. అదియునుగాక అబెల్ మాగ్ విచ్ ఆస్ట్రేలియా నుండి ఇంగ్లండునకు తిరిగివచ్చినాడని నేను వార్తా పత్రికలలో ప్రకటనలు చేయబోవుట లేదు కదా? అపాయము ఇప్పటి అపాయముకంటె ఏబది రెట్లు ఎక్కువైన దైనను నేను నిన్ను చూచుటకు వచ్చియుండెడివాడను. నాయనా! నిన్ను చూచుటకు వచ్చియుండెడివాడను."

"నీవిక్కడ నెంతకాలముండ దలచుకొన్నావు?"

"ఎంతకాలమా? నేనింక ఆస్ట్రేలియాకు తిరిగి పోలేను. మరణము సంప్రాప్తించువఱకు ఈ దేశములోనే ఉండవలయునని నిశ్చయించికొని వచ్చినాను."

మఱి నీ వెచట నివసింతువు? నిన్నేమి చేయవలయును? నీ వెచ్చట సురక్షితముగ నుందువు?"

"నాయనా! అది యేమంత కష్టమైన పని కాదు. నేను మాఱువేషము వేసికొని జీవింతును. డబ్బున్నచో ఎన్ని వస్తువులనైన కొని ఇతరు లెవ్వరును ఆనవాలు పట్టకుండునట్లు మాఱువేషము వేసికోవచ్చును. ఇదివఱకు ఎందఱు మాఱువేషము వేసికొని జీవింపలేదు? అవిఘ్నముగ నేను మాత్రము జీవింపలేనా? ఇక, ఎక్కడ, ఎట్లు నివసింప వలయునను విషయమును గూర్చి నీ అభిప్రాయమేమో చెప్పుము."

"ఇప్పుడు నీవు ఏమియు జరుగనట్లు మాట్లాడుచున్నావు కానీ పట్టుబడినచో మరణమే శరణ్యమని నిన్న రాత్రి చెప్పి యుంటివి కదా."

"ఇప్పుడు మాత్రము కాదనుచున్నానా? పట్టుపడినచో మరణము తప్పదు. కాని మరణము ఒక్కసారివచ్చును. నేనింక ఆస్ట్రేలియాకు తిరిగిపోను. నేను నిన్ను చూచుకొనుచుండవలయు ననియే వచ్చినాను. అపాయములకు నేనేమాత్రము భయపడను. నేనిప్పుడు ముసలివాడను. అపాయములు వచ్చినరానిమ్ము. నేను భయపడను."

సమీపగృహములో నెచ్చటనైన అతనికి బస నేర్పాటు చేయవలయులని అనుకొంటిని. రెండు మూడు రోజులలో హెర్బర్టు తిరిగి వచ్చును. అప్పుడు అతనిని అచ్చటకు పంప వచ్చును. అతని కథనంతను హెర్బర్టుకు చెప్పవలసిన అవసర మును నేను గుర్తించితిని. కాని అతడు మాత్రము గుర్తింప కుండెను.

"నేను మొట్టమొదట హెర్బర్టును చూడవలయును. తరువాత నాకథను అతనికి చెప్పవచ్చును. చెప్పకుండదా అను విషయమును నిర్ణయింతును." అని అత డనెను; "ఒక వేళ చెప్ప దలచుకొన్నచో అతనిచేత ప్రమాణము చేయించిన తరువాత నే చెప్పవలయును."

ఎసెక్సు వీధిలో నాకు తెలిసినవారి ఇల్లొకటి యున్నదను విషయము జ్ఞప్తికి వచ్చి నే నచ్చటకు పోతిని. అదృష్టవశమున రెండవ అంతస్తులో నా చిన్నాన్న ప్రోవిస్ నివసించుటకు అవ కాశము లభించెను. తరువాత నేను వేర్వేరు అంగళ్లకు బోయి మారువేషము వేసికొనుటకు కావలసిన వస్తువులను కొంటిని. ఆపని పూర్తియైన పిమ్మట జాగర్సు కార్యాలయమునకు పోతిని

నేను లోపలకు పోవునప్పటికి జాగన్సు బల్లముందు కూర్చుండియుండెను. కాని నన్ను చూడగానే అతడు లేచి కుంపటిముందు నిలబడెను.

నే నెందుకు వచ్చితినో అతడు గ్రహించినట్లుండెను. అందువలన నతడు, "పిష్! కడు జాగ్రత్తగా నుండుము" అని యనెను.

"అట్లనే" అని యంటిని. జాగన్సుతో జాగ్రత్తగా మాట్లాడవలసిన విధానమును నేను త్రోవలోనే ఆలోచించు కొంటిని.

"నీవు పేర్లేమియు చెప్పరాదు. అర్థమైనదా? ఏ పేరు గూడ చెప్పరాదు. నాకు ఏవిషయము చెప్పవలదు. నేను ఏ విషయమునుగాని తెలిసికొనగోరుట లేదు. నాకు తెలిసికోవలయు నను కుతూహల మేమియు లేదు."

అతడు వచ్చినాడను విషయము జాగన్సుకు తెలియునని ఆ మాటలవలన నేను గ్రహించితిని.

"అయ్యా! నేను విన్నవిషయము నిజమేనని నమ్మకము కలిగించుకొనుటకై వచ్చినాను. అది సత్యమనియే నే ననుకొను చున్నాను."

"అది నిజమే."

"అయ్యా! నేను మిమ్ముల నేమియు ననుట లేదు. కాని నాకు ఒక్క సందేహము మాత్రమున్నది. హవిషమ్‌కన్య నాకు మొదటినుండియు లాభము చేకూర్చుచున్నదని భావించుచు వచ్చినాను."

"నే నందునకేమాత్రము బాధ్యుడను కానను విషయము నీవు బాగుగ తెలియునుగదా!"

"కాని నా కటుల కనబడినది."

"అందుకు సాక్ష్యాధారమేమియు లేదు."

"ఇంక నాకు ఆ విషయముతో పని ఏమియున్నది? నేను వచ్చినపని పూర్తియైనది. ఇంక మాయింటికి పోయెదను."

తరువాత నేను ఇంటికి పోతిని.

రెండు రోజులలో తిరిగి వచ్చెదనుకొన్న హెర్బర్టు అయిదురోజులు గడచినను తిరిగి రాలేదు. ఈ లోపల ప్రోవిస్‌కు ఎట్టి అపాయము వాటిల్లునో యని నే నెంతయు భయపడసాగితిని. చీకటి పడినతరువాత నేను ప్రోవిస్‌నుబయటకు తీసికొని పోవుచుంటిని. అప్పుడు తప్ప మరి యింకెప్పుడును నేను బయటకు పోకుంటిని.

ఒకనాడు నేను భోజనముచేసి కుర్చీపై కూర్చుంటిని. రాత్రి సమయమునందు సరిగా నిదుర పట్టకుండుట వలన నా కప్పుడు నిద్దురపట్టెను. ఆ నిదురలో నాకు మెట్లమీద నెవ్వరో నడచి వచ్చుచున్న సవ్వడి విన నాయెను. ఆ సవ్వడినాకు పరిచయమైనదే. ఆ వచ్చుచున్నవాడు నా ప్రియమిత్రుడు హెర్బర్టు.

ఆ సవ్వడిని వినగానే అచ్చటనే నిదురించుచున్న ప్రోవిస్ కూడ ఉలికిపడి లేచెను. అతడు చేత చాకును పట్టుకొనెను.

"ఏమియు భయము లేదు. నా మిత్రుడు హెర్బర్టు వచ్చుచున్నాడు" అని నేను అంటిని.

"పిప్! నాప్రియ మిత్రమా! ఎట్లున్నావు? నీ వెట్లున్నావు? ఎట్లున్నావు? నేను ఈ ప్రదేశమును వీడిపోయి సంవత్సరమైనట్లు

న్నది? అందుకు సందేహ మెందులకు? నేను వెళ్ళి నిజముగా సంపన్నుడనై యుందును? నీ విట్లు చిక్కిపోయినావేమి? అని యనుచు హెర్బర్టు నా వద్దకు పరుగెత్తుకొనివచ్చి కరచాలనము చేసెను. సరిగ నప్పుడే అతడు ప్రొవిస్‌ను చూచెను. ప్రొవిస్ తన చేతిలోని చాకును జేబులో పెట్టుకొను చుండెను.

నేను తలుపులు మూసివైచి హెర్బర్టుతో నిట్లంటిని, "మిత్రమా! ప్రియ మిత్రమా! హెర్బర్టు! నీవు లేనప్పుడు వింత కథ జరిగినది. ఇతడు నన్ను దర్శింపగోరి వచ్చిన వాడు."

అంతలో ప్రొవిస్ దగ్గఱకువచ్చి, బైబిలు గ్రంథము నందించుచు హెర్బర్టుతో నిట్లనెను: "దీనిని నీ కుడిచేత పట్టుకొనుము. రహస్యముల నెవ్వరికి చెప్పనని ప్రమాణము చేసి చెప్పుము. ప్రమాణభంగము జరిగినచో నీతల వేయి వ్రక్కలై పోవును. దీని ముద్దు పెట్టుకొనుము."

"అతడు కోరినట్లు చేయుము" అని నేను హెర్బర్టుతో నంటిని. హెర్బర్టు ఆశ్చర్యముతో నావంక జూచుచు అతడు కోరి నట్లు ప్రమాణచేసెను.

అంతట ప్రొవిస్, హెర్బర్టుతో కరచాలనము చేయుచు నిట్లనెను: "నీవు ప్రమాణము చేసిన విషయమును జ్ఞప్తియందుంచుకొనుము. పిప్ నిన్ను గౌరవనీయునిగ తయారు చేయు ననుటకు ఎట్టి సందేహమును లేదు."

మేము ముగ్గురము కుంపటిముందు కూర్చుంటిమి. అప్పుడు నేను ప్రొవిస్‌కు సంబంధించిన రహస్యము నంతను హెర్బర్టుకు విశదీకరించి చెప్పితిని. అంతయువిని హెర్బర్టు ఆశ్చర్య

పడెను. అతని మనస్సు ఆందోళనా పూరితమయ్యెను. ఆ చిహ్నము లతని మొగములో స్పష్టముగా గడచు చుండెను.

ప్రోవిస్‌ను క్రొత్తయింటికి తీసికొని పోవలయునని నే నెంతయు తొందరపడసాగితిని. ఏలయన అప్పుడు నేను, హెర్బర్టు మా భవిష్యత్కార్య క్రమమునుగూర్చి స్వేచ్ఛగా చర్చించుకోవచ్చును. కాని ప్రోవిస్ అంత త్వరగా వెళ్ళి పోవుటకు ఇష్టపడకుండెను. కాని ఎట్టకేలకు అర్ధ రాత్రి గడచిన తరువాత మే మిరువురము ప్రోవిస్‌ను క్రొత్త బసలో ప్రవేశ పెట్టితిమి. అంతటితో మా హృదయభారము సగము తగ్గిపోయినట్లయ్యెను. తరువాత మేము ఇంటికి తిరిగి వచ్చితిమి.

నేను, హెర్బర్టు ఒకచోట కూర్చుండి మా భవిష్య త్కార్యక్రమమునుగూర్చి ఆలోచించుకొన సాగితిమి.

"హెర్బర్ట్! మన మిప్పుడు ఏమి చేయవలయును?" అని నేను అంటిని.

"నేను ఆశ్చర్య సముద్రమున మునిగిపోయి యున్నాను. నా మనస్సు ఆందోళనా పూరితమైయున్నది. అందువలన నే నిప్పుడు ఏమియు చెప్పలేని పరిస్థితిలో నున్నాను" అని అత డనెను.

"మొట్టమొదట నా పరిస్థితికూడ అటులనే యుండెను. కాని మన మిప్పుడు ఏదో యొకపని చేయవలయునుగదా. అతడు డబ్బు ఖర్చుపెట్టి ఎన్నో వస్తువులను కొనదలచుకొన్నాడు. నేను నా హోదాకు తగినట్లు జీవింపవలయునని అతడు అభి ప్రాయ పడుచున్నాడు. అత డేవియు కొనకుండ ఆపుచేయ వలయును."

"అనగా నీ వతని సొమ్మును అంగీకరింపవన్న మాట!"

"ఎట్లు అంగీకరింపగలను? అతనినిగూర్చి ఆలోచింపుము! అతనిని చూడుము!"

మా యిరువురి శరీరములలోను ఒకవిధమగు భయము వ్యాపించెను.

నే నింకను ఇట్లంటిని: "ప్రియమిత్రమా! కాని ఒక భయంకర సత్యమును గ్రహించినాను. అతడు నాపట్ల పూర్తి అనుబంధము కలిగియున్నాడు. నన్ను విడిచి ఎక్కడకు పోడు."

"అయ్యో! పాపము! ప్రియమిత్రమా!"

"ఇక అతనివద్దనుండి ఒక్క పెన్నీనైనను తీసికొనను కొనుము. కాని ఇంతివఱకు అతనివద్దనుండి ఎంతసొమ్ము తీసికొన్నానో ఆలోచింపుము. నాకిప్పుడు ఎంతో అప్పుకూడ నున్నది. ఆ అప్పు నింక తీర్చుట ఎట్లు? నాకేపనియు చేతకాదు. నేను వట్టి పనికిమాలిన వాడను."

"ఎందుకు పనికిరావు? ఆవిధముగ మాట్లాడకుము?"

"నే నెందుకు పనికివత్తును? ఒక్కపనికిమాత్రము పనికివత్తునను విషయము నాకు బాగుగ తెలియును. అది యేమన నేను సైనికుడుగా వెళ్ళవలయును. నీతో ఆలోచించి వెళ్లుద మనుకొన్నాను. లేనిచో నే నిదివఱకే వెళ్ళిపోయి యుండెడివాడను."

"వలదు, వలదు. సైన్యములో చేరరాదు. నీ వతని డబ్బు నింక స్వీకరింపరాదని నిశ్చయించుకొన్నావు. అనగా నీవతని వద్దనుండి ఇదివఱకు తీసికొనిన డబ్బును ఎప్పటికయిన తిరిగిఇచ్చి వేయవలయునని నీవు భావించుచున్నావన్న మాట! నీవు సైన్య

ములో జేరినచో ఆపని చేయుట ఎట్లు సాధ్యమగును? నీవు మా వ్యాపారసంస్థలో ఎందుకు చేరకూడదు?"

పాపము! ఎవరి డబ్బులో తన వ్యాపారము జరుగు చున్నదో అతని కణుమాత్రమైనను తెలియదు!

అతడింకను నిట్లనెను: "కాని మఱియొకసమస్య యున్నది. అతనికి చాలకాలమునుండి ఒక నిశ్చితాభిప్రాయమున్నది. అతడు దానిని తప్పక అమలు జరుపవలయునని నిశ్చయించుకొన్నాడు. అతడు సర్వమునకు తెగించియున్నాడు."

"అతడట్టివాడను విషయము నాకు తెలియును. అందుకు తగిన సాక్ష్యాధారమునుగూర్చి నీకు చెప్పెదను."

అంతవఱకు నేను అతనికి చిత్రని నేలలలో చూచిన రెండవ నేరగాని విషయము చెప్పలేదు. అప్పుడా విషయ మంతయు చెప్పితిని. అంతట నతడిట్లనెను: "మఱిచూడుము! తన నిశ్చితాభిప్రాయము నమలు పఱచుట కతడు ప్రాణమునకు తెగించిగూడ ఇచ్చుటకు వచ్చియున్నాడు. నీవు మనోహరభవన ములో నివసించుచు, మనోహరశకటములలో గొప్ప గౌరవ నీయునివలె తిరుగుచుండగా చూడవలయునని అతడు గాఢముగ వాంఛించుచున్నాడు. అతడు ఎంతో కష్టపడి డబ్బు సంపాదించి నాడు. అతనికోరిక నెఱవేఱనున్న సమయమున నీవు అడ్డుతగుల నున్నావు. మఱి భగ్నహృదయుడైన అతడేపనిచేయుటకైన సాహసించును. అతడేమిచేయునో నీవు ఊహింపలేకున్నావా?

"ఎందుకు ఊహింపలేను? అతడు మన బసలో ప్రవేశిం చిన మొదటిరాత్రినుండియు ఆ భయంకరసత్యమును గూర్చి

ఆలోచించుచునే యున్నాను. అతడు తన ప్రాణము తీసికో వచ్చును."

"మఱి అది చాల అపాయకరమైన విషయముకదా!"

అనగా నాకు సాహాయ్యము చేసినవానిని నేనే ఒకవిధముగా హత్యచేసినట్లన్నమాట!

"పోలీస్ నెవ్వరైన గుర్తించి పట్టుకొన్నను నాస్థితి కడు దుర్భరముగనే యుండును" అని నేను అంటిని.

"ఈ సందర్భమున మనము చేయవలసినపని ఒక్కటి మాత్రమేయున్నది. అదియేమన అతనిని వెంటనే ఇంగ్లండునుండి మఱియొక దేశమునకు తీసికొనివెళ్ళవలయును. నీవుకూడ అత నితో కలసివెళ్ళవలయును. అప్పుడే అతడు మఱియొక దేశమునకు వెళ్ళుటకు అంగీకరించును."

"అతనిని ఏదేశమునకు తీసికొనిపోయిననేమి? అతడు తిరిగి ఇచ్చటకు రాడనునమ్మక మేమియున్నది?"

"అందులకొక చక్కని ఉపాయమున్నది. అతనిపూర్వ జీవితమునకు సంబంధించిన వివరములను మనము తెలిసికోవల యును. రెండవనేరగానికి సంబంధించిన విషయములు కొన్ని మనకు తెలిసినచో, ఈ దేశములోనుండుట చాల అపాయకర మను విషయమును ప్రోవిస్‌కు నచ్చచెప్పవచ్చును."

"మంచిది. అతనిజీవిత విశేషములను తెలిసికొందము."

"మిత్రమా! ఇంక అతనివద్దనుండి సొమ్ముగ ఏమాత్రము తీసికోరాదని నీవు నూటికినూరుపాళ్ళు నిశ్చయించుకొన్నవా?"

"అవును. నీవు నా స్థానములోనున్నను అదేనిశ్చయము నకు వచ్చియుండెడివాడవు కదా."

"అతనితోడి సంబంధమునకు సంపూర్ణముగ తెగతెం పులుచేసికొనుట అవసరమని నీవు గట్టిగా నమ్ముచున్నావా?"

"ఆప్రశ్న నాకెందుకు వేసినావు?"

"అతడు నీపట్లగల ప్రేమతో తనప్రాణమునకైన తెగించి ఇచ్చటకు వచ్చినాడు. కావున సాధ్యమైనంతవఱకు నీవతని ప్రాణమును రక్షింపవలయును. అందువలన నీవు మొట్టమొదట అతనిని మఱియొక దేశమునకు తీసికొనిపోవుట ముఖ్య కర్తవ్యము. తరువాత నీవిషయమునుగూర్చి మన మిరువురముకలసి ఆలోచింతము."

"మఱి అతని పూర్వ జీవితమునుగూర్చి తెలిసికొనుట ఎట్లు? నాకు తెలిసినంతవఱకు ఒక్కమార్గము మాత్రమే కనబడుచున్నది. అది అతని సూటిగ, స్పష్టముగ అడుగుటయే."

"అవును. అడుగుము. ఉదయకాల భోజనమునకై ఆతడిచ్చటకు వచ్చునుగదా! అప్పుడతని నడుగుము."

తరువాత మేము నిదురింపబోతిమి. కాని నాకు నిదుర సరిగాపట్టలేదు. అందువలన తెల్లవాఱినతరువాత లేచుసరికి నేను బాగుగ అలసిపోయి యుంటిని.

# 22

తెల్లవారిన తరువాత ఉదయకాలపు భోజనమునకై ప్రోవిస్ మా బసకు వచ్చెను. అతడుభోజనముచేయుచు నాతో నిట్లనెను: "నాయనా! నీవు గొప్ప గౌరవనీయునివలె సంచరింప వలయునని నేను గట్టిగాఅభిప్రాయపడుచున్నాను. అందువల్ల నీవు వెంటనే నేనిచ్చిన పుస్తకములోని నోట్లు నుపయోగించుట ప్రారంభింపవలయును. ఇప్పుడు నేను, నీవు నివసించుచున్న గృహములు మనకు తాత్కాలిక నివాసస్థానములు మాత్రమే. అందువలన మనము వెంటనే మనోహర భవనము నొకదానిని సంపాదింపవలయును. అందు మనము నివసింపవలయును."

అతని భోజనము ముగిసెను. అంతట నేను అతనితో నిట్లంటిని: "నిన్న మేము నిన్ను నీ బసలో దిగవిడచి వచ్చిన తరువాత నా మిత్రున కొక విషయము చెప్పినాను. నీవు చిత్తడి నేలలలో మఱియొక నేరగానితో పోరాడుచుండగా సైనికులు చూచియున్నారు గదా! ఆ సంగతి జ్ఞాపకమున్నదా? ఆ విషయమునే నా మిత్రునకు చెప్పినాను."

"జ్ఞాపకమున్నది! జ్ఞాపకమున్నది!"

"మేము అతనిని గూర్చియు నిన్ను గూర్చియు తెలిసికో గోరుచున్నాము. నేను నిన్న రాత్రి చెప్పిన విషయము తప్ప, నిన్ను గూర్చిగాని, నీ మిత్రుని గూర్చిగాని మఱి యింకనేమియు తెలిసికొనకుండుట ఆశ్చర్యకరముగ నున్నది. మిమ్ములనుగూర్చి

యింకను ఎక్కువ విషయములు తెలిసికొనుటకిది తగిన సమయము కాదా!"

కొంచెముసేపు ఆలోచించిన తరువాత అత డిట్లనెను: "పిప్ యొక్క మిత్రుడా! రహస్యములను వెలిపుచ్చనని నీవు ప్రమాణము చేసియుంటివి. జ్ఞప్తియందున్న దా?"

"తప్పక ప్రమాణమును నిలబెట్టుకొందును." అని హెర్బర్టు అనెను.

"నీ ప్రమాణము నేను చెప్పు విషయముల కన్నింటికి వర్తించును."

"తప్పక వర్తించును" అని హెర్బర్టు అనెను.

తరువాత ప్రోవిస్ తన కథ నిట్లు చెప్పసాగెను:

"మిత్రులారా! నా జీవిత మొక పెద్ద కావ్యము కాదు, నవల కాదు. నా కథను మీకు కొన్ని ముక్కలలో చెప్పగలను. పిప్ నాకు మిత్రుడై ప్రభుత్వమువారు నన్ను ఆస్ట్రేలియాకు పంపు వఱకు నా జీవితము జైలులో, జైలు బయట జైలులో జైలు బయట, జైలులో జైలు బయట అని చెప్పవలసి యున్నది."

ప్రభుత్వమువారు నన్ను ఉరితీయలేదన్న మాటయేగాని' నేను ఎన్నో బాధల ననుభవించినాను. అధికారులు నన్ను తిట్టినారు. కొట్టినారు, కడు తీవ్రముగ హింసించినారు. ఒకపట్టణము నుండి మఱియొక పట్టణమునకు తీసుకొనిపోయినారు. ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు తఱిమినారు. నా జీవితమంతయు కష్టముల మయమని చెప్పవలెను.

నేను ఎక్కడ పుట్టినానో నాకే తెలియదు. నాతలిదండ్రు లెవరో నాకు తెలియదు. నా పేరు అబెల్‌మాగ్‌విచ్ అని ఎట్లు వచ్చినదో నాకసలు తెలియదు. చిన్నప్పటి విషయము లేవియు నాకు తెలియవు. నాకు జ్ఞాపకమున్న మొకటి విశేష మేమనగా ఆకలిబాధకు తాళజాలక టర్నిప్పులు దొంగిలించుట. అప్పుడు నేను పట్టుబడి కఠినముగా శిక్షింప బడినాను. అప్పటి నుండి నేను వేర్వేరు ప్రదేశములలో తిరుగసాగినాను. బిచ్చ మెత్తుకొనుట, దొంగతనము చేయుట, జైలు శిక్ష ననుభ వించుట, పని దొరకి నప్పుడు పనిచేయుట నా కార్యక్రమములోని ముఖ్యాంశము లయ్యెను. క్రమ క్రమముగా నేను పెరిగి పెద్ద వాడనైతిని.

ఇప్పుడింక నేను అసలు విషయములోనికి వచ్చుచున్నాను. ఇది జరిగి ఇరువది సంవత్సరములకు పైగా నైనది. ఒక చోట గుఱ్ఱపు పందెములు జరుగు చుండెను. అచ్చట నాకొక మనుజు నితో పరిచయమయ్యెను. అతడిప్పుడు కనబడినచో పొడిచివేయు దును. ఆ దుర్మార్గునిపేరు కాంపేసన్. చిత్తడి నేలలలో నేను పోరుచున్నది ఆ కృతఘ్నునితోనే. అప్పుడే సైనికులు నన్ను చూచి యుండిరి.

అతడు వట్టి మోసగాడు. దొంగనోట్లు మార్చుట, ఫోర్జరీ చేయుట, మోసము చేయుట మున్నగునవి అతని కార్య క్రమములోని కొన్ని ముఖ్యాంశములు. అతనికా పనులు చేయు టలో సాహాయ్యము చేయుట కొకడు అవసరమై యుండెను. అందువలన తనవద్ద పనిచేయ వలసినదని అతడు నన్ను అర్థించెను.

విధిలేక నే నందుల కంగీకరించితిని. మఱి నేను కడు బీదవాఁడను. అందువలన నే నతని ప్రభావమునకు లోబడి పోతిని.

నేను అతని కెప్పుడును ఋణపడి యుండసాగితిని. అతని కెప్పుడును పని చేసిపెట్టు చుంటిని. ఎప్పుడును అపాయములలో తలదూర్చు చుంటిని. అతఁడు నాకంటె చిన్నవాఁడు; తెలివైన వాఁడు. అందువలన అన్ని అపాయకరమైన పనులు నాచే చేయించు చుండెడివాఁడు. లాభము మాత్రము తాను పొందు చుండెడివాఁడు.

అతనితోబాటు ఆర్థర్ అను యువకుఁడొకఁడుకూడ నుండెడివాఁడు. అతఁడా యువకునిగూడ మోసగించు చున్నట్లు గ్రహించితిని. కాని నేను గుణపాఠము నేర్చుకోలేను. అతనికి శాలీ అను పేరుగల భార్య కలదు. అయినను అతఁడు ఒక ధనికు రాలిని ప్రేమించుచున్నట్లు నటించు చుండెడివాఁడు. ఆమె వద్ద నుండి పెద్ద పెద్ద మొత్తములను లాగు చుండెడివాఁడు. ఆ విషయ మునుగూడ నేను గ్రహించితిని. అయినను నేను గుణపాఠము నేర్చుకోలేను. నే నతని చేతిలోని కీలుబొమ్మవలె పనిచేయు చుంటిని.

ఒకనాఁడు దురదృష్ట వశమున నేను పట్టుపడి శిక్ష ననుభ వించితిని. తరువాత రెండు, మూఁడుసార్లు నన్ను పట్టుకొనిరి గాని, సాక్ష్యము లేనందున వదలివైచిరి. మఱియొకనాఁడు పోలీసువారు నన్ను, కాంపేసన్నుగూడ పట్టుకొనిరి. అప్పుడు అతఁడు ద్రోహ బుద్ధితో ప్రవర్తించెను. అతఁడు తనతరఫున ప్రత్యేకముగ న్యాయ వాదిని పెట్టుకొనెను. నాతో తనకెట్టి సంబంధమును లేదనెను. అప్పుడే నాకు న్యాయవాది జాగర్సుతో పరిచయమాయెను.

కాంపేసన్ గౌరవనీయుఁడు. పాఠశాలకుపోయి చదువు కొన్నవాఁడు. నేను అనామకుఁడను. సంస్కారము లేని వాఁడను సాక్ష్యము నాకు వ్యతిరేకముగ నుండెను. కాంపేసన్ తానట్టి నేరము చేయలేదనియు, అంతకు నేనే బాధ్యుఁడ ననియు చెప్పెను. కోర్టువారంతయు విచారణ చేసి కారాగారపు గోడలలో నేను పదునాలుగు సంవత్సరములు గడపవలయుననియు, కాంపేసన్ ఏడు సంవత్సరములు గడపవలయుననియు తీర్పు ఇచ్చిరి. కాంపేసన్ ద్రోహబుద్ధికి నేను మండిపడితిని. కాని ఏమి లాభము? చేతులు కాలిన తరువాత ఆకులుపట్టుకొనుట వలన లాభమేమియున్నది?

ప్రభుత్వమువారు మమ్మిరువురను ఒకే కారాగారపు గోడలలో బంధించినారు. అతడు చేతికి చిక్కినచో చంపివేయ వలయునని నేను నిశ్చయించుకొన్నాను. కాని అతడు ఎంతకును చిక్కలేదు. అతడు నాకు కనబడునప్పటికి చాలకాలమైనది. ఒక నాడు నేను అతనివెనుకనేపోయి బుగ్గమీద గట్టిగా కొట్టినాను. అతడు వెనుకకు తిరుగవలయునని అటులచేసినాను. కాని అధి కారులు నేను చేసిన పనిని చూచి శిక్షగా నన్నొకచోట బంధించి నారు. కాని నేను అందుండి తప్పించుకొని బయటపడినాను. సముద్రమునకు నీరు తీరమును చేరుకొన్నాను.

పిప్ నన్ను మొట్టమొదట చూచినపుడు నేను శ్మశాన ములో దాగుకొని యుంటిని. మఱునాడు పిప్ నాకు దయతో సాహాయ్యము చేసినాఁడు. మఱియొక నేరగాఁడుకూడ తప్పించు కొని వచ్చినాఁడను విషయమును నేను పిప్ వద్దనుండియే తెలిసి కొంటిని. పిప్ చెప్పిన వర్ణనబట్టి ఆ నేరగాఁడు కాంపేసన్ అని

నిర్ణయించుకొంటిని. ఇంక కారాగారపుటోడలో నున్నచో నా చేత మరణము తప్పదని భావించి అతడు తప్పించుకొని వచ్చి యుండవచ్చునని భావించితిని. నేను తప్పించుకొని వచ్చినానన్న విషయమతనికి తెలియదు! నేనతనికొఱకంతయు వెదకితిని. చివరకతనిని పట్టుకొంటిని. నేనతనిని హత్య చేయవలెయునను కొంటిని. కాని అంతలో సైనికులువచ్చినారు. వారు మమ్మల నిరువురను పట్టుకొని తీసికొని పోయినారు. మమ్మ కోర్టులో హాజరు పఱచినారు. ఈసారికూడ ఎప్పటివలె నాకే అన్యాయము జరిగినది. నాకు భయపడి అతడు పాఱిపోయినాడను నుద్దేశ్య ముతో కోర్టువారతనికి తేలికశిక్ష విధించిరి. నన్ను శృంఖలము లతో బంధించి జీవితాంతము వఱకు ప్రవాస శిక్ష విధించి ఆస్ట్రేలియాకు పంపిరి. నేనిచ్చటకువచ్చి పట్టుబడినచో మరణ శిక్ష విధింతురను విషయము నాకు తెలియును. అయినను ప్రాణమునకు తెగించి నేనిచ్చటకు వచ్చినాను."

"అతడు మరణించినాడా?" అని నేను ప్రశ్నించితిని.

"ఎవరు?"

"కాంపేసన్."

"తరువాత అతడేమైనాడో నాకు తెలియదు."

హెర్బర్టు పెన్సిలితో నొకపుస్తకము అట్టమీద నేమో వ్రాయుచుండెను. వ్రాయుట పూర్తియైన తరువాత అతడో పుస్తకమును మెల్లన నా వద్దకు నెట్టెను. ఆ సమయమున ప్రోవిస్ చుట్ట కాల్చుకొనుచు కుంపటివంక చూచుచుండెను.

ఆ అట్టమీద ఈ విధముగా వ్రాయబడియుండెను: "ఆర్థర్ అను నతడే హావిషమ్‌కన్య సవతిసోదరుడు. ఆమెను మోసగించిన ప్రియుడే కాంపేసన్."

ఆ విషయమును చదివినతరువాత నేనా పుస్తకమును ప్రక్కకునెట్టివైచితిని. మేమేమియు మాట్లాడలేదు. ప్రోవిస్ ఇంకను చుట్టకాల్చుకొనుచునే యుండెను.

# 23

నాటి సాయంకాలము ప్రోవిస్ తనబసకు వెళ్ళిపోయెను. అప్పుడు నేను హెర్బర్టుతో నిట్లంటిని. "నేను ఇంగ్లండునువీడి వెళ్ళిపోవుటకుముందు ఒకసారి హావిషమ్‌కన్యను, ఎస్టెల్లాను కలసికోవలయును." అందుకు హెర్బర్టు అంగీకరించెను. మఱునాడు నేను రిచ్మండుకు బయలుదేఱిపోతిని.

నేను బ్రాడ్లీ గృహమును చేరుకొంటిని. అక్కడ ఎస్టెల్లా చెలికత్తె కనబడి ఎస్టెల్లా ఇంటలేదని చెప్పెను.

"ఎక్కడకు వెళ్లినది?"

"మామూలుగనే హావిషమ్‌కన్య ఇంటికే వెళ్ళినది."

"మామూలుగకాదు. ఏలయన నేను లేకుండ ఆమెవెళ్ళు అలవాటులేదు. ఆమె ఇక్కడ కెప్పుడు తిరిగివచ్చును?"

"ఒకవేళ ఆమె తిరిగివచ్చినచో కొద్దికాలము మాత్రమే ఉండుననుకొందును."

నాకు ఏమియు అర్థముకాలేదు. నేను నిస్పృహతో లండనులోని నా బసకు తిరిగివచ్చితిని.

నేను, హెర్బర్టు మఱియొకసారి మాట్లాడుకొంటిమి. నేను హావిషమ్‌కన్య ఇంటికిపోయి తిరిగివచ్చువఱకు ప్రోవిస్ విదేశ ప్రయాణమునుగూర్చి అతనికి చెప్పరాదని మేమిరువురము నిశ్చయించుకొంటిమి. అంతవఱకు ప్రోవిస్‌తో ఏమిచెప్పవలయునను విషయమునుగూర్చి మేము ఆలోచింపవలయు ననుకొంటిమి. "నీవు చాల అపాయములోనే యున్నావు. కావున మనము కొంతకాలము విదేశములలో నుండుటమంచిది" అని చెప్పవలయునా? లేక "నేనెన్నడును విదేశములకు పోయియుండలేదు. ఇప్పుడు పోవలయుననియున్నది. నాతో కూడరమ్ము" అని చెప్పవలయునా? ఈ రెంటింటిలో ఏవిషయమును చెప్పవలయునో మా మిత్రుల మిరువురము తేల్చుకొనవలసియున్నది.

మఱునాడు నేను నాబావ జోనుచూచుటకై పోవలయునన్నట్లు నటింపసాగితిని. నేను ఎంతనీచుడను! జోపట్ల ఎంతటి నైచ్యమునైన ప్రదర్శించుటకు నేను తగినవాడనే! నేను లేనిసమయమున ప్రోవిస్ చాల జాగ్రత్తగ నుండవలయుననియు, హెర్బర్టు అతనిని సంరక్షించుచుండుననియు చెప్పితిని. నేను ఒక్కరాత్రి మాత్రమే ఇంటివద్దనుండను.

నేను కోచిలో పెందలకడ ప్రవేశించి హావిషమ్‌కన్య నివసించుచున్న పట్టణమునకు పోతిని. ఉదయకాల భోజనసమయము నకే కోచి "బ్లూబోర" హోటలునుచేరుకొనెను. నేను కోచిలో నుండి దిగితిని.

అచ్చట నాకు డ్రమ్మోల్ కనబడెను. అతడనిన నాకు తీవ్రమగు అసహ్యముకదా! అతడు నన్ను చూడనట్లు నటింప సాగెను. నేనును అతనిని చూడనట్లు నటింపసాగితిని. మేమిరువురము ఒకే భోజనశాలలోనికి పోతిమి. కాని మాట్లాడుకొనలేదు. అతని నాపట్టణములో చూచుచున్నందుకు నేనెంతయు బాధపడసాగితిని. ఏలయన అతడచ్చటకు ఎందులకు వచ్చినాడో నాకు బాగుగ తెలియును.

కడకు నేనే అతనిని పలుకరించితిని.

"ఓహో! నీవా? ఎట్లున్నావు? ఇంతవఱకు నీవెవ్వరవో అనుకొన్నాను" అని అతడనెను.

అంతట నేను ఆతని ప్రక్కనే కూర్చుంటిని.

"నీవిప్పుడేవచ్చినావా?" అని ఆతడు ప్రశ్నించెను.

"అవును."

"ఈ ప్రాంతము వట్టిగొడ్డుప్రాంతము. ఇది మీప్రాంతమే అనుకొందును."

"అవునవును. ఇది మీ ప్రాంతమువలెనే ఉండునని కొందఱు చెప్పగావిన్నాను."

"ఏ మాత్రము కాదు."

అతడు తన బూట్లవంక చూచుకొనెను. నేను నాబూట్లవంక చూచుకొంటిని. తరువాత నతడు నా బూట్లను చూచెను. నేను అతని బూట్లను చూచితిని."

"నీ విచ్చటకువచ్చి చాలా కాలమైనదా?" అని ప్రశ్నించితిని.

"అవును. విసుగుపుట్టుచున్నది."

"ఇచట ఇంకను చాల కాలముందువా?"

"చెప్పలేను. నీవు?"

"చెప్పలేను."

అంతట నతడు ఒక సేవకుని పిలిచి యిట్లనెను: "నా గుఱ్ఱము సిద్ధముగ నున్నదా?"

"సిద్ధము చేసినానయ్యా!"

"ఇటువినుము. యువతీమణి నేడు స్వారీచేయదు. వాతావరణమేమియు బాగుండలేదు."

"చిత్తము. అయ్యా!"

"నేనిచట భోజనము చేయను. యువతీమణి ఇంటి వద్ద భోజనము చేయబోవుచున్నాను."

"చిత్తము. అయ్యా!"

అంతట డ్రమ్మొల్ నావంక విజయగర్వముతో చూచెను. తరువాత మేమిరువురము మాట్లాడుకొంటిమి. కాని ఆ సంభాషణ మాకిరువురకు గూడ రుచికరముగ లేకుండెను. ఎట్టకేలకు నేను విసుగెత్తి బయటకు పోతిని.

నేను తిన్నగా పోయి హావిషమ్ కన్య గదిలో ప్రవేశించితిని. అప్పుడామె కుంపటివద్ద కూర్చుండి యుండెను ఎస్టెలా ఆమె పాదముల వద్ద కూర్చుండి ఏదో అల్లికపని చేసుకొనుచుండెను. నన్ను చూడగనే వారొకరి మొగమువంక యొకరుచూచుకొనిరి. వారు నాలోని మార్పును గ్రహించినట్లుండెను.

"పిప్! నీవు ఏగాలి కిచ్చుటకు కొట్టుకొని వచ్చినావు?" అని హావిషమ్ కన్య అనెను.

"నేను నిన్న రిచ్మండుకు పోయియుంటిని. ఎస్టెల్లాతో మాట్లాడవలయునని తలచితిని. కాని ఆమె నెవ్వరో యిచ్చటికి కొట్టుకొని వచ్చినారని తెలిసినది. అందువలన ఇచ్చటకు వచ్చి నాను."

అంతట నామె నన్ను కుర్చీమీద కూర్చుండ వలసినదిగా సంజ్ఞ జేసెను. అప్పుడు నేను సాధారణముగ ఆమె కూర్చుండెడి కుర్చీమీద కూర్చుంటిని. తరువాత నిట్లంటిని: "నేను ఎస్టెల్లాకు పోదలచుకొన్న విషయము నిపుడు నీ ముందే చెప్పెదను. అది నీకు ఆశ్చర్యమును గొల్పను. అయిష్టముగను నుండదు. నేను నీవు ఎన్నడును అనుకోనంత సుఖముగ నున్నాను. నాకు సహాయము చేయుచున్న వారెవరో కనుగొన్నాను. కానిఅందువలన నాకీర్తి ప్రతిష్ఠలు మున్నగునవి పెరుగవు. ఇంక దానిని గురించి వివర ముగ చెప్పకుండుటకు కొన్ని కారణములు గలవు. అది నా రహస్యముకాదు. మఱియొకరి రహస్యము."

"అది నీ రహస్యము కాదు, మఱియొకరి రహస్యము తరువాత?" హావిషమ్ కన్య అనెను.

"నీవు నన్ను మొదట ఇచటకు రప్పించినావు. నీఇష్టము వచ్చినట్లు నన్ను ఉపయోగించుకొన్నావు"

"ఓ! పిప్!"

"మఱి జాగర్సు......"

"జాగర్సుకు ఆ సంగతి ఏమియు తెలియదు. అతడు నా న్యాయవాది అగుటయు, నీకు సాహాయ్యము చేసినవారి న్యాయవాది అగుటయు కాకతాళీయము మాత్రమే అతని

కటువంటి సంబంధము పలువురితో నున్నది. అందు ఆశ్చర్యకర మైన విషయ మేమాత్రము లేదు."

"నాకు సాహాయ్యము చేయుచున్నవారు మీరే అని భావించును. ఆ పొరపాటు అభిప్రాయమును ప్రోత్సహించి నాను."

"అవును."

"అటులచేయుట న్యాయమేనా? అది నిర్దయ కాదా?"

"నే నెవ్వరిని? దయచూపుటకు నేను ఎవరిని?"

"నేను మీ మీద ఫిర్యాదుగా అని చెప్పలేదు."

"సరిసరి. తరువాత?"

"నేను విషయ సేకరణకొరకుమాత్రమే అడిగినాను. అది అటుండనిమ్ము. మఱి నీ బంధువులను ఎందుకు శిక్షించు చున్నావు?"

"నా చరిత్ర ఏమి? ఎవరి కర్మకు ఎవరు కర్తలు?"

"నేను లండనుకు పోయిన తరువాత నీ బంధువుల కుటుంబము వారితోబాటు నివసించుట తటస్థించినది. వారి సంగతి నాకు పూర్తిగ తెలియును. నీవు నన్ను గుఱించి ఏమనుకొన్నను సరే. వారినిగూర్చి నీకు చెప్పవలసియున్నది. నీవు మర్తయు పోకెట్‌కు, అతని కుమారుడు హెర్బర్టుకు తీఱని అన్యాయము చేయుచున్నావని నిష్కర్షగ చెప్పవలసి యున్నది."

"వారు నీకు మిత్రులు."

"అవును. వారు నాకు మిత్రులైనారు."

"వారికేమి చేయమందువు?"

"నీవు హెర్బర్టుకు ధనసాహాయ్యము చేయవలసియున్నది. కాని నీవు సాహాయ్యము చేయుచున్నట్లతనికి తెలియరాదు."

"అతనికి తెలియకుండ ఎందులకు చేయవలయును?"

"రెండు సంవత్సరముల క్రిందటనే నే నతనికి తెలియకుండ సాహాయ్యముచేయ ప్రారంభించినాను. ఇప్పుడు నేను సాహాయ్యము చేయు పరిస్థితిలో లేను. కావున ఇదివఱకువలెనే అతనికి సాహాయ్యమందుట అత్యావసరమైయున్నది. నే నిప్పు డెందుకు సాహాయ్యము చేయలేనను విషయమును వివరించి చెప్పుటకు వీలులేదు. అది మఱియొకరిరహస్యమునకుసంబంధించియున్నది."

కొంచెముసేపు ఆలోచించిన తరువాత ఆమె ఇట్లనెను: "ఇంక ?"

కాని నే నేమియు సమాధానము చెప్పకుండ ఎస్టెలా వంక తిరిగి యిట్లంటిని: "ఎస్టెలా! నేను నిన్ను ప్రేమించుచున్నానను విషయము నీకు బాగుగ తెలియును. నేను నిన్ను చాలకాలమునుండి గాఢముగా ప్రేమించుచున్నాను. విషయము నీకు తెలియును. ఈ సంగతిని నేను నీకు చాలకాలము క్రిందటనే చెప్పియుండవలసినది. కాని హావిషమ్‌కన్యనుగూర్చి పొరపాటు అభిప్రాయపడుటవలన నేను చెప్పలేదు. మనమిరువురము భార్యాభర్తలు కావలయునని గాఢముగ వాంఛించున్నదని నేను తలచితిని. నీకు స్వాతంత్ర్యము లేదను వుద్దేశ్యముతో నేను చెప్పలేదు. కాని యిప్పుడు చెప్పక తప్పదు."

ఎస్టెలా తల అడ్డముగా ఊపెను.

నే నింకను నిట్లంటిని: "నాకు తెలియుదు? నాకు తెలియును! ఎస్టెలా! నీవు నాదానివని పిలుచుకొను అవకాశము నాకు

లేదను విషయము తెలియును. నా భవిష్యత్తు ఎట్లుండునో నాకు తెలియదు. అయినను నేను నిన్ను ప్రేమించుచున్నాను. నేను మొట్ట మొదట ఈ గృహములో చూచినప్పటి నుండియు నిన్ను ప్రేమించుచునే యున్నాను."

ఎస్టెలా మరల తల అడ్డముగా ఊపెను.

అంతట నేను హావిషమ్‌కన్య ప్రవర్తనను తీవ్రముగ నిరసించుచు మాట్లాడితిని. అపుడు హావిషమ్‌కన్య తన చేతిని హృదయము మీద పెట్టుకొని నావంక, ఎస్టెలావంక చూడసాగెను.

పిమ్మట ఎస్టెలా కడు ప్రశాంతముగ నిట్లనెను: "నీవు నన్ను ప్రేమించు చున్నానని చెప్పుచున్నావు. దాని భావమేమో నాకు తెలియదు. నేను దానిని మాటల ప్రోగుగ మాత్రమే స్వీకరించు చున్నాను. నీ మాటలకు నా హృదయము స్పందించుట లేదు. అసలవి అందులో ప్రవేశించుట లేదు. నీ మాటల నసలు నే నేమాత్రము లెక్క చేయుట లేదు. ఆ విషయమునుగూర్చి నిన్ను హెచ్చరించుటకు ప్రయత్నించినాను. లేదా?"

"అవును."

"అవును. కాని నీవా హెచ్చరికను స్వీకరింపలేదు. నా యుద్దేశ్యమది కాదను కొన్నావు. నీవట్లు తలంచినావా లేదా?"

"నీ యుద్దేశ్య మదియని నే నెట్లను కొందును. నీవు యువతివి; అందమైనదానవు. ఎస్టెలా! అది ప్రకృతి విరుద్ధమైనది."

"అది నా ప్రకృతిలో నున్నది. నాలో నేర్పడిన ప్రకృతిలో నున్నది. నీకు ఇతరులకు మధ్య చాల తేడా ఉన్నది. అందువలననే ఇంతగా చెప్పినాను. నేనింక చేయగలిగినది ఏమియు లేదు."

"డ్రమ్మొల్ ఈ పట్టణములోనే యున్నాడు. అతడు నీ వెంటపడి తిరుగు చున్నాడన్న మాట నిజమే కదా!"

"అవును, నిజమే."

"అతనిని నీవు ప్రోత్సహించు చున్నావు. అతనితో బాహు గుఱ్ఱపు స్వారీ చేయుచున్నావు. నేడతనితో కలసి భోజనము చేయ నున్నావు. ఇవి అన్నియు నిజమేనా?"

ఆ విషయములన్నియు నాకు తెలిసినందులకు కామె ఆశ్చర్య పడుచు, "నిజమే" అని యనెను.

"ఎస్టెలా? నీ వతనిని ప్రేమింప లేవే!"

"నేనేమి చెప్పినాను? నీకంత చెప్పిన తరువాతగూడ నేను చెప్పునదొకటి, ఉద్దేశ్యము వేఱొకటి అని భావించు చున్నావా?"

"ఎస్టెలా! నీవతని నెన్నటికిని వివాహము చేసికొనవా?

"నేను నీ కెందుకు నిజము చెప్పకూడదు? నాకు అతనికి వివాహము కాబోవు చున్నది."

ఆ మాటలకు నాకు అపరిమితమగు విచారము కలిగించెను. కాని నన్ను నేను అదుపులో పెట్టుకొంటిని.

ఎట్టకేలకు ఇట్లంటిని: "ప్రియమైన ఎస్టెలా! ప్రియాతి ప్రియమైన ఎస్టెలా! హవిషమ్‌కన్య మాటలువిని అటువంటి పని చేయకుము. నన్ను శాశ్వతముగ వదలివేయుము. నీ వటుల చేసి నావను విషయము బాగుగ తెలియును. కాని సరియైన వానిని ఎన్నుకొని వివాహము చేసికొనుము. నిన్ను పరి పరి విధముల ప్రశంసించు వారెందఱో నున్నారు. నిన్ను హృదయపూర్వకముగ ప్రేమించు చున్నవారు కొందఱున్నారు. వారి నందఱను అవమానించుటకుగాను హవిషమ్‌కన్య నిన్నా వ్యర్థునకిచ్చి వివాహము

చేయవలయునని సంకల్పించుకొని యున్నది. నావలె నిన్ను గాఢముగ ప్రేమించుచున్నవాడు మఱియొకడుండ వచ్చును. అతనిని వివాహము చేసికొనుము. నే నప్పుడు నీ చర్యను సహింపగలను."

"నేనతనిని వివాహము చేసికొనబోవుచున్నాను. వివాహమునకు కావలసిన పనులన్నియు జరుగుచున్నవి. త్వరలోనే నా వివాహము జరుగును. నీవు అనవసరముగ నా పెంపుడుతల్లి పేరు నెందులకింక తెచ్చెదవు? ఇది నేను స్వయముగా చేసికొన్న నిర్ణయము."

"ఎస్టెల్లా? ఇది నీ స్వంతనిర్ణయమా? పనికిమాలిన వానిని చేసుకోదలచుట నీ నిర్ణయమా?"

"ఆమాటలెందులకు? నేనొక నిర్ణయమునకు వచ్చినాను అంతయు నై పోయినది. నేను బాగుగనే జీవింతును. అటులనే నా భర్తకూడ. నేనిప్పుడప్పుడే వివాహము చేసికోరాదనియే హావిషమ్‌కన్య అభిప్రాయపడుచున్నది. కాని నేనింతవఱకు గడపిన జీవితముతో నాకు విసుగెత్తిపోయినది. అందుచలన నేను జీవితవిధానమును మార్చుకొనదలచుకొన్నాను. ఇంక నేమియు మాట్లాడకుము. మనము ఒకరినొకరము అర్థముచేసికోలేము."

"అతడు వట్టిపశువు! వట్టిపశువు!" అని నేను నిస్పృహతో నంటిని.

"నేనతనివద్ద దేవతవలెనుందునని భయపడకుము. ఇదిగో నా హస్తము. మనమింక విడిపోదము" అని ఎస్టెల్లా అనెను.

నా కన్నీరు ఆమె చేతిమీద పడుచుండగా నేనిట్లంటిని: "ఓ ఎస్టెల్లా! నేను ఇంగ్లండులో తల ఎత్తుకొని తిరుగుచు నిన్ను డ్రమ్మిల్ భార్యగా ఎట్లు చూడగలను?"

"అవి ఏమిమాటలు ? కాలము గడచుచున్న కొలది అంతయు సమసి పోవును."

"ఎప్పటికిని కాదు, ఎన్నెలా !"

"ఒక్క వారమురోజులలోనే నేను నీ మనస్సులోనుండి మాయమగుదును."

"నా మనస్సులోనుండి మాయమగుటయా ! ఎన్నటికిని కాదు! ఎన్నటికిని కాదు ! నీవు నాలోని భాగమవు. నీవు నా ప్రతి అణువులోను నున్నావు. నీవులేనిదే నేను లేను. నేను ఏ పని చేసినను నీవు ఉన్నావు. నా జీవితాంతమువఱకు నీవు నాలోనే యుందువు. ఈ వియోగములో నేను నీ మంచినే జ్ఞప్తియందుంచు కొందును. భగవంతుడు నిన్ను ఆశీర్వదించును గాక ! భగవంతుడు నిన్ను క్షమించునుగాక !"

అట్లని నేనామె హస్తమును ముద్దుపెట్టుకొంటిని. పిమ్మట బయటకు పోతిని.

కోచిలో ప్రయాణము చేయవలయునన్న నేను "బ్లాక్ బోర్" హోటలువద్దకు పోవలయును. అచ్చట నాకు డ్రమ్మోల్ కనబడవచ్చును. అతనిని చూచుటకుగాని, అతనితో మాట్లాడుటకుగాని నాకేమాత్రము ఇష్టములేదు. అందువలన నేను నడచియే లండను మహానగరమునకు పోవలయునని నిర్ణయించుకొంటిని. వెంటనే నేను ఆ ఆలోచనను అమలులో పెట్టితిని.

నేను లండను వంతెనను దాటునప్పటికి అర్ధరాత్రి దాటిపోయెను. ఎట్టకేలకు నేను ఇల్లు చేరుకొంటిని. నడచుటవలన నా బట్టలన్నియు మట్టికొట్టుకొని యుండెను. అందువలన రాత్రి

కావలివాడు నన్ను సంశయముగ చూడసాగెను. అపుడు నే నతనికి నా పేరు చెప్పితిని.

అంతట నతనిట్లనెను: "నేను మొదట సందేహించినమాట నిజమే. కాని యిప్పుడు నాసందేహము తీఱిపోయినది. అయ్యా! ఒక వార్తావహుఁడు వచ్చి ఈయుత్తరమునిచ్చినాడు. దీనినిచదివిన తరువాతనే ఇంటిలోనికి వెళ్ళవలసినదిగా చెప్పుమన్నాడు." అపుడు నేను ఆశ్చర్యముతో నా యుత్తరమును తీసికొని, చింపి చదివితిని. అందిట్లుండెను: "ఇంటిలోనికి వెళ్ళవలదు." అది వెమ్మిక్ వ్రాతయని వెంటనే గ్రహించితిని.

## 24

నేను వెంటనే వెనుకకు తిరిగిపోయి దూరముగా నున్న ఒక హోటలుకు వెళ్లితిని. అచ్చట ఒక గది తీసికొని అందు నిదురింపబోతిని. కాని నాకు సరిగా నిదురపట్టలేదు.

తెల్లవాఱిన తరువాత లేచి ఏడు గంటలకు వెమ్మిక్ వద్దకు పోతిని. నన్ను చూడగనే అతడు, "హలో! పిప్! అయిన నీవు తిరిగి వచ్చినావన్నమాట!" అని యనెను.

"అవును, తిరిగి వచ్చినాను. కాని ఇంటికి మాత్రము వెళ్ళలేదు."

"నీవు చేసిన పనికి చాల సంతోషించుచున్నాను." అని అతడనెను. ప్రోవిస్ పేరు చెప్పకుండ అతడింకను నిట్లనెను: "నేను

నీకా ఉత్తరము నెంపులకు వ్రాసినానో తెలియునా? ఒకరు ఆస్ట్రేలియానుండి ఈ దేశమునకు తిరిగివచ్చినారను వార్త ప్రబలినది. అతనిరాకకొఱకు చాలమంది వేచియున్నారు. వారతనిని పట్టుకొని ప్రభుత్వమువారి కప్పగింపవలయునని తలచుచున్నారు. అతడు నీవద్దకు తప్పకవచ్చునని వారు ఊహించినారు. అందువలన వారు నీ బసను కనిపెట్టిచూచుచున్నారు."

"ఎవరు?" అని నేను ప్రశ్నించితిని.

కాని అతడు పేర్లుచెప్పలేదు.

"కాంపేసన్ అను పేరు వినియుంటివా?" అని నేను ప్రశ్నించితిని

"అవును" అను అర్థమువచ్చునట్లు అతడు తలయూపెను.

"అతడిప్పుడు జీవించియున్నాడా?"

అతడు మరల తలయూపెను.

"అతడిప్పుడు లండనులో నివసించుచున్నాడా?"

అతడు మరల తల యూపెను.

తరువాత నతనితో నేను: "ఆస్ట్రేలియానుండి ఒక మనుజుడు తిరిగివచ్చినాడను విషయము తెలిసినతరువాత నేనేమిచేసితినో తెలియజెప్పెదను వినుము. మొదట నేను నీ నివాసస్థానమునకు పోతిని. అచ్చట నీవుగాని, హెర్బర్టుగాని కనబడలేదు. అంతట నేను హెర్బర్టు పనిచేయుచున్న వ్యాపారకార్యాలయమునకు పోతిని. అచ్చట నతనిని కలిసికొని ఇట్లుచెప్పితిని: "పిప్ బసలో గాని, అతనిబసకు సమీపమునగాని ఒకరు నివసించుచున్న విషయము నీకు తెలియునా? తెలిసినచో పిప్ లేనప్పుడే అతని నచ్చట నుండి వేఱొక ప్రదేశమునకు మార్చివేయుట అత్యవసరము."

నా మాటల అర్థమును హెర్బర్టు గ్రహించెను. కాని ఏమిచేయు టకును అతనికి తోచకుండెను.

కాని కొంచెము సేపటికి కతనికొక చక్కనిఆలోచనతట్టెను. 'నా ప్రియురాలు క్లేరా తనతండ్రితో కలసి నదియొద్దనసేయున్న ఒక గృహములో నివసించుచున్నది. అచ్చట రెండుగదులు ఖాళీగానున్నవి. కావున మనమనస్సులోని ఒకరు అచ్చట సురక్షి తముగ కొంతకాలముండవచ్చును' అని అతడనెను. అతడా యింటి పూర్తివిలాసమునుగూడ నాకు చెప్పెను.

నేను ఆ ఒకరిని అచ్చట ప్రవేశపెట్టుటకు అంగీకరించితిని. అందుకు మూడుకారణములు గలవు. ఒకటి నీబసకు; ఆ యింటికి చాలదూరమున్నది. అందువలన నీకొఱకచ్చట నెవ్వరును చూడరు. నీవచటకు వెళ్ళకుండగనే హెర్బర్టు ద్వారమున అతని క్షేమ సమాచారములను తెలిసికోవచ్చును. మూడు, ఆ ఒకరిని సురక్షితముగ ఓడలో ప్రవేశపెట్టవలసి వచ్చినప్పుడు అతడచ్చట సిద్ధముగ నుండును."

వెమ్మిక్ మాటలు నాకెంతో సంతోషము కలుగజేయ సాగెను. అందువలన నేను "ఇంకనుచెప్పుము. ఇంకనుచెప్పుము" అని యన సాగితిని.

వెమ్మిక్ ఇంకను ఇట్లు చెప్పసాగెను: "హెర్బర్టు వెంటనే ఆ ఒకరిని క్రొత్త బసలోనికి మార్చుటకు ప్రయత్నించెను. ఆపని ఎవ్వరికిని ఎట్టి అనుమానమును కలుగకుండ అత్యంత స్వల్పకాల ములో జరిగిపోయెను. ఆ సమయమున నీవిచ్చట లేకుండుటయే చాల మంచిపనియైనది. ఇప్పటికి నేనుచేయవలసిన పనియంతయు పూర్తియైనది. ఇంక నేను ఏమి చేయవలసియున్నను సంతో

షముతో చేయుదును. అవసరము వచ్చినప్పుడు నిన్ను తప్పక కలిసికొందును. నేటిరాత్రి నీవు ఆ ఒకరిని చూచుటకు పోవచ్చును. అందువలన నెట్టి అపాయమును ఉండదు. నీవు నీ బసకు వెళ్ళుటకు పూర్వమే ఆ పనిచేయవచ్చును. చీకటి పడు వఱకు నీవు నీ బసకు వెళ్ళకుండుట చాల మంచి పని."

తరువాత నతడు నాకు ఆ ఒకరు నివసించుచున్న ఇంటి పూర్తి విలాసమును తెలిపెను. నేనా పగలంతయు హెమ్మిక్ గృహములోనే సుఖముగా నిదురించితిని.

రాత్రి ఎనిమిది గంటలకు నేను, క్లేరా తన తండ్రితో కలసి నివసించుచున్న ఇంటివద్దకు పోతిమి. అచ్చటనున్న హెర్బర్టు కలసికొని లోపలకు తీసికొనిపోయెను. మేమిరువురము ఒక గది లోనికి ప్రవేశించితిమి.

అంతట హెర్బర్టు ఇట్లనెను: "ప్రియమిత్రమా! అంతయు బాగుగనే యున్నది. అతనికి సంపూర్ణమగు సంతృప్తి కలిగినది. కాని అతడు నిన్ను చూడవలయునని తొందఱ పడుచున్నాడు. నా ప్రియురాలు తన తండ్రివద్ద నున్నది. ఆమె క్రిందకు వచ్చు వఱకు నీవిచ్చటనున్నచో నిన్నామెకు పరిచయము చేయుదును. తరువాత మనము పైకి పోవచ్చును.

తరువాత హెర్బర్టు క్లేరా తండ్రిని నిశితముగ విమర్శింప సాగెను. అంతలో ఇఱువది యేండ్లసుందరి యొకర్తు ఆ గదిలో ప్రవేశించెను. ఆమె చేత నొక బుట్టయుండెను. హెర్బర్టు ఆమె చేతిలోనుండి బుట్ట తీసికొనెను. పిమ్మట నన్ను ఆమెకు, ఆమెను నాకు, పరిచయము చేసెను. క్లేరాపట్ల నాకు సదభిప్రాయ మేర్ప డెను. ఆమెలో అనేక సుగుణము లున్నట్లు నాకు అర్థమయ్యెను.

కొంచెముసేపు ఆ గదిలో నున్న తరువాత క్లేరా మరల తండ్రి వద్దకు పోయెను.

అటుపిమ్మట నేను, హెర్బర్టు కలసి మేడపై గదులలో నున్న ప్రోవిస్ వద్దకు పోతిమి. ఆ గదుల కిటికీలు నదివైపుకుండెను. ప్రోవిస్ నిర్భయముగ కూర్చుండి యుండెను. అతని మొగమున శాంతము తొంగలి సలాడుచుండెను.

మేము ముగ్గురము కుంపటివద్ద కూర్చుంటిమి. అప్పుడు నేను ప్రోవిస్‌తో నిట్లంటిని: "నీకు వెమ్మిక్ తెలివితేటల యందు నమ్మకమున్నదా?"

ఆ ప్రశ్న కతడిట్లు సమాధానము చెప్పెను: "నాయనా! జాగర్సు కావిషయ మంతయు బాగుగ తెలియును. జాగర్సు సరియైన దనుకొన్నవానినే వెమ్మిక్‌కు చెప్పును; చేయును."

అప్పుడు నేను అతనికి వెమ్మిక్ మా కరువురకు చెప్పిన విషయముల నన్నిటిని చెప్పితిని. కాని కాంపేసన్‌కు సంబంధించిన విషయములను మాత్రము చెప్పలేదు. ఏలయన ఆవిషయమును చెప్పినచో కాంపేసన్‌ను చంపివేయవలయునను నుద్దేశ్యముతో బయటకు పోవచ్చును. ఆ విధముగా నతడు సర్వనాశనమునకు దారి తీయవచ్చును.

కొందఱు నా బసను కనిపెట్టి చూచుచున్నారు; ప్రోవిస్ కొంతకాలమువఱకు నా బసకు రారాదు; నేను ప్రోవిస్‌కు కొంత కాలమువఱకు దూరముగా నుండవలయును; ప్రోవిస్ వీలు చిక్కగానే ఇంగ్లండునుండి విదేశములకు వెళ్లిపోవలయును. అవసరమైనచో నేనుకూడ అతనితోనే వత్తును; లేక తరువాత వచ్చి కలసికొందును; మున్నగు విషయము లతనికి తెలిపితిని.

అంతయు విన్నతరువాత నత డిట్లనెను: "నమ్మిక్ చేయుమన్నట్లెల్ల చేయుటకు నేను సంసిద్ధముగా నున్నాను."

ఆ మాటలను విని నేనెంతయు సంతసించితిని.

తరువాత హెర్బర్టు ఇట్లనెను: "పిప్! మన మిద్దఱము పడవలను చక్కగా నడపుటలో సమర్థులము. సమయము వచ్చినప్పుడు మన మితనిని పడవలో కూర్చుండబెట్టి ఓడవద్దకు తీసికొనిపోదము. ఈలోపల నీవొక పని చేయవలయును. నీవు నదిమీద ఒక పడవ నేర్పాటు చేసికోవలయును. వీలు చిక్కినప్పుడెల్ల నీ వా పడవను ఇటు నటు త్రిప్పుచుండవలయును. నీవు పడవను నడుపుచున్న దృశ్యమును పలువురు జనులు చూచుచుందురు. కొంతకాలమునకు వారికది అందులో ప్రత్యేకత ఏమియు నగపడదు. కడకు వారు నీవంక చూచుటయే మానివైచెదరు. అప్పుడు మన మితనిని తీసికొనిపోవచ్చును."

హెర్బర్టు ఇచ్చిన సలహా చాల చక్కగా నుండెను నేను, ప్రోవిస్ కూడ ఆ సలహాను ఎంతయు అభినందించితిమి. ఆ సలహాను వెంటనే అమలులో పెట్టవలయునని మేము నిశ్చయించుకొంటిమి.

అంతటితో మా సమావేశము ముగిసెను, నేను ఇంటికి పోవుటకై లేచి నిలబడి హెర్బర్టుతో నిట్లంటిని: "మిత్రమా! నీవు నేను ఇప్పుడు కలిసి ఇంటికిపోవుట మంచిపని కాదు. అనుమానములకు దారితీయవచ్చును. కనుక నేను వెళ్ళిన అరగంటకు నీవు ఇచ్చటనుండి బయలుదేఱి రమ్ము."

తరువాత ప్రోవిస్తో ఇట్లంటిని: "నిన్నిచ్చట విడిచిపెట్టుట నాకేమాత్రము ఇష్టమైన పనికాదు. కాని తప్పునా, పోయెద, నీవు

నా దగ్గఱకొంటె ఇచ్చటనే సురక్షితముగ నుండును. అందువలన నిన్నిచ్చటనే వదలి వెళ్లుచున్నాను. గుడ్ బై."

అప్పుడు ప్రొవిస్ ఇట్లనెను: "మనము తిరిగి ఎప్పుడు కలసి కొందుమో తెలియదు. నీవు 'గుడ్ బై' అనిఅనుట నా కిష్టముగా లేదు. 'గుడ్ నైట్' అని అనుము."

"గుడ్ నైట్! హెర్బర్టు మన యిరువురి మధ్య తిరుగు చుండును. నీ క్షేమ సమాచారముల నతడు నాకు తెలియజేయు చుండును. సమయము వచ్చినపుడు నేను సిద్ధముగా నుందునని నమ్ముము. గుడ్ నైట్! గుడ్ నైట్!" అని నే నంటిని.

నేను క్రిందకు దిగిపోవుచు వెనుకకు తిరిగి చూచితిని. నా కప్పుడు గుమ్మములో నిలబడియున్న ప్రొవిస్ కనబడెను. అతడు నా బసకు వచ్చిన మొదటిరాత్రి అతనిని చూడగనే జుగుప్స కలిగెను. కాని యిప్పు డతనిని వీడిపోవుచున్నందుకు నా హృదయ మెంతయు బాధపడసాగెను.

హెర్బర్టు నా వెనుకనే వచ్చి ఇట్లుచెప్పెను: "ఈ గృహ ములో ప్రొవిస్ పేరు ప్రొవిస్ కాదు; కాంబెల్ అతని పేరు."

హెర్బర్టు తెలివితేటలకు నే నెంతయు సంతసించితిని. తరు వాత నేను క్లేరావద్ద సెలవుతీసికొని బయటకుపోతిని. నేను ఎవ్వ రైనను తలచుకొని విచారింపసాగితిని. మెల్లన ఇల్లుచేరుకొంటిని. నా కెవ్వరును కనబడలేదు. తరువాత నా గదిలో ప్రవేశించి మంచముపై పరుంటిని. కాని నాకు నిదురపట్టలేదు. మఱికొంం చెము సేపటికి హెర్బర్టు వచ్చెను. అతడుకూడ తనకెవ్వరును కన బడలేదని చెప్పెను.

మఱునాడు నేను పడవకొఱకు విచారించి ఒకపడవను సంపాదించితిని. అప్పటినుండి నేను నదిలో విలాసార్థము ఆ పడవను నడుపసాగితిని. ఒక్కొకప్పుడు హెర్బర్టుకూడ వచ్చుచుండెడివాడు. కొన్నిసార్లా విధముగ చేసినతరువాత సన్నుగమనించువారే లేకుండిరి.

హెర్బర్టు ప్రోవిస్‌కు సంబంధించిన సంగతులేవియు చెప్పకుండెను. అనగా అతనినిగూర్చి భయపడవలసిన పనిలేదన్నమాట; అతడు సురక్షితముగనే యున్నాడన్నమాట. కాని నేను మాత్రము భయపడుచుంటిని. మమ్ముఱు నెవ్వరోకనిపెట్టి తిరుగుచున్నట్లు భావింపసాగితిని. దుర్మార్గుడగు కాంపేసన్, పోలీసులకు ప్రోవిస్‌ను పట్టియిచ్చుటకు సిద్ధపడుచున్నాడని భావింపసాగితిని నామనస్సు మాటి మాటికని ఆందోళనా పూరితమగుచుండెను.

## 25

వారములు గడచిపోవుచుండెను. కాని ఎట్టి మార్పును కనబడకుండెను. వెమ్మిక్ కనబడునేమోయని మేము వేచియుండసాగితిమి. కాని అతనిజాడ ఏమియు తెలియకుండెను. అతనినద్దనుండి ఏకబురునురాకుండెను. అతనిసంగతి నాకు బాగుగ తెలియును. అందువలన నేనతని నేమాత్రము సందేహింపజాలితిని,

నాఆర్థికపరిస్థితులు కడుహీనముగనుండెను. నాకు సొమ్మ అప్పిచ్చినవారు తిరిగి యీయవలసినదని ఒత్తిడిచేయసాగిరి. నా ఖర్చులకుగూడ సొమ్ము అవసరమగుచుండెను. అందువలన నావద్దనున్న విలువైన వస్తువులనుఒక్కొక్కదానినే అమ్మివేయ సాగితిని. నాకు చాల విలువైన బ్యాంకునోట్లున్న పుస్తకము నొక దానిని ప్రోవిస్ఇచ్చినమాట నిజమే. కాని ఆసొమ్మును ఖర్చు పెట్టరాదని నిశ్చయించుకొంటిని. ప్రస్తుత అనిశ్చిత పరిస్థితిలో ఆసొమ్మును ఖర్చుపెట్టుట మోసమనియు, హృదయములేనివారు మాత్రమే అట్టిపని చేయగలరనియు భావించితిని. అందువలన ఆ పుస్తకమును ప్రోవిస్ వద్దకు పంపివైచితిని. అతడెవ్వరో తెలి సినతరువాత అతనిడబ్బు వాడుకొనందుకు సంతృప్తిచెందితిని.

నా జీవితము కడుదుర్భరముగ కనబడుచుండెను. నేను ఎప్పటివలె నదిలో పడవ నడుపుచునేయుంటిని. ఫిబ్రవరి మాసపు చివరిరోజులలో ఒకనాడు నేను పడవను ఇటు నటు త్రిప్పితిని. తరువాత భోజనము చేయవలయు నను నుద్దేశ్యములో ఒక హోటలులో ప్రవేశించితిని. అచ్చట భోజనము చేసిన తరువాత వాప్సల్ నటించుచున్న నాటకము నకు పోతిని. నాటకమైపోయిన తరువాత నేను బయటకు వచ్చితిని. అప్పుడచ్చట నా కొఱకు వాప్సల్ వేచియుండెను.

"నీ వెనుక నెవ్వరో వింతమనిషి కూర్చునట్లు కనబడినది" అని అతడనెను.

"అతడెట్లున్నాడు?"

"అప్పుడు నీవు చిన్నవాడవు. అది క్రిస్మసు సుదినము. ఆనాడు నేను గార్జరీ ఇంట భోజనము చేసినాను. అప్పుడు

కొందఱు సైనికులు సంకెళ్ళను బాగుచేయించుటకు వచ్చినారు. జ్ఞాపకమున్నదా?"

"బాగుగ జ్ఞాపకమున్నది."

"సైనికులు ఇరువురు నేరగాండ్రను పట్టుకో వలయునని వెళ్ళినారు. మనముకూడ వారివెంట వెళ్ళినాము. గార్జరీ నిన్ను వీపుమీద ఎక్కించుకొన్నాడు. జ్ఞాపకమున్నదా?"

"బాగుగ జ్ఞాపకమున్నది."

"ఇరువురు నేరగాండ్రొక గోతిలో పోరుచున్న దృశ్యమును మనము చూచినాము. అందులో ఒకడు తీవ్రముగ గాయపడియుండెను అతని మొగము గాయములు మయమై యుండెను. జ్ఞాపకమున్నదా?"

"అది యంతయు నాకు కన్నులకు కట్టినట్లు కనబడు చున్నది."

"ఆ నేరగాండ్రలో నొకడు నీవు నాటకము చూచు చుండగా నీ వెనుకనే కూర్చుండి యున్నట్లు కనబడినది."

"మఱి ఇరువురు నేరగాండ్రున్నారుగదా! అందులో నీవు ఏ నేరగానిని చూచి యుంటివి?"

"అప్పుడు తీవ్రముగ గాయపడిన నేరగానినే చూచి యుంటిని. అందుకు సందేహ మేమాత్రము లేదు."

"ఇది చాల వింతగా నున్నది" అని నేను అంటిని.

తరువాత నేను వాప్సుల్ వద్ద సెలవు తీసికొని వెళ్ళిపోతిని. కాంపేసన్ నన్ను వెంబడించు చున్నాడని తెలిసికొని నే నెంతయు ఆందోళన పడసాగితిని. ఎట్లకేలకు నాగది చేరుకొంటిని.

కొంచెముసేపటి కచ్చటకు హెర్బర్టు వచ్చెను. మేమిరువు రము జరిగిన విషయమునుగూర్చి తీవ్రముగ ఆలోచించితిమి. "ఇప్పుడు మనము చేయదగినది ఏమి యున్నది? ఈ విషయము నంతను ఉత్తరము ద్వారమున వెమ్మిక్ కు తెలియజేయుదము. అతని కొఱకు వేచియున్నామని తెలుపుదము" అని హెర్బర్టు అనెను. నేను అతని అభిప్రాయముతో నేకీభవించితిని. వెంటనే ఆ విషయమును వెమ్మిక్ కు తెలియ జేసితిమి.

వారము రోజులు గడచిన తరువాత ఒకనాడు నేను ఒక చోట ఇటునటు తిరుగుచుంటిని. అప్పటికి నే నింకను భోజనము చేయ లేదు. అంతలో నెవ్వరో వెనుకనుండివచ్చి తమ బరువైన హస్తమును నా భుజముపై వేసిరి. ఎవ్వరాయని వెనుకకు తిరిగి చూచితిని. అతడు జాగర్సు.

"మన మిరువురము ఒకే దిక్కునకు పోవుచున్నాము. కలసి పోదమా?" అని అతడనెను.

"అటులనే."

"భోజనమైనదా?"

"లేదు."

"అయిన మన మిరువురము కలసి భోజనము చేయుదము. వెమ్మిక్ కూడ వచ్చును."

నేను అతని ఆహ్వానమును అంగీకరించితిని. మే మిరువురము జాగర్సు కార్యాలయమునకు పోతిమి. అచ్చట వెమ్మిక్ కూడ నుండెను. అచ్చటిపనులు పూర్తియైన తరువాత మేము మువ్వురము కలసి జాగర్సు ఇంటికి పోతిమి.

నేను మ ప్రకారము భోజనమునకు కూర్చుంటిమి. కాని వెమ్మిక్ నావంక చూడకుండెను.

జాగర్సు వెమ్మిక్‌తో నిట్లనెను: "హావిషమ్ కన్య వ్రాసిన యుత్తరమును పిప్‌కు పంపియున్నావా?"

"లేదు. దానిని పోస్టులో పంపవలయు ననుకొన్నాను. అంతలో మీరు వచ్చినారు. ఆ యుత్తర మిదిగో."

అట్లని అతడా యుత్తరమును నాకీయక జాగర్సుకిచ్చెను.

ఈ యుత్తరములో రెండు పంక్తులు మాత్రమే యున్నవి. నీ అడ్రసు తెలియనందున ఆమె దీనిని నాకు పంపినది. నీ వామెను ఏదో పనిచేయుమని కోరినావట. ఆ విషయమున నీవు తన్ను కలిసికోవ యునని కోరుచున్నది. వెళ్ళెదవా?"

"వెళ్ళెదను."

"ఎప్పుడు వెళ్ళెదవు?"

అప్పుడు నేను వెమ్మిక్ వంక చూచుచు నిట్లంటిని: "నా కిచ్చట వేఱొ ముఖ్యమైన పనియున్నది. అందువలన నేను ఎప్పుడు వెళ్ళెదనో చెప్పజాలను."

అంతట వెమ్మిక్ జాగర్సుతో నిట్లనెను: "పిప్ వెంటనే హావిషమ్ కన్య వద్దకు వెళ్ళదలచుకొన్నచో ఆమెకుజాబువ్రాయ వలసిన పని లేదు."

అతని మాటలలోని అర్థమును గ్రహించి నేను ఇట్లంటిని: "నేను రేపే పోయెదను."

అంతట వెమ్మిక్ సంతృప్తితో జాగర్సువంక చూచెను. నావంక మాత్రము కాదు.

భోజన సమయమున నలువది సంవత్సరముల స్త్రీ యొకర్తె మాకు భోజన పదార్థములందించుటకు వచ్చెను. ఆమె చాల పొడవైనది. బాగుగ పాలిపోయి యుండెను. కన్ను లదియొక విధముగా నుండెను. జుట్టుచాల పొడవుగ నుండెను. ఆమెను చూడగనే నాకు ఎవ్లైలా జ్ఞాపకము వచ్చెను. ఎవ్లైలా అన్ని విధములా ఆమెను పోలియుండెను. ఆమె తప్పక ఎవ్లైలా తల్లియై యుండునని నేను భావింప సాగితిని.

భోజనమైపోయిన తరువాత నేను వెమ్మిక్ కలిసి బయటకు వచ్చితిమి. అంతకు మునుపు ఏమియు మాట్లాడని వెమ్మిక్ అప్పటినుండి నాతో ఎంతో చనువుగా మాట్లాడసాగెను. నలువది సంవత్సరముల స్త్రీకి సంబంధించిన చరిత్రను చెప్పవలసినదని నేనతనిని కోరితిని. అంతట నతడామె చరిత్ర నిట్లుచెప్పెను:

"ఆమెపేరు మాలీ. సుమారు ఇరువది సంవత్సరముల క్రిందట ఆమె యొకరిని హత్యచేసినట్లు నేరమారోపింప బడినది. కాని న్యాయస్థానము వారామెను విచారణచేసి విడచి పుచ్చినారు. అప్పుడు జాగర్సు న్యాయస్థానములో ఆమెతరఫున వాదించి యుండెను. హత్య చేయబడిన స్త్రీ, వయస్సునఆమెకంటె పది సంవత్సరములు పెద్ద. మాలికి చాల చిన్నప్పుడే ఒక దుష్టునితో వివాహమైనది. తరువాత నాదుష్టునకు హత్యచేయబడిన స్త్రీతో గూడ సంబంధ మేర్పడినది. అందువలన మాలీ ద్వేషబుద్ధితో ఆ రెండవ స్త్రీని హత్యచేసినదని నేర మారోపింపబడినది. భర్త మీదగల కోపముతో మాలీ తన మూడేండ్ల బిడ్డనుగూడచంపి వైచినదని కొందరు అనుమానించినారు. మరి బిడ్డను హత్య చేసినందుల కామెను ఎందుకు విచారణచేయుట లేదని జాగర్సు

జ్యూరీ వారిని ప్రశ్నించెను. మాలీ నేమియు చేయలేదను విషయము
మును అతడు చక్కగా నిరూపించెను. జ్యూరీవారు అతని వాదనా
పటిమను గ్రహించి ఆమెను విడిచిపుచ్చిరి."

"అప్పటినుండి ఆమె జాగర్సువద్ద పని చేయుచున్నదా?"
అని నేను ప్రశ్నించితిని.

"అవును."

"ఆమెబిడ్డ ఆడబిడ్డయా? మగబిడ్డయా?"

"ఆడబిడ్డయని అన్నారు."

"ఇంక చెప్పవలసిన దేమియు లేదా?"

"ఏమియు లేవు. నీవు వ్రాసిన యుత్తర మందినది; దానిని
కాల్చివైచినాను సంగతి లేమియు లేవు."

తరువాత మేము విడిపోతిమి.

మరునాడు నేను హావిషమ్‌కన్య వ్రాసిన యుత్తరమును
జేబులో పెట్టుకొని ఆమె యింటికి పోతిని. అప్పటికి నాకు ఎస్టెలా
డ్రమ్మల్‌ను వివాహము చేసికొని యుండెను విషయము
గూఢిగా తెలిసియుండెను.

హావిషమ్‌కన్య తన మామూలు గదిలోగాక పెద్దగదిలో
కూర్చుండి యుండెను. ఆమె యప్పుడు చాల స్మీతిస్థిలో
నున్నట్లుండెను. ఆమె నాకు ఎంతో అపకారము చేసినమాట
నిజమే. అయినను నా కామెపట్ల నానుభూతి ఏర్పడెను.

కొంతసేపటి కామె నన్ను చూచి, "ఎవరు? నీవేనా?
నిజమేనా?" అని యడిగెను.

"అవును. నేను పిపును. నీ యుత్తరమును నిన్న జాగర్సు
నాకిచ్చినాడు. నేను వెంటనే ఇక్కడికి వచ్చినాను."

"కృతజ్ఞురాలను. కృతజ్ఞురాలను. నీవప్పుడు ఒక విషయమును గురించి మాట్లాడినావు. ఆ విషయమునుగూర్చి మాట్లాడుటకును, నా శరీరమంతయు శిలకాదని ఋజువు చేయుటకును నిన్ను పిలిపించినాను. నాలో మానవత్వమున్నదను విషయమును నీవు నమ్మవను కొందును."

"నీ వటుల భావింపవలసిన పని లేదు."

"నీ స్నేహితురాలికు నేను సాహాయ్యము చేయవలయునని కోరి యుంటివిగదా?"

"అవును."

"ఎటువంటి సాహాయ్యము కావలయును?"

అంతట నేను ఆమెకు హెబ్బర్టు వ్యాపారమునకు సంబంధించిన రహస్య చరిత్రనంతను చెప్పి "అత్త యిప్పుడు ఆ వ్యాపార సంస్థలోని భాగమును కొనుటకు సంబంధించిన వ్యవహారమును పూర్తిచేసికోవలసియున్నది" అని అంటిని.

"అందుకు కెంత సొమ్ము కావలయును?"

"తొమ్మిది వందల పౌనులు."

"మఱి ఆ సొమ్మిచ్చినచో నీ రహస్యమును నీవు దాచుకొన్నట్లే నా రహస్యమును గూడ దాచెదవా?"

"తప్పక."

"అప్పుడు నీ మనస్సునకు శాంతి కలుగునా?"

"ఎక్కువ శాంతి కలుగును."

"మఱి నీ విప్పుడు సుఖముగ జీవించుట లేదా?"

"నాకు సుఖమునకు ఆమడ దూరమున్నది. అందుకు నీకు తెలిసిన కారణములు కొన్ని యున్నవి. నీకు తెలియని కారణములు కొన్ని యున్నవి. నీకు తెలియనివి నా రహస్యములు."

"నీ స్నేహితునకు సాహాయ్యము చేయవలయునని నేను నిశ్చయించుకొన్నాను. మఱి నేను నీకు చేయవలసిన సాహాయ్యమేదియు లేదా?"

"ఏదియు లేదు."

"నీవు, జాగస్సు ఇంకను స్నేహితులుగనే యున్నారా?"

"ఉన్నాము. నిన్ననే నేను అతనితో కలిసి భోజనము చేసినాను."

"ఇదిగో ఈ చీటీ తీసికొనిపోయి జాగస్సుకు చూపుము. అతడు నీకు సొమ్మివి వందల సొసులిచ్చును. ఆ సొమ్మును నీ స్నేహితున కుపయోగింపుము. ఇచ్చట నావద్ద దబ్బేమియు నుండదు. జాగస్సుకు ఈ సంగతి ఏదియు తెలియరాదని నీవు భావించుచున్నచో, నేనే నీకు సొమ్ము పంపెదను."

"అతని వద్దనుండి డబ్బు తీసికొనుటకు నాకు ఎట్టి అభ్యంతరము లేదు."

ఆమె తాను వ్రాసిన చీటీని చదివెను. అది చాల స్పష్టముగను, సూటిగను, నుండెను. ఆ చీటీని చదివిన వారెవ్వరును నేను నాస్వంత లాభము కొఱకు సొమ్ము తీసికొనుచున్నానని తలంపరు. నేనామెవద్దనుండి ఆ చీటీని తీసికొంటిని.

తరువాత నామె యిట్లనెను: "పిప్! నీవు నన్ను క్షమింతువా? క్షమించుచున్నానని అనుము."

అంతట నేను ఇట్లంటిని: "నేను నిన్ను క్షమించుచున్నాను. నేను ఎన్నో బాధల ననుభవించినాను. బాధయన నేమో నాకు సంపూర్ణముగ తెలియును. కావున నేను నీపట్ల ద్వేషభావమును కలిగియుండ లేను."

అంతట నామె నా పాదముల ముందు మోకరిల్లెను. తన చేతు లెత్తి మ్రొక్కసాగెను. నేనా దృశ్యమునుజూచి సంభ్రమ పడితిని. లేచి ఎప్పటివలె కూర్చుండ వలసినదని నేనామెను ప్రార్థించితిని. ఆమెను లేవ నెత్తుటకు ప్రయత్నించితిని. కాని ఆమె తన తలను నాచేతిపై ఆన్చి ఏడువ సాగెను. ఆమె కన్నీరు కార్చుచుండగా ఇదివఱకెన్నడును నేను చూచియుండ లేను. కన్నీరు కార్చుట వలన ఆమె హృదయము తేలికపడునని నేను భావించితిని. నే నేమియు మాట్లాడకుండ ఆమెపైకి వంగితిని. అప్పుడామె నేలపై కూర్చుండి, "అయ్యో! నేనేమి చేసినాను! నేనేమి చేసినాను!" అని నిస్పృహతో ననసాగెను.

"నన్ను గాయపఱచినానను నుద్దేశ్యముతో మాట్లాడుచున్నావా? నీవు చేసినది చాల స్వల్పము మాత్రమే. ఎటువంటి పరిస్థితులలో నైనను నే నామెను వివాహము చేసికొని యుండెడి వాడనే. ఆమెకు వివాహమైనదా?"

"అయినది."

నేను ఆ ప్రశ్న అనవసరముగా వేసియుంటిని. ఏలయన ఆ విషయము నాకిదివఱకే తెలియును.

ఆమె చేతులూపుచు, జుట్టు పీకికొనుచు, "నేనేమి చేసినాను! నేనేమి చేసినాను! నేనేమి చేసినాను!" అని అఱవ సాగెను.

ఆమెకేమి సమాధాన మీయవలయునో. ఆమెనెట్లు ఓదార్ప వలయునో నాకు తెలియకుండెను. ఆమె మానవలోకమును ద్వేషించి ఏకాంత జీవితమును గడపుటవలన తగిన ఫలితము ననుభవించు చున్నది. ఎస్టెలాను హృదయములేని దానినిగ తయారుచేసినందుకు తగినఫలితము ననుభవించు చున్నది.

"నీవిప్పుడు ఎస్టెలాతో మాట్లాడినావు. అంతవఱకు నేనేమి చేసినానో నాకు తెలియదు. అయ్యో! నేనేమిచేసినాను! నేనేమి చేసినాను!" అని అనెను.

"నన్నుగుఱించి నీవేమియు అనుకోవలదు. కాని వీలైనచో ఎస్టెలాను తిరిగిబాగుచేయుటకు ప్రయత్నింపుము."

"అవునవును. మొట్టమొదట ఆమె నావద్దకు వచ్చినపుడు నేనామెను దుస్థితినుండి తప్పించవలయుననియే అనుకొన్నాను. కాని తరువాత ఆమె హృదయమును తీసివైచి, ఆ స్థానమున మంచుగడ్డపెట్టినాను."

"హృదయమును పూర్తిగా తొలగింపకుండ గాయపడిన హృదయమునైన నుంచియుండిన బాగుండెడిది."

"నీకు నా పూర్తికథ తెలియదు. తెలిసినచో ఆ విధముగ అనియుండెడివాడవు కావు."

"తెలియకేమి? తెలియును. అది యటులుండనిమ్ము. ఎస్టెలానుగుఱించి ఒకప్రశ్న అడుగదలచుకొన్నాను. నీకెట్టి అభ్యంతరము లేదుకదా?"

"అడుగుము."

"ఎస్టెలా ఎవరిబిడ్డ?"

హావిషమ్‌కన్య తలఆడించెను.

"నీకు తెలియదా?"

ఆమె మరల తలఆడించెను.

"జాగర్సు ఆమెనిచ్చుటకు తీసికొనివచ్చినాడా, లేక ఎవరి ద్వారమునన్నైన పంపినాడా?"

"తీసికొనివచ్చినాడు."

"అది ఎట్లుజరిగినదో చెప్పెదవా ?

"చెప్పెదను వినుము. అప్పటికి నేను ఈ ఏకాంతజీవితములో ప్రవేశించి చాలకాలమైనది. అప్పుడు నాకు ఒకపిల్లను ప్రేమతో పెంచుకొనవలయునను అభిప్రాయము కలిగినది. ఆ యభిప్రాయమును జాగర్సుకు చెప్పినాను. తల్లిదండ్రులు లేని పిల్లనొకర్తను తీసికొనివచ్చి యిత్తునని అతడు అనెను. ఒకనాటి రాత్రి అతడు నిదురించుచున్న పిల్లనొకర్తెను తెచ్చి నాకిచ్చెను. ఆ పిల్లకు నేను ఎస్టెల్లాఅను పేరునొసగితిని."

"అప్పుడా పిల్లవయస్సు ఎంత?"

"రెండుమూడు సంవత్సరములు. ఆమెకు ఏసంగతులు తెలియవు. తానొక అనాథబాలికననియు, తన్ను నేను పెంచుకొన్నాననియు మాత్రము ఆమెకు తెలియును."

జాగర్సువద్ద పనిచేయుచున్న నలుబది సంవత్సరముల స్త్రీ ఎస్టెల్లా తల్లియని నేను గట్టిగా నిశ్చయించుకొంటిని.

ఇంక నేను హావిషమ్‌కన్యవద్ద నుండవలసిన అవసరమేమి వచ్చినది? హెర్బర్టుకు సంబంధించిన విషయమున నేను విజయమును సాధించినాను. ఎస్టెల్లాకు సంబంధించిన విషయమును

తనకు తెలిసినంతవఱకు హావిషమ్కన్య చెప్పినది. హావిషమ్కన్య మనస్సు తేలికపడుటకు నేను దోహదమొసగినాను.

అందువలన నేను ఆమెనువీడి బయటకుపోతిని.

మఱునాడు నేను పయనమైపోయి లండను చేరుకొంటిని. ఇంటికిపోయి హెర్బర్టును కలసికొంటిని.

హెర్బర్టు నాతో నిట్లుచెప్పెను: "ప్రియమిత్రమా! నిన్న రాత్రి నేను సుమారు రెండుగంటలు ప్రొవిస్‌వద్ద కూర్చుంటిని. అప్పుడు అతడు తన భార్యనుగూర్చి చెప్పినాడు. ఆ భార్య, తన భర్త మఱియొకస్త్రీతో తిరుగుచున్నట్లు అనుమానపడుచు అసూయపడుచుండెనదట. ఆమె యా మఱియొక స్త్రీపై పగతీర్చుకోదలచినదట. ఆ యుద్దేశ్యముతో నామె మఱియొకస్త్రీని హత్యచేసినదట. అప్పుడు ఆమెను న్యాయస్థానమువారు విచారణచేసిరి. ఆ సందర్భమున జాగర్సు ఆమె తరఫున వాదించెను. ఆమె హత్యచేయలేదని కోర్టువారు విడిచిపుచ్చిరి. ప్రొవిస్ కిప్పుడే జాగర్సు సంగతి తెలిసెను.

ఆ విడుదల చేయబడిన స్త్రీకిని, ప్రొవిస్‌కును ఒక ఆడపిల్ల యుండెడిది. ఆ పిల్లను ప్రొవిస్ చాల గాఢముగ ప్రేమించుచుండెడివాడు. మఱియొక స్త్రీ హత్యచేయబడిన నాటిరాత్రియే భార్య, భర్తవద్దకుపోయి, 'నేను మన కూతురును నాశనము చేయుదును. ఆమెను నీవిక నన్నటికని చూడజాలవు' అని యనెను. అట్లని ఆమె వెళ్ళిపోయెను.

"మఱి ఆమె తన బెదరింపును నిలబెట్టుకొన్నదా?" అని నేను ప్రశ్నించితిని.

"నిలబెట్టుకొన్నదని ప్రొవిస్ చెప్పుచున్నాడు."

"అది ఎప్పుడు జరిగినదని చెప్పినాడు?"

"సుమారు ఇరువది సంవత్సరములక్రిందట జరిగినదట. అతనిని నీవు శ్మశానములో కలిసికొన్నప్పుడు నీ వయస్సు ఎంత?"

"అప్పుడు నాకుపదునెంసంవత్సరముల వయస్సనుకొందును."

"అయిన అది జరిగి అప్పటికి మూడు నాలుగు సంవత్సరములై యుండునని అన్నాడు. నిన్ను చూడగనే అతనికి తన కూతురు జ్ఞప్తికి వచ్చినదట. ఆమెకు కూడ నీ వయస్సే ఉండి యుండును."

అప్పుడు నేను ఇట్లంటిని: "ప్రియమిత్రమా! ఎస్టెలా ఎవ్వరనుకొనుచున్నావు? ప్రోవిస్ కొమార్తెయే ఎస్టెలా."

తరువాత నే నతనికి ఎస్టెలా తల్లిదండ్రులనుగూర్చి నాకు తెలిసిన విషయమంతయు చెప్పితిని. అటుపిమ్మట నేను జాగర్సు కార్యాలయమునకు పోయి జాగర్సుతో ఆ విషయమంతయు మాట్లాడితిని. "ఈ విషయము ప్రోవిస్‌కుగాని, మాలీకిగాని, ఎస్టెలాకుగాని, తెలియరాదు. తెలిసినచో ఎవరికిగాని కలుగు లాభముండదు. పైగా ఎస్టెలా జీవితము చెడిపోవచ్చును." అని జాగర్సు అనెను. అందువలన ఆ రహస్యము నా ముప్వురకు తెలియజేయరాదని నిశ్చయించుకొంటిని. హావిషమ్‌కన్య ఇచ్చిన చీటి ప్రకారము అతనివద్దనుండి తొమ్మిది వందల పౌనులు తీసికొంటిని.

జాగర్సు కార్యాలయమునుండి నేను వేరొకచోటకు పోయి జాగర్సు యిచ్చిన తొమ్మిదివందల పౌనులు హెర్బర్టుకు

అందు ఏర్పాట్లు చేసితిని. అంతటితో హెర్బర్టుకు కార్మిక వ్యాపార సంస్థలో వాటా స్థిరపడి నట్టయ్యెను.

# 26

మార్చి నెల వచ్చెను. ఒక సోమవారమునాటి యుదయమున నేను, హెర్బర్టు కలసి భోజనము చేయుచుంటిమి. అప్పుడు నాకు కెమ్మోక్ వద్దనుండి ఒక చీటీ వచ్చెను.

ఆ చీటీలో నిట్లు వ్రాయఁబడియుండెను: "చదువగానే ఈ చీటీని కాల్చివేయవలయును. బుధవారమునాడు నీవు చేయఁదలచుకొన్నపని చేయవలయును. ఇక ఈ చీటిని కాల్చివేయవలయును."

నే నా చీటీని హెర్బర్టుకు చూపితిని. మేమా చీటీలోని విషయములను బట్టీ పట్టితిమి. తరువాత దానిని నిప్పులోపడవైచితిమి.

తరువాత ముందు కర్తవ్యమునుగూర్చి ఆలోచింపసాగితిమి. హావిషమ్ కన్య యింటికి పోయినప్పుడు నా చేయి నొప్పిపెట్టి యుండెను. అందువలన పడవను నడుపుటకు మేము మఱి యొకరి సహాయ్యము తీసికొనవలసి యుండెను.

ఆ సందర్భమున హెర్బర్టు ఇట్లనెను: "నేను ఆ విషయమును గూర్చి దీర్ఘముగ ఆలోచించినాను. సాధారణముగా థేమ్సునది మీఁద పడవలను నడుపువారికంటె నాకీనొకనిని

తీసికొనుట మేలని తోచుచున్నది. ఉదాహరణకు స్టార్‌టాప్ విషయము ఆలోచింపుము. అతడు చాలా మంచివాడు. గౌరవ నీయుడు. మనమన్న మంచి అభిప్రాయము అభిమానము కలవాడు. పడవలను నడుపుటయందు మంచినేర్పుకలవాడు."

"మఱి అతనికే యే విషయములు తెలియజేయుదువు?"

"అతని కంతగా చెప్పవలసిన పని ఏమియు నుండదు. అవసరమైనచో ఆనాడు కొద్ది విషయమును చెప్పెదము. నీవు గూడ ప్రోవిస్‌తో బాటు వెళ్ళెదవు కదా?"

"తప్పక వెళ్ళెదను."

"ఎక్కడకు వెళ్ళెదవు?"

"ఎక్కడకు వెళ్ళేను ఒక్కటే. ఇంగ్లండును వదలి వెళ్ళి పోయిన చాలును" అని అంటిని. తరువాత ప్రోవిస్‌ను పడవ మీద ఎక్కించి తప్పించవలసిన విధానమునంతను వివరించితిని. నేను చెప్పినదాని కంతకు హెర్బర్టు అంగీకరించెను. భోజనమైపో యిన తరువాత మేము చేయవలసిన పనులను పూర్తిచేయుటకు బయటకు పోతిమి. హాంబర్గుకు బయలుదేరి పోవు స్టీమరొకటి మా ఆలోచనకు సరిపోవునని వివరములను కనుగొన్న తరు వాత అనుకొంటిమి.

తరువాత మేమిరువురము కొన్ని గంటలు విడిపోతిమి. నేను అవసరమైన పాస్‌పోర్టులను తెచ్చుటకు పోతిని. హెర్బర్టు స్టార్‌టాప్‌ను కలసికొనుటకై అతని బసకు వెళ్ళెను. ఏవిధమైన అడ్డు లేకుండ మేమిరువురము చేయవలసిన పనులను పూర్తిచేసి కొంటిమి. ఒంటిగంటకు మేమిరువురము మరల నొకచోట కలసి కొంటిమి. నేను పాస్‌పోర్టులను సిద్ధము చేసితిని. పడవ ప్రయాణ

మునకు స్టార్‌టాప్ సంతోషమును ప్రకటించినాడన్న విష యమును హెర్బర్టు తెలిపెను. హెర్బర్టు యింక చేయవలసిన పనులన్నిటిని నేనతనికి వివరించి చెప్పితిని. మే మిరువురము ఇకముందు నడచుకోవలసిన విధానము నంతను నిర్ణయించు కొంటిమి.

తరువాత నేను నా బసకు పోతిని. అప్పుడచ్చట నొక యుత్తరము పడియుండెను.

ఆ యుత్తరములో నిట్లు వ్రాయబడి యుండెను:

"నీ చిన్నప్పటి చిత్తడినేలలు నీకు జ్ఞప్తియందున్నవా? నీకచ్చటకు వచ్చుటకు భయములేదా? అయిన నేటి రాత్రికి గాని, రేపు రాత్రికి గాని, అచ్చటకు రమ్ము. ఆ చిత్తడినేలలలో నొక చిన్న గృహమున్నది. ఆ గృహములోనికి రమ్ము. నీ ప్రొవిస్‌ను గూర్చి తెలిసికోవలయునని యున్నచో అచ్చటకు తప్పక రమ్ము. ఎవ్వరికి చెప్పకుము. కాలము వృథాచేయకుము. నీవు ఒంటరిగ రావలయును. వచ్చునపుడు ఈ యుత్తరమును నీతో గూడ తీసికొని రమ్ము."

ఆయుత్తరము చదువక పూర్వమే నామనస్సు ఎన్నో ఆలోచనలతో నిండి యుండెను మఱి యిప్పుడే యుత్త రము వచ్చినది. నేనేమి చేయవలయును? నా కేమియు తోచ కుండెను. నేను వెంటనే ఒక నిర్ణయమునకు రావలసియున్నది. లేకపోయినచో రాత్రి కచ్చటకు పోవు కోచి తప్పిపోవును. మంగళవారము నాటి రాత్రి అచ్చటకు పోవుటకు వీలు లేదు. ఏలయన బుధవారమునాడు ప్రొవిస్‌ను తీసికొని విదేశము లకు ప్రయాణమై పోవలసియున్నది.

అనియుగాక నాకు తెలియు వివరములు మా ప్రయాణమునుప్పి నేడేని ప్రభావమును చూపవచ్చును. అందువలన వానిని సాధ్యమైనంత ముందుగనే తెలిసికొనియుండుట అవసరము.

కోచి బయలుదేరిపోవుటకింక అరగంటకాలముమాత్రమే యున్నది. చిత్తడినేలలకు ప్రయాణమైపోవలయునని యే నిశ్చయించుకొని యుంటిని. ప్రోవిస్‌కు సంబంధించిన విషయములను తెలిసికోవలయునని యే నేనానిశ్చయమునకు వచ్చియుంటిని. అతనిపేరు ఆ యుత్తరములో లేకపోయినచో నేనానిశ్చయమునకు వచ్చియుండెడివాడనుకాను.

ఒకచీటీమీాద, "నేను హావిషమ్‌కన్యను చూడవలయుననే అభిప్రాయముతో పోవుచున్నాను. సాధ్యమైనంత త్వరలో తిరిగి వత్తును" అని పెన్సిలుతో వ్రాసి బల్లమీాద పెట్టితిని. నేనాచీటీని హెర్బర్టుకొఱకుద్దేశించియుంటిని. తరువాత నాగదికి తాళము వేసి తొందరగా కోచికార్యాలయమునకు పోతిని. కోచి అప్పుడే బయలుదేరిపోవుటకు సిద్ధముగానుండెను. నేను ఆ కోచిలో ప్రవేశించితిని.

కోచిలో కూర్చున్నతరువాత నేను ప్రయాణముచేయుట సరియగునా, కాదా, అని ఆలోచింపసాగితిని. ఊరు, పేరు లేని వారు వ్రాసినయుత్తరము ననుసరించి ప్రయాణమైపోవుట వెఱ్ఱితనమని భావించితిని. కాని ప్రోవిస్‌కు సంబంధించిన విషయములను తెలిసికోవలయునను ఆశ బలవత్తరమగుచుండుటవలన నేను ప్రయాణమును కొనసాగించితిని.

కోచి హవిషమ్‌కన్య నివసించుచున్న పట్టణములో ఆగు సరికి చీకటిపడెను. నేను కోచిలోనుండి క్రిందకు దిగితిని. నేను 'బ్లూబోర్' లో బసచేయక మఱియొక హోటలులో బసచేసి తిని. భోజనమైనతరువాత చిత్తడినేలలోని గృహమువంకకు పయనమైపోతిని.

నేను ఆగృహమును సమీపించుచుంటిని. నాకాగృహము లోని దీపము కనబడుచుండెను నేను వేగమును హెచ్చించి అనతికాలములో ఆ యింటిని సమీపించితిని. తలుపు తట్టితిని. సమాధానముకొఱకు వేచియుంటిని. కాని నాకెట్టిసమాధాన మును రాలేదు. మరల తలుపుతట్టితిని. ఈసారిగూడ సమాధాన మేదియురాలేదు. నేను పరిశీలించిచూడగా లోపల గొళ్లెము వేయబడియుండలేదని అర్థమయ్యెను. అంతట నేను తలుపులు త్రోసి లోపలకు ప్రవేశించితిని.

లోపల నొకబల్ల, ఒకటేబులు, ఒకచాప ఉండెను. టేబులుమీద ఒక క్రొవ్వువత్తి వెలుగుచుండెను. పైన అటుక యుండెను. అందువలన, "ఇచ్చట నెవ్వరైన నున్నారా?" అని ప్రశ్నించితిని. సమాధానము రాలేదు. నా చేతిగడియారము చూచుకొంటిని. తొమ్మిదిగంటలు దాటిపోయినది. మఱియొక సారి, "ఇక్కడెవ్వరైననున్నారా?" అని అఱచితిని. అప్పుడుగూడ సమాధానమురాలేదు. ఏమిచేయుటకును తోచక నేను బయ టకు పోతిని.

అప్పటికి బయట వాన బాగుగాకురియుచుండెను. అందు వలన నేను మరల లోపలకుపోతిని. గుమ్మములో నిలబడి బయ టకు చూచుచుంటిని. "ఇంతకుముందు ఇచ్చట నెవ్వరోఉన్నారు.

వారు బయటకు వెళ్ళియుందురు; త్వరలోనే తిరిగి వత్తురు" అని నేను అనుకొనసాగితిని; "క్రొవ్వువత్తి వెలుగుచున్నదికనుక అటులనే భావింపవలయును" అని కూడ ననుకొంటిని. క్రొవ్వువత్తి పెద్దదిగ నున్నదా? చిన్నదిగ నున్నదా అను విషయమును పరిశీలించుటకై వెనుకకు తిరిగితిని. క్రొవ్వువత్తిని చేతిలో పట్టుకొంటిని. అంతలో దీపము హఠాత్తుగా ఆఱిపోయెను. ఎవ్వరో నాతలమీదకు ఉచ్చు విసరిరి. నేనా ఉచ్చులో చిక్కుకొంటిని.

"ఇప్పుడు నీవు నాకు చిక్కినావు" అన్న మాటలు నాకు వినబడెను.

నేను ఉచ్చులోనుండి తప్పించుకొనుటకు ప్రయత్నించుచు ఇల్లుఅరవసాగితిని, "ఇది యేమి? ఈ పని చేసినవారెవరు? అయ్యలారా! నేను ఆపదలో చిక్కుకొన్నాను! నాకు సాహాయ్యము చేయుడు! నాకు సాహాయ్యము చేయుడు!"

ఒక బలమైన హస్తము నా నోటిని మూయుటకు మాటిమాటికి ప్రయత్నించుచుండెను. ఈ లోపల నేను గట్టిగా గోడకు కట్టివేయబడితిని. అంతయు అంధకారముగ నుండుట వలన నాకేమియు కనబడకుండెను.

తరువాత నాకీ మాటలు వినబడెను; "ఓరీ! దుష్టుడా! ఈసారి కేకలు వేయుము. మఱి! నిన్ను పరలోకమునకు పంపుట తథ్యము!"

ఆ మాటలాడుచున్న దుర్మార్గుడు ఆ బెదరింపును తప్పక అమలులో పెట్టునని నేను భయపడితిని. అందువలన నేను సాహాయ్యమునకై కేకలు వేయుట మానివైచితిని.

ఆ దుర్మార్గుడు క్రొవ్వువత్తిని వెలిగించుట కనేకసార్లు ప్రయత్నించెను. అతని ప్రయత్నము కొంతసేపటి వఱకు నిష్ఫల మయ్యెను. తరువాత నతడు క్రొవ్వువత్తిని వెలిగింప గలిగెను.

క్రొవ్వువత్తి వెలుగులో నేనా దుర్మార్గుని చూచితిని. అతడు ద్రోహియగు ఆర్లిక్.

నేను ఎవరి కోసమచ్చటకు వచ్చితినో నాకు తెలియదు. కాని ఆర్లిక్‌ను కలిసికొనుటకు మాత్రము నే నచ్చటకు వచ్చి యుండలేదు. అతడు నావంక చూడసాగెను. నే నతనివంక చూడసాగితిని.

కొంతవడి కతడు ఇట్లనియెను: "ఓరీ! నీ విప్పుడు నాకు చిక్కినావు."

"నాకట్లు విప్పివేయుము. నా దారిని నన్ను పోనిమ్ము" అని నేను అంటిని.

"ఓహో! నిన్ను నేను తప్పక పోనిత్తును! నిన్ను చంద్ర మండలమునకు పంపించెదను. తారా మండలములకు పంపించె దను. అంతయు త్వరలోనే పూర్తియగును. నీకే మాత్రము సందేహము వలదు."

"నన్నచ్చటి కెందులకు రప్పించినావు?"

"నీకు తెలియదా?"

"ఈ చీకటిలో నీవు నన్నెందులకిట్లు చేయుచున్నావు?"

"పని యంతయు నే నొక్కడనే పూర్తిచేయ దలచు కొన్నాను గనుక, రహస్యము దాగ వలయునన్నచో ఒక్కడు మాత్రమే ఉండవలయును. ఇద్దఱు కాని అంతకంటె ఎక్కువమంది కాని పనికిరాదు. నీవు నాకు విరోధివి! నాకు విరోధివి."

తరువాత నాతడు తల ఆడించుచు నావంక చూడ సాగెను. పిమ్మట నతడు ఒక మూలనుండి తుపాకి నొకదానిని బయటకు తీసెను.

అతడు దానిని నా వంకకు గురిపెట్టి చూచుచు నిట్లనెను: "ఇదియేమో ఎఱుగుదువా? దీని నిదివఱకు ఎక్కడ చూచియుంటివో ఎఱుగుదువా? మాట్లాడుము, ద్రోహీ!"

"ఎఱుగుదును" అని యంటిని. ఏలయన నేనా తుపాకిని హావిషమ్‌కన్య ఇంట చూచియుంటిని. ఆర్లిక్, హావిషమ్‌కన్యవద్ద పనిచేసి నప్పుడు ఆ తుపాకి అతనివద్దనే యుండెను.

"నీవు నన్నా గృహమునుండి వెడలఁగొట్టించితివి! వెడలఁగొట్టించితివి. మాట్లాడుము!"

"నే నంతకంటె ఏమి చేయఁగలను? అప్పుడు ఏ పనిని చేయవలయునో ఆ పనినే చేసితిని. ఇంకను ఎక్కువ పనిని చేసి యుండవలసినదని భావించుచున్నావా?"

"నీ వప్పుడా పని చేసినావు. అదియే నీవు నాకు చేసిన ఘోరమైన అపకారము; అపచారము. మఱియు నే నొక యువతిని ప్రేమించినాను. నీవు నాకు ఆమెకు మధ్య చాలసార్లు అడ్డువచ్చినావు."

"ఎప్పుడు వచ్చినాను?"

"నీవు ఎప్పుడు రాలేదు? ఆమెకు ఆర్లిక్‌ను గూర్చి ఎప్పుడును చెడ్డమాటలు చెప్పినవాడవు నీవేకదా?"

"నే నేమియు చెప్పలేదు. నీయంతట నీవే చెడ్డపేరు సంపాదించుకొన్నావు. నీకునీవు హాని చేసికొనక యుండకపోయినచో నేను నీకు హానిచేయఁగలిగియుండెడివాడనుకాను."

"నీవు వట్టి అసత్యవాదివి. నన్నీ దేశమునుండి వెడల గొట్టుటకు ఎంత శ్రమనయిన తీసికొంటివి! ఎంత డబ్బునయిన ఖర్చు పెట్టితివి! అవునా? నేను నీ కిప్పుడొక ముఖ్య విషయమును చెప్పెదను. నన్ను ఈ రాత్రికే ఈ దేశమునుండి వెళ్ళ గొట్టుటకు ప్రయత్నింపుము. అప్పుడు నీవు చాల విలువయిన వాడవను విషయము స్పష్టముగా తెలియును. ఎంత డబ్బయినను సరే ఖర్చుపెట్టి, నన్నీ రాత్రికే దేశమునుండి వెళ్ళ గొట్టుము."

"నీ విప్పుడు నన్ను ఏమి చేయబోవుచున్నావు?" అప్పుడతడు పిడికలితో బల్లమీద గట్టిగా గ్రుద్ది "ఏమి చేయబోవుచున్నానా! నీ ప్రాణము తీయబోవుచున్నాను; సిద్ధముగా నుండుము" అని యనెను.

అతడు నావంక తీక్షణముగా చూచుచు నింకను నిట్లనెను—"ద్రోహీ! నీవు చిన్నప్పటినుండియు నా మార్గమునకు అడ్డు వచ్చుచున్నావు. ఈ రాత్రితో నీవు నా మార్గమునుండి తొలగి పోదువు. ఇంక నిన్నుగూర్చి నేను భయపడవలసిన పనియుండదు. నీవు మరణింతువు."

నాకింక మరణము తప్పదని యనుకొంటిని. తప్పించుకొని పారిపోవుట కేమార్గమైన కనబడునేమోయని నేను నలుదిక్కులా జూచితిని. కాని, నాకే మార్గమును కనబడలేదు.

అతడింకను నిట్లనెను: "నేను నిన్ను చంపివేయుటతో సంతృప్తిచెందను. నీ ఆనవాలిచ్చట లేకుండ చేయుదును. నీ గుడ్డపీలికలుగాని, నీ ఎముకలుగాని ఇచ్చట లేకుండ చేయుదును. నీ శవమును తీసికొనిపోయి సున్నపుబట్టీలో పడవేయు

దును. జనులు నీ గతినిగూర్చి ఏమైన అనుకొనవచ్చును. కాని, అసలు విషయము మాత్రము ఎవ్వరికినీ తెలియదు."

నేనా విధముగ మరణించినచో ఏమి జరుగునను విషయమును గూర్చి ఆలోచించుకొనసాగితిని. ఎట్టెలా తండ్రి ప్రోవిస్ నేను తన్ను విడిచిపుచ్చితినని భావించును. పోలీసులతనిని పట్టుకొందురు. అతడు నన్ను శపించుచు మరణించును. హెర్బర్టు కూడ నన్ను సందేహించుటకు ప్రారంభించును. ఏలయన, హావిషమ్‌కన్య ఇంటికి పోదునని నేను చీటీ వ్రాసిపెట్టియుంటిని; కాని, ఆ యింటి నొక్కసారి చూచుటతప్ప మఱి యింకేమియు చేయలేదు. జో బిడ్డలకు నా సంగతి ఏమియు తెలియదు. నే నెన్నిబాధలు పడితినో ఎవ్వరికినీ తెలియదు. అందఱును నన్ను అపార్థము చేసికొన ప్రారంభింతురు. మరణము భయంకరమైనదే; కాని జనులు నన్నపార్థము చేసికొనుట అంతకంటె భయంకరమైన విషయము. ఈ తరమువారేకాదు, ముందు తరములవారుకూడ నన్ను దూషించుట తథ్యము.

నే నావిధముగ ఆలోచించుచుండగా ఆర్లిక్ ఇట్లనెను: "ఓరీ తోడేలా! నేను నిన్ను క్రూరమృగమును చంపినట్లు చంపెదను. ఆవిధముగ చేయుటకొఱకే నిన్ను నాచేత చిక్కించుకొని కట్టివైచినాను. నిన్ను తీవ్రముగ హింసించిన తరువాతనే చంపివైచెదను."

అంతట నాకు సాహాయ్యముకొఱకు మరల కేకలు పెట్టవలయునను అభిప్రాయము కలిగెను. ఆ ప్రాంతమంతయు నిర్జన ప్రదేశమనియు, నా కేక లెవ్వరికిని వినబడవనియు నాకు తెలియును. అయినను అతనికి భయపడి నోరు మూసికొని

యుండుట పిఱికివారి లక్షణమని భావింపసాగితిని. నే నతనిని తీవ్రముగ అసహ్యించుకొనసాగితిని. ఏ సందర్భములోను నన్ను రక్షింపవలసినదని అతనిని ప్రార్థింపరాదని నిశ్చయించుకొంటిని. అతనిని సాధ్యమైనంతవఱకు ఎదిరించి ఆ ప్రయత్నములో మర ణింపవలయు ననుకొంటిని. నన్ను క్షమింపవలసినదని భగవంతుని ప్రార్థించితిని. నాకు ఇష్టులైన వారందఱివద్ద సెలవు తీసికొనకుండ, వారి కేవిషయము చెప్పకుండ మరణింపబోవుచున్నందుల కెంతయు విచారింపసాగితిని. నేను మరణించుచున్నను దుర్మార్గుడగు ఆర్లిక్‌ను చంపివేయుట శ్రేయస్కర మనుకొంటిని.

ఆర్లిక్ సారా త్రాగుచుండెను. అతని కన్నులు చింత నిప్పులవలె ఎఱ్ఱగా నుండెను. అతడు త్రాగుచున్నసారా చాల శక్తివంతమైనదనియు, ఆతనికి బాగా నిషా ఎక్కుచున్నదనియు గ్రహించితిని.

అతడు మరల నన్నుద్దేశించి ఇట్లనెను: "ఓరి తోడేలా! నేను నీకొక ముఖ్యమైన విషయమును చెప్పబోవుచున్నాను. నీ సోదరిని చంపినదెవరు? నీవే! నీవే! నీవే! ముమ్మాటికి నీవే! అందుకు సందేహ మేమాత్రమును లేదు."

అంతట నా సోదరి నెవ్వరో బలముగ కొట్టుట. ఆమె జబ్బుపడి మంచము పట్టుట, మరణించుట మున్నగు దృశ్యము లన్నియు నా కన్నులముందు నాట్యము చేయసాగెను.

"ఓరి దుర్మార్గుడా! నా సోదరిని నీవే హత్యచేసియుంటివి" అని నేను అపరిమితమగు కోపముతో ఉద్ఘాటించితిని.

"నీవే అని మఱియొకసారి చెప్పుచున్నాను. నీమూలము ననే అది జరిగినదని మఱియొకసారి చెప్పుచున్నాను. నేనీరాత్రి

నీ వెనుకనుండి వచ్చి నిన్ను కట్టివైచినాను. చూచినావుగదా! అట్టులనే నే నామెను వెనుకనుండి వెళ్ళినాను. ఆమె నెత్తిపై బలమగు దెబ్బ కొట్టినాను. ఆ దెబ్బ కామె మరణించియుండ దను భావముతో వదలివైచి వెళ్ళిపోయినాను. ఇక్కడ ఉన్నట్లు సున్నపుబట్టీ అక్కడ ఉండి యుండినచో ఆమె బ్రతికియుండెడిది కాదు. ఆమెను తీసికొనిపోయి సున్నపు బట్టీలో పడవైచియుండెడి వాడను. కాని ఆపని చేసినది నేనుకాదు. నీవే చేసినావు. అచ్చట పక్షపాత బుద్ధి చూపి నీకు అనేక సౌకర్యములు కల్పించినారు. నన్ను పలువిధముల బాధపెట్టినారు. నాకు కోపము వచ్చునట్లు చేసినారు. మఱి ఆనాడు నన్ను నీవారు పలువిధముల హింసించి యున్నారు. అందుకు తగిన ఫలితమును నీవిప్పుడు అనుభవింప వలయును. నీవప్పుడు చేసినావు; కావున దానికి తగిన ఫలితమును నీవే ఇప్పుడు అనుభవింప వలయును."

అతడు మఱియొకసారి త్రాగెను. నన్ను చంపివేయవలె నన్న తలంపుతో అతడు చిత్తుగా త్రాగి నిషా తెప్పించుకొను చున్నాడను విషయమును గ్రహించితిని.

అంతవఱకు బల్లమీద కూర్చున్న ఆర్లిక్ లేచి నిలబడి సీబులును ఒక ప్రక్కకు త్రోసివైచెను. అతడు వెలుగుచున్న క్రొవ్వు వత్తిని చేత బట్టుకొని దాని వెలుగులో నన్ను చూడ సాగెను. నా దుస్థితి అతనికి ఆనందము కలిగించుచుండెను.

అతడు నావంక చూచుచు నిట్లనెను: "నీవు నాకు అప కారము చేసినావు. అందువలన నేను నిన్ను చంపివేయ వలయు నని నిశ్చయించుకొన్నాను. నీవు నీ సోదరి అంత్యక్రియలకు వచ్చినావు. అప్పటినుండియు నేను ఆ ప్రయత్నములోనే

యుంటిని. నిన్ను ఏవిధముగ పట్టుకొని చంపివేయవలయునో నాకు తెలియకుండెను. కాని నేను నిన్ను వెంబడించుచునే యుంటిని. నీ రాకపోకలను గమనించుచునే యుంటిని. ఆ సందర్భమునందే నేను నీచిన్నాన్న ప్రోవిస్ రాకను కనిపెట్టుట తటస్థించినది. నీ చిన్నప్పుడు పోని చిన్నాన్న అప్పుడు వచ్చుట ఎట్లు తటస్థించినది? ఆ ప్రోవిస్ ఎవ్వరో గ్రహించినాను. నీవు అతనిని విదేశములకు తీసికొని పోవుచున్నావను విషయమును నేను గ్రహించినాను. నేను నీకు తగిన ఉజ్జీని. అందువలననే నేను నిన్నిచ్చటకు రప్పించినాను. నీ విచ్చటకు తప్పక వత్తువను విషయము నాకు తెలియును.

నేను నీకు సమానమైన ఉజ్జీనైనట్లే, నీ చిన్నాన్న ప్రోవిస్కుగూడ సమానమైన ఉజ్జీలు కొందఱు కలరు. వారికి తాము ప్రోవిస్-అనగా మాగ్ విచ్-ఉన్న దేశములో ఉండుట వాంఛనీయము కాదనియు, అపాయకరమనియు తెలియును. అతడు విదేశములలో నుండగా వారి తరఫువారు కొందఱతనిని కనిపెట్టుచునే యుండిరి. అతడు ఆస్ట్రేలియాను వీడి ప్రయాణమైన సంగతి వారికి తెలిసినది; ఇంగ్లండులో కాలుపెట్టిన సంగతి కూడ తెలిసినది. మాగ్విచ్‌కి విరోధి కాంపేసన్, విషయమంతయు కాంపేసన్‌కు తెలియును."

నేను నింక కొన్ని నిమిషములలో మరణించుట తథ్యము. నన్ను త్వరలో చంపివేయవలయునను నుద్దేశ్యముతోనే ఆర్లిక్ ఆ విషయములన్నిటిని నాకు చెప్పినాడు.

అతడు మఱియొకసారి త్రాగెను. కిందకు వంగి ఏదో చేత బట్టుకొని లేచెను. అపుడు నేనతని చేతనున్న సుత్తిని

చూచితిని. ఆ సుత్తితో కొట్టినచో నాబుఱ్ఱ ఒక్క దెబ్బకుపగిలి పోవుట తథ్యము. నాకు సంపూర్ణమగు నిరాశ ఏర్పడెను. ఆ నిరాశతో నేను శక్తియంతయు నుపయోగించి గట్టిగా కేకలు పెట్టితిని; స్వేచ్ఛను పొందుటకు ప్రయత్నింప సాగితిని.

అంతలో కొందఱు నన్ను పేరుపెట్టి పిలువసాగిరి. నాకు ద్వారమువద్ద కొన్నిదీపములు కనబడెను. ఆ దీపప్రకాంతిలో కొందఱు మనుజులు కనబడిరి. నాకు సవ్వడివినబడెను. ఆర్లిక్ కొందఱి మనుజులతో పోరాడుచున్న దృశ్యముకనబడెను. కొంత సేపటికి అతడు వారిమధ్యనుండి బయటకువచ్చి బయటనున్న చీకటిలోనికి పాఱిపోయెను.

తరువాత నేమిజరిగెనో తెలియదు. మఱికొంతసేపటికి నేను స్వేచ్ఛనుపొందిన విషయమును గ్రహించితిని. నేనొకరి మోకాలిపై తలపెట్టుకొని పరుండియుంటిని. ఎవ్వరో ఒకరు ఇట్లనుచుండిరి: "ఇతడిప్పుడు బాగుగ పాలిపోయియున్నాడు. కాని ఇప్పుడితనికివచ్చిన ఇబ్బందిఏమియు లేదు."

అపుడు నన్ను తన మోకాలిమీద పెట్టుకొనియున్న మనుజుడు నా ముఖముదగ్గఱ తనముఖముపెట్టి చూచెను. నేను అతని ముఖములోనికి చూచితిని. అతడెవ్వరు? నా ప్రియమిత్రుడగు హెర్బర్టు.

"హెర్బర్టు!" అని నేనంటిని.

"మెల్లన మాట్లాడుము, మిత్రమా! అంతతొందఱ వలదు" అని అతడనెను.

అంతలో నేను అచ్చటనేయున్న స్టార్ టాప్‌నుచూచి, "మన మిత్రుడు! స్టాక్ టాప్!" అని యంటిని.

అప్పుడు హెర్బర్టు ఇట్లనెను: "అతడు మనకేవిషయములో సాహాయ్యము చేయనున్నాడో జ్ఞప్తికి తెచ్చుకొనుము. ప్రశాంతముగ నుండుము. అలసట తెచ్చుకోవద్దు."

ఆ మాటలు వినగానే నేను పైకిలేచితిని. కాని చేతి బాధ మిక్కుటముగ నుండుటవలన మరల పరుంటిని.

కాని హెర్బర్టుతో నిట్లంటిని: "ప్రియమిత్రమా! హెర్బర్ట్! కాలముగడచిపోలేదుగద! గడచిపోయినదా? ఈరాత్రి ఏరాత్రి? నేనిక్కడ ఎంతకాలమునుండి యున్నాను? నేనిక్కడ చాలకాలమునుండి పడియున్నా ననుకొనుచున్నాను. ఒకపగలు, ఒకరాత్రి లేక రెండుపగళ్ళు, రెండురాత్రులు ఇచ్చట గడపినా ననుకొనుచున్నాను."

"కాలనేమియు గడచిపోలేదు. ఇది సోమవారమునాటి రాత్రియే."

"భగవంతుడు మహిమాన్వితుడు."

"నీవు సంపూర్ణముగ విశ్రాంతితీసికొనుటకు రేపుమంగళ వారమంతయు నున్నది. కాని నీవు బాధపడకతప్పదు. నీకెక్కడ దెబ్బతగిలినది? నీవు నిలబడగలవా?"

"ఎందుకు నిలబడలేను? నేను నడువగలనుగూడ. నాకు ఎక్కడను దెబ్బతగులలేదు. ఈ చేయిమాత్రము చాల బాధగ నున్నది."

అంతట వారు నాచేయినొప్పి తగ్గుటకు తమకుచేతనైనంత వఱకు సాహాయ్యముచేసిరి. అనతికాలములో మేమా యింటి తలుపులను మూసివైచి పట్టణమునకు బయలుదేఱి పోసాగితిమి.

నన్ను రక్షించినందుకు నేను భగవానునకు కృతజ్ఞతను తెలియ జేయసాగితిని.

"మీరు నావద్దకువచ్చి నన్ను రక్షించుట ఎట్లు తటస్థించినదో చెప్పవలసినదిగా ప్రార్థించుచున్నాను" అని నేను హెచ్బర్టుతో అంటిని.

"ఇప్పుడుకాదు. తరువాత చెప్పెదను" అని అతడనెను. కాని నేను పట్టినపట్టు విడవలేదు.

అందువలన నతడు జరిగిన విషయము నిట్లుచెప్పసాగెను.

"నేను స్టార్‌టాప్‌తో కలసి మన బసలో ప్రవేశించినాను. అప్పుడు ఎవ్వరో అనామకుడు వ్రాసిన ఉత్తరము దొరకినది. దానిని వ్రాసినవాడు దాని నిచ్చటకు తీసికొని రమ్మని అన్నాడు. కాని నీవు దానిని తొందరలో అచ్చటనే మరచి పోయినావు. తరువాత నీవు నాకు వ్రాసిన యుత్తరము దొరికినది. ఆ రెండును పరస్పర విరుద్ధముగా నున్నవి. ఏలయన నీకు ఉత్తరము వ్రాసినవాడు నిన్నిచ్చటకు రమ్మని వ్రాసియుండెను. నీవేమో హావిషమ్‌కన్య ఇంటికి పోవుచుంటినని వ్రాసియుంటివి. అందువలన నాకు అనుమానము కలిగెను. ఆ విషయమునుగూర్చి సుమారు పదునేను నిమిషములు ఆలోచించితిని. నా అనుమానము హెచ్చయ్యనేగాని అణుమాత్రమైనను తగ్గలేదు.

అందువలన నేను నాతో వచ్చుచున్న స్టార్‌టాప్‌తో కలసి కోచి కార్యాలయమునకు పోతిని. సాయంకాలపుకోచి వెళ్ళిపో యినదను విషయమును తెలిసికొంటిని. అంతట నేను భయపడ సాగితిని. మే మిరువురము ప్రత్యేకముగ నొకబండి చేసికొని

పట్టణము చేసుకొంటిమి. సాధారణముగ నీవు 'బ్లూబోర్' హోటలులో బసచేయుచుందువుగదా! అందువలన మేము అచ్చటకు పోతిమి. నీ వచ్చట కనబడలేదు. నీకు సంబంధించిన సమాచారముగూడ తెలియలేదు. హావిషమ్‌కన్య ఇంటికి పోయితిమిగాని నీవు అచ్చటకూడ కనబడలేదు. మేము తిరిగి ఇంటికి పోవుచుండగా ట్రాబ్ వద్ద పనిచేయుచున్న పిల్లవాడు కనబడెను. అతడు మాకు నీవు పోయినదారిని తెలిపెను. వెంటనే మేము మరల నీని తీసికొని చిత్తడి నేలలకు ప్రయాణమై వచ్చిపోతిమి. ఈయిల్లు మాకు కనబడినది.

అంతలో నాకొక ఆలోచన తట్టెను. ఎవ్వరైన నీకు ప్రొవిస్‌కు సంబంధించిన సరియైన విషయములను తెలుపజేయుచుండవచ్చును. మేము మువ్వురము వచ్చిన అందుకు భంగము కలుగవచ్చును. అందువలన నేను ఒక్కడనే ఈ యింటి దగ్గఱకు మెల్లనవచ్చి పరిశీలించు చుంటిని. మిగిలిన ఇద్దరను కొంచెము దూరముగా నుంచితిని. కొంచెముసేపు నాకు ఏసవ్వడియు వినబడకుండెను. అందువలన ఇంటిలో నెవ్వరును లేరని నేను భావింపసాగితిని. అంతలో నాకు నీ కేకలు వినబడినవి. అప్పుడు నేను సమాధాన మిచ్చితిని, లోపలకు ప్రవేశించితిని. నా కేకలు విని కొంచెము దూరమునున్న ఇద్దరుగూడ లోపలకు పరుగెత్తుకొని వచ్చిరి."

అంతట నేను లోపల జరిగిన విషయమునంతను హెర్బర్టుకు వివరించి చెప్పితిని. అప్పుడతడు ఇట్లనెను: "ఇప్పుడు ఎంత అర్ధరాత్రియైననేమి? మనము వెంటనే పట్టణ మేజిస్ట్రేటువద్దకు

పోయి ఫిర్యాదు చేయుదుము. ఆర్నిక్ అరెస్టుకు వారంటు పుట్టు నట్లు చేయుదుము."

కాని నే నిట్లంటిని: "అందువలన మన మిచ్చటనుండి పోవలసి వచ్చును. లేక మఱియొకసారి ఇచ్చటకు రావలసి వచ్చును. అప్పుడు మన కార్యక్రమ మంతయు భగ్నమైపోయి, ప్రోవిస్‌కు హాని కలుగవచ్చును."

అప్పుడు హెర్బర్టు ఆ ప్రసక్తి మానుకొనెను. నేను ట్రాబ్ వద్ద పని చేయుచున్న పిల్లవానికి రెండు గినీ నాణెముల నొసగి కృతజ్ఞతను తెలిపితిని. అంతట నతడు వెళ్ళిపోయెను.

బుధవారము చాలా దగ్గఱలో నున్నందుననే మేమా రాత్రికే లండను మహానగరమును చేరుకోవలయునని నిశ్చ యించుకొంటిమి. హెర్బర్టు, స్టార్ స్టాప్ ప్రయాణమై వచ్చినబండి 'బ్లూబోర్' హోటలువద్ద సిద్ధముగానుండెను. మేమా బండిలో ప్రవేశించితిమి. వెంటనే అది ప్రయాణము ప్రారంభించెను. నేము మాబస చేరుకొనునప్పటికి బాగుగ తెల్లవాఱిపోయెను. వెంటనే నేను నాగదిలో ప్రవేశించి శయ్యపై పరుంటిని. మంగళ వారమునాడు పగలంతయు నేను శయ్యమీదనేయుంటిని.

ప్రోవిస్‌కెట్టి అపాయము కలిగినదోయని నేనా పగలం తయు భయపడుచునే యుంటిని. ఏ మాత్రపు సవ్వడి వినపడి నను ప్రోవిస్‌ను పోలీసులు పట్టుకొన్నారను వార్తను తెలియ జేయుటకు ఎవ్వరోవచ్చినారనియే నేను భావింపసాగితిని. ఆ విధముగా పగలంతయు గడచిపోయెను. చీకటిపడెను. నాకంతయు అయోమయముగ నుండెను. అర్థరాత్రి సమయమున నేను హెర్బర్టు వద్దకుపోతిని. నేను ఇరువదినాలుగు గంటలు నిదురించి

నాననియు, బుధవారము దాటిపోయినదనియు తలంపసాగితిని. కాని హెర్బర్టు, "మన మింకను మంగళవారము రాత్రిలోనే యున్నా" మని నాకు నచ్చజెప్పెను. అంతట నేను తిరిగివచ్చి నాశయ్యమీద పరుంటిని. అప్పుడు నాకు గాఢముగ నిదుర పట్టెను.

తెల్లవారునప్పటికి నాకు మెలకువ వచ్చెను. నేను కిటికీలో నుండి బయటకు చూచితిని. ఉదయభానుడు పెద్దనిప్పు ముద్దవలె నుండెను. క్రమక్రమముగా సూర్యుడు పైకి లేచు చుండెను.

హెర్బర్టు ఇంకను తన శయ్యమీద నిదురించు చుండెను. స్టార్‌టాప్ సోఫామీద నిదురించు చుండెను. నేను లేచి కుంపటి అంటించి కాఫీ తయారుచేసితిని. మఱికొంచెము సేపటికి వారివురుకూడా లేచిరి. అంతట మేము ముగ్గురము కాఫీ సేవించితిమి.

# 27

సాధారణముగా మార్చినెలలో సూర్యుడు తీక్షణముగ ప్రకాశించు చుండును. కాని గాలిమాత్రము చల్లగా వీచు చుండును. బుధవారమునాటి యుదయము ఆవిధముగనే యుండెను. మేము ముగ్గురము పై కోటులను తీసికొంటిమి. నేనొక సంచిగూడా తీసికొంటిని. అత్యవసరమైన వస్తువులను

మాత్రమే ఆ సంచిలో పెట్టుకొంటిని. నేను ఎక్కడకు పోవలయును? నేను ఏమిచేయవలయును? ఎప్పుడు తిరిగి రావలయును? ఈ ప్రశ్నలకు సమాధానములేవియు నాకు తెలియవు. ఆ సమాధానములను గూర్చి నేను బాధపడలేను కూడా. ఏలయన అంతయు ప్రోవిస్ క్షేమముపైననే ఆధారపడి యున్నది. నేను ద్వారము బయట ఆగి వెనుకకు చూచితిని. అప్పుడు నా మనస్సులో కొన్ని ప్రశ్నలుదయించెను. నేను ఇచ్చటకు తిరిగి వత్తునా? ఒకవేళ తిరిగి వచ్చుట సంభవించినచో అప్పటి నా పరిస్థితులు ఎట్లుండును. ?

నా పడవ నిర్ణీత స్థానమున నుండునట్లు ఏర్పాటుచేసితిని. మేము మున్పూరము ఆ ప్రదేశమును చేరుకొంటిమి. కాని ప్రయాణము చేయుట కింకను నిర్ణయించుకోలేదన్నట్లు అచ్చట కొంచెము సేపు ఆగితిమి. ఎట్టకేలకు మేము మున్పూరము పడవలో ప్రవేశించితిమి. అప్పటికి ఎనిమిదిన్నర గంటలాయెను. స్టార్టాప్! హెర్బర్టులు తెడ్లు వేయుచుండిరి; నేను చుక్కానను నడపుచుంటిని. మధ్యాహ్నము మూడుగంటల వఱకు మేము ప్రవాహముతో బాటు పడవను నడపవలయుననుకొంటిమి. తరువాత చీకటి పడువఱకు ప్రవాహమున కెదురుగానడుపవలయుననుకొంటిమి. అటుపిమ్మట మేము జన సంచారము ఎక్కువగా లేని ప్రదేశమున విశ్రాంతి తీసికోదలచితిమి. హాంబర్గుకు బయలుదేఱు స్టీమరు, రాటర్డామ్‌కు బయలుదేఱుస్టీమరు గురువారము నాటి యుదయమున సుమారు తొమ్మిదిగంటలకు బయలుదేఱును. అందులో మొదట బయలుదేఱు స్టీమరులోనికి ప్రోవిస్‌ను ప్రవేశ పెట్టవలయును. ఆ స్టీమరు కెప్టెన్ అందుల కంగీక

రింపనిచో, రెండవ స్టీమరులో ప్రవేశించుటకు ప్రయత్నింప వలయును.

మేము పడవను నడుపుచునేయుంటిమి. అనతికాలములో మా పడవ ప్రోవిస్ నివసించుచున్న గృహమును సమీపించు చుండెను.

"అత డక్కడ నున్నాడా?" అని హెర్బర్టు ప్రశ్నించెను.

"ఇంకను రాలేదు."

"మంచిది. మనము కనబడువఱకు క్రిందకు రావలదని చెప్పినాను. అతని సంకేతము కనబడుచున్నదా?"

"బాగుగ కనబడుటలేదు ఆ. ఇప్పుడు బాగుగ కనబడు చున్నది. అతడువచ్చినాడు పడవను కొద్దిగాఒడ్డుకు పోనీయుడు."

పడవ ఒడ్డుకు పోవుట, ప్రోవిస్ అందు ప్రవేశించుట ఒక్క క్షణకాలములో జరిగిపోయెను. మా పడవ ఎప్పటివలె ప్రయాణము చేయసాగెను.

ప్రోవిస్ పడవలో కూర్చుండి, నా భుజముమీద చేయి వేసి, "ప్రియమైన నాయనా! విశ్వాసముగల నాయనా! చాల చక్కగా చేసినావు. ఎంతయు కృతజ్ఞుడను! ఎంతయు కృతజ్ఞు డను!" అని యనెను.

పడవలో మేము నలుగురముంటిమి. మా నలుగురిలో ఏమాత్రము భయపడనివాడు ప్రోవిస్ మాత్రమే. మిగిలిన వారము ఎప్పుడే అపాయము వాటిల్లునోయని భయపడు చుంటిమి. దీనినిబట్టి అతడు ప్రాణముకు తెగించి యుండెనని ఎవ్వరును భావింపరాదు. అతడు జీవింపవలయునని గట్టిగా కోరుకొనుచుండెను. విదేశములలో నేను గొప్ప గౌరవ

నీయునివలె తిరుగుచుండగా చూడవలయునని అతడు గాఢముగ వాంఛించుచుండెను.

"ఎప్పుడో అపాయము వచ్చునని ఇప్పటినుండి విచారించుట ఎందులకు? అందువలన కలుగు లాభమేమి? అని అతడు అనసాగెను. "అపాయము వచ్చినపుడు దాని నెదుర్కొనుటకు నేను ఏమాత్రము వెనుదీయను" అని అతడు అనుచుండెను.

అత డింకను నిట్లనెను: "నాయనా! నేను లండను నగరమునకు వచ్చిన తరువాత నాలుగు గోడలమధ్య నివసించుచు వచ్చినాను, ఇప్పుడు నాకు స్వేచ్ఛ లభించినది. నా నాయన ప్రక్కనే కూర్చుండి చుట్ట కాల్చుకొను భాగ్యము లభించినది. ఇది నిజముగా ఎంతటి అదృష్టకరమైన విషయము! దీని పూర్తి విలువ నీకు సరిగా తెలియదు."

"స్వేచ్ఛాస్వాతంత్ర్యములలోగల ఆనందమేమో నాకు బాగుగ తెలియును" అని నేను అంటిని.

అంతట నతడు తలఆడించుచు నిట్లనెను: "నీకు తెలిసి యుండవచ్చును. కాని నాకు తెలిసినంతగా నీకు తెలియదు, నాయనా! నిన్ను గదిలోపెట్టి తలుపులకు తాళమువేసినచో ఆ సంగతి బాగుగ తెలియును. నేను ఆస్ట్రేలియాలో నున్నప్పుడు ఎప్పుడును ఈ దేశమువంకకే చూచుచుండెడివాడను. అచ్చట నేను ధనికుడనైనాను. నన్నుగురించి ఆ దేశములో నెవ్వరును బాధపడెడివారు కారు. కాని ఈ దేశములో నా పరిస్థితి వేరుగా నున్నది."

"అంతయు సవ్యముగా జరిగిపోయినచో నీకు మరల కొన్నిగంటలలోనే సంపూర్ణమగు స్వేచ్ఛలభించును."

"అట్లుల జరుగవలయునని యాశించుచున్నాను."

"అట్లుల జరుగునని అనుకొనుచున్నావా?"

అతడు మందహాసముచేయుచు, "అనుకొనుచున్నాను" అని జవాబిచ్చెను.

ఆ పగలంతయు మేము పడవను నడుపుచునే యుంటిమి. మధ్య మధ్య అచ్చటచ్చట ఆగి ఆహారపదార్థములను, పానీయములను కొంటిమి. క్రమముగా నదివెడల్పు ఎక్కువగుచుండెను. చీకటిపడుచుండెను. రాత్రికి మే మేదేని సత్రములో విశ్రమింపవలయునని నిశ్చయించుకొంటిమి. ఆ యుద్దేశ్యముతో నేనొక అన్వేషణకొరకు వెదకసాగితిని. ఎట్టకేలకు నాకు ఒకసత్రము కనబడెను. నేను ముగ్గురను పడవలోనేఉంచి ఆ సత్రములోనికి పోతిని.

ఆ సత్రము చూచుటకు ఏమాత్రము బాగుండలేదు. కాని చలికాచుకొనుటకు చక్కనిఏర్పాట్లుండెను. ఆహారపదార్థములు, పానీయములు మంచివిఉండెను. రెండు చక్కనిగదులు ఖాళీగానుండెను. తరువాత నేను పడవవద్దకు తిరిగిపోయి అచ్చటివారికి సత్రమునకు సంబంధించిన విషయముల నన్నిటిని చెప్పితిని. వారు సత్రములో బసచేయుటకు అంగీకరించిరి. అందువలన మేము పడవనొకచోట పెట్టి సత్రమునకు వచ్చితిమి. నాటిరాత్రి మేము చక్కగా భోజనముచేసితిమి; చక్కని పానీయములను సేవించితిమి. అటుతరువాత రెండుగదులలోను, గదికెద్దఱము చొప్పున, నిదురించితిమి. మా కచ్చట చక్కగా నిదుర పట్టెను.

తెల్లవారినతరువాత మేము మరల పడవలో ప్రవేశించి ప్రయాణము ప్రారంభించితిమి. మేము స్టీమర్లువచ్చు దారిలోనికి వెళ్ళితిమి. మాకు మధ్యాహ్నము ఒంటిగంటన్నరకు స్టీమరు పొగ కనబడెను. దానివెనుకనే మఱియొక స్టీమరు పొగకూడ కనబడసాగెను. ఆ రెండును కడువేగముగ వచ్చుచుండెను. అందువలన నేను, ప్రోవిస్ మా సంచులను సిద్ధముగా పట్టుకొని యుంటిమి. స్టార్టాప్‌కు, హెర్బర్టుకు 'గుడ్‌బై' చెప్పితిమి. మేము కరచాలనము చేసికొంటిమి. నా కన్నులు, హెర్బర్టు కన్నులు బాష్పములతో నిండిపోసాగెను.

అంతలో మా ముందుభాగమున నొకపడవ ఒడ్డునుండి బయలుదేఱెను. అదికూడ స్టీమర్ల నందుకొను దారిలోనికే వచ్చెను. మొదటిస్టీమరు మాకు చాల సమీపమునకు వచ్చెను. మా పడవను దానివంకకు నడపవలసినదని హెర్బర్టును కోరితిని. అప్పుడు స్టీమరులోని వారు మేము దాని కొఱకే వేచి యున్నామని అర్థము చేసికొందురు. "నీవు ముసుగు వేసికొని ప్రశాంతముగ కూర్చుండి యుండుము" అని నేను ప్రోవిస్‌తో నంటిని. ఈ లోపల మా ముందున్న పడవమాకు అడ్డుగా దగ్గఱకు వచ్చెను. ఆ పడవలో తెడ్డు వేయుచున్న వారుగాక మఱి యిరువురు కూర్చుండి యుండిరి. అందులో ఒకడు చుక్కాని నడపుచుండెను. అతడు మావంక నిశితముగ చూచుచుండెను. మఱియొకడు ప్రోవిస్‌వలెనే ముసుగు పెట్టుకొని కూర్చుండి యుండెను. అతడెందులకో భయపడు చున్నట్లుండెను. అతడు తన ప్రక్కనున్న వానితో ఏమో మెల్లగ అనుచుండెను.

కొన్ని నిమిషములు గడచిన తరువాత యొట్ట యెదుట వచ్చుచున్న స్టీమరేదో స్టార్టాప్ కనుగొనగలిగెను. అతడు మెల్లగ "హాంబర్గు" అని యనెను. ఆమాట నాకు తప్ప మఱి యింకెవ్వరికిని వినబడి యుండదు. స్టీమరు మమ్ములను సమీపించుచుండెను. ఇంజనుల సవ్వడి హెచ్చిపోవుచుండెను.

అంతలో ముందు పడవలోని ఒకడు మమ్ముల నుద్దేశించి ఇట్లనెను: "మీ పడవలో చట్ట విరుద్ధముగ ప్రవాసమునుండి తిరిగివచ్చిన నేరగాడొకడున్నాడు. మీ పడవలోని ముసుగు మనిషి అతడే. అతనిపేరు అబెల్ మాగ్విచ్. ఇప్పుడతడు ప్రోవిస్ అను మాఱుపేరుతో నున్నాడు. అతడు వెంటనే మాకు లోబడి పోవలయునని కోరుచున్నాను. అతడు మాకు లోబడునట్లు మీరు సాహాయ్య పడవలయునని కోరుచున్నాను."

పిమ్మట నతడు తన పడవలోని వారితో నేమియు మాట్లాడకుండగనే తన పడవను మా పడవకు పూర్తిగా అడ్డు పెట్టెను.

ఈ లోపల స్టీమరు మాకు చాల దగ్గఱకు వచ్చెను. మా పడవ స్టీమరుక్రిందపడి ముక్కలు ముక్కలై పోవునట్లుండెను. ఆ అపాయమును నేను గుర్తించితిని. స్టీమరులోనున్న వారు మమ్ముల నుద్దేశించి కేకలు పెట్టసాగిరి. అధికారులు స్టీమరు ఇంజనుల నాపివేయవలయునని ఆజ్ఞ ఇచ్చిరి. వెంటనే ఇంజనులు ఆపివేయబడెను. స్టీమరు ఇకను మామీదకు వచ్చుచున్నట్లుండెను.

రెండవ పడవలో చుక్కానును నడుపుచున్నవాడు ప్రోవిస్ భుజముపై తన హస్తమును వేసెను. ప్రోవిస్ మాపడవలోనుండి ఆ పడవలోనికి దుమికి ముసుగు మనిషిపైనున్న

ముసుగును తీసివైచెను. అప్పుడు నేను ఆ మనుజుని గుర్తుపట్టితిని. అతడు నాకు చిన్నప్పుడు చిత్తడి నేలలో కనబడిన రెండవ నేరగాడు. అతడే కాంపేసన్. అతడు అపరిమితమగు భయముతో వెనుకకు పడిపోయెను. స్టీమరులోనివారు గట్టిగా కేకలు పెట్టిరి. నేనున్న పడవ నన్ను వదలిపెట్టి, ఎచ్చటికో వెళ్ళిపోయినట్లయ్యెను. అనగా నేను నీటిలో పడిపోతిని. కాని నేను ప్రాణరక్షణకొఱకు నీటిలో ఒక్క క్షణకాలము మాత్రమే కొట్టుకొనవలసి వచ్చెను. ఏలయన ఈ లోపు కొందఱు నన్ను రెండవ పడవలోనికి తీసికొని పోయిరి. ఆ పడవలో హెర్బర్టు; స్టార్టాప్ కూడ నుండిరి. మా పడవ మునిగిపోయినట్లు వారు చెప్పిరి. నాకు ప్రోవిస్ కాని, కాంపేసన్ కాని కనబడలేదు వారిరువురును నీటి అడుగుననే యుండిరి.

తెడ్లు వేయుచున్నవారు మేమున్న పడవను సరియైన అమరికలో పెట్టిరి. దానిని కొన్ని గజముల దూరము ముందుకు నడిపిరి. తరువాత వారు వెనుకకు తిరిగి చూచిరి. ఏదో నల్లని వస్తువు మా వంకకు వచ్చుచున్నట్లుండెను. ఆ నల్లని వస్తువు క్రమక్రమముగా మనుజుడుగా మారెను. అతడు ప్రోవిస్ అను విషయమును నేను గ్రహించితిని. కొందఱు మనుజు లతనిని పట్టుకొని పడవలోనికి తీసికొనివచ్చిరి. అతని చేతులకు, కాళ్లకు సంకెళ్లు వేసిరి.

వారింకను జేసితో జాగ్రత్తతో నీటివంక చూడసాగిరి. ఈలోపల రెండవ స్టీమరుగూడ వచ్చి మమ్ములను దాటి వెళ్లిపోయెను. కొంతసేపటికి రెండు స్టీమర్లుగూడ మాకు కనబడకుండ అదృశ్యమైపోయెను. నీటిలోనుండి కాంపేసన్ బయటకువచ్చునని అందఱును

భావించుచుండిరి. కాని అతడెంతకును బయటకు రాకుండెను. అందువలన నతడు నీటిలో మునిగిపోయి యుండునని అందరును నిర్ణయించుకొనిరి.

అధికారులు మేమున్న పడవను తిన్నగా ఒక సత్రము వద్దకు తీసికొనిపోయిరి. కడచిన రాత్రి మేమా సత్రములోనే బసచేసియుంటిమి. పాపము, ప్రోవిస్ పరిస్థితి ఎట్లున్నదని చెప్పుదును? అతని ఱొమ్ము భాగము తీవ్రముగ గాయపడెను. అతని తలమీదకూడ బలమైన దెబ్బ తగిలియుండెను. నేనతనికి సత్రములో కొన్ని సౌకర్యములు సమకూరునట్లు ఏర్పాట్లు చేసితిని.

"నీకు తలమీద ఎందుకు దెబ్బ తగిలినది?" అని నేను అతని – అతడింక మాగ్విచ్; ప్రోవిస్ ఏ మాత్రముకాదు – ప్రశ్నించితిని.

"నేను స్టీమరు అడుగు భాగమునకు పోయియుంటి ననుకొందును. పైకి లేచుచున్నప్పుడు స్టీమరు క్రింది వెన్నుదూలము నాతలకు తగిలి యుండును."

"ఱొమ్ముమీద ఎందుకు దెబ్బతగిలినది?"

"అధికారులు కూర్చుండియున్న పడవ గట్టిగా తగిలినది."

"కాంపేసన్ గతి ఏమైనది?"

"నేను కాంపేసన్‌ను బట్టబయలు చేయుటకై అతనిపైనున్న ముసుగును తీసివైచితిని. అప్పుడతడు వెనుకకు వ్రాలిపోయి నీటిలో బడెను. అతనితోబాటు నేనుకూడ నీటిలో బడితిని. మేమిరువురము ఒకరి నొకరము గట్టిగా పట్టుకొని నీటి అడుగు భాగమునకు పోతిమి. అచ్చట తీవ్రముగ పోరాడుకొంటిమి. ఎట్టకేలకు నేనతని బారినుండి తప్పించుకొంటిని.

కాంపేసన్ శక్తి విహీనుడై నీట మునిగిపోయినాడు. నేను ఈదు కొనుచు పైకి వచ్చినాను."

అతనితో గూడ ఉన్న అధికారితో నేను ఇట్లంటిని: "అయ్యా! ఈ ఖైదీ దుస్తులు చాల తడిగానున్నవి. కావున ఇతని దుస్తులను మార్చి క్రొత్త దుస్తులను తొడిగించుటకు అనుమతింపవలయును." అందులకు అధికారి అంగీకరించి ఇట్లనెను: "ఈ ఖైదీవద్దనున్న వస్తువులన్నియు నాకీయవలయును." అప్పుడు నేను ఆ మాట ప్రకారము చేసితిని. ఖైదీవద్దనుండి తీసికొన్న వస్తువులలో ఒక జేబు పుస్తకముండెను. ఆ పుస్తకములోనే విలువైన బ్యాంకు నోట్లు ఎన్నో కలవు. లండను వఱకు ఖైదీ నను సరించి వచ్చుటకు అధికారి నాకు అనుమతి ఇచ్చెను. కాని స్టార్టాప్, హెర్బర్టులకు మాత్ర మా అనుమతి లభింపలేదు.

అధికారి, నేను, ఖైదీ మరల పడవలో ప్రవేశించితిమి. హెర్బర్టు, స్టార్టాప్‌లు నేల మార్గమున లండను చేరుకొందు మని చెప్పి వెళ్ళిపోయిరి. పడవలో నేను ఖైదీమాగ్‌విచ్ ప్రక్కనే కూర్చుండియుంటిని. మా పడవ ప్రయాణము ప్రారంభించెను.

మాగ్‌విచ్‌పట్ల నాకుగల అయిష్టమంతయు మంచు తెర వలె మాయమైపోయెను. అతని మంచి తనము. ఔదార్యము నాకు చక్కగా అర్థము కాసాగెను. అతనికి నేను చేసిన సాహాయ్యమేమి? ఎప్పుడో చిన్నప్పుడు అతనికి ఆహారము పెట్టితిని; ఒక ఆకు రాయినిచ్చితిని. అతడా సాహాయ్యమును మఱచి పోలేదు. నాకు ప్రత్యుపకారము చేయవలయునని అతడు నిశ్చయించుకొనెను. నన్ను గొప్ప గౌరవనీయుని చేసి చూచి సంత సింపవలయునను నుద్దేశ్యముతో ఎన్నో సంవత్సరములు కష్టపడి

అపారమగు ధనమును సంపాదించెను. అతడు నా కంటె వేయి రెట్లు మంచివాడు. ఏలయన నన్నెంతో ప్రేమతో పెంచిన జోకు నేనేమి చేసితిని? హావిషమ్‌కన్య ఇంటికిపోయి నప్పుడుగూడ నేనతనిని చూచుటకు వెళ్ళలేదు! ఇక నా కర్తవ్యమేమి? మాగ్‌విచ్ జీవితాంతమువఱకు అతని ప్రక్కనే ఉండవలయునని నిశ్చయించుకొంటిని.

రాత్రి సమీపించుచున్న కొలది మాగ్‌విచ్ ఊపిరి పీల్చుకొనుట కష్టసాధ్యమగుచుండెను. నేనతనికి తగిన విధముగా సేవ చేయుటకు పూనుకొంటిని. కాని హృదయములో నతడు మరణించిన మేలని అనుకొనసాగితిని. కాంపేసన్ ఇంక లేడన్న మాట నిజమే. కాని మాగ్‌విచ్‌ని గుర్తుపట్టు వారెంకను పలువురుండవచ్చును. ప్రభుత్వము వారతనికి తేలిక శిక్ష విధింతురనుట పట్టి అడియాసయేయగును. ఏలయన న్యాయస్థానములో అతనిమీద కావలసినంత గ్రంథమున్నది. అతడు కారాగారమునుండి తప్పించుకొని పాఱిపోయినాడు. మరల పట్టుబడి విచారణ చేయబడి ప్రవాస శిక్ష విధింపబడినాడు. కాని అతడు ప్రభుత్వమువారి ఆజ్ఞను ధిక్కరించి మరల ఈ దేశమునకు వచ్చినాడు. తన అరెస్టుకు కారణ భూతుడైన కాంపేసన్ మరణించునట్లు చేసినాడు. ప్రభుత్వము వారతనిని కఠినాతి కఠినముగ శిక్షింతురనుట తథ్యము. కావున ప్రభుత్వమువారు శిక్షింపక పూర్వమే అతడు మరణించుట మేలని భావింపసాగితిని.

నేను అతనితో నిట్లంటిని: “నీవు నన్ను చూడవలయునను సదుద్దేశ్యముతో తిరిగి వచ్చినావు. కాని కడకు ఈ విధ

ముగ జరిగినది. ఇందుకు నేనెంతయు విచారించుచున్నాను. ఇది నాకెంతయు బాధాకరముగ నున్నది."

కాని అతడు ఇట్లనెను: "ప్రియమైన అబ్బాయి! మంచి జరుగునని వచ్చినాను. నేను నా నాయనను చూచినాను. నేను లేకపోయినను అతడు గౌరవనీయునిగనే ఉండగలడు."

అతని అభిప్రాయము సరియైనదికాదు. ఏలయన అతని సొమ్మంతయు ప్రభుత్వము వారికే చెందును. ఈ పరిణామము నూహించియే వెమ్మిక్ నాతో ఎన్నోసార్లు, "చరాస్తి జాగ్రత్త! చరాస్తి జాగ్రత్త!" అని హెచ్చరించి యుండెను. కాని నేను ఆ హెచ్చరికను లెక్కపెట్టలేదు. బ్యాంకు నోట్లున్న పుస్తకమును మాగ్విచ్ వద్దనే ఉంచితిని. ఇప్పుడా పుస్తకము అధికారి వశమందున్నది.

అతడింకను నిట్లనెను: "నాయనా! నీ వింకను గౌరవనీయుడుగనే జీవింపవలయును. అందువలన నీవు నాకు సంబంధించిన వాడవని ఎవ్వరికిని తెలియరాదు. నీవు వెమ్మిక్‌తో బాటు యధాలాపముగవచ్చి నాకు కనబడునట్లు కూర్చున్నచాలును; నే నింతకంటె ఎక్కువ ఏమియు అడుగను."

కాని నేను ఇట్లంటిని: "నేను నీవద్దనే యుందును. నీ ప్రక్కనే కూర్చుందును. నిన్ను విడిచి ఎక్కడకు వెళ్ళను. నీవు నాపట్ల ఎటువంటి అభిమానమును ప్రదర్శించినావో, నేనుగూడ నీపట్ల అదే అభిమానమును ప్రదర్శింతును."

అతడు నా హస్తములను బట్టుకొనెను. అతని చేతులు గజగజ వణకి పోసాగెను. నన్ను ధనికుని చేయవలయునని అతడు ప్రయత్నించెను. ఆ ప్రయత్నము సర్వనాశనమై పోయినదను

విషయము అతనికి తెలియదు. నేను సౌధాగ్రమునుండి క్రింద పడిపోవుచున్న విషయ మాతనికి తెలియును. అటుల తెలియకుండు టయే మేలని నేను సంతృప్తి చెందితిని.

# 28

మఱునాడు అధికారి నా శ్రేయోభిలాషి మాగ్‌విచ్‌ని పోలీసు కోర్టుకు తీసికొనిపోయెను. అతడు వెంటనే విచారణకు పంపబడియుండెడివాడే. కాని అతడు ఫలానావాడని ధ్రువపఱచు వారెవ్వరు? పూర్వమతడు కారాగారపు టోడనుండి పాఱిపోయి వుండెనుగదా. ఆ ఓడకుచెందిన ఉద్యోగియొకడు వచ్చువఱకు విచారణ వాయిదావేయబడెను. మాగ్‌విచ్‌నిగూర్చి ఎవ్వరికిని ఏ సందేహమును లేదు. కాని ఎవ్వరో ఒకరు అతడు ఫలానాఅని చెప్పవలసియుండెను. ఆ పనిచేయగలిగిన కాంపేసన్ నీటిలో మునిగి మరణించియుండెను. లండనులోమఱియింకఆపనిచేయగల ఉద్యోగులెవ్వరును లేకుండిరి.

జాగర్సు సాహాయ్యమును కోరవలయునను నుద్దేశ్య ముతో నేనతని ఇంటికి పోతిని. అతనిని కలసికొని విషయమును చెప్పితిని. మాగ్‌విచ్‌ని ఈ ప్రపంచములోని ఏశక్తియు రక్షింప లేదని అతడు విస్పష్టముగా చెప్పెను.

"అతని సంపద ఇంకనాకు చెందదు. కాని ఈ విషయము మాత్రము అతనికి తెలియరాదు. నేను అతని విశ్వాస్యమును

అనుభవింతుననియే అతడు అనుకోవలయును" అని నేను జాగ్రత్తతో నంటిని. అపుడు జాగస్సు నాపై అపరిమితమగు కోపమును ప్రకటించెను. "నీచేతికి చిక్కిన ధనమును అనవసరముగా జారవిడిచినావు. ఇదియెంతయు శోచనీయమైన విషయము. ఇందుకు నిన్ను నేను ఏమాత్రము క్షమింపజాలను" అని అతడు కోపముతో ననెను.

అతడింకను ఇట్లనెను: "అతని సొమ్మిప్పుడు ప్రభుత్వము వారికి చిక్కినది. కాని అనేకసందర్భములలో ప్రభుత్వమువారు సొమ్ము తిరిగి యిచ్చివేసినవిషయము నాకు తెలియును. మనము గూడ అందులో కొంతసొమ్మును రాబట్టుటకు ప్రయత్నింతము. కాని పరిస్థితులన్నిటినిబట్టి ఆలోచించిచూడగా ప్రభుత్వమువారు మనకు సొమ్మేమియు తిరిగి ఈయరని తోచుచున్నది."

అతడుచెప్పిన విషయము నాకు బాగుగఅర్థమయ్యెను. నేను నేరగానికి బంధువునుకాను. అతనికి నాకుగూడ గుర్తింపదగిన సంబంధమేదియు లేదు, పోలీసువారికి పట్టుబడకపూర్వము అతడు తనసొమ్మునంతయు నాకుచెందవలయునని కాగితమేదియు వ్రాసియిచ్చియుండలేదు. ఇప్పుడతడు వ్రాసియిచ్చుట నిరుపయోగకరమైనపని. కనుక సొమ్ముమీద నాకు ఎటువంటిహక్కు లేదను విషయము స్పష్టమయ్యెను. అందువలన సొమ్ముకు నాకు హక్కుగలదని రుజువుచేసికొనుటకు ప్రయత్నింపరాదని నిశ్చయించుకొంటిని. నేనా నిశ్చయమునకు కట్టుబడియుంటిని.

నీటమునిగిపోయిన కాంపేసన్ ప్రభుత్వమువారికి మాగ్విచ్‌ని పట్టిఇచ్చి అతనిసొమ్ములో కొంతభాగమును బహుమానముగా పొందవలయునని తలచియుండును. అందువలన మాగ్

విచ్ వ్యవహారములకు సంబంధించిన వివరముల నన్నిటిని సరిగా సేకరించియుండెను. కాంపేసన్ మునిగిపోయిన ప్రదేశమునకు కొన్నిమైళ్ళ దూరములో అతనిశవము కనబడెను. అతని జేబులో నొక చిన్నపెట్టెయుండెను! ఆ పెట్టెలో కొన్ని కాగితములుండెను. ఆ కాగితములు ఏమాత్రము పాడైపోలేదు. ఆ కాగితములలో న్యూసౌత్ వేల్సులోని ఒక, బ్యాంకులో మాగ్ విచ్ కిగల ధనమునకు సంబంధించిన వివరములు, అతనికి గల విలువైన భూములకు సంబంధించిన వివరములుండెను.

జైలులో నుండగా మాగ్ విచ్ నేను పొందవలసినఆస్తుల వివరములను జాగర్సుకు వ్రాసియిచ్చెను. అందు బ్యాంకులో గల సొమ్ము. విలువైన భూములు గూడ పేర్కొనబడి యుండెను. జాగర్సు సాహాయ్యముతో నేను తన ఆస్తినంతను అనుభవింప గలనని అతడు గట్టిగా నమ్ముచుండెను.

మూడురోజులు గడచిన తరువాత కారాగారపు టోడ నుండి సాక్షివచ్చి మాగ్ విచ్ ని గుర్తుపట్టెను. అంతట సెషన్సుకోర్టు వారతనిని విచారణచేయవలయునని నిర్ణయింపబడెను. సెషన్సు కోర్టు వారతనిని సుమారు ఒక నెల దినములలో విచారణ చేయుదురు.

నా జీవితములో నది చాల చీకటికాలమని చెప్పవచ్చును. ఆ కాలములో నొకనాటి సాయంకాలము హెర్బర్టు విచార వదనముతో నావద్దకువచ్చి ఇట్లు చెప్పెను: "ప్రియమిత్రమా! నేను నిన్ను అనతికాలములోనే వీడి వెళ్ళిపోవలయునని భయపడు చున్నాను."

హెర్బర్టును కైరో బ్రాంచికి పంపుచున్నాడను విషయ మును మఱియొక భాగస్వామి యగు క్లారికర్ నా కదివఱకే తెలిపియుండెను. అందువలన హెర్బర్టు మాటలు నా కంతగా ఆశ్చర్యమును కలిగింపలేదు.

హెర్బర్టు ఇంకను ఇట్లనెను: "నే నిప్పుడు కైరో ప్రయాణ మును వాయిదా వేసినచో ఒకచక్కని అవకాశమును కోల్పోయి నట్లగును. నా అవసరము నీ కిప్పుడే ఎక్కువ ఇటువంటి సమయ మున నిన్ను వదలిపెట్టి వెళ్ళవలసి వచ్చుచున్నందుకు నేనెంతయు విచారించుచున్నాను."

అంతట నేను ఇట్లంటిని: "ప్రియమిత్రమా! నీ అవసరము నాకు ఎప్పుడును ఉండును. ఏలయన నేను నిన్నెప్పుడును ప్రేమించుచున్నాను. కాని ఇప్పుడు నా అవసరము ఇదివఱకు కంటె ఎక్కువది."

"నీవు ఒంటరిజీవితము గడపవలసి వచ్చును."

"నే నా విషయమును గుఱించి ఆలోచించుటకే తీరుబడి యుండదు. నేను అధికారులు అనుమతించినంతవఱకు అతనితో నుందును. రోజంతయు అతనివద్దనే గడపుటకు నేను సంసిద్ధము గనే యున్నాను. అతనివద్దనుండి బయటకు వచ్చినను, నా ఆలోచనలు అతనిని గూర్చియే యుండును."

"నేను నిన్ను త్వరలోనే వీడిపోనున్నాను. కావున నీకు సంబంధించిన ప్రశ్న నొకదానిని వేసి నిన్ను బాధపెట్టదల్చు కొన్నాను. నీ భవిష్యత్తునుగుఱించి ఆలోచించు కొన్నావా?"

"లేదు. ఏలయన భవిష్యత్తునుగూర్చి తలచుటకే నేను భయపడుచున్నాను."

"నీ భవిష్యత్తునుగూర్చి భయపడుట ఎందులకు? నీకు వచ్చెడు భయమేమియులేదని నేను హామీ ఇచ్చుచున్నాను. నీవు వచ్చి మాక్లెర్ కార్యాలయములలో చేరుము. ప్రస్తుతము ఒక గుమాస్తాపదవి ఖాళీగానున్నది. నీ వా పదవిలో ప్రవేశింపుము. తరువాత నీవు కూడ భాగస్వామిని కావచ్చును. ఈ విషయమును గూర్చి నేను, క్లేరా అనేకసార్లు మాట్లాడుకున్నాము. ఇంతకుమునుపే ఆమె కన్నీరు పెట్టుకొని ప్రార్థనాపూర్వకముగ నాతో నిట్లన్నది! 'మనము వివాహము చేసికొన్న తరువాత అతడుకూడ మనతో నుండవచ్చును. అతని జీవితము సౌఖ్యవంతముగ నుండుటకు నా శక్తికొలది తోడ్పడెదను. నాభర్త స్నేహితుడు నాకుగూడ స్నేహితుడని రుజువుచేసెదను.' కావున మనము కలసియుండి సుఖముగా జీవింపవచ్చును."

"నేను నీకు, నీ భార్యకు ఎంతయు కృతజ్ఞుడను. మీదయ నన్ను ముగ్ధుని చేయుచున్నది. నాకు గుమాస్తా పదవి నిత్తు నన్నందుకు నే నెంతయు సంతసించు చున్నాను. కాని నేను ఇప్పుడప్పుడే ఆ విషయమున ఒక నిర్ణయమునకు రాజాలను."

నేను తక్షణమే నిర్ణయమునకు రాకపోవుటకు రెండు కారణములు కలవు. ఒకటి; నా మనస్సు వేఱు విషయములతో నిండి యుండుటవలన ఆ విషయమునుగూర్చి స్పష్టముగ ఆలోచింప లేకుంటిని. రెండు; నా ఆలోచనలలో నొక విషయము కొలదిగా మెదలు చుండెను. అదియేమో ముందు తెలియగలదు.

"నీ వ్యాపారమునకెట్టి భంగము కలుగకుండ, గుమాస్తా పదవిని కొంతకాలము ఖాళీగా నుంచుటకు వీలుండునా?"

"ఎంతకాలమైనను సరే ఖాళీగా నుంచెదను. ఆఱునెలలు! ఒక సంవత్సరము!"

"అంతకాలమక్కఱలేదు. రెండు మూడు నెలలు ఖాళీగా నుంచిన చాలును."

ఆ ఏర్పాటుకు మే మిరువురము అంగీకరించి సంతోషముతో కరచాలనము చేసి కొంటిమి. తరువాత హెర్బర్టు ఇట్లనెను: "ఈ వారాంతముననే నేను కైరోకు వెళ్ళవలసి యుండునని నమ్ముచున్నాను. ఈ విషయము నిప్పుడు నీకు ధైర్యముగ చెప్పగలుగుచున్నాను."

"మఱి క్లేరా సంగతి?"

"ఆమె తండ్రి బ్రతికి యున్నంత వఱకు ఆతనివద్దనుండ వలసినదే. కాని అతడింక నెంతో కాలము బ్రతుకడు."

"అతడు పరలోకమున కేగుటయే మంచిపని అనుకొందును."

"నేను ఆవిషయమును అంగీకరింపక తప్పదు. అతడు మరణించిన తరువాత నేను క్లేరాను కలసి కొనుటకై ఇచ్చటకు తిరిగి వచ్చెదను. మే మిరువురము ప్రశాంతముగ చర్చిలోనికి పోయి వివాహము చేసికొందుము."

హెర్బర్టు ఆ వారములోనే శనివారమునాడు కైరోకు బయలుదేఱి పోయెను. నే నతనిని కోచిలో నెక్కించి, తరువాత నాబసకు తిరిగి వచ్చితిని.

నా శ్రేయోభిలాషి జబ్బుతో జైలులో బడియుండెను. ఊపిరి తిత్తులు పాడై పోవుట వలన నతడు సరిగా గాలిపీల్చ లేకుండెను. అతని గొంతు చాల హీనముగ నుండెను. అందు వలన నతని మాటలు నాకు సరిగా వినబడ కుండెను. కావున నతడు మాటలాడుట చాలవఱకు తగ్గించి వైచెను. కాని అతడు నా మాటలను వినుటకు సిద్ధముగ నుండెను. అందువలన నే నతనికి మంచి మాటలు చెప్పసాగితిని. మంచి గ్రంథములలోని భాగములను చదివి వినిపింప సాగితిని. నేను అతని నుత్సాహ పఱచుటకు శతవిధముల ప్రయత్నింప సాగితిని. కాని రోజులు గడచుచున్న కొలది అతడు బలహీనుడై పోవుచుండెను.

సెషన్సు కోర్టువారు అతనిని విచారింపవలసిన దినము వచ్చెను. విచారణను వాయిదా వేయవలయునని జాగర్సు ముద్దాయి తరఫున వాదించెను. ఈ లోపల ముద్దాయి ఎట్లో మరణించునను నుద్దేశ్యముతో నతడా విధముగ చేసెను. కాని కోర్టువారు అతని దరఖాస్తును త్రోసి పుచ్చిరి.

విచారణ వెంటనే ప్రారంభమయ్యెను. కోర్టువారి అనుమతితో జబ్బుగానున్న మాగ్‌విచ్ ఒక కుర్చీలో కూర్చుండెను. నేనుకూడ కోర్టువారి అనుమతినిపొంది అతనిచేతి నొకదానిని పట్టుకొంటిని.

విచారణ సూటిగ, స్పష్టముగ చాలకొద్దిసేపు మాత్రమే జరిగెను. "ముద్దాయి ఆస్ట్రేలియాలో కష్టపడి పనిచేసినాడు.

న్యాయసమ్మతముగ ప్రవర్తించినాడు. మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించినాడు. అపారమగు ధనమును సంపాదించినాడు" అని కోర్టువారతనిని పరిపరి విధముల ప్రశంసించిరి. "కాని ఇతడు ఆస్ట్రేలియానువదలి ఇచ్చటకు వచ్చుటకు వీలులేదు. ఇప్పుడితడు మనయెదుట స్పష్టముగ కనబడుచున్నాడు. దీనినిబట్టి ఇతడు చట్ట విరుద్ధముగ ఆస్ట్రేలియానువదలి ఇంగ్లండుకు వచ్చినాడను విష యము స్పష్టముగ తెలియుచున్నది. ఈ నేరమునకు మరణమే శరణ్యము" అనికూడ కోర్టువారనిరి.

కోర్టువారు మాగ్‌విచ్‌కి మరణశిక్ష విధించిరి. అతడు ఉరి తీయబడవలసిన దినముకూడ నిర్ణయింపబడెను.

నేను ప్రతిరోజు అధికారుల అనుమతితో జైలుకుపోయి మాగ్‌విచ్‌ప్రక్కనే కొంతకాలము గడపసాగితిని. రోజులు గడచు చున్నకొలది అతనిలోని జీవకళ మాయమైపోవుచున్నదను విష యమును నేను గ్రహించితిని.

ఒకనాడు నేను ఎప్పటివలె అతడు బంధింపబడియున్న గదిలో ప్రవేశించితిని. అంతవఱకు అతడు నాకొఱకు ద్వారము వంక చూచుచుండెను. నన్ను చూడగనే అతనికన్నులు ప్రకా శింపసాగెను. నేనుపోయి అతనిప్రక్కనే కూర్చుంటిని. అప్పు డతడు నాతో నిట్లనెను: "ప్రియమైన నాయనా! నీవు వచ్చుట ఆలస్యమైపోయిన దనుకొన్నాను. కాని నీవు ఆలశ్యముగ రావను విషయము నాకు తెలియును."

"గేటు తెఱచు సమయము సరిగానిదియే. నేను గేటువద్ద వేచియుంటిని."

"ప్రియమైన నాయనా! నీవెప్పుడును గేటువద్దనే వేచి యుందువు కాదా?"

"అవును. ఒక్కక్షణకాలమైనను పోగొట్టుకొనరాదని యను అభిప్రాయముతో అటులచేయుదును."

"నాయనా! నీకు కృతజ్ఞుడను! నీకు కృతజ్ఞుడను! భగవంతుడు నీకు సర్వకాల సర్వావస్థలయందు మేలుచేయుగాక. నీవు నన్నెప్పుడును వదలిపెట్టియుండలేదు. ప్రియమైన నాయనా!"

అప్పుడు నేను ప్రశాంతముగ అతని హస్తమును నొక్కితిని. ఏలయన ఒకప్పుడు నేను అతనిని అతనికర్మకు వదలివేయ వలయునని అనుకొంటిని. ఆ విషయమును నేను మఱచిపోజాలను.

అతనింకను నిట్లనెను: "నేను చెప్పవలసిన ముఖ్యవిషయ మొకటి యున్నది. నీవు నా దుస్థితిలో నా పక్కనేయుండి సేవ చేసినావు. ఇది నీకు అపారమగు సంతోషమును కలిగించుచున్నదని నేను అర్థముచేసికొనుచున్నాను. ఇంతకంటె నాకు కావలసినది మఱియేమియున్నది?"

అతడు తెల్లవెలుపమునందే ఎంతోకష్టముతో ఊపిరిపీల్చుచు విడుచుచుండెను. క్షణక్షణమునకు అతనిలోని జీవకళ తగ్గిపోవుచున్నదను విషయమును నేను గ్రహించితిని.

"నేడు నీకు బాధ ఎక్కువగా నున్నదా?" అని ప్రశ్నించితిని.

"నేను దేనిగూర్చిగాని ఫిర్యాదుచేయను."

"అవును, నీ వెన్నడును ఫిర్యాదు చేయవు."

అత డింకను మాట్లాడలేదు. అతడు మందహాసముచేసి నాచేతిని ముట్టుకొనెను. నాచేతిని పైకెత్తి తనతొమ్ముమీద పెట్టవలయునని కోరుచున్నాడని అర్థము చేసికొంటిని. వెంటనే నే నటుల చేసితిని. అతడు మఱియొకసారి మందహాసము చేసి తన రెండు చేతులను నా చేతిపై పెట్టెను.

అప్పటికి జైలు అధికారి నా కొసగిన కాల వ్యవధి ముగిసెను. నేనింక నా శ్రేయోభిలాషిని వీడిపోవలసి యుండెను. నేను అచ్చటనేయున్న జైలు అధికారివంక చూచితిని. అతడు మెల్లన నాతో నిట్లనెను: "నీవప్పుడే వెళ్ళిపోవలసిన పనిలేదు." అంతట నే నతనికి కృతజ్ఞతాభి వందనములను తెలిపితిని.

తరువాత నేను నా శ్రేయోభిలాషితో నిట్లంటిని: "ప్రియమైన మాగ్విచ్! ఇప్పుడు నీకొక ముఖ్యమైన విషయమును చెప్పెదను. నా మాటలు నీకు అర్థమగుచున్నవా?"

అతడు నా హస్తమును మెల్లన నొక్కెను.

"నీకు పూర్వమొక బిడ్డ యుండెడిది. నీ వామెను గాఢముగ ప్రేమించితివి. కాని ఆమెను పోగొట్టుకొంటివి."

అతడు నా హస్తమును ఇంతవఱకుకంటెగట్టిగ నొక్కెను.

"ఆమె మరణింపలేదు. ఆమెకు ధనికమిత్రులు లభించినారు. ఆమె యిప్పుడింకను జీవించియున్నది. ఆమె యిప్పుడు గౌరవనీయురాలు; సౌందర్యరాశి. నే నామెను ప్రేమించుచున్నాను."

అంతట నతడు ఎంతోకష్టముతో నాచేతిని తన పెదవుల వద్ద పెట్టుకొని ముద్దు పెట్టుకొనెను. తరువాత నాచేయి అతని

రొమ్ము భాగముమీద పడిపోయెను. అతని రెండు చేతు లును నాచేతిమీద పడెను. అతనితల వ్రాలిపోయెను. అతడు మరణించెను.

"ఓ భగవానుడా! పాపియగు నితనిని కరుణతో మన్నిం పుము!" అని నేను దేవుని ప్రార్థించితిని.

# 30

లండను మహానగరమున నేను ఒంటరివాడనై పోతిని. నావద్ద నింక మార్గవిచ్ కాని హెర్బర్టుకాని లేరు. ఇంక నాకు అన్ని గదు లెందుకు? కాని మేము వ్రాసికొన్న ఒడంబడిక పత్రము ప్రకారము నేను ఇంకను చాలకాలము ఆ గదులలో నుండవచ్చును. అందువలన నేను ఆ గదులలో కొన్నిటిని మఱి యొకరికి అద్దె కీయదలచి నోటీసు కట్టితిని. అందుకు నావద్దడబ్బు లేకపోవుటగూడ ముఖ్యకారణము. నేను ఇతరులకు చాల సొమ్ము బాకీపడియుంటినిగూడ. నా పరిస్థితులు నాకు చాల భయంకరగ ముగ కనబడసాగెను.

ఈలోపల నాకు జబ్బుచేసెను. నా జీవితి మెట్లు గడచి పోవుచుండెనో నాకే అర్థము కాకుండెను. ఎప్పుడును ఎవ్వరో ఒకరు నావద్ద కూర్చుండి సేవచేయుచున్నట్లు కనబడసాగెను. నాకు ప్రతిక్షణము జో స్వరూపము కనబడుచుండెను.

కడ కొకనాడు నే నీవిధముగ ప్రశ్నించితిని; "ఎవరు? జో యేనా?"

"అవును, నాయనా!"

"అయ్యో! జో! నీ వావిధముగ మాట్లాడి నాహృదయమును వ్రక్కలు చేయుచున్నావు. నావంక ఆగ్రహముతో చూడుము. నన్ను కొట్టుము, జో! నా కృతఘ్నతను గూర్చి చెప్పుము. నాపట్ల ఇంత మంచిని చూపకుము."

తన్ను నేను గుర్తించినానను సంతోషముతో జో నన్ను కౌగిలించుకొను చుండెను.

"మిత్రమా, పిప్! మన మిరువురము చిన్నప్పటినుండియు మంచి మిత్రులము."

తరువాత నతడు కిటికీవద్దకుపోయి బయటకు చూచుచు కన్నులు తుడుచుకొన సాగెను. బలహీనముగ నుండుట వలన నేను లేచి అతనివద్దకు పోలేక మెల్లన నిట్లను కొంటిని: "ఓయి భగవానుడా! ఈ నిజమైన క్రైస్తవ గౌరవనీయునకు మేలు చేయుము!"

తరువాత నతడు నాప్రక్కన కూర్చుండుసరికి అతని కన్నులు చాల ఎఱ్ఱగా నుండెను.

"ఎంతకాలము, ప్రియమైన జో!"

"అనగా నీ యుద్దేశ్యము? నీవు ఎంతకాలమునుండి జబ్బుగా నున్నానో తెలిసికొన గోరుచున్నావా?"

"అవును, జో!"

"నీకు మే చివరి భాగములో జబ్బుచేసినది, రేపు జూన్ మొదటి తేదీ."

"ప్రియమైన జో! నీ వప్పటినుండి నావద్దనే యున్నావా?"

"చాల వఱకు, పిప్! నీవు జబ్బుగా నున్నావని పోస్టులో నాకొక యుత్తరము వచ్చినది. నేనా యుత్తరములోని విషయ మును బిడ్డీకి తెలిపినాను. అప్పుడామె ఇట్లన్నది: 'మన పిప్ అచ్చట క్రొత్తవారి మధ్య నున్నాడు. అతడు ఏమి బాధలు పడుచున్నాడో తెలియదు. నీవును, అతడును చిన్నప్పటినుండియు మిత్రులుకదా! ఈ కష్ట సమయమున నీ వచ్చుటకుపోయినచో అతనికి అసంగీకారము కాకపోవచ్చును. కావున నీవు ఒక్క నిమిషమైనను వృథాచేయక వెంటనే పోయిరమ్ము.' అంతట నేను బయలుదేరి నీ వద్దకు వచ్చినాను.

అది యటుండనిమ్ము. నీవు ఎక్కువగా మాట్లాడరాదు. మాట్లాడినచో అలసిపోయి బలహీన పడుదువు. నీకు ఇష్టమైనను కాక పోయినను నిర్ణీత సమయములందు సరియైన ఆహారము తీసికొను చుండవలయును. ఇంత ఎందులకు? నీవు ఏ విషయమున నైనను నా ఆజ్ఞ ప్రకారము నడచుకోవలయును."

అంతట నేను అతని హస్తమును ముద్దు పెట్టుకొని ప్రశాంతముగ పరుంటిని. అపుడతడు బిడ్డీకొక యుత్తరము వ్రాయసాగెను.

మఱునాడు నేను అతని నిట్లు ప్రశ్నించితిని: "హావిషమ్ కన్య ఆరోగ్య మెట్లున్నది?"

అతడు సమాధాన మేమియు నీయలేదు. తలమాత్ర మూపెను.

"జో! ఆమె మరణించినదా?"

"మిత్రమా! నే నంత దూరము పోను. ఆమె జీవించి. . ."

"లేదా? జో!"

"అవును, ఆమె జీవించి లేదు."

"ఆమె ఎప్పుడు మరణించినది."

"నీకు జబ్బుచేసిన తరువాత సుమారు వారము రోజుల కనుకొందును."

"ఆమె ఆస్తినేమి చేసినదో నీకేమైన తెలియునా?"

"ఆమె ఆస్తిలో చాల ఎక్కువ భాగమును ఎస్టెలాకు వ్రాసి యిచ్చినట్లు తెలియు చున్నది. ఆమె మరణించుటకు కొన్ని రోజులకు పూర్వము వీలునామాలో క్రొత్త విషయ మును చేర్చినదట. అది యేమనుకొన్నావు? మత్తయి పోకెట్ అను వానికి నాలుగు వేల పౌనులు చెందవలయునని వ్రాసినదట. 'మత్తయి పోకెట్‌నుగూర్చి పిప్ చెప్పిన దానినిబట్టియే ఈ సొమ్ము నిచ్చుచున్నాను' అని ఆమె వీలునామాలో వ్రాసినదట."

మత్తయిపోకెట్‌కు హావిషమ్‌కన్య నాలుగువేల పౌనుల నిచ్చినదన్న వార్తనాకు అపరిమితమగు సంతోషముకలిగించెను. ఏలయన నేను తలపెట్టిన మంచిపని పూర్తియైనది.

"ఇంకెవ్వరికైన నేమైననిచ్చినదా?" అని నేను ప్రశ్నించి తిని. సారాముున్నగు ముగ్గురుస్త్రీలకు గూడ హావిషమ్‌కన్య స్వల్పమొత్తముల నిచ్చిన విషయమును జో తెలిపెను.

తరువాత సతడు ఆర్లిక్‌నుగూర్చి ఇట్లుచెప్పెను: "ఆర్లిక్ పంబుల్‌చూక్ ఇంటిమీద దొంగతనముచేసెను. పంబుల్‌చూక్ అతనిని గుర్తించి పోలీసువారికి ఫిర్యాదుచేసెను. పోలీసువారత నిని వెంబడించి, అరెస్టుచేసి, న్యాయస్థానమునకు తీసికొని

పోయిరి. న్యాయాధికారి అతనిని విచారణచేసి జైలుశిక్ష విధించెను. అతనిప్పుడు జైలులో నున్నాడు."

రోజులు గడచిపోవుచుండెను. నేను మెల్ల మెల్లన బలమును పుంజుకొనుచుంటిని. జో నావద్దనేయుండి నన్ను అతిగారాబముగా చూడసాగెను. నేను చిన్నప్పటి పిప్‌వలె నున్నట్లుండెను.

నేను జో సాహాయ్యమున బయటకుపోయి తిరుగసాగితిని. క్రమ క్రమముగా బలిష్ఠుడ నగుచుంటిని. నా ఆశాసౌధములు కూలిపోయినవను విషయము జోకు, బిడ్డీకి తెలియునను విషయమును జోతోని మాటల సందర్భమున గ్రహించితిని. కాని అతడా విషయమునుగూర్చి మాట్లాడలేదు.

నేను బలిష్ఠుడ నగుచున్నకొలది నాపట్ల జో ప్రవర్తన మారసాగెను. నేను బలహీనుడుగ నున్నప్పుడు అతడు నాతో ఎంతో చనువుగ ప్రవర్తించుచుండెడివాడు. కాని నేను ఆరోగ్యవంతుడ నగుచున్నకొలది ఆచనవు తగ్గిపోవుచుండెను. అతడట్లు ప్రవర్తించుచున్నందుకు నేను మొదట ఆశ్చర్యపడితిని. కాని దానికంతకు కారణము నేనే అనియు, తప్పంతయు నాదే అనియు నేను అనతికాలములోనే గ్రహించితిని.

అవుడు, తప్పంతయు నాదే. ఎటువంటి పరిస్థితులలోనైనను నేను తనపట్ల అభిమానమును కలిగియుందునను నమ్మకమును జోకు కలుగజేయలేకపోతిని. చిన్నప్పుడు అతని యింటనుండి అతని అభిమానమునుపొంది అతనిపట్ల అభిమానముతో ప్రవర్తించితిని. అప్పుడు నేను దీనఅనాథబాలుడను. కాని నాకు ఐశ్వర్యమురానున్నదను విషయము తెలియగనే అతనిని నిరాద

రణచేసితిని. హావిషమ్‌కన్య ఇంటికి పోతినిగాని అతనిని చూచుటకు పోనైతిని. భార్యను పోగొట్టుకొన్న జోపట్ల నేను ఏవిధముగను సానుభూతిని చూపనైతిని. అయినను అతడు దేవతవంటివాడు. జబ్బులోనున్న నాకు అతడువచ్చి సేవచేసెను. తరువాత నాకు తాను భారమగుదుమనను తలంపుతో దూర దూరముగ పోవుచుండెను.

ఒకనాడు నేను జోను ఆధారముచేసికొని నదీతీరమునకు బోతిని. నేమిరువురము నదియొద్దున చాలసేపు కూర్చుంటిమి. తరువాత ఇంటికి తిరిగివచ్చు తలంపుతో లేచితిమి.

అప్పుడు నేను ఇట్లంటిని: "చూడుము, జో! ఇప్పుడు నేను బాగుగనే నడవగలను. నాకింక ఎవ్వరి సాహాయ్యము అక్కఱలేదు. ఇప్పుడు నాఅంతట నేనే నడచివత్తునుచూడుము."

అంతట జో ఇట్లనియెను: "పిప్! శక్తికి మించిమాత్రము పనిచేయకుము. నీఅంతట నీవు మఱియొకరి సాహాయ్యము లేకుండ నడవగలుగుట నాకు సంతోషదాయకమైన విషయమే. అయ్యో! నాకు సంతోషదాయకమైన విషయమే.''

అత డుపయోగించిన 'అయ్యో' అనుమాట నాకు కష్టమును కలుగజేసెను. కాని నేనేమి చేయగలను! నేను కొంచెము దూరముమాత్రమే అతని సాహాయ్యము లేకుండ నడచి, తరువాత నీరసముగనున్నట్లు నటించి, "జో! నీచేతి నందిమ్ము" అని అంటిని. అంతట నతడు తన చేతి నందిచ్చెను గాని ఏమో ఆలోచింపసాగెను.

నేనుకూడ ఆలోచింప సాగితిని. జోలోని మార్పును అరికట్టుట ఎట్లను విషయమునుగూర్చి నేను ఆలోచించుచుంటిని.

అది నాకొక పెద్దసమస్యగా నుండెను. నా ఆర్థిక పరిస్థితి నతనికి తెలియఁజేయుటకు సిగ్గుపడుచుంటిని. కాని అందుకు నాకు సంబంధించిన కారణమేగాక, జోకు సంబంధించిన కారణముగూడ నొకటియుండెను. నేను పూర్తిగా నిర్ధనుడనన్న విషయము తెలిసినచో అతడు తాను కూడబెట్టిన సొమ్ములోని కొంత భాగమును నా కిచ్చుటకు ప్రయత్నింపవచ్చును. కాని అతడు నాకు సాహాయ్యము చేయరాదు. నాకు సాహాయ్యముచేసి తాను బాధపడరాదు. అతనివద్దనుండి సాహాయ్యమును స్వీకరించుటకు నే నతని కేమి సాహాయ్యము చేసితిని?

ఆదివారము కడు ప్రశాంతముగ నుండెను. నాడు నేమిత్రులము కలిసి పొలములలోనికి నడచిపోతిమి.

"జో, నాకు జబ్బుచేసినందుకు నే నెంతయు సంతసించుచున్నాను" అని అంటిని.

"ప్రియమైన పిప్! నీకు చాలవఱకు ఎప్పటి ఆరోగ్యము చేకూరినందుకు నేను ఎంతయు ఆనందించుచున్నాను."

"ఈసమయము నిజముగా సువర్ణాక్షరములతో పేర్కొనదగిన సమయము. దీనిని నా జీవితములో ఎన్నటికిని మఱచిపోను."

"నేనును అదేవిధముగా అనుకొనుచున్నాను."

"జో! ఈసమయమున మన మిత్రులము కలిసియుంటిమి. దీనిని నే నెన్నటికిని మఱచిపోజాలను. ఒకప్పుడు నేను పూర్వపు రోజులను కొలదిగా మఱచిపోయినమాట నిజమే. కాని ఈరోజులను మాత్రము ఎన్నటికిని మఱచిపోజాలను."

"పూర్వపు విషయ మెందులకు? మనమధ్య నున్న దేమో యున్నది. మన మిరువురము ఎప్పుడును గాఢ స్నేహితులమే యను విషయమును జ్ఞప్తియం దుంచుకొనుము."

నేను రాత్రి శయ్యమీద పరుంటిని. అప్పుడు జోనావద్దకు వచ్చెను. ఆవిధముగా నతడు ప్రతిరాత్రియు చేయుచుండుట అలవాటే.

అతడు నాతో నిట్లనెను: "ప్రొద్దుట నీవు చాల ఆరోగ్యముగ నున్నావనియు, మంచి బలము కలిగియున్నావనియు నని పించినది. ఇప్పుడుకూడ అదేవిధముగ నున్నావా?"

"అవును, ప్రియమైన జో! నే నిప్పుడు సంపూర్ణారోగ్యమును కలిగియున్నాను."

"నీ బలము దిన దినాభివృద్ధి చెందుచున్నదా?"

"అవును, జో! నేను రోజు రోజుకు బలిష్ఠుడనగుచున్నాను."

అంతట నతడు నా భుజమును తట్టెను. తరువాత నతడు 'గుడ్ నైట్!' అని అన్నట్లుండెను.

నేను తెల్లవారిన తరువాత నిదురనుండి లేచితిని. అప్పుడు నా మనస్సు ఎంతో ప్రశాంతముగ నుండెను. శరీరమున బలము కూడ మిక్కుటముగ నున్నట్లుండెను. నాకు సంబంధించిన విషయములనన్నిటిని జోకు తెలియజేసి అతని కాళ్ళమీద పడవలయు ననుకొనుచుంటిని. ఆ పనిని వెంటనే చేయవలయుననుకొంటిని. ఉదయకాలపు భోజనమునకు పూర్వమే ఆపనిని ముగింప వలయు నని నా యుద్దేశ్యము. అంత పెందలకడ నేను లేచుటకదియే మొదటిసారి. నేను దుస్తులు వేసుకొని జోకు ఆశ్చర్యమును

కలుగ జేయవలయునను కొంటిని. ఆ యుద్దేశ్యముతో నే నతని గదిలోకి పోతిని. కాని అతడచ్చట లేడు. అతడు లేకపోవుటయే కాదు; అతని పెట్టెకూడ నచ్చట లేదు. అంతట నేను భోజనము చేయు టేబులువద్దకు వెళ్లితిని. దానిమీద నొక చీటీ పడియుండెను. ఆ చీటీలో నిట్లు వ్రాయబడి యుండెను.

ప్రియమైన పిప్! నీకు సంపూర్ణముగ ఆరోగ్యము చేకూరినది. నేను లేకపోయినను నీ పనులను నీవు చక్కగా చేసికొనగలవు. ఇంక నిచ్చట ఎక్కువ కాలముండరాదను నుద్దేశ్యముతో నేను వెళ్ళిపోవు చున్నాను. కాని మన మిత్రత్వము ఎప్పుడును గాఢ స్నేహితులమను విషయమును మాత్రము జ్ఞప్తియందుంచుకొనుము.

ఇట్లు,

జో.

ఆ చీటీతోబాటు అతడు నా అప్పునొకదానిని తీర్చివేసి నట్లు తెలియ జేయు రసీదుకూడ నుండెను. అంతవఱకు నేను ఆ అప్పులవాడు నాకుజబ్బు నయమగువఱకు వేచియున్నాడని భావించు చుంటిని. జో నా అప్పును తీర్చివైచినాడని నే నెన్నడును ఊహింపలేదు. కాని అతడు నా అప్పును తీర్చివైచెను. రసీదు అతని పేరిటనే యుండెను.

అప్పుడింక నేనేమి చేయవలయును? నేను తిన్నగా చిన్నప్పుడు పనిచేసిన కొలిమువద్దకు పరుగెత్తుకొని పోవలయును. అచ్చట నేను జోకు నా చరిత్రయంతయు 'పెచ' తప్పకుండ చెప్పవలయును. నేను హృదయ పూర్వకముగ పశ్చాత్తాప పడు

చున్న విషయమును తెలియజేయ వలయును. మఱియు అంత వఱకు నా మనస్సులో ఊగిసలాడుచున్న ఒక ముఖ్యమైన నిర్ణయమును అమలులో పెట్టవలయును.

ఆ ముఖ్య నిర్ణయమేమి? నేను బిడ్డీ వద్దకు పోయి నా పతనావస్థ నంతను వివరించి చెప్పుదును. నేను హృదయపూర్వకముగ పశ్చాత్తాపపడి తిరిగివచ్చిన విషయమును చెప్పెదను. నేను సౌధాగ్రమునుండి కూలిపడిపోయిన విషయమును చెప్పెదను. మా కిరువురకు ఒకరిపై నొకరికి పూర్వము గల విశ్వాసమును జ్ఞప్తికి తెత్తును.

తరువాత నామెతో నిట్లందును: "బిడ్డీ! ఒకప్పుడు నీకు నే ననిన అపరిమితముగు నిష్టముండెడిదని అనుకొను చున్నాను. అప్పుడుకూడ నాహృదయ మిటునటు పోవు చుండెడిది. అయినను నీవు నన్ను హృదయ పూర్వకముగ ప్రేమించు చుండెడి దానవు. ఆ విషయము నాకు బాగుగ తెలియును. ఇప్పుడు నాపై అప్పుడు ప్రకటించిన ప్రేమలో సగముప్రేమను మాత్రము ప్రకటింపుము. నేను భగ్నహృదయుడను; నాలో ఎన్నో లోట్లున్నవి. అట్టి నన్ను స్వీకరింపుము. తల్లి తప్పుచేసిన కుమారుని క్షమించి మరల నతనిని తన యొడిలోనికి తీసికొనును. అటులే నీవుకూడ నన్ను స్వీకరింపుము. నీ వీ విధముగా చేసినచో నేను ధన్యుడనని తలంతును. తరువాత నీవు చెప్పినట్లు చేయుదును. నేను జోతో బాటు కొలిమివద్ద పని చేయవలయునా? లేక మఱి యింకేదేని వృత్తిని స్వీకరించి గ్రామసీమలలోనే నివసింపవలయునా? లేక కైరోలో నాకొఱకు ఖాళీగా నుంచబడిన ఉద్యోగమును స్వీక

రింపవలయునా? నీ సమాధానము తెలియువఱకు కైరోలోని ఉద్యోగమును ఖాళీగా నుంచవలసినదని నా మిత్రుని కోరి యున్నాను. ఈ మూఁటింటిలో నీకేది ఇష్టమో చెప్పుము. నేను నీ ఇష్టప్రకారమే నడచుకొందునని వాగ్దానము చేయుచున్నాను. బిడ్డీ! నన్ను భర్తగా స్వీకరించి నాతోబాటు ఈ ప్రాపంచిక వ్యవహారములలో పాల్గొందునని చెప్పుము. నీవట్లు చెప్పినచో ఈ ప్రపంచము నాకు ఇదివఱకుకంటె గొప్ప ప్రపంచమగును. నేను ఇదివఱకుకంటె ఔన్నత్యముకల మానవుఁడనగుదును. నేను నీవు సర్వసౌఖ్యముల ననుభవించునట్లు నా శక్తియుక్తుల నన్నిటి నుపయోగించి పని చేయుదును."

మఱి మూఁడురోజులు విశ్రాంతి తీసికొన్నతరువాత నేను చిన్నప్పుడు నివసించిన గ్రామసీమకు పయనమై పోతిని.

నా ఆశా సౌధములు కూలిపోయిన వను విషయము నాకంటె ముందుగనే గ్రామసీమను చేరుకొనెను. 'బ్లూబోర్' హోటలులోఁ కూడ ఆసంగతి వ్యాప్తిచెందెను. అందువలననే నే నచ్చటకు పోయి నాకు మొదటిరకపు గది కావలయుననగా నాలుగవ రకపు గది నిచ్చిరి. నాకు గొప్ప ఐశ్వర్యము రానున్నదని తెలిసినపుడు ఆ హోటలు అధికారులు నన్నెన్నో విధముల గౌరవించిరి; నాకు ప్రత్యేకమగు గది నొసగిరి; ప్రత్యేకమగు ఆహార పానీయముల నొసగిరి. మఱి యిప్పుడు ఆమర్యాద మన్నన లన్నియు మాయమైపోయెను. అచ్చటివారు నన్ను మొఱటుగా నాలుగవ రకపు గదిలో పెట్టిరి! ఆహా! ఈ ప్రపంచ మెట్టిది!

అంతయు ధనముతో నున్నది! అయినను రాత్రికి నే నాహోటలు లోనే బస చేసితిని.

తెల్లవారిన తరువాత నేను హావిషమ్కన్య ఇంటిదిక్కునకు పోతిని. అది పూర్తిగా పాడుపడినట్లుండెను. ఆ యిల్లు, అందు లోని సామానులు అమ్మివేయబడునని అచ్చట నోటీసులు అంటింపబడి యుండెను. వాని నన్నిటిని జూచి నే నెంతయు విచారింప సాగితిని.

తరువాత నేను ఉదయకాలపు భోజనము తీసికొనుటకై హోటలుకు తిరిగి వచ్చితిని. అప్పు డచ్చట పంబుల్‌చూక్ హోటలు యజమానునితో వేచియుండెను. అతడు నాకొఱకే వేచి యున్నట్లుండెను. నన్ను చూడగనే అత డిట్లనెను: "యువకుడా! నీవు తిరిగి అధమస్థితికి వచ్చినావని తెలిసికొనుటకు నే నెంతయు విచారించుచున్నాను! అంతకంటె ఆశింపదగినది ఏమి యున్నది! అంతకంటె జరుగునది ఏమియున్నది!"

అట్లని అతడు నాకేదో గొప్ప యుపకారము చేయుచున్న వానివలె చేయి అందిచ్చెను. విధిలేక నే నతనికి నాహస్తమును అందిచ్చితిని.

తరువాత నేను భోజనమునకు కూర్చుంటిని. అప్పుడు పంబుల్‌చూక్ నూదిపోటు మాటలతో నన్ను పలువిధముల బాధించెను. ఎన్నోవిధముల అవమానించెను. అతడు నాకు చిన్నప్పుడు ఎంతో సాహాయ్యము చేసినాడట! నా అభివృద్ధికి ఎంతో తోడ్పడినాడట! కాని నేను అభివృద్ధిలో నున్నప్పుడు నే నత

పట్ల కృతఘ్నతతో ప్రవర్తించినానట! ఇప్పుడు నేను పతనావస్థలో నున్నను తాను ఆదరించుచున్నాడట! నేనికముందు బుద్ధికలిగి యుండవలయునట!

నేనెట్లో అతని మాటలు సహించి భోజనము ముగించితిని. తరువాత పంబుల్ చూక్ తన దారిని వెళ్ళిపోయెను. నేను హోటలు వదలి బయటకు వెళ్ళితిని. జో నివసించుచున్న గ్రామము వంకకు పయనమై పోసాగితిని. జో బిడ్డీలను చూచుటకు వెళ్ళుచున్నానను తలపు నాకు ఆహ్లాదమును కలుగజేయుచుండెను. నేను గర్వమును సంపూర్ణముగ విడిచివచ్చి వినమ్రుడనై పోవుచుంటిని.

జూన్ మాసపు వాతావరణ పరిస్థితి కడు ఆహ్లాదకరముగ నుండెను. ఆకసమున నీలముగ నుండెను. భరద్వాజ పక్షులు పచ్చని పంటచేలపై ఎగురుచుండెను. గ్రామ సీమలు అందముగను, ప్రశాంతముగను నుండుననువిషయమును నేను బాగుగ ఎరుగుదును. కాని అప్పుడు ఆప్రాంతము ఇంకను అందముగను ప్రశాంతముగను కనబడసాగెను. నేనచ్చట గడపబోవు జీవిత చిత్రములు నాకన్నులముందు కట్టినట్లు కనబడసాగెను. నేను బిడ్డీని వివాహము చేసికొన్నప్పుడు ఆమె నా ప్రక్కనే కూర్చుండి నాకు చక్కని సలహాల నొసగుచుండును. అప్పుడు నా జీవిత విధానమే మారిపోవును. ఆ జీవిత విధానమునకు చెందిన చిత్రములుగూడ నా కన్నులముందు నాట్యము చేయసాగెను. అప్పుడు నేను ఎన్నో సంవత్సరములు విదేశ సంచారముచేసి వట్టి పాదములతో ఇంటికి తిరిగి వచ్చుచున్నట్లుండెను.

బిడ్డీ గ్రామములోని పాఠశాలలో టీచరుగా పనిచేయు చున్నది. నేనా పాఠశాలా భవనమును అంతవఱకు చూచి యుండలేదు. కాని నేను ఎవ్వరికి కనబడకుండ ఇంటికి వెళ్ళ వలయునను తలంపుతో గ్రామములోని చుట్టుదారిగుండా వెళ్ళి తిని. పాఠశాల ఆదారిలోనే యుండెను. కాని దురదృష్టవశమున నారోజు సెలవు దినము. అందువలన బిడ్డీ అచ్చటలేదు. అచ్చట పిల్లలెవ్వరును లేరు. ఆమె నన్ను చూడక పూర్వమే, నేనామె తన పనులను చేసికొనుచుండగా చూడవలయునను కొంటిని. కాని నాకోరిక నెఱవేరలేదు.

అచ్చటకు జో గృహము ఎంతో దూరమున లేదు. నే నచ్చటకు పోసాగితిని. జో సుత్తి దెబ్బలు వినబడునేమోయని చెవులు రిక్కించి వింటిని. కాని నాకా సవ్వడి ఏమాత్రము వినబడలేదు. అంతయు ప్రశాంతముగ నుండెను.

ఎట్టకేలకు నేను ఇల్లు చేరుకొంటిని. కాని కొలిమి గది మూయబడి యుండెను. ఎక్కడను నిప్పుకాంతి కనబడలేదు. నిప్పు రవ్వలు కనబడలేదు. కొలిమి తిత్తిమోత వినబడలేదు. అంతయు కడు ప్రశాంతముగ నుండెను.

మిగిలిన ఇంటి భాగము చాల చక్కగ కనబడుచుండెను. చావడి చాలచక్కగా నలంకరింపబడి యుండెను. దాని కిటికీలో తెరలు రెపరెప లాడుచుండెను. కిటికీ తలుపులు తెఱచియుండెను. అచ్చట పూల కుండీలుండెను. ఆ పుష్పములను చూడవలయునను నుద్దేశ్యముతో నే నచ్చటకు మెల్లన పోతిని. అంతట నాకు చేయి చేయి పట్టుకొని నిలబడియున్న జో, బిడ్డీలు కనబడిరి.

మొదట నే నెవ్వరో అనుకొని ఆమె కేకవేసెను. కాని అనతి కాలములో నామె నాదగ్గఱకు వచ్చి నన్ను కౌగిలించుకొనెను. నే నామెను చూచి ఆనందబాష్పములు కార్చితిని. నన్నామె చూచి విచార బాష్పములు కార్చెను. ఆమె కడు మనోహర ముగ యౌవనదశలో నుండెను; అందువలన నేను ఆనంద బాష్ప ములు కార్చితిని. నేను చిక్కిపోయి, పాలిపోయి, అలసిపోయి యుంటిని. అందువలన నామె దుఃఖబాష్పములు కార్చెను.

"ప్రియమైన బిడ్డీ! నీ వెంత మనోహరముగ నున్నావు?"

"అవును, ప్రియమైన పిప్!"

"జో! నీవు ఎంత మనోహరముగ నున్నావు!"

"అవును, ప్రియమైన పిప్! ప్రియమైన పిప్!"

నేను ఇరువురను చూచితిని. జోను చూచితిని, తరువాత బిడ్డీని చూచితిని; మరల జోను చూచితిని; మరల బిడ్డీని చూచి తిని.

అంతలో బిడ్డీ ఇట్లనెను: "నేడు మా వివాహదినము. మే మింతకుముందే వివాహము చేసికొన్నాము!"

ఆమె ముఖమున అపరిమితమగు సంతోషము తాండవ మాడుచుండెను.

వారు నన్ను వంటగదిలోనికి తీసికొనిపోయిరి. నేను టేబి ల్మీపై తలపెట్టుకొని కుర్చీమీద కూర్చుంటిని. బిడ్డీ నా చేతులలో

నొకదానిని తన పెదవులవద్ద పెట్టుకొని ముద్దుపెట్టుకొనసాగెను. జో తన హస్తమును నా భుజముపై పెట్టి నిమురసాగెను.

నన్ను చూడగలిగినందుకు వారెంతయు ఆనందింపసాగిరి. ఎంతయు గర్వింపసాగిరి. ఆనాడు వారి వివాహ దినము. వారు ఆనందసాగరమున నీదులాడుచుండిరి. కాని వారికి నేను లేని కొఱత కనబడుచునే యుండెను. అంతలో నేను వచ్చితిని. సరిగానే నా దినమున వచ్చుటలో ప్రత్యేకతయున్నది. వారి కింక నేకొఱతయు లేదు. వారి ఆనందము సంపూర్ణమైనది.

నేను జబ్బులో నున్నప్పుడు జో నావద్దనేయుండి సేవచేసి యుండెను. అప్పుడు నేను బిడ్డీని ప్రేమించినాననియు, ఆమెను వివాహము చేసికొనబోవుచున్నాననియు జోకు చెప్పనందుకు భగవానున కిప్పుడు కృతజ్ఞతను తెలియజేయుచున్నాను. ఆ విషయము నా నాలుక చివరవఱకు ఎన్నోసార్లు వచ్చెను; కాని నేను చెప్పియుండ లేదు. అట్లు చెప్పకపోవుటయే మేలైనది. చెప్పియుండినచో అతడు నాకొఱకు తన సౌఖ్యమును త్యజించి యుండెడివాడు. అతడు నాకు చెప్పకుండ లండను నుండి వచ్చివేసినాడు కనుక సరిపోయినదిగాని, లేనిచో నే నతని కావిషయమును చెప్పియుండెడివాడను.

నేను బిడ్డీతో నిట్లంటిని: "ప్రియమైన బిడ్డీ! నీవు గొప్ప అదృష్టవంతురాలవు. నీపూర్వ పుణ్యావశమున జో నీకు భర్తగా లభించినాడు. ఇటువంటివాడు మఱియొకడు లేడని నిశ్చయముగ చెప్పగలను. నీ వతనిని గాఢముగ ప్రేమించుచున్నందులకు నే నెంతయు సంతసించుచున్నాను."

నా మాటలకు వారి హృదయములు కరగిపోయెను. "ఇంక నీవేమియు మాటలాడవలదు." అని వారిరువురును నన్ను ప్రార్థించిరి.

కాని నే నింకను నిట్లంటిని: "ప్రియమైన జో! నే నింకను మాట్లాడవలసియున్నది. నీకు పిల్లలన్న ఎంతయు ప్రేమ. అందు వలన నీకు పిల్లలు పుట్టుదురని ఆశించుచున్నాను. నే నిదివఱకు ఈ మూల కూర్చొనుచుండెడివాడను. శీతకాలపు రాత్రులందు నీ పిల్లవాడు ఒకడు కూడ ఇచ్చట కూర్చుండునని ఆశించు చున్నాను. అప్పుడు నేను నీకు జ్ఞప్తికి వచ్చుచుందును. జో! నేను కృతఘ్నుడనను విషయమును మాత్రము అతనికి చెప్ప కుము. బిడ్డీ! నేను అనౌచిత్యముగను, ఔదార్య రహితముగను, అన్యాయముగను ప్రవర్తించితినన్న విషయమును అతనికి చెప్ప కుము. మీరు ఇరువురును చాలమంచివారు కనుక నేను మిమ్ము గౌరవించితినని చెప్పుడు. ఆ బాలుడు నా కంటె ఎక్కువ మంచి వాడు కావలయునని కోరితినని చెప్పుడు."

"పిప్! నేనటువంటి విషయము లేవియు అతనికి చెప్పను. బిడ్డీగూడ చెప్పదు. ఎవ్వరును చెప్పరు." అని జో అనెను.

నే నింకను నిట్లంటిని: "మీరు మీ మీ హృదయము లలో నన్ను క్షమించినారను విషయము నాకు తెలియును. అయినను మీరా సంగతి అనుచుండగా వినవలయునని యున్నది. దయయుంచి నన్ను క్షమించిన విషయమును చెప్పుడు! మీరా మాట అనుచుండగా వినవలయునని యున్నది! ఆ ధ్వనిని నాతో, విదేశమునకు తీసికొని పోదును. రాబోవు కాలములో మీరు

నన్ను విశ్వసించితిరనియు, నన్ను గురించి మంచిగా తలంతు గనియు అనుకొనగలను.

"నిన్ను క్షమించుటకేమి యున్నది, ప్రియమైన పిప్! క్షమించుటకేమైన నున్నచో నేను నిన్ను క్షమించితినను విష యము భగవానునకు తెలియును."

"తథాస్తు! నేను క్షమించితినన్న విషయముకూడ భగ వానునకు తెలియును" అని బిడ్డీకూడ ననెను.

"నే నిపుడింక చిన్నప్పుడు పరుండెడి చిన్నగదిలోకి పోవుదును. అచ్చట నే నొక్కడను కొన్ని నిమిషములు విశ్రాంతి తీసికొందును. తరువాత నేను మీతోకలసి భోజనము చేయు దును. పానీయములను సేవింతును. అటు పిమ్మట మీ రిరువు రును నాతోకలసి గ్రామపు పొలిమేరలోనున్న స్తంభమువఱకు రండు. నన్ను సాగనంపుడు" అని నే నంటిని.

*  *  *

నేను నావద్దనున్న వస్తువుల నన్నిటిని అమ్మివైచి, వచ్చిన సొమ్ముతో అప్పులన్నియు తీర్చివైచితిని. తరువాత కైరోకుపోయి హెర్బర్టును కలసి కొంటిని. అనతికాలములో హెర్బర్టు కార్యా లయములో గుమాస్తాగా చేరితిని. అంతలో క్లేరా తండ్రి మర ణించెను. అందువలన క్లేరాను తెచ్చుకొనుటకై హెర్బర్టు ఇంగ్లండునకు వెళ్ళెను. అపుడు నేనే బ్రాంచి వ్యవహారములన్ని టిని చూచుకొంటిని. మఱికొంత కాలమునకు హెర్బర్టు క్లేరాను తీసికొని తిరిగి వచ్చెను.

నేను ఆవ్యాపార సంస్థలో భాగస్వామి నగునప్పటికి చాల సంవత్సరములు గడచిపోయెను. కాని ఈ లోపల నేను హెర్బర్టుతోను, అతని భార్యతోను కలసి సుఖముగా జీవించుచుంటిని. బిడ్డీ జోలకు ఉత్తరములు వ్రాయుచుంటిని. నేనుగూడ భాగస్వామినైన తరువాత నా రహస్యమును క్లారికర్ హెర్బర్టుకు చెప్పివైచెను. "పిప్ డబ్బుతో హెర్బర్టు నా వ్యాపారసంస్థలో భాగస్వామి యైనాడన్న రహస్యము ఇంతవఱకు నాగుండెలమీద కుంపటిగా నున్నది. ఇప్పుడు చెప్పివైచినాను గనుక నా హృదయము తేలికపడినది" అని క్లారికర్ అనెను.

నా యుపకారబుద్ధికి హెర్బర్టు కదలిపోయెను; ఆశ్చర్యపడెను. అంతకాక మా రహస్యము చెప్పకుండ దాచినందుకు హెర్బర్టు తప్పేమియు పట్టలేదు. మేమిద్దరము ఎప్పటివలెనె గాఢస్నేహితులముగనే యుంటిమి.

మా వ్యాపారసంస్థ ప్రపంచమంతట ప్రసిద్ధి చెందిన పెద్ద వ్యాపారసంస్థయని గాని, మేము కోట్లకొలది ధనములు సంపాదించుచుంటిమని గాని, ఎవ్వరును భావింపరాదు. మా వ్యాపారసంస్థకు మంచి పేరు ప్రతిష్ఠలుండెను. మేము కష్టపడి పనిచేసి బాగుగ వ్యాపారము చేయుచుంటిమి. మంచి లాభములు సంపాదించుచుంటిమి. మా వ్యాపారసంస్థ అభివృద్ధికి హెర్బర్టు కృషి ముఖ్యకారణమని చెప్పకతప్పదు.

కొంచెము నీవలెనే పెరుగునని మేమాశించుచున్నాము. అవును, ఇతడు తప్పక నీవలెనే పెరుగును."

నేనుకూడ అట్లులే అనుకొంటిని. మఱునాటి యుదయము ననే నాబాలునితీసికొని వాహ్యాళికివెళ్ళితిని. మేమిరువురము ఒకరి నొకరము అర్థముచేసికొనుచు చాలసేపు మాట్లాడితిమి. తరు వాత నేనతనిని శ్మశానమునకుగూడ తీసికొనిపోతిని. అచ్చటి సమాధులను పరిశీలించిచూచితిమి. తరువాత ఇంటికిపోతిమి.

భోజనమైన తరువాత నేను, బిడ్డీ మాట్లాడుకొనసాగి తిమి. ఆ సందర్భమున నేను ఆమెతో నిట్లంటిని: "బిడ్డీ! మీ పిప్‌ను మీరు నాకిచ్చివేయవలయును." అప్పుడామె రొమ్ములో నొక ఆడపిల్ల నిదురించుచుండెను.

"వలదు, వలదు. నీవు పెండ్లిచేసుకోవలయును" అని ఆమె అనెను.

"బిడ్డీ! హెర్బర్టు క్లేరాలుకూడ ఆ విధముగనే సలహా ఇచ్చుచుందురు. కాని నేను పెండ్లిచేసుకోగలనని అనుకోను. నేను వారియింటిలో పూర్తిగస్థిరపడిపోయినాను. నావివాహము సంభవమగు విషయముకాదు. నేనప్పుడే ముసలిబ్రహ్మచారినై పోయినాను."

బిడ్డీ తనరొమ్ములోని పిల్లవంకచూచెను. తరువాత ఆ పిల్ల చిన్నారిచేతిని పెదవులవద్ద పెట్టుకొని ముద్దుపెట్టుకొనెను. అట్లు పిమ్మట ఆ చిన్నారి హస్తమునుతాకిన తన మాతృహస్తమును

నాచేతిలో పెట్టెను. ఆమె తన పెండ్లియుంగరముతో నాహస్తమును మెల్లన నొక్కెను. ఆమె చేసినపనులు అర్థవంతమైనవిగనుండెను.

"ప్రియమైన పిప్! నీవామెకొఱకు కలవరించుట లేదా" అని బిడ్డీ అనెను.

"లేదు. లేదనుకొందును, బిడ్డీ!"

"నీవు నాకు పాతమిత్రుడవు. మఱిచెప్పుము. నీవామెను పూర్తిగా మఱచిపోయినావా?"

"ప్రియమైన బిడ్డీ! నా జీవితములో ప్రధానస్థానముకల విషయమునుకాని, మఱియే యితరస్థానముకల విషయమును కాని నేను మఱచిపోలేదు. కాని ఆమె విషయమంతయు నొక కల. అదియంతయు అదృశ్యమైపోయినది. బిడ్డీ!"

నేనావిధముగ నంటినన్న మాటయేకాని ఆమె కొఱకు నాటిసాయంకాలము ఒంటరిగ పాడుపడిన హవిషమ్‌కన్య ఇంటి వంకకు పోవలయునని అనుకొనుచునేయుంటిని. అపను, అంపకు సందేహమేమాత్రము లేదు. ఎస్టెలాకొఱకే నేను వెళ్లవలయు నని అనుకొనుచుంటిని.

ఎస్టెలా కష్టముతో గూడిన జీవితము గడపుచున్నదని నేను వినియుంటిని. ఆమె భర్త కడు దుర్మార్గుడు. నైచ్యము, పశుత్వము, క్రౌర్యము, దురాశ, అహంకారము మున్నగు దుర్గుణము లన్నియు అతనిలో మూర్తీభవించి యున్నది. అందువలన నతడు ఎస్టెలాను కడు క్రూరముగ హింసించినాడు. అందువలన వారిరువురును విడిపోవలసివచ్చినది. తరువాత భర్త మరణించి

నాడు. గుఱ్ఱము మీద ప్రయాణముగ వచ్చినాడు. అందువలన నది యాత్రను ప్రారంభించవలెనని త్రొక్కుచుండెడి. ఇది జరిగి రెండు సంవత్సరము లైనది. తరువాత వాడు పునర్వివాహము చేసికొన్నదని గూడ నేను వినియుంటిని.

ఇంకను చీకటి పడకపూర్వమే నేను ఒంటరిగ హావిషమ్ కన్య ఇంటికి బయలుదేరితిని. కాని మధ్యమధ్య ఆగి ఇతర స్థలములను చూచుటవలన నేనచ్చటకు పోవునప్పటికి సూర్యాస్తమయమైపోయెను. ఇప్పుడచ్చట కట్టడము లేమియు లేవు. తోట గోడ మాత్ర ముండెను. ఖాళీ ప్రదేశము చుట్టును కంచె వేయబడియుండెను. ఆ కంచె కొకచోట ద్వారముండెను. ఆ ద్వారమున లోనికి పోతిని.

ఆకసమున చంద్రుడు ఉదయించుటకు ప్రారంభించుచుండెను. నక్షత్రములు ప్రకాశించుచుండెను. అందువలన రాత్రి అంత చీకటిగా లేకుండెను. నక్షత్రముల కాంతిలో నేను పూర్వము ఎక్కడెక్కడ ఏది యుండెడిదో తెలిసికొన గలిగితిని. తరువాత తోటవంకకు చూడసాగితిని. అంతలో నాకు ఆతోటలో ఎవ్వరో నడచి వచ్చుచున్నట్లు కనబడసాగెను.

నేను ముందుకు పోతిని. తోటలోనివారు నా యునికిని గ్రహించినట్లున్నది. నావంకకు వచ్చుచున్నవారు ఆగిపోయిరి. నేను ముందుకు సాగిపోయి, దగ్గరకు వెళ్ళి నిలబడితిని. ఆ నిలబడి యున్నవారు ఒకస్త్రీ యను విషయమును గ్రహించితిని. ఆమె నన్నుచూచి ఆశ్చర్య పడినట్లుండెను. "పిప్!" అని యనెను.

"ఎస్టెలా!" అని నేను అంటిని.

"నేను పూర్తిగా మాఱిపోయినాను. నన్ను నీవు గుర్తు పట్టగలిగినందులకెంతయు ఆశ్చర్య పడుచున్నాను."

ఆమె అందములోని నూతనత్వము మాయమయ్యెను. కాని అందులోని శీవి, మడులుగొల్పు శక్తిమాత్రము ఎప్పటి వలెనే యుండెను. వానిని నేను ఇదివఱకే చూచియుంటిని. కాని నే నామెలో ఇదివఱకెన్నడును చూడని రెండు విశేషముల నప్పుడు చూడగలిగితిని. ఆమె కన్నులిదివఱకు అహంకార పూరితములై యుండెనివి; ఇప్పుడా కన్నులలో విచార పూరితమైన, మృదువైన కాంతి యున్నది. ఇదివఱకామె చేతిని పట్టుకొన్నప్పుడు ఏదో మంచును పట్టుకొన్నట్లుండెడిది. కాని యిప్పుడా చేతిలో స్నేహ పూర్వకమగు స్పర్శ యున్నది.

మే మిదుపురమును సమీపముననేయున్న ఒక బెంచిమీఁద కూర్చుంటిమి. అంతట నే నిట్లంటిని: "ఎట్టిలా! ఇన్ని సంవత్సరములు గడచిపోయిన తరువాత మన మిదుపుర మిచ్చట నీవిధముగా సమావేశమగుట వింతగానున్నది. మనము మొట్టమొదట సమావేశమైన దిక్కుననే! నీవు తఱచుగా నిచ్చటకు వచ్చుచుందువా?"

"అప్పటినుండి ఇంతవఱకు నే నిచ్చటకు వచ్చి యుండలేదు."

"నేనుకూడ రాలేదు."

చంద్రుడుప్పైకి వచ్చుచుండెను. నేను మా పూర్వపు మాటలను తలంపునకు తెచ్చుకొనుచుంటిని. చంద్రుడింకను పైకి వచ్చుచుండెను. అతడు కడసారిగా నా మాటలను విన్న తరువాత నా చేతిని నొక్కిన విషయమును జ్ఞప్తికి తెచ్చుకొనుచుంటిని.

మేమిరువురము కొంచెము సేపు ఏమియు మాట్లాడ లేదు. ఎట్టకేలకు ఎస్టెలా, "నేనెన్నో సార్లు ఇచ్చటకు రావలయు నని అనుకొన్నాను; ఆశించినాను. కాని పరిస్థితుల ప్రాబల్యము వలన ఇచ్చటకు రాలేకపోయినాను."

ఆమె కన్నులనుండి నీటి బిందువులు పడుచుండెను. చంద్ర కాంతిలో నేను వానిని చూచితిని. నేను వానిని చూడలేదని ఆమె అనుకొనసాగెను. తన్ను అదుపులోకి తెచ్చుకొనుటకు ప్రయత్నించుచు ఆమె మెల్లన ఇట్లనెను: "ఈ ప్రదేశమునెందుల కిట్లు వదలి వైచినారని నీవు ఆశ్చర్యపడుచున్నావా?"

"అవును, ఎస్టెలా!"

"ఈ నేల నాకు చెందినదే. నేను ఇతర ఆస్తుల నన్నిటిని వదలించి వైచినాను. ఇంకను వదలనిది ఇది యొక్కటియే. మిగి లిన వన్నియు క్రమక్రమముగా చేయి జారిపోయినవి. ఇది యొక్కటి మాత్ర మింకను మిగిలియున్నది. ఈ నికృష్ట కాలములో నేను పట్టుదలతో ప్రతిఘటించిన విషయమిది యొక్కటియే."

"ఇచ్చట భవనమును నిర్మింతురా?"

"అవును. ఎట్టకేల కది జరుగుచున్నది. మార్పు జరుగక పూర్వము దీనిని చూడవలయునని ఇచ్చటకు వచ్చియున్నాను. మరి నీవు? నీవింకను విదేశములలోనే నివసించుచున్నావా?"

"అవును."

"బాగుగనే ఉన్నావను కొందును?"

"కష్టపడి పనిచేసి సుఖముగా జీవించుటకు కావలసినంత సంపాదించుకొను చున్నాను. అందువలన నీ ప్రశ్నకు 'అవును' అనియే సమాధానము చెప్పవలయును."

"నేను నిన్ను గూర్చి పలుమార్లు అనుకొన్నాను."

"అనుకొన్నావా?"

"ఇటీవల చాల తఱచుగా అనుకొనుచున్నాను, నీ విలువ నాకప్పుడు సరిగా తెలియదు. నేను నిన్ను త్రోసివుచ్చినాను. నిన్ను మఱచిపోవుటకు ప్రయత్నించినాను. కాని సాధ్యముకాలేదు. అందువలన నీకు నా హృదయములో నొక స్థాన మొసగినాను."

"నా హృదయములో నీ కెప్పుడును ప్రముఖస్థాన మొసగియుంచితిని."

కొంచెముసేపు గడచిన తరువాత ఎస్టెలా ఇట్లనెను: 'ఈ స్థలమువద్ద సెలవు తీసికొనవలయునని వచ్చినాను. అప్పుడు నీవద్దగూడ సెలవు తీసికొను అవకాశము లభించునని భావించియుండలేదు. ఇప్పుడు నీవద్దగూడ సెలవు తీసికొనగలుగుచున్నందులకు నే నెంతయు సంతసించు చున్నాను."

"తిరిగి విడిపోవుటకు సంతసించు చున్నావా, ఎస్టెలా! నాకు విడిపోవుట యన్నది చాల బాధాకరమైన విషయము. మన మిరువురము విడిపోయిన సంగతి నాకెంతయు జ్ఞప్తియందున్నది. అప్పుడు నే నెంతగానో బాధపడినాను! ఎంతగానో విచారించినాను!"

ఎస్టెలా ఇట్లనెను: "కాని అప్పుడు నీవు ఏమి అన్నావు? 'భగవంతుడు నిన్ను ఆశీర్వదించుగాక! భగవంతుడు నిన్ను

TPLA 127 B157


క్షమించుగాక!' అని యన్నావు. అప్పుడా మాటలన్న నీ[illegible] ఇప్పుడు మరల ఆ మాటలనుటకు సందేహింపరాదు. నేను ఎన్నో బాధలుపడి నాను. ఆబాధలే నీహృదయమెట్టిదో నేను సరిగా అర్థము చేసికొనునట్లు చేసినవి. ఈ సమయమునగూడ నీ వట్లనుట సముచితముగ నుండును. నేను వంగిపోయినాను. నా హృదయము భగ్నమై పోయినది; కాని మంచి ఆకారమును పొందినదని తలచు చున్నాను. ఇదివఱకు నాపట్ల ఎట్టి అభిమాన మును చూపితివో ఇప్పుడుకూడ అట్టి అభిమానమునే చూపుము. మన మిరువురము మిత్రులమని చెప్పుము."

ఆమె బెంచిమీదనుండి లేవబోవుచుండెను. అప్పుడు నేను లేచి ఆమెపైకి వంగి, "మన మిరువురము మిత్రులము" అని యంటిని.

"మనము విడిగానున్నను మిత్రులముగనే యుందము" అని ఎస్టెలా అనెను.

నేనామె హస్తమును పట్టుకొంటిని. మేమిరువురము ఆపాడుపడిన ప్రదేశమునుండి బయటకువచ్చితిమి. కాని మేమింక విడిపోలేదు. మేమిరువురము భార్యాభర్తలమైతిమి.

మాగ్విచ్ ఆస్తిని నేను పొందలేకపోతిని; సౌధాగ్రము నుండి క్రిందపడిపోతిని. కాని యిప్పుడు మాగ్విచ్ కూతురు ఎస్టెలా నాభార్యయైనది. మరల నేను సౌధాగ్రమును చేరు కొన్నాను. నన్నక్కడనుండి ఎవ్వరును క్రిందకు పడవేయలేరు. ఇది ముమ్మాటికి నిజము. నేను నా సౌధాగ్రమున ఎస్టెలా ప్రక్కనే కూర్చుండియే మీ కీకథయంతయు చెప్పినాను.

సమాప్తం.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B157 |
| పుస్తకం పేరు | సౌధాగ్రము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 339 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 62,63,215,216 |
| తయారు చేసినది | Aswin |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |